యిక్కడ వున్నట్లు, ఆర్కేలాజికల్ డిపార్టుమెంటువారు ఇటీవల జరిపిన తవ్వకాలవల్ల బైటపడినది.

కోటప్పకొండ :

గుంటూరుజిల్లాలో, నరసారావుపేటకు ఎనిమిదిమైళ్ళ దూరంలో వున్నది. కొండమీద కోటీశ్వరాలయంవుంది. శివరాత్రికి ప్రతిఏటాగొప్ప ఉత్సవం జరుగుతుంది. కొన్నిలక్షలమంది ప్రజలు వస్తారు. అధిక సంఖ్యాకులు బండ్లమీద ప్రభలు కట్టుకొనివచ్చి మొక్కుబళ్లు చెల్లిస్తారు.

కోణార్క :

ఇది పూరీ-జగన్నాథ క్షేత్రానికి సుమారు 20 మైళ్ళ దూరంలో యిసుక పర్రలలోవున్న ఒక గొప్ప సూర్యదేవాలయము. ఆలయమంతా కూడా బ్రహ్మాండమైన నల్లరాయి చెక్కడంతో కట్టబడింది. ఈ దేవాలయ నిర్మాణం పదమూడవ శతాబ్దంలో జరిగిందని ప్రతీతి. కాని యిప్పటికీ చెక్కు చెదరని ఈ నిర్మాణం అందరికీ ఆశ్చర్యం గొలుపుతున్నది.

చిదంబరం :

మదరాసుకు 115 మైళ్ళదూరంలో వుంది. ఇచ్చటి నటరాజదేవాలయం తప్పక చూడవలసింది. పంచలింగాలలో ఒకటైన ఆకాశలింగం గల ఈ చిదంబరదేవాలయం పురాణ ప్రసిద్ధమైనది. ఈ దేవాలయంలో 108 నాట్యముద్రలు చూపే విగ్రహాలు చెక్కబడివున్నాయి. ఈనగర సమీపంలోనే అన్నామలై విశ్వకళాపరిషత్తు స్థాపించబడింది.

చెంజిదుర్గం :

మదరాసునుంచి రోడ్డు ప్రయాణంచేస్తే 105 మైళ్ళు. రైలుమీదుగా వెడితే తిండివనంవెళ్ళి అక్కడనుంచి 15 మైళ్లు బస్సులో వెళ్ళాలి. దేశింగురాజు కథ అనే బుర్రకథ, యీ దుర్గమురాజుదే. ఇచ్చట కోట బురుజులు చూడదగినవి.

జంబుకేశ్వరం :

పంచలింగాలలో ఒకటైన అపోలింగం గల తీర్థం. ఈ లింగం సంతతవాహినియైన జలధారవద్ద స్థాపింపబడింది. ఈ నగరం, శ్రీరంగ

నగరానికి ఒక మైలు దూరంలోవుంది. మదరాసునుంచి శ్రీరంగానికి రైలులో వెళ్ళవచ్చును. 258 మైళ్లు. జంబుకేశ్వర దేవాలయం కూడా అతి పురాతనమైనది.

ఢిల్లి :

ఇండియాకు రాజధాని. ఢిల్లికోట, షాజహాన్ మందిరము,ముత్యాల మసీదు, జుమ్మామసీదు, కుతుబ్ మినార్, మొదలైన పురాతనకట్టడాలను చూసితీరవలసిందే. మొగల్ చక్రవర్తుల పరిపాలనానంతరం చాలా కాలం భారతదేశానికి కలకత్తా రాజధానిగా వుండేది. కాని, 1912 లో జార్జి రాజు ఢిల్లీలో దర్బారుజరిపి, అప్పటినుంచి రాజధాని మళ్ళీ ఢిల్లీలో వుంటుందని ప్రకటించాడు. తరువాత, కొత్త ఢిల్లి అనే పేరుతో, పాతఢిల్లీ ప్రక్కన మరొక పెద్దపట్టణం కట్టబడింది. ప్రభుత్వకార్యాలయాలన్నీ కూడా క్రొత్తఢిల్లీలోనే వున్నాయి.

తంజావూరు :

మదరాసునుంచి 222 మైళ్లు. ఇచ్చట రాజరాజచోళునిచే 13 వ శతాబ్దంలో నిర్మించబడిన బృహదీశ్వరాలయం చూడదగినది. మహారాష్ట్ర రాజులు నిర్మించిన సరస్వతీ మహాల్ తప్పక చూడవలసినది. దీనిలో సుమారు 20,000 పురాతన గ్రంథములు వున్నవి.

తిరుపతి :

భారతదేశంలోని దేవాలయము లన్నిటిలోను అత్యంత భాగ్యవంతమైనది. శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనమునకు, మొక్కులు చెల్లించుకొనుటకు, ప్రతి రోజూ దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ యాత్రికులు వస్తూనే వుంటారు. దేవస్థానంవారి బస్సులు కొండమీదికి వెడతాయి.

తిరువణ్ణామలై :

మదరాసునుంచి రైలుమీద 144 మైళ్లు. రోడ్డు ప్రయాణం 116 మైళ్లు. పంచ లింగాలలో ఒకటైన తేజోలింగం అరుణాచలేశ్వరుడనే పేరుతో ఇక్కడ వుంది. ఈ దేవాలయం చాలా పెద్దది. కార్తికపౌర్ణమి నాడు యిచ్చట పెద్ద ఉత్సవం జరుగుతుంది.

నాగార్జునకొండ :

ఒకప్పుడు, గొప్ప బౌద్ధపీఠస్థానములలో ఒకటి. గుంటూరుజిల్లాలో మాచర్లకు 14 మైళ్ళదూరంలో వుంది. పూర్వం విజయపురి అనే గొప్ప నగరం ఇక్కడ వుండేది. ఆంధ్రదేశాన్ని పాలించిన ఇక్ష్వాకులకు ఇది రాజధాని. ఇప్పుడిక్కడ చిన్నపల్లెటూరువుంది, దానిని పుల్లారెడ్డిగూడెం అంటారు. ప్రక్కనవున్న కొండను మాత్రం నాగార్జునకొండ అంటారు. ఇటీవల ఆర్కెలాజికల్ డిపార్టుమెంటువారు ఇక్కడి దిబ్బలను త్రవ్వి పురాతన కట్టడాలను పైకితీస్తున్నారు, బౌద్ధమతంలో 'మహాయాన' మతాన్ని స్థాపించిన సిద్ధ నాగార్జునుడు యిక్కడ నివసించాడని చరిత్రకారుల నిర్ణయం. చాలా చక్కని బౌద్ధ శిల్పాలెన్నో యిక్కడ బయల్పడినవి.

నెల్లూరు :

మదరాసు-వాల్తేరు రైలుమార్గంలో మదరాసుకు 110 మైళ్ళ దూరంలోనూ, విజయవాడకు 158 మైళ్ళ దూరంలోను పెన్న (పినాకిని) నది ఒడ్డున వున్నది. ఇచ్చట గొప్ప రంగనాయకస్వామి ఆలయము వుంది.

పక్షితీర్థము :

ఇది చెన్నపట్టణమునుంచి చెంగల్పట్టుమీదుగా 50 మైళ్ల దూరంలో వుంది. ఇక్కడ విశేషం ఏమిటంటే, ప్రతిరోజూ, కొండమీద శివాలయం దగ్గరకు, సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు రెండుగ్రద్దలువచ్చి, అర్చకుడు పెట్టే ప్రసాదాన్ని ఆరగించి వెళ్ళిపోతాయి. ఈవిధంగా కొన్ని వందల సంవత్సరాలనుంచి ఆరెండుపక్షులూ కాశీనుంచివచ్చి ప్రసాదం తిని వెడుతున్నాయని ప్రతీతి. ఇక్కడ చెరువులో స్నానంచేసి, కొండచుట్టూ ప్రదక్షిణాలు చేస్తే, సమస్తరోగాలు పోతాయని భక్తుల విశ్వాసం.

పానుగల్లు :

నల్లగొండకు రెండుమైళ్ళదూరంలో వుంది. ఇచ్చటి సోమేశ్వర దేవాలయంలో, లింగం నీళ్ళలో వుంటుంది. నీళ్ళలో వున్న, లింగాన్ని ఆనుకొని, గర్భాలయంలో ఒక పొడవైన నీడ, పగలంతా ఒకచోట కనిపిస్తుంది. అందువల్ల ఇచ్చటి దేవునికి, ఛాయా సోమేశ్వరుడు అని పేరు.

పూరి - జగన్నాథం :

ప్రపంచ ప్రసిద్ధి చెందిన జగన్నాథక్షేత్రం. ఈ నగరాన్ని పురి అంటారు. ఇది ఒరిస్సా రాష్ట్రంలో వుంది. మదరాసునుంచి కలకత్తాకు వెళ్ళే రైల్వేలైనులో, ఖుర్దారోడ్ జంక్షనువద్ద దిగి, పూరికి మరొక రైలు ఎక్కాలి. ఖుర్దారోడ్‌నుంచి పూరికి సుమారు గంటన్నర ప్రయాణం. జగన్నాథక్షేత్రం, కాశీ రామేశ్వరాలతో పాటు సమానమైన ప్రాధాన్యతను పొందిన వైష్ణవక్షేత్రం. కులభేదం పాటించకుండా, అన్ని కులాలవారూ సమానంగా ప్రసాదాన్ని స్వీకరించడం, ఒక్క యీ క్షేత్రంలోనే జరుగుతున్నది. దేశంలోని అన్ని ప్రాంతాలనుంచి కొన్ని లక్షల మంది యాత్రికులు వెడతారు.

భద్రాచలం :

'రామదాసు' అని ప్రసిద్ధి పొందిన కంచెర్ల గోపన్న కట్టించిన శ్రీ రామాలయం వుంది. దేశంలోని ప్రసిద్ధిపొందిన రామాలయం ఇదే. ప్రతిసంవత్సరమూ, శ్రీరామనవమికి ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. రాజమండ్రినుంచి పడవలో వెళ్ళవచ్చును.

భువనేశ్వర్ :

కాశీ తరువాత, ఉత్తరదేశంలో ప్రధానమైన శివక్షేత్రం. ఇది పూరి-జగన్నాథక్షేత్రానికి వెళ్ళే త్రోవలో, ఒరిస్సా రాష్ట్రంలో వుంది. ఇక్కడ సుమారు అయిదువందల పురాతన శివాలయాలు వున్నాయి. వాటిలో ముఖ్యమైనది 'త్రిభువనేశ్వరు'ని ఆలయం. ఈ దేవుని 'లింగ రాజమహాదేవు'డని కూడా అంటారు. ఈ దేవాలయ గోపురం సుమారు 160 అడుగుల ఎత్తు వుంటుంది. లోపల శివలింగం నల్లరాతితో చేయబడినది. భూమిమీద ఎనిమిది అంగుళాల ఎత్తుమాత్రమే వుంటుంది. కాని, యీ లింగపు వ్యాసము, ఎనిమిది అడుగులు వుంటుంది. చుట్టుకొలత సుమారు 26 అడుగులు వుంటుంది. ఈ నగరంలోనే ముక్తేశ్వర దేవాలయం వుంది. శిల్పశిల్ప ప్రజ్ఞకు యిది ప్రధాన తార్కాణమని అంటారు.

మధుర :

ప్రసిద్ధిపొందిన మీనాక్షిదేవాలయం ఇక్కడే వుంది. మదరాసు

రాష్ట్రంలోని ఒక జిల్లాకు ప్రధాన స్థానం. మదరాసుకు 345 మైళ్ళ దూరంలో వుంది. 152 అడుగుల ఎత్తుగల ప్రధానగోపురముకాక యింకా ఎనిమిది గోపురాలుగల, యీ దేవాలయం 347 అడుగుల వెడల్పు 729 అడుగుల పొడవు. అదీకాక, ఇచ్చట చూడవలసింది దేవాలయంలోని వెయ్యి స్తంభాల మండపము.

మధురాంతకం :

ఈ క్షేత్రం చెన్నపట్టణానికి 50 మైళ్ళ దూరంలో వుంది. ఇది శైవులకూ, వైష్ణవులకూ కూడా తీర్థం. ఇక్కడి దేవాలయాలలో శ్రీ కోదండరామస్వామి ఆలయం ప్రధానమైనది. రావణ వధానంతరం. శ్రీరాముడు పుష్పక విమానంమీద అయోధ్యకు వెడుతూవుండగా, ఇక్కడవున్న 'జ్ఞానగిరి' అనేకొండ విమానమార్గాన్ని ఆటంకపరచేటంత ఎత్తుకు పెరిగిందని అప్పుడు ఇక్కడవుండే 'విభాండకు' డనే భక్తునికి తాను అయోధ్యకు వెళ్ళేటప్పుడు తనదర్శనంయిచ్చి వెడతానన్న వాగ్దానం శ్రీరామునికి జ్ఞాపకం వచ్చి, ఆయన విమానందిగి భక్తునికి దర్శనం యిచ్చి మరీ వెళ్ళాడని స్థలపురాణం చెపుతుంది. ఆలయంలోని మూలవిరాట్ రూపంకూడా, విమానంలోంచి శ్రీరాముడు సీతా సమేతంగా క్రిందకు దిగుతూన్నట్టు వుంటుంది.

మహాబలిపురము :

ఇది మదరాసు దక్షిణంగా, 30 మైళ్ళ దూరంలో వుంది. మద రాసునుంచి కారులో సరాసరి వెళ్ళవచ్చును. ఇక్కడ కొండరాతిలోనే చెక్కబడిన సుప్రసిద్ధ రథాలున్నాయి: కొండమీద చెక్కబడిన అనేక బొమ్మలున్నాయి. రాతిలో చెక్కబడిన అయిదు రథాలను పంచపాండవులు అంటారు. ఒకప్పుడు, మన దేశంనుంచి యితర దేశాలతో జరిగిన సముద్ర వ్యాపారానికి యిది ఒక కేంద్రంగా వుండేదని చెప్పడానికి, చరిత్రజ్ఞులు ఎన్నో నిదర్శనాలను పైకి తీశారు.

రామప్ప దేవాలయం :

వరంగల్ జిల్లాలో, వరంగల్ కు 40 మైళ్ళ దూరంలో, రామప్ప చెరువు ఒడ్డునవున్న, ఒక పురాతన శివాలయం. ఈ ఆలయంలోని శిల్ప నైపుణ్యం అత్యద్భుతం.

రామేశ్వరం :

ఉత్తరదేశంలో కాశీ, దక్షిణదేశంలో రామేశ్వరం హిందువులకు ప్రధానమైన తీర్థాలు. శ్రీరామునిచే కట్టబడినదని ప్రఖ్యాతిపొందిన శివాలయం, 4,000 అడుగులు పొడవుగల మండపంతో దర్శనీయమైనది. మదరాసునుంచి 410 మైళ్లు.

లేపాక్షి :

అనంతపురం జిల్లాలో, హిందూపూర్‌కు తొమ్మిదిమైళ్ళలో వుంది. విరూపన్న, వీరన్న నాయకులు కట్టించిన ప్రసిద్ధమైన వీరభద్రాలయం వుంది. ఈ కొండమీద పాపనాశేశ్వరాలయం, రఘునాథాలయంకూడా వున్నాయి. ఏక శిలతో చెక్కబడిన పెద్ద వీరభద్ర విగ్రహము, ఆలయంలోని రంగుబొమ్మల పనితనము చూచి తీరవలసినదే.

వరంగల్ :

హనుమకొండ, ఖాజీపేట, వరంగల్ అనే మూడు పట్టణాలు కలిసి ఒకే మునిసిపాలిటీ. వరంగల్ అనబడే ఓరుగల్లు, పూర్వంకాకతీయ సామ్రాజ్య రాజధాని. ఇచ్చట పాతకోట, వేయి స్తంభాల గుడి తప్పక చూడవలసినవి.

శ్రావణబెలగొల :

మైసూరు రాజ్యంలో వుంది. ఇక్కడ జైనఋషి, గోమటేశ్వరుని శిలావిగ్రహం, 56½ అడుగుల ఎత్తుగలది ఉంది. ఆసియా ఖండంలో ఇంత గొప్ప శిలా విగ్రహంలేదు. పన్నెండు సంవత్సరాల కొకసారి, యీ విగ్రహానికి మహామస్తకాభిషేకం జరుగుతుంది. ఆ ఉత్సవానికి దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ జైన మతస్థులు వస్తారు.

శ్రీకూర్మం :

శ్రీకాకుళం జిల్లాలోని శ్రీకాకుళం పట్టణానికి ఎనిమిది మైళ్ళ దూరంలో, సముద్ర తీరాన వుంది, కూర్మావతారానికి దేవాలయం గల ప్రదేశం. భారత దేశంలో మరెచ్చటను కూర్మావతారానికి దేవాలయం లేదు.

శ్రీపెరుంబుదూరు :

శ్రీరామానుజా చార్యుల జన్మస్థలము. చెన్నపట్టణానికి 35 మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడ మంచి శిల్పంతో కట్టిన రామానుజాలయం వుంది. ఇప్పటికీ, భారతదేశంలోని అన్ని ప్రాంతాలనుంచి, వైష్ణవ మత స్థులు యిక్కడికి యాత్ర వస్తూవుంటారు.

శ్రీరంగం :

భారతదేశంలోని దేవాలయాన్నిటిలోకి పెద్దది, శ్రీరంగంలో వుంది. కావేరీ నదీ పాయలమధ్య శ్రీరంగపట్టణం, తిరుచిరాపల్లికి రెండు మైళ్ళ దూరంలోవుంది. ఇచ్చటి దేవుడు, శ్రీరంగనాథుడు. ఈ దేవాల యపు ప్రధాన గోపురము ఎత్తు 152 అడుగులు. గోపురములన్నిటిమీదా మంచి శిల్పనైపుణ్యం కనబడుతుంది.

శ్రీశైలం :

కర్నూలుజిల్లాలోని ప్రసిద్ధ శివక్షేత్రం. దేవుడు మల్లికార్జునుడు. కర్నూలునుంచి మార్కాపురం (44 మైళ్ళు) వెళ్లాలి. ఇక అక్కడనుంచి కొండ లెక్కడమే. పెద్దచెరువు పదిమైళ్ళు. దారి కష్టం. ప్రయాణం ప్రయాస. అయినా, శివరాత్రికి వేలకొలది భక్తులు వెడుతూనేవుంటారు 1958 లో యీ కొండ మీదికి రోడ్డు వేశారు. కొండపైకి బస్సులు వెడతాయి.

సింహాచలం :

వాల్తేరుకు 8 మైళ్ళలోవుంది. కొండమీద నృసింహాలయం. ఇచ్చటి దేవునికి సింహాద్రి అప్పన్న అనిపేరు. సంవత్సరం పొడుగునా భక్తులు కానుకలను చెల్లించడానికి ఇక్కడికి వెడుతూనే వుంటారు.

హంపి :

జగత్ప్రసిద్ధిపొందిన ఆంధ్రరాజధాని విజయనగరపు శిధిలాలుగల చోటు. దక్షిణ రైల్వేలో, గుంటకల్లు – హుబ్లి సెక్షనులో హాస్పేట వద్దరదిగి, ఎనిమిదిమైళ్లు వెళ్లాలి. తుంగభద్రా నదీతీరాన, పది చదరపు మైళ్ల వైశాల్యంగల స్థలంలో, విజయనగర శిధిలాలను చూడవచ్చును.

# జన్మదినోత్సవాలు

ఏప్రిల్, 16 : కందుకూరి వీరేశలింగం (1848)
మే, 1 : కాశీనాథుని నాగేశ్వరరావు (1867)
జూన్, 2 : దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889)
ఆగస్టు, 15 : అరవిందయోగి (1872)
ఆగస్టు, 23 : టంగుటూరి ప్రకాశం (1869)
అక్టోబరు 2 : గాంధిజీ (1869)
అక్టోబరు, 31 : సర్దార్ పటేల్ (1875)
నవంబర్ 14 : జవహర్ లాల్ నెహ్రూ (1889)
నవంబర్, 30 : గురజాడ అప్పారావు (1861)
డిసెంబర్, 28 : కాంగ్రెసు మహాసభ స్థాపన (1885)

# స్మారక దినములు

జనవరి 30 : గాంధీజీ హత్య (1948)
ఫిబ్రవరి 22 : కస్తూరిబా గాంధి మరణము (1944)
,, 28 : కమలా నెహ్రూ మరణము (1934)
ఏప్రిల్ 11 : కాశీనాథుని నాగేశ్వరరావు మరణము (1938)
మే 20 : టంగుటూరి ప్రకాశం మరణము (1957)
,, 27 : కందుకూరి వీరేశలింగం మరణము (1919)
జూన్ 10 : దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మరణము (1928)
ఆగస్టు 1 : బాలగంగాధర తిలక్ మరణము (1920)
,, 15 : కొండా వెంకటప్పయ్య మరణము (1949)
,, 18 : సుభాసచంద్రబోస్ మరణము (1945)
నవంబర్ 12 : మదనమోహన మాలవీయ మరణము (1946)
,, 17 : లాలా లజపతిరాయ్ మరణము (1927)
,, 30 : గురజాడ అప్పారావు మరణము (1915)
డిసెంబర్ 5 : శ్రీ అరవిందయోగి సమాధి (1950)
,, 15 : సర్దార్ వల్లభాయ్ పటేల్ మరణము (1950)
,, 15 : పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ (1952)

# జాతీయ గీతం

భారతదేశానికి జాతీయగీతంగా "జనగణమన"ను ఎంచుకోవాలా, "వందేమాతరం"ను ఎంచుకోవాలా అనే విషయాన్నిగురించి రాజ్యాంగ పరిషత్తులోనూ పత్రికలలోనూ చాలాచర్చ జరిగింది. చివరకు 1950 జనవరి 24 వ తేదీన రాజ్యాంగ పరిషత్తులో అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ ఒక ప్రకటనచేశారు. ఆ ప్రకటన ప్రకారం భారతదేశానికి జాతీయ గీతంగా 'జనగణమన' నిర్ణయించబడింది. ఈ గీతంలోని పదాలలో ఏదైనా మార్పులు అవసరమైతేోస్తే, అలాటిమార్పులను చెయ్యడానికి ప్రభుత్వం ఉత్తరువు చెయ్యవచ్చును. 'వందేమాతరం' గీతం, భారత జాతీయోద్యమంలో దేశభక్తులందరూ భక్తితో పాడిందిగనుకనూ, ఆ గీతంపట్ల దేశంలోని ప్రజలందరికీ భక్తిహెచ్చుగనుకనూ, ఆగీతానికికూడా 'జనగణమన'తో సమానస్థానం ఇవ్వబడింది. అయితే, జాతీయగీతంగా 'జనగణమన' నిర్ణయింపబడింది గనుక, ప్రభుత్వం అధ్వర్యంలో జరిగే ఉత్సవాలలోనూ, ప్రభుత్వ కార్యక్రమాల సందర్భంలోనూ జాతీయ గీతంగా 'జనగణమన' పాడబడుతుంది.

జాతీయగీతం అంటే ఒక జాతిప్రజలు తమ దేశానికీ, తమకూ చెప్పుకొనే నమోవాకం అన్నమాట. దేశంపట్ల ప్రతివ్యక్తీ భక్తిని ఎలా కలిగివుండాలో, జాతీయగీతంపట్ల ప్రతివ్యక్తీ అలాంటి గౌరవాన్ని చూపించాలి. ఒక వ్యక్తి తన మాతృభూమిపట్ల చూపే భక్తికి నిదర్శనము తన జాతీయపతాక పట్లనూ, తన జాతీయగీతం పట్లనూ అతడు చూపే గౌరవమే. అందుచేత జాతీయగీతాన్ని పాడేటప్పుడు ప్రతివ్యక్తి తన మాతృదేశాన్ని తలచుకొంటూ, భక్తిభావం కనపరచాలి. అసభ్యంగా జాతీయగీతాన్ని పాడకూడదు. సభలలోనూ, సినిమాలలోను, జాతీయగీతాన్ని పాడేటప్పుడు, అక్కడ వున్నవారంతా లేచి నిలుచుని జాతీయగీతంపట్ల గౌరవాన్ని ప్రదర్శించాలి. సినిమాలలో, ప్రదర్శనం అయిన తరువాత ఆఖరున జాతీయగీతం పాట వాయిద్యం పెట్టినప్పుడు, ప్రతివ్యక్తి కదలకుండా గౌరవభావంతో నిలబడాలి. కాని గబగబ బైటికి వెళ్లకూడదు. అలా బైటికి వెళ్ళడం జాతీయగీతాన్ని అవమానం చెయ్యడం అవుతుంది. విద్యావంతులు, నాగరికులు, తమ దేశంపట్ల తమ జాతిపట్ల గౌరవం కలవారూ అలా చెయ్యరు.

జాతీయగీతం పూర్తిపాఠము ప్రక్క పేజీలో ప్రకటింపబడినది.

# భారత జాతీయ గీతము
## (జనగణమన)

జన గణ మన అధినాయక జయహే భారత భాగ్యవిధాతా
పంజాబ సింధు గుజరాత మరాటా ద్రావిడ ఉత్కళ వంగ
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధితరంగ
తవశుభనామే జాగే తవశుభ ఆశిషమాగే
గాహే తవ జయ గాథా

జన గణ మంగళ దాయక జయహే భారత భాగ్యవిధాతా
జయ జయహే జయ జయహే జయజయ జయహే
అహరహతన ఆహ్వాన ప్రచారిత శునీతవ ఉదారవాణీ
హిందు బౌద్ధ సిఖ జైన పారసిక ముసల్మాన క్రిస్తానీ
పూరబ పశ్చిమ ఆసే తవ సింహాసన పాసే
ప్రేమి హార హయ గాథా

జన గణ ఐక్య విధాయక జయహే భారత భాగ్యవిధాతా
పతన అభ్యుదయ బంధుర పంథా యుగ యుగ ధావితయాత్రీ
తుమి చిర సారథి తనరథ చక్రే ముఖరిత పథ దిన రాత్రీ
దారుణ విప్లవ మాఘే తన శంఖధ్వని బాజే సంకట దుఃఖత్రాతా
జన గణ పథ పరిచాయక జయహే భారత భాగ్యవిధాతా
ఘోర తిమిర ఘన నిబిడనిశీథే పీడిత మూర్ఛిత దేశే
జాగృత ఛిలతవ అవిచల మంగళ నతనయనే అనిమేషే
దుఃస్వప్నే అంతకే రక్షోకరిలే అంకే
స్నేహమయీ తుమి మాతా

జన గణ దుఃఖత్రాయక జయహే భారత భాగ్యవిధాతా
రాత్రి ప్రభాతిల ఉదిలరవిచ్ఛవి పూర్వఉదయగిరి భాలే
గాహే విహంగమ పుణ్యసమీరణ సజీవన రసఢాలే
తవకరుణారుణ రాగే నిద్రిత భారతజాగే తవచరణేనతమాథా
జయజయజయహే జయ రాజేశ్వర భారత
భాగ్యవిధాతా జయహే

—రవీంద్రనాథ ఠాకూర్.

# జాతీయ పతాకము

ప్రతి దేశానికి ప్రధాన చిహ్నము ఆ దేశము పతాకము. ప్రతిదేశానికి ప్రత్యేక రంగులలో, ప్రత్యేక చిహ్నముతో పతాకాలు వుంటాయి. భారతదేశపు జాతీయ పతాకంలో మూడురంగులు వున్నాయి. కుంకుమ వర్ణము, తెలుపు, ఆకుపచ్చ. పైన కుంకుమ వర్ణము, మధ్య తెలుపు, క్రిందన ఆకుపచ్చ, వుండేటట్టుగా ఈ రంగులు అమర్చాలి. పతాకం పొడవు ఎంత వుంటే ఆ పొడవులో మూడింట రెండు వంతులు వెడల్పు వుండాలి. అంటే పతాకం పొడవు మూడు అడుగులుంటే, వెడల్పు రెండు అడుగులు వుండాలి. పతాకంలోని మూడు రంగులకూ సమానమైన వెడల్పు వుండాలి. పతాకం మధ్యలో అశోకునిధర్మచక్ర చిహ్నం వుంటుంది. ఇది మన జాతీయ పతాకం.

ప్రతిజాతీ, తన గౌరవానికి జాతీయ చిహ్నంగా పతాకను గౌరవించాలి. జాతీయ పతాకాన్ని అగౌరవంగా చూడటం జాతిని అగౌరవంగా చూచినట్లే. అంచేత, యితర దేశాల పతాకాలనుకూడా ప్రతి దేశీయుడూ గౌరవించాలి.

జాతీయపతాకాన్ని కాళ్ళతో తొక్కడం, ఎక్కడబడితే అక్కడ పడవెయ్యడం, పెళ్ళిళ్లు మొదలైన గృహోత్సవాల సందర్భంలో ఇంటిమీద ఎగుర వెయ్యడం, నాగరికులైనవారూ, తమ దేశంపట్ల గౌరవం కలవారూ చెయ్యరు. జాతీయ ఉత్సవాలనాడు మాత్రమే జాతీయ పతాకాలను ఇళ్లమీద ఎగరెయ్యాలి.

భారత రాష్ట్రపతి, రాష్ట్రాల గవర్నర్లు, ఇండియా మంత్రులు, రాష్ట్రాల మంత్రులు మాత్రం జాతీయపతాకాన్ని తమ కార్లమీద ఎగురవేసుకోవచ్చును. తక్కిన వ్యక్తులెవరూ అలా చెయ్యకూడదు. జాతీయ ఉత్సవాలనాడు తప్ప ఇతర దినాలలో పతాకాన్ని ఎగురవెయ్యకూడదు. పతాకాన్ని ఎగురవేసినప్పుడు సూర్యోదయకాలంలో పతాకాన్ని ఎగరవేసి, సూర్యాస్తమయ సమయంలో దింపాలి.

# భారతదేశం

ఆసియా భూఖండంలోని పెద్ద భాగాలలో ఒకటి భరతఖండం అని పిలువబడే భూభాగం. రష్యా మినహాగా యూరప్ ఖండపు అంతటి వైశాల్యం ఎంతో, భరత ఖండపు వైశాల్యం కూడా దాదాపు అంతే.

1947 ఆగస్టు 15వ తేదివరకు భరతఖండంఅంతా ఏక దేశంగానే పరిగణింపబడేది. బ్రిటిషువారి పరిపాలనలో ఏక కేంద్ర ప్రభుత్వపు పరిపాలనలోనే వుంది. కాని, 1947 ఆగస్టు 15న రాజకీయంగా స్వాతంత్ర్యం చేకూరడంతోపాటు, భరతఖండం ఇండియా, పాకిస్తాన్ అనే పేర్లతో రెండు దేశాలయింది. ఇండియాకు 'భారత్' అని దేశీయ నామం. నేడు భారతదేశం అంటే పాకిస్తాన్ పోగా మిగిలిన భరత ఖండంలోని భూభాగం అన్నమాట.

## భౌతికరూపం

ఇండియాను భౌతిక స్వరూపంలో మూడు భాగాలుగా విభజింపవచ్చును. హిమాలయ పర్వతభూమి, గంగానదీ ప్రాంత పల్లపుభూమి, దక్కన్ పీఠభూమి.

హిమాలయ పర్వతభూమి ప్రాంతాలలో పెద్ద అడవులు, ఖనిజ సంపదా వున్నాయి.

గంగాతీర పల్లపు భూమి సుమారు 3,00,000 చ. మైళ్ల ప్రాంతం. చాలా సారవంతమయినది.

దక్కను పీఠభూమిలో గోదావరి, కృష్ణ, కావేరి నదీ ప్రాంత భూములు సారవంతమయినవి.

ఉత్తర ఇండియాలోని ప్రధానమయిన నదులు, గంగ, యమున, బ్రహ్మపుత్ర, మహానది, నర్మద, తపతి.

దక్షిణ ఇండియాలోని ప్రధానమయిన నదులు: కృష్ణా, గోదావరి కావేరి, పెన్న.

# భూకంపములు

ఇండియాలో గత రెండువందలసంవత్సరాలలోనూ నాలుగుదారుణమయిన భూకంపములు జరిగినవి. వాటి వివరాలు ఇవి ;

1737: కలకత్తా. సుమారు 3లక్షల మంది ప్రజలు చనిపోయారు. (1737 : అక్టోబరు 11)

1934: బీహార్: సుమారు 10,000 మంది చనిపోయారు. (1934 జనవరి 15)

1935 : క్వెట్టా : సుమారు 60,000 మంది ప్రజలు చనిపోయారు. (1935 మే 31)

1950: అస్సాం. సుమారు 1,000 మంది చనిపోయారు. (1950 ఆగస్టు 15).

# వైశాల్యం

భారతదేశపు వైశాల్యం 11,74,120 చ. మైళ్లు. తూర్పునుంచి పడమరవరకు గరిష్ఠదూరము 2,000 మైళ్లు; ఉత్తరమునుంచి దక్షిణానికి గరిష్ఠదూరము 2,000 మైళ్లు. భారతదేశపు సముద్రతీరం మొత్తం2.700 మైళ్ళ పొడవు వుంటుంది.

భారతదేశం, పోర్చుగీసుదేశం అధీనంలోవున్న కొద్దిపాటి భూభాగంతప్ప, ఒకే కేంద్రప్రభుత్వపు అధీనంలో వుంది.

భారతదేశం విస్తారంగా పల్లెటూళ్ళదేశం. గత 50 సంవత్సరాలనుంచీ పట్టణాలు, కొంచెం కొంచెంగా పెరుగుతున్నాయి. అయితే, దేశంలోకల్లా మరీ పెద్ద పట్టణాలు అయిదు : కలకత్తా, బొంబాయి, మదరాసు, ఢిల్లీ. హైదరాబాదు.

## ఇండియా రాష్ట్రాల వైశాల్యం చదరపుమైళ్లలో

ఆంధ్రప్రదేశ్, 1,05.677. అసాం, 85,012, ఉత్తర ప్రదేశ్, 1.13,433. ఒరిస్సా, 60,136. కాశ్మీర్, 92,780. కేరళ 14,610.

పంజాబ్, 47,427. పశ్చిమ బెంగాల్, 34;944, బీహార్, 66,161, బొంబాయి, 1,19,367. మదరాసు, 50.171.మధ్యప్రదేశ్. 1,70,909. మైసూర్, 74,093. రాజస్థాన్, 1,32,439. అండమాన్ నికోబార్ దీవులు, 3,215, ఢిల్లి, 578. త్రిపుర, 4,032. మణిపూర్, 8,622. లక్షదీవులు, అమీన్ దీవులు, 384. హిమాచల ప్రదేశ్ 10,909, వైశాల్యంప్రకారం, దేశంలోని రాష్ట్రాలు వరుసగా ఇవి : బొంబాయి, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్. ఆంధ్రప్రదేశ్, కాశ్మీర్, అసాం. మైసూర్, బీహార్, ఒరిస్సా,. మదరాసు. పంజాబ్, పశ్చిమ బెంగాల్, కేరళ, హిమాచలప్రదేశ్, మణిపూర్, త్రిపుర, అండమాన్, నికోబార్ దీవులు, ఢిల్లీ, లక్షదీవులు, అమీన్ దీవులు.

## ప్రజలు : జాతులు

పూర్వకాలంలో భారతదేశంలో ద్రావిడ, ఆర్యజాతులు ప్రత్యేకంగా వున్నప్పటికీ, క్రమేణా యీ రెండు జాతులు కలియడం, ఆ తరువాత మంగోలియన్ జాతికూడా ఇండియాలోప్రవేశించి, ఇలడియాలోని తక్కిన జాతులతో కలియడమూ జరిగిలది. జాతి సమ్మేళనం బాగా జరిగిపోయిన తరువాత వర్ణవ్యవస్థ ఏర్పడింది. అందువలనే ఆర్యసాంప్రదాయం ప్రధానంగా అవలంబించే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలలో ద్రావిడజాతి చిహ్నముగల వ్యక్తులూ, ప్రథమంలో ద్రావిడ జాతికి చెందిన పంచములలో ఆర్యజాతి చిహ్నముగల వ్యక్తులూ, యీ వుభయులలోనూ, ముఖ్యంగా అస్సాం, బెంగాల్, ఒరిస్సాలలో మంగోలియన్ జాతి చిహ్నముగల వ్యక్తులూ స్పష్టంగా కనిపిస్తూవున్నారు. అందుచేత, భారతదేశంలో యీనాడు ప్రత్యేకజాతుల ప్రజలు నివసిస్తున్నారని ఏప్రాంతాలలోని ప్రజలనూ వేరుగా నిర్దేశించడానికి వీలులేదు. నేడు భారతదేశంలోవున్న ప్రజలు, వివిధజాతుల సమ్మేళనంవల్ల ఏర్పడిన భారతజాతి.

ఈ భారతజాతిలోనే, పురాణకాలంలో వర్ణవ్యవస్థ ఏర్పడి అయిదు ప్రధాన కులాలు స్థిరపడిపోయినవి. ప్రస్తుతం యీ కులభేదం

క్రమంగా తొలగిపోతున్నది. ఏకజాతి, ఏకపలంగల భారత ప్రజా వ్యవస్థ క్రమంగా పరిణామం పొందకపోదు.

1955 అంచనాల ప్రకారం, రాష్ట్రాలలోని జనాభా సంఖ్యలు ఇవి ;

ఆంధ్రప్రదేశ్ : 3,12,60,133, అసాం : 90.43,707. ఉత్తర ప్రదేశ్ : 6,32,15,742. ఒరిస్సా : 1,46,45,946. కాశ్మీర్: 44,00,000. కేరళ: 1,35,49,118. పంజాబ్: 1,61,34,890. పశ్చిమ బెంగాల్ : 2,61,60,217. బీహార్: 3,89,25,947. బొంబాయి: 4,82,65,221. మదరాసు:2,99,74,936. మధ్యప్రదేశ్:2,60,71,637. మైసూరు: 1,94,01,193. రాజస్తాన్: 1,59,70,774. అండమాన్, నికోబార్: 30,971. ఢిల్లి: 17,44,072. త్రిపుర: 6,39,029. మణిపూర్: 5,77,635. లక్షదీవులు: 21,035. హిమాచల ప్రదేశ్ : 11,09,466.

రాష్ట్రాలన్నిటిలోనూ ఎక్కువ జనాభా గలది ఉత్తరప్రదేశ్. తరువాత బొంబాయి, బీహార్, ఆంధ్రప్రదేశ్, మదరాసు, పశ్చిమ బెంగాల్, మధ్యప్రదేశ్, మైసూర్, పంజాబ్, రాజస్తాన్, ఒరిస్సా, అసాం, కాశ్మీర్ రాష్ట్రాలు లెక్కకు వస్తాయి.

దేశంలోని జనాభాలో 29,50,04,271 మంది గ్రామాలలో నివసిస్తున్నారు. తక్కిన 6,18,25,214 మంది నగరాలలో నివసిస్తున్నారు.

పదిలక్షలకంటె ఎక్కువ జనాభాగల పట్టణాలు దేశంలో అయిదు మాత్రమే వున్నాయి. అవేమిటంటె :

| | |
|---|---|
| బొంబాయి : | 28,39,270. |
| మదరాసు : | 14,16,056. |
| కలకత్తా : | 25,48,677. |
| హైదరాబాద్ : | 10,[illegible]5,722. |
| ఢిల్లి : | 11,91,104. |

కొన్ని ముఖ్యనగరాల జనాభా

| | | | |
|---|---|---|---|
| పాట్నా : | 2,83,489; | కటక్ : | 1,02,501 |

| | | | |
|---|---|---|---|
| జంషెడ్‌పూర్ : | 2,18,162; | లక్నో : | 4,96,865 |
| గయ : | 1,33,700; | కాన్పూర్ : | 7,05,882 |
| అహమ్మదాబాద్ : | 7,88,333; | ఆగ్రా : | 3,75,665 |
| పూనా : | 4,80,982; | కాశీ : | 3,55,777 |
| సూరత్ : | 2,23,182; | అలహాబాద్ : | 3,32,295 |
| కొల్హాపూర్ : | 1,36,835; | వరంగల్ : | 1,33,130 |
| నాగపూర్ : | 4,49,099; | బెంగుళూరు : | 7,78,977 |
| మధుర : | 3,61,781; | మైసూరు : | 2,44,323 |
| తిరుచిరాపల్లి : | 2,18,921; | జైపూర్ : | 2,91,130 |
| కోయంబత్తూరు : | 1,97,755; | జోద్‌పూర్ : | 1,80,717 |
| విజయవాడ : | 1,61,198; | రాజకోట : | 1,32,069 |
| గుంటూరు : | 1,25,255; | త్రివేంద్రం : | 1,86,931 |
| విశాఖపట్టణం : | 1,08,042; | ఉజ్జయిని : | 1,29,177 |
| రాజమండ్రి : | 1,05,276; | అమృతసర్ : | 3,25,747 |

## వృత్తులు

దేశంలోని జనాభాలో 24.90,74,901 మంది వ్యవసాయంమీద జీవిస్తున్నారని 1951 జనాభా లెక్కలవల్ల తేలింది.

భూమి ఖామందులుగావుండి, వ్యవసాయ వృత్తిమీద జీవిస్తున్న వారూ, వారి ఆశ్రితులూ, స్త్రీ పురుషులు : 16,73,26,578.

భూఖామందులు కాకుండా వ్యవసాయం చేస్తున్న వారు; స్త్రీ పురుషులు కలిపి, 3,16,78,073.

వ్యవసాయ వృత్తిమీద జీవించే కౌలుదారులు జనులు, స్త్రీ పురుషులు : 4,48,09,019.

వ్యవసాయం చెయ్యకుండావుండే భూఖామందులు, స్త్రీలు పురుషులు కలిపి, 53,21,201.

వ్యాపారవృత్తి వలన జీవించేవారూ, వారి పోషణమీద ఆధారపడినవారూ కలిపి, 2,13,11,898.

రవాణా సౌకర్యాలలో పనిచేస్తున్నవారూ, వారి పోషణమీద ఆధారపడినవారూ కలిపి, 56,20,717.

## మతములవారీగా

భారతదేశంలోని జనాభాలో నూటికి 84.99 వంతులు హిందువులు. 9.93 వంతులు ముస్లిములు. 2.3 వంతులు క్రైస్తవులు. 1.74 వంతులు సిక్కులు. 0.45 వంతు జైనులు. 0.06 వంతులు బౌద్ధులు; 0.03 వంతులు పార్శీలు వున్నారని 1951 జనాభా లెక్కలవల్ల తేలింది.

దేశంలోని ప్రజలలో వివిధ మతాలకు చెందినవారి సంఖ్య ఇది

| | |
|---|---|
| హిందువులు : | 30,31,86,986 |
| ముస్లిములు : | 3,54,00,117 |
| క్రైస్తవులు : | 81,57,765 |
| సిక్కులు : | 62,19,134 |
| జైనులు : | 16.18,406 |
| బౌద్ధులు | 1,80.767 |
| పార్శీలు | 1.11,791 |
| యూదులు : | 26,781 |
| కొండజాతులు : | 16,16,897 |
| ఇతర మతములు : | 47,148 |

## వివాహితులు : అవివాహితులు

1951 జనాభా లెఖ్ఖల ప్రకారం, ఇండియాలో 8,81,47,296 మంది వివాహం కాని పురుషులూ, 6,59,50,673 మంది వివాహంకాని స్త్రీలూ వున్నారని తేలింది. వివాహితులైన పురుషులు, 8,22,43,086; స్త్రీలు. 8,23,87,997.

భార్య చనిపోయినవారు, లేక భార్యలను వదలిపెట్టినవారు. మొత్తం పురుషులు, 90,33,458. భర్త చనిపోయినవారు లేక భర్తలను వదలిపెట్టినవారు, మొత్తం స్త్రీలు, 2,18,11,014.

## బస్తీలు : గ్రామాలు

ఇండియాలో 5,58,089 గ్రామాలు, 3,010 బస్తీలువున్నాయి.

మొత్తం 6,43,61,676 ఇళ్ళలోను 5,40,65,388 పల్లెటూరి ఇళ్లు, 103,95,288 బస్తీ ఇళ్ళు. ఈ బస్తీ ఇళ్ళలో 6,18,75,122

మంది నివసిస్తున్నారు. దీనినిబట్టి గ్రామ ప్రాంతాలలో ప్రతి ఇంటిలోను 5. 4 మంది, బస్తీలలో 5 మంది సగటున నివసిస్తున్నట్టు లెక్క తేలింది.

ఇండియాలో మొత్తం 500 మంది అయినా లేని గ్రామాలసంఖ్య 38,020. వాటి మొత్తం జనాభా 78,347,691.500-1000 మంది జనాభాగల గ్రామాల సంఖ్య 104,263. ఇంక 1,000—2000 జనాభా ఉండే గ్రామాలు 51,769. 2,000—5,000 మధ్య జనాభా గల బస్తీల సంఖ్య 20,588.

5,000—10,000 జనాభా గల బస్తీలు 3,101. వీటిలో 2,07,53,736 మంది నివసిస్తున్నారు. 10,000-20,000 జనాభాగల పెద్ద పట్టణాలు 856. వీటిలో 1,16,85,768 మంది నివసిస్తున్నారు. 20,000—50,000 లోపు జనాభా గల పట్టణాలు 401. వీటిలో 1,18,04,047 మందినివసిస్తున్నారు. 50,000—1,00,000 జనాభాగల పెద్ద పట్టణాలు 111, వీటిలో 75,55,324 మంది నివసిస్తున్నారు.

లక్షకు పైబడి జనులు నివసిస్తున్న నగరాలు 73. వీడిలో 53,551,617 మంది నివసిస్తున్నారు.

## విద్యావంతులు

1951 జనాభా లెక్కలనుబట్టి దేశపు జనాభాలో నూటికి 16.6 వంతులమంది, అంటే దాదాపు ఆరు కోట్లమంది మాత్రమే విద్యావంతులని తేలింది.

ఆరుకోట్లమంది అక్షరాస్యులలోనూ, సుమారు 38 లక్షలమంది మాత్రమే స్కూలుఫైనలు పరీక్ష ప్యాసయినవారు. ఇంటర్మీడియేట్ వరకు చదివినవారు మొత్తం, 4,66,000 మంది, వీరిలో 4,07,000 మంది పురుషులు ; 59,000 మంది స్త్రీలు.

డిగ్రీలను పొందినవారు మొత్తం, 11,76,398 మంది. వీరిలో పురుషులు, 9,93,304 ; స్త్రీలు. 1,83,094.

డిగ్రీలు పొందినవారిలో లా పరీక్ష ప్యాసయినవారు, 64,636 మంది. వీరిలో 873 మాత్రమే స్త్రీలు. వైద్య పరీక్ష ప్యాసయినవారు 64,690 మంది. వీరిలో స్త్రీలు 806 మంది మాత్రమే.

## పసిపిల్లల మరణాలు

ఇతరదేశాలతో పోల్చిచూస్తే, భారతదేశంలో పసిపిల్లల మరణాలు చాల ఎక్కువ. బిడ్డలపోషణవిషయంలో తల్లిదండ్రుల అజ్ఞానము, పుష్టిలేని ఆహారము, దారిద్ర్యము మొదలైన అనేక కారణాలవల్ల బిడ్డల మరణం ఈ ఖండంలో ఎక్కువ, అయినప్పటికి గత 25 సంవత్సరాలలోనూ, యీ మరణాలు క్రమేపి తగ్గుతున్నాయి.

1947 లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యి మందికీ 146 మంది చనిపోయారనీ, 1948లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యి మందికి 131 మంది 1952లో ప్రతి వెయ్యిమందికి 116 మంది 1953లో ప్రతి వెయ్యి మందికి 118 మంది, 1954 ప్రతివెయ్యిమందికి 113 మంది చనిపోయారని లెక్కల వల్ల తెలుస్తున్నది.

## ఇండియాలో విదేశీయులు

1959 జనవరి 1 తేదినాటికి ఇండియాలో నివసిస్తున్న విదేశీయుల సంఖ్య, 47,410. ఇతర రాష్ట్రాలలో కంటె, బొంబాయిలో ఎక్కువ మంది నివసిస్తున్నారు. దేశంలోని విదేశీలలో చైనీయులు, 11,301; ఆఫ్ఘనులు, 7,034; ఇరానియనులు, 4,570; అమెరికనులు, 3,709; జర్మనులు, 2,433; బర్మీయులు, 2,144; ఫ్రెంచి, 1,061; ఇటాలియనులు, 1,133.

# ఆహారధాన్యాలపంట

ప్రస్తుతం భారతదేశంలో 37 కోట్ల పైగా జనాభావుంది. మనిషికి రోజుకు 28 ఔన్సుల లెక్కన, ఏడాదికి 6 కోట్ల టన్నుల ఆహారధాన్యాలు మనకు కావాలి.

విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడంవల్ల డబ్బు చాలా వ్యయమైపోతున్నది. దేశంలోనే అవసరమైనంతవరకు ఆహారపదార్థాలను ఉత్పత్తిచేసుకుంటే, విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోడానికి ఖర్చుపెట్టేడబ్బు మిగులుతుంది. ఆ డబ్బుతో, పరిశ్రమలను వృద్ధిపొందించడానికి కావలసిన యంత్ర సామ

గ్రిని కొనవచ్చును : కాబట్టి, విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడం శీఘ్రమైనంత త్వరలో నిలిపివెయ్యడానికి నిశ్చయించి, దేశంలోనే ఎక్కువ భూమిని వ్యవసాయం చెయ్యడానికీ, నీటితీరువ సదుపాయాలను కల్పించి, ఒకసారి పంటపండే భూమిలో రెండుపంటలు పండించడానికీ కార్యక్రమాలను ప్రభుత్వం తయారుచేసింది.

ఈ కార్యక్రమాల ఫలితంగా, దేశంలో ఆహారధాన్యాల పంట చాలా ఎక్కువ చేయబడినది. 1950 లో పండిన ఆహారధాన్యాలు 4,60,18,000 టన్నులు అయితే, 1957 లో పండిన ఆహారధాన్యాలు, 6 కోట్ల 87 లక్షల టన్నులు.

## వ్యవసాయ భూమి

ఇండియాలో వ్యవసాయములోవున్న భూమి, అడవి, వ్యవసాయానికి రానిభూమి ఎంత వున్నదీ ఈ క్రింది పట్టినిబట్టి తెలుసుకోవచ్చును. (భూమి కొలత ఎకరాలలో యివ్వబడినది.)

| | | |
|---|---|---|
| దేశంలోనిభూమి : | 72,15,00,000 | ఎకరాలు |
| అడవి : | 13,34,05,000 | ,, |
| బంజరు : | 12,18,00,000 | ,, |
| సేద్యపు భూములు | 3,65,89,300 | ,, |
| నీటి పారుదల సౌకర్యాలుగలభూమి. | 6,73,00,000 | ,, |

వరి :

1955-56 లో 6,57,42,000 ఎకరాలలో 2,54,74,000 టన్నులు, 1954-55 లో 7,59,49,000 ఎకరాలలో 2,45,31,000 టన్నులు వరిపంట పండినది.

1956-57 లో 7,18,74,000 ఎకరాలలో వరిపంట వేయగా 2,81,42,000 టన్నుల బియ్యం పండినవి.

1957-58 లో 7,94,47,000 ఎకరాలలో వరిపంట వేయగా 2,48,85,000 టన్నుల బియ్యం పండినవి.

1958-59 లో 8,15,90,000 ఎకరాలలో వరిపంట వేయగా, 2,97,21,000 టన్నుల బియ్యం పండినవి.

గోధుమలు :

1956-57 లో మనదేశంలో 3,28,91,000 ఎకరాలలో 90,68,000 టన్నుల గోధుమలు పండినవని అంచనా. 1955-56 లో 3,03,86,000 ఎకరాలలో 85,99,000 టన్నుల గోధుమలు పండినవి.

బార్లీ :

1956-57 లో దేశంలో 85,94,000 ఎకరాలలో 27,44,000 టన్నుల బార్లీ పండినట్లు అంచనా, 1955-56 లో 83,82,000 ఎకరాలలో 27,49,000 టన్నుల బార్లీ పండింది.

మొక్కజొన్న :

1956-57 లో దేశంలో 91,77,000 ఎకరాలలో 30,09,000 టన్నుల మొక్కజొన్న పండినది. 1957-58 లో 67,62,000 ఎకరాలలో 30,64,000 టన్నులు పండినవి.

జొన్నలు :

1956-57 లో ఇండియాలో 30,97,000 ఎకరాలలో 72,49,000 టన్నుల జొన్నలు పండినవి. 1957-58 లో 41,41,000 ఎకరాలలో 80,56,000 టన్నులు పండినది.

రాగులు ;

1956-57 లో 58,01,000 ఎకరాలలో 19,14,000 టన్నుల రాగులు పండినవి. 1957-58 లో 58,67,000 ఎకరాలలో 17,16,000 టన్నుల రాగులు పండినవి.

బంగాళా దుంపలు :

1956-57 లో 7,02,000 ఎకరాలలో 16,74,000 టన్నుల బంగాళా దుంపలు పండినవని అంచనా. 1955-56 లో 6,91,000 ఎకరాలలో 18,60,000 టన్నుల బంగాళాదుంపలు పండినవి.

నువ్వులు :

1957-58 లో 54,87,000 ఎకరాలలోను, 1956-57 లో 51,45,000 ఎకరాలలోను నువ్వులపంట వేయబడిందని అంచనా.

శనగలు :

1956-57 లో 2,33,54,000 ఎకరాలలో 53,50,000 టన్నుల శనగలు పండినవని అంచనా. 1955-56 లో 2,23,37,000 ఎకరాలలో 46,36,000 టన్నుల శనగలు పండినవి.

మిరపకాయలు :

| సంవత్సరం : | పంట వేసిన భూమి ఎకరాలు : | పంట టన్నులు |
|---|---|---|
| 1954-55 | 15,23,000 | 3,68,300 |
| 1955-56 | 14,92,000 | 3,40,000 |
| 1956-57 | 14,76,000 | 3,42,000 |
| 1957-58 | 15,34,050 | 3,55,000 |

వేరుశనగ :

ప్రపంచంలో వేరుశనగ అత్యధికంగా పండే దేశాలలో ఇండియా ఒకటి. దీనితో చాలాభాగం ఎగుమతి అవుతుంది. 1957-58 లో 1,44,57.000 ఎకరాలలో 42,71,000 టన్నులు, 1956-57 లో 1,14,21,000 ఎకరాలలో 35,70.000 టన్నులు వేరుశనగ పండింది.

చెరకు:

1957-58 లో దేశంలో మొత్తం 47,84,000 ఎకరాలలో చెరకు పంట వెయ్యబడిందనీ 6,35,01,000 టన్నుల చెరకు పండిందనీ అంచనా. 1956-57 లో 44,75,000 ఎకరాలలో 5,89,85,000 టన్నుల చెరకు

ప్రత్తి :

| సంవత్సరం : | పంట వేసిన భూమి ఎకరాలు : | పంట (బేళ్లు) |
|---|---|---|
| 1954-55 | 1,83,46,000 | 42,98,000 |

| | | |
|---|---|---|
| 1955-56 | 1,99,78,000 | 40,01,000 |
| 1956-57 | 1,98,93,000 | 47,35,000 |
| 1957-58 | 2,01,50,000 | 47,58,000 |

మన దేశంలో పండే ప్రత్తి మన అవసరాలకు చాలదు. అంచేత విదేశాలనుంచి మనం ప్రత్తి విశేషంగా దిగుమతి చేసుకుంటున్నాము. అయితే, యిటీవల దేశంలో ప్రత్తి పంట ఎక్కువ భూమిలో వెయ్యటంవల్ల దిగుమతులను తగ్గించుకున్నాము. 1950-51 లో 10 కోట్ల రూపాయల విలువగల 2 లక్షల టన్నుల ప్రత్తిని దిగుమతి చేసుకుంటే 1956-57 లో, రు. 9.05 కోట్ల విలువగల 1,15,183 టన్నుల ప్రత్తి మాత్రమే దిగుమతి చేసుకున్నాము.

అయితే మన దేశంనుంచి కొంత ప్రత్తిని యితర దేశాలకు ఎగుమతికూడా చేస్తున్నాము. 1956-57 లో రు. 63,00,000 విలువగల 2,595 టన్నుల ప్రత్తి ఇంగ్లండుకూ, రు. 6,78,35.000 విలువగల 49,882 టన్నుల ప్రత్తిని జపానుకూ ఎగుమతి చేశాము.

పట్టు :

దేశంలో పట్టు వుత్పత్తి నానాటికీ ఎక్కువ అవుతున్నది. 1953 లో 24,61,759 పౌనుల ముడి పట్టు వుత్పత్తి అయితే, 1956లో 34,13,245 పౌనులు ముడిపట్టు వుత్పత్తి చేయబడింది.

గోగునార :

1958-59 లో 8,51,000 ఎకరాలలో గోగునార పండించబడింది. 15,81,000 బేళ్ళ గోగునార వుత్పత్తి అయింది.

జనపనార :

ఈ పైరుకూడా ప్రధానంగా గంగా - బ్రహ్మపుత్రానది డెల్టాలోనే వేయబడుతున్నది. జనపనార ఎక్కువగా బెంగాలు, బీహారు, అసాం రాష్ట్రాలలో పెరుగుతున్నది. 1957-58 లో దేశంలో 14,73,000 ఎకరాలలో జనుము పంట వేయబడింది.

మన దేశంలో మొట్టమొదట జనపనార మిల్లు 1855 లో బెంగాల్

లో రిష్రావద్ద స్థాపింపబడింది. నేడు దేశంలో 112 జనపనార మిల్లులు, 72,365 మగ్గాలు వున్నాయి. మిల్లులలో 101 పశ్చిమ బెంగాల్ లోను 4 ఆంధ్ర ప్రదేశ్ లోను, 3 బీహార్ లోను, 3 ఉత్తర ప్రదేశ్ లోను, ఒకటి మధ్య ప్రదేశ్ లోను వున్నాయి. 1957 లో 10,96,248 టన్నుల జనపనార వసువులు తయారు చేయబడినవి. వానిలో రు. 114,20,000 విలువగల 8,48,000 టన్నుల జనపనార వస్తువులు విదేశాలకు ఎగుమతి చేయబడినవి.

## టీ

ఇండియా పంటలలో వ్యాపారపు ప్రాధాన్యంగల సరుకులలో టీ ఒకటి. ఇది ఎక్కువగా అసాం రాష్ట్రంలోను, బెంగాల్, మదరాసు అలలో స్వల్పంగాను, పెరవుతున్నది.

1956 లో 66,24,00,000 పౌనులు, 1957లో 66,60,00,000 పౌనులు టీ పండింది,

1957లో 44,70,00,000 పౌనుల టీ విదేశాలకు ఎగుమతి చేయ బడింది.

1956 లో ఇండియానుంచి రు. 140 కోట్ల విలువచేసే టీ విదేశాలకు ఎగుమతి చేయబడింది.

## కాఫీ

కాఫీ మొట్టమొదట భరతఖండానికి మెక్కానుంచి 16 వ శతాబ్దంలో తీసుకరాబడిందని వదంతి. మొట్టమొదటి కాఫీతోట 1840లో వెయ్యబడిందట. కాని ఈ నూరు సంవత్సరాలలోను కాఫీ వాడుక, ముఖ్యంగా దక్షిణదేశంలో, విస్తారంగా ప్రబలింది. కాఫీ పంటకూడా అసాం రాష్ట్రంలో కొద్దిగా తప్ప, ముఖ్యంగా దక్షిణదేశంలోనే అవుతున్నది. ఇండియాలో పండే కాఫీలో నూటికి 40 వంతులు మైసూరు రాష్ట్రంలోనే పండుతున్నది. దేశంలో మొత్తం 2,54,000 ఎకరాలలో కాఫీ తోటలు వేయబడినవి.

కాఫీ పంట వివరాలివి; 1950 ; 17,238 : 1951 : 18,096 ; 1952 : 21,096 : 1953 : 28,572 ; 1954 ; 29,364 ; 1955 : 24,948 ; 1956 : 42,000 టన్నులు.

1957 లో మన దేశంలో 26,202 టన్నుల కాఫీగింజలు ఖర్చు అయినవి. 1956-57 లో 9,358 టన్నుల కాఫీగింజలు విదేశాలకు ఎగుమతి చేయబడినవి.

## పోక చెక్కలు

ఇండియాలోని వ్యాపారపంటలో ముఖ్యమైనవాటిలో పోకచెక్క (వక్క) ఒకటి. 1949 లో తీసిన లెక్కనుబట్టి, ఇండియాలో మొత్తం 2,88,400 ఎకరాలలో వక్క తోటలు వేయబడినవనీ, యీ తోటలలో ఏడాదికి 25 లక్షల టన్నుల వక్కలు పండుతవని అంచనా.

## పొగాకు

పొగాకు మొట్టమొదట ఇండియాకు పోర్చుగీసువారిచే తీసుకొని రాబడింది. ఇండియాకు ఎక్కువ ఆదాయం వచ్చే పంటలో యీ నాడు అగ్రస్థానం పొగాకుదే.

పొగాకు ఉత్పత్తిలో ప్రపంచంలోని అన్నిదేశాలలోను, యునైటెడ్ స్టేట్స్ తరువాత అగ్రస్థానం ఇండియాదే. పొగాకు పెంపకం ఇండియాలో ప్రధానంగా అయిదు ప్రాంతాలలో జరుగుతున్నది. ఉత్తర బెంగాల్, గుంటూరు—కృష్ణా, ఉత్తరబీహారు, గుజరాత్, బెల్గాం—సతారా ప్రాంతాలు. దేశంలో పండే పంటలో మూడవవంతు ఆంధ్ర దేశంలో పండుతున్నది.

1956-57 లో 10,22,000 ఎకరాలలో మొత్తం 3,06,000 టన్నుల పొగాకు పండిందని అంచనా.

1955-56 లో 10,13,000 ఎకరాలలో 2,65,000 టన్నుల పొగాకు పండింది.

మనదేశంలో పండే పొగాకులో అయిదోవంతు విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది. దీనివల్ల ఏడాదికి దాదాపు రు. 12 కోట్లు మనకు విదేశాలనుంచి రాబడి.

**జీడి గింజలు :**

భారత దేశపు జీడిగింజలకు విదేశాలలో మంచి గిరాకి వుంది.

1955-56 లో రు. 12,92,00,000 విలువగల 30,862 టన్నుల జీడి గింజలు విదేశాలకు ఎగుమతి చేయబడినవి. జీడి పప్పును ఎక్కువగా దిగుమతి చేసుకుంటున్న దేశం అమెరికా.

కొబ్బరి :

ఇండియాలో ఏడాదికి మొత్తం 78 కోట్ల రూపాయల విలువగల కొబ్బరికాయలు కొట్టబడుతున్నవి. దేశంలో మొత్తం 15,.0,000 ఎకరాల భూమిలో కొబ్బరితోటలు వేయబడినవి. దీనిలో మూడింట రెండు వంతులు కేరళ దేశంలో వున్నాయి. తక్కిన భాగం, మదరాసు రాష్ట్రంలోని దక్షిణ కన్నడ, తంజావూరు జిల్లాలలోనూ ఆంధ్రరాష్ట్రంలోని తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోనూ, మైసూరు, బొంబాయి, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోనూ వున్నాయి. ప్రపంచంలో కొబ్బరి తోటలు ఎక్కువగావున్న దేశాలలో ఇండియాది మూడవ స్థానం. అయినా, ఇండియా సిలోను నుంచి కొబ్బరికాయలను దిగుమతి చేసుకుంటున్నది.

మిరియాలు :

విదేశంలో ద్రవ్యార్జనకు మనకు ఎక్కువగా సహాయపడే పంటలలో మిరియాలు ఒకటి. మిరియాల ఉత్పత్తి దేశంలో క్రమంగా ఎక్కువ అవుతున్నది. 1954-55 లో 26,000 టన్నుల మిరియాలు ఉత్పత్తి అయితే, 1955-56 లో 32,000 టన్నుల మిరియాలు ఉత్పత్తి అయినవి. 1956-57 లో కూడా ఇదే ప్రమాణంలో ఉత్పత్తి అయినవి.

1954-55 లో 14,778 టన్నులు, 1955-56 లో 13,127 టన్నులు, 1956-57 లో 14,840 టన్నులు మిరియాలు ఎగుమతి అయినవి.

అవిసె నూనె :

అవిసెనూనె ఉత్పత్తిలో, ప్రపంచంలో అమెరికా, రష్యా అర్జెంటైనా దేశాల తరువాత నాలవస్థానం మనదేశానిది. ఒకప్పుడు మనదేశంనుంచి అవిసెగింజలు ఎగుమతి చేయబడేవి. గాను గ పరిశ్రమ ఎక్కువ అయిన తరువాత గింజలబదులు అవిసెనూనె మనం ఎక్కువగా ఎగుమతి చేస్తున్నాము.

1956-57 లో 37,58,000 ఎకరాలలో 3,19,000 టన్నులు, 1955-56 లో 37,81,000 ఎకరాలలో 4,14,000 టన్నులు అవిసె గింజలు మనదేశంలో ఉత్పత్తి అయినవి.

ఏడాదికి సుమారు 80,000 టన్నుల అవిసెనూనె మనదేశంనుంచి ఎగుమతి అవుతున్నది. దీనివల్ల మనకు రు. తొమ్మిదికోట్లపైగా ఆదాయం వస్తున్నది.

అవిసెనూనె ప్రధానంగా బ్రిటను, ఆస్ట్రేలియా, న్యూజీలెండ్ దేశాలకు ఎగుమతి అవుతున్నది.

## పాడి

పాలు, పెరుగు, వెన్న, నెయ్యి. వీటిని తియ్యడం, అమ్మడం, భరతఖండంలో యిప్పుడు గృహ పరిశ్రమగానే వుంది. పశువులువున్న గ్రామీణ గృహస్థులు, పాడిని చాలవరకు అమ్మరు. కొంతమంది మాత్రమే అమ్ముతున్నారు. సరియైన పద్ధతిలో పాడిని వ్యాపారంలోకి తెచ్చినట్లయితే, గ్రామస్థులకు మంచి ఆదాయం రావడానికి అవకాశం వుంది. దీనికి గ్రామాలనుంచి పట్టణాలకు మంచి రోడ్లు, బస్సు, లారీల సదుపాయం వుండాలి. భరతఖండంలో ప్రజలు మామూలుగా మనిషికి అవసరమైనంతగా పాలు, పెరుగు, వెన్నలను తినడం లేదు. దానికి కారణం, పట్టణాలలో వీటి ఖరీదు ఎక్కువగా వుండటం. పల్లెలలో బీద తరగతివారికి వీటి వుపయోగం తెలియక పోవడం. పశుపోషణ, రక్షణ సరియైన పద్ధతిలో జరిగిననాడు, ఎక్కువపాడి లభ్యం అయి అందరూ వీటిని తినడానికి వీలు కలుగుతుంది.

## పశు సంపద

భారత దేశంలో గల పశు సంపద వివరాలివి :

| | |
|---|---|
| ఆవులు : | 15,88,63,000 |
| గేదెలు : | 4,47,66,000 |
| గొర్రెలు : | 3,86,66,000 |
| మేకలు : | 5,66,28,000 |
| కోళ్ళు : | 9,73,72,000 |

## బియ్యపు ఫ్యాక్టరీలు

1958 అక్టోబరు 1 తేది నాటికి మనదేశంలో వున్న బియ్యపు ఫ్యాక్టరీలు మొత్తం, 22,495. రాష్ట్రాలవారిగా, వాటిసంఖ్యలు ఇవి: ఆంధ్రప్రదేశ్, 4,095; ఆసాం, 257; ఉత్తరప్రదేశ్, 1,294; ఒరిస్సా, 104; కేరళ, 2,078; ఢిల్లి, 1; పంజాబ్, 1,200; పశ్చిమ బెంగాల్, 500; బీహార్, 1,268; బొంబాయి, 3,159; మదరాసు, 7,206; మధ్యప్రదేశ్, 1,486; మణిపూర్, 46; రాజస్తాన్, 3.

## సహకార వ్యవసాయ సంఘాలు

సంయుక్త వ్యవసాయం, సమష్టి వ్యవసాయంచేసే సహకార వ్యవసాయ సంఘాలు 1957-58 సంవత్సరాంతానికి భారతదేశంలో 2,020 వున్నాయి. ఏఏరాష్ట్రంలో, ఎన్ని సహకారవ్యవసాయసంఘాలు వున్నదీ, వివరాలు ఇవి: ఆంధ్రప్రదేశ్, 61; ఆసాం, 170; ఉత్తరప్రదేశ్, 255; ఒరిస్సా, 28; కాశ్మీర్, 7; కేరళ, 55; పంజాబ్, 585; పశ్చిమ బెంగాల్, 148; బీహార్, 27; బొంబాయి, 402; మదరాసు, 37; మధ్యప్రదేశ్, 140; మైసూర్, 100; రాజస్తాన్, 105; ఢిల్లి, 22; మణిపూర్, 6; త్రిపుర, 12.

# పంట కాలువలు

భారతదేశంలో పొలాలకు నీటిని అందించే కాలువల పొడవు 65,587 మైళ్లు వుంటుంది. ఈ కాలువలవల్ల దాదాపు ఏడు కోట్ల ఎకరాల పొలం సాగు అవుతుంది. అయినప్పటికీ, యింకా ఎక్కువ పంట కాలువలను త్రవ్వించి ఎంతో ఎక్కువ భూమికి నీటిని అందచెయ్యవలసిన అవసరం ఎక్కువగా వుంది. అలా చేసినట్లయితే, ఇంకా ఎంతో ఎక్కువ పంట పండుతుంది. ప్రస్తుతం బీడుగావున్న భూమిలో చాలా భాగం నీటి పారుదలవుంటే వ్యవసాయానికి అక్కరకు వస్తుంది.

నీటి పారుదల సౌకర్యాలను ఇంకా యెక్కువ చెయ్యడమూ, నదులలోని నీరు వృధాగా సముద్రంలోకి పోకుండా ఆనకట్టలను, రిజర్వాయర్లనుకట్టి ఆ నీటిని కాలువలద్వారా బీడు భూములకునూ, మెట్ట

భూములకను సరఫరాచేసి పంటలను ఎక్కువ చెయ్యడమూ ప్రభుత్వ కార్యక్రమాలలో ఒకటి. ఇండియాలోని నదుల నీటిలో ప్రతి సంవత్సరమూ నూటికి ఆరేడువంతులు మాత్రమే యిలా వుపయోగింపబడుతున్నదనీ, తక్కిన నీరంతా వృథాగా పోతున్నదనీ, పరిశోధనలవల్ల తేలింది.

## విద్యుచ్ఛక్తి

గత 19 సంవత్సరాలలోను ఇండియాలో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చెయ్యడం బాగా ఎక్కువైంది. గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చెయ్యడంలో చాలా అభివృద్ధి జరిగింది. అయితే, యీ అభివృద్ధి ఎక్కువగా మద్రాసు, ఆంధ్ర, మైసూర్, ఉత్తర ప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలోనే జరిగింది. విద్యుచ్ఛక్తి సప్లయి జరిగిన గ్రామాలు ఇండియాలో 1949లో 2,118 వున్నాయి. 1959 జనవరి 1వ తేదినాటికి విద్యుచ్ఛక్తి సప్లయిని పొందుతున్న గ్రామాల సంఖ్య, 7,701 లకు పెరిగింది.

ఇండియాలోని పట్టణాలు, పల్లెలు, (జనాభా ప్రకారం) విద్యుచ్ఛక్తి సప్లయిని పొందినవి 1956 లో ఎన్ని వున్నది వివరాలు యీక్రింది పట్టీనిబట్టి తెలుసుకోవచ్చును.

| జనాభా | ఇండియాలోని అసలు ఊళ్లు | విద్యుచ్ఛక్తి సప్లయి పొందినవి |
|---|---|---|
| లక్షకు పైగా | 73 | 73 |
| 50,000 కు పైన లక్షకు లోపు | 111 | 111 |
| 20,000 పైన 50,000 లోపు | 401 | 366 |
| 10,000 పైన 20,000 లోపు | 856 | 450 |
| 1,000 పైన 10,000 లోపు | 3,101 | 1,000 |
| 5,000 లోపు | 5,56,565 | 4,500 |

విద్యుచ్ఛక్తి పరికరాలను భారతదేశంలోనే ఎక్కువగా ఉత్పత్తి చేయడం జరుగుతోంది. ఇండియాలో 1951లో రు. 7 కోట్ల విలువగల విద్యుచ్ఛక్తి పరికరాలు ఉత్పత్తికాగా, 1955లో రు. 17,90,00,000 విలువగల విద్యుచ్ఛక్తి పరికరాలు ఉత్పత్తి అయినవి.

## అడవులు

ఇండియా వైశాల్యంలో నూటికి 22 వంతులు, అంటే 2,80,348 చదరపు మైళ్ళు, అడవి. దీనిలో నూటికి 96 వంతులు, అంటే 2,69,915 చదరపు మైళ్ళ అడవి ప్రభుత్వ స్వాధీనంలో వున్నది. మిగతా పంచాయితీల అధీనంలోనూ, వ్యక్తుల స్వాధీనంలోను వున్నది.

ప్రభుత్వ స్వాధీనంలోవున్న అడవిలో 2,66,000 చదరపుమైళ్ళ అడవిలో కలప లభిస్తున్నది,

మొత్తం అడవిలో 32,511 చ. మైళ్ళ అడవిలో పశువులను సంవత్సరం పొడుగునా మేపడానికి ఉత్తరువులు ఇవ్వబడినవి.

అడవులవల్ల కేంద్ర ప్రభుత్వానికి ఏడాదికి రు. 15 కోట్లు ఆదాయం వస్తుందని అంచనా.

## వ్యాపారము : పరిశ్రమలు

భారతదేశపు వ్యాపారం ఇటీవలివరకు ఎక్కువగా ముడిసరుకులను విదేశాలకు ఎగుమతి చెయ్యడం, యంత్రాలలో తయారైన వస్తువులను విదేశాలనుంచి దిగుమతి చేసుకోవడంతో నిండివుండేది. యుద్ధకాలంలో దిగుమతులు చాలా తగ్గిపోయినందున, కొన్ని పరిశ్రమలు భారతదేశంలో చాలా అభివృద్ధికి వచ్చాయి. స్వాతంత్ర్యం వచ్చినతరువాత, దేశీయ పరిశ్రమలకు ప్రభుత్వం ఇచ్చే ప్రోత్సాహంవల్ల, పరిశ్రమలు ఎక్కువగా అభివృద్ధి పొందుతున్నాయి.

కొన్ని ముఖ్య పరిశ్రమలను ప్రభుత్వమే స్వయంగా స్థాపించినిర్వహిస్తున్నది.

### బట్టల మిల్లులు :

1958 జనవరి నాటికి ఇండియాలో మొత్తం 465 ప్రత్తిమిల్లులు వున్నాయి. ఈ మిల్లులన్నిటిలోను వున్న మగ్గాలసంఖ్య 2,07,000; కదుళ్ళ సంఖ్య, 1,23,76,000.

1956-57 లో 41,10,000 పౌనుల నూలునూ రు. 2,26,39,000

విలువగల 1.14,44,000 పౌనుల బట్టనూ మన దేశానికి దిగుమతి చేసు కున్నాము. అదే సంవత్సరంలో రు. 1,87,01,000 విలువగల 80,18,000 పౌనుల నూలునూ, రు. 52,05,96,000 విలువగల 75 కోట్ల గజాల బట్టనూ మన దేశంనుంచి ఎగుమతి చేశాము.

1951 నుంచి ఇండియాలోని మిల్లులలో వడుకబడిననూలు నేయు బడిన బట్టల వివరాలు ఈ క్రింద ఇవ్వబడినవి.

| సంవత్సరం : | నూలు (పౌనులు) | బట్ట (గజాలు) |
|---|---|---|
| 1950 : | 1,17,30,36,000 | 3,66,73,49,000 |
| 1951 : | 1,30,38,61,000 | 4,07,61,86,000 |
| 1952 : | 1,44,91,11,000 | 4,59,86,38,000 |
| 1953 : | 1,50,51,98,000 | 4,87,85,74,000 |
| 1954 : | 1,56,10,32,000 | 4,99,77,12,000 |
| 1955 : | 1,63,03,99,000 | 5,09,44,75,000 |
| 1956 : | 1,67,10,00,000 | 5,30,70,00,000 |
| 1957 : | 1,77,40,00,000 | 5,31,70,00,000 |

## చేనేత పరిశ్రమ :

ఇండియాలో ఉత్పత్తి అయే బట్టలో నూటికి 26 వంతులు చేనేత పారిశ్రామికులు తయారుచేసేదే. దేశంలో మొత్తం 25 లక్షలమంది చేనేత పారిశ్రామికులున్నారనీ, వారి కుటుంబాలతో కలిపితే సుమారు కోటి మంది ప్రజలు చేనేత పరిశ్రమమీద ఆధారపడివున్నారనీ అంచనా.

ఇండియాలో మొత్తం 28,93,271 చేనేత మగ్గము లున్నవి. వీటిలో 22,000 మగ్గములు విద్యుచ్ఛక్తి సహాయంతో పనిచేసేవి.

1953 లో 120 కోట్లగజాలు, 1954 లో 131 కోట్ల గజాలు, 1955 లో 148 కోట్లగజాలు 1956 లో 154 కోట్ల గజాలుబట్ట 1957 లో 1957 లో 168 కోట్ల గజాలుబట్ట చేనేత మగ్గములపై తయారు చేయబడినది. 1957 లో మరమగ్గములపై 30 కోట్ల 80 లక్షల గజాల బట్టతయారు చేయబడింది.

పంచదార :

పంచదార శరీరానికి సత్తువనిచ్చే ఆహారపదార్థాలలో ముఖ్యమైన వాట్లలో ఒకటి. అందుచేతఇది ప్రతివారికీ కావలసిందే. ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ ఏడాదికి నాలుగుకోట్ల టన్నులపంచదార తయారవుతున్నది. ఇండియాలో 1951 లో 11,14,800 టన్నులు, 1952 లో 14.94,000 టన్నులు, 1953 లో 12,91,200 టన్నులు, 1954 లో 10,08,000 టన్నులు, 1955 లో 15,94,800 టన్నులు, 1956 లో 17,01,000 టన్నులు, 1957 లో 20,29,000 టన్నులు పంచదార తయారయింది.

ఇండియాలో 1956 లో 160 పంచదార ఫాక్టరీలు వున్నాయి.

ఇండియాలో సగటున 11 పౌనులు పంచదారకాక, సగటున ప్రతి మనిషి ఏడాదికి 16 పౌనుల బెల్లంకూడా తింటున్నట్టు లెక్కల వల్ల తేలింది.

సైకిళ్ళు :

ఇండియాలో 1949 లో 80,208 సైకిళ్లు, 1950 లో 1,30,152 సైకిళ్ళు, 1951 లో 1,14,275 సైకిళ్లు, 1952 లో 1,96,956 సైకిళ్లు 1953 లో 2,64,109 సైకిళ్లు, 1954 లో 3,72,365 సైకిళ్లు, 1955లో 4,19,171సైకిళ్లు, 1956లో 6,64,000 సైకిళ్ళు, 1957 లో 7 91,000, సైకిళ్లు 1958 లో 9,00,000 సైకిళ్ళు తయారు చేయబడినవి. మోటారు సైకిళ్ళను తయారు చెయ్యడం 1955 మేలో ప్రారంభమైంది.

ప్రస్తుతం ఇండియాలో సైకిళ్లు తయారుచేసే పెద్దతరహా కంపెనీలు 20, చిన్న తరహా ఉత్పత్తి కేంద్రాలు 78 వున్నాయి.

మోటారు కార్లు :

మోటారుకార్లను ఇండియాలోనే తయారు చెయ్యడానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. ప్రస్తుతం ఇంగ్లండు, అమెరికాలలో తయారైన మోటారుకారు భాగాలను విడిగా ఇండియాకు తెప్పించి, వాటిని కార్లుగా సమకూర్చే ఫాక్టరీలు ఇండియాలో రెండు వున్నాయి.

ఇండియాకు భాగాలుగా తెప్పించి, కార్లుగా సమకూర్చిన కార్ల వివరాలు ఇవి :

| సంవత్సరం | కార్లు | ట్రక్కులు |
|---|---|---|
| 1952 : | 6,952 | 8.339 |
| 1953 : | 5,050 | 9,087 |
| 1954 : | కార్లు, ట్రక్కులు : | 14.462 |
| 1955 : | ,, | 23,084 |
| 1956 : | 22,989 | 19,149 |

సింద్రి ఎరువుల ఫ్యాక్టరీ :

పొలాలకు ఎరువులను తయారుచెయ్యడానికి ఇండియా ప్రభుత్వపు యాజమాన్యంలో, బీహారురాష్ట్రంలో, దామోదర నది ఒడ్డున సింద్రి అనే గ్రామసమీపంలో నిర్మింపబడిన ఫాక్టరీలో ఎరువుల ఉత్పత్తి 1951 అక్టోబరు 30 న (దీపావళినాడు) ప్రారంభమైంది. ఈ ఫాక్టరీ నిర్మాణానికి దాదాపు 23 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. ఇంత పెద్ద ఎరువుల ఫాక్టరీ ఆసియా ఖండంలో మరొకటి లేదట.

1956 లో ఈ ఫాక్టరీలో 3,31,745, టన్నుల అమ్మోనియం సల్ఫేట్ 94,743 టన్నుల అమ్మోనియా ఉత్పత్తి చేయబడినవి.

1957 లో ఈ ఫాక్టరీలో 3,32,891 టన్నుల అమ్మోనియం సల్ఫేట్, 95,080 టన్నుల అమ్మోనియా ఉత్పత్తి చేయబడినవి.

పెన్సిళ్లు :

పెన్సిళ్ళు తయారుచెయ్యడం ఇండియాలో 1905 లో ప్రారంభమైంది. అయితే, రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనే యీ పరిశ్రమ బాగా వృద్ధిపొందింది. 1947-48 లో 1,07,80,000. రూపాయల విలువగల పెన్సిళ్లు ఇండియాకు దిగుమతి అయినవి. తరవాత క్రమేపీ యీ దిగుమతులు చాలవరకు తగ్గినవి. 1957 లో ఇండియాలో 9,60,000 గ్రోసుల పెన్సిళ్ళు చేయబడినవి.

గాజు పరిశ్రమ :

గాజు పరిశ్రమ ఇండియాలో ఇటీవల బాగా అభివృద్ధికి వచ్చింది.

1950 లో 87,270 టన్నుల గాజు వస్తువులు ఇండియాలో ఉత్పత్తి కాగా, 1956 లో 1,43,585 టన్నుల గాజువస్తువులు వుత్పత్తి అయినవి.

కాగితము :

కాగితం చెయ్యడం దాదాపు రెండువేల సంవత్సరాలనాడు మొట్ట మొదట కనిపెట్టినవారు చైనా దేశీయులు. కాని, ఈ పరిశ్రమ చాలా కాలంవరకూ ప్రపంచంలోని ఇతరదేశాలలో ఏర్పడలేదు. యంత్రస్థాపన జరిగిన విదేశాలలో కాగితపు ఉత్పత్తి జరుగుతూనేవున్నా, కాగితాల మిల్లులు ఇండియాలో 1867 సంవత్సరం వరకూ ఏర్పడలేదు. 1867 లో హుగ్లీ నది తీరాన, బెంగాల్ లో సిరాంపూర్ లో మొట్టమొదటి కాగితాల మిల్లు స్థాపించబడింది. ప్రస్తుతం ఇండియాలో 19 మిల్లులు వున్నాయి. ఈ మిల్లులన్నీ కూడా తెల్లకాగితం తయారు చేస్తున్నాయి. పేచు అట్టలను తయారు చేసే మిల్లులు 17 వున్నాయి. వార్తాపత్రికలు అచ్చువేసే కాగితాన్ని తయారుచేసేమిల్లు మధ్యప్రదేశ్ లో ఒకటి వుంది. ఈ మిల్లు 1957 లో 14,489 టన్నుల న్యూస్ ప్రింటును ఉత్పత్తి చేసింది. అయినా, ఆ సంవత్సరంలో 55,649 టన్నుల న్యూస్ ప్రింటు మన దేశానికి దిగుమతి చేయబడింది.

ఇండియాలో కాగితపు ఉత్పత్తి (టన్నులలో)

| | | | |
|---|---|---|---|
| 1950 | 1,08,914 | 1954 | 1,55,328 |
| 1951 | 1,31,916 | 1955 | 1,83,490 |
| 1952 | 1,37,508 | 1957 | 2,10,125 |
| 1953 | 1,38,216 | | |

లక్క.

లక్క, ఒకజాతిపురుగు విడిచే మలం. శుద్ధి చేసిన లక్కను షెల్లాక్ అంటారు. ఇండియాలో లక్క బీహారు రాష్ట్రంలోని ఛోటా నాగపూర్ డివిజన్ లో విశేషంగా ఉత్పత్తి అవుతున్నది. గ్రామఫోను రికార్డులు, రంగులు, వార్నిషులు, ఎలక్ట్రిక్ సామానులు తయారు చెయ్యడానికి లక్క విశేషంగా ఉపయోగింపబడుతుంది. భారతదేశంలో తయారయే లక్కలో విశేషభాగం యునైటెడ్ స్టేట్సు, బ్రిటను, రష్యా. పశ్చిమ జర్మనీ, ఇటలీ, ఫ్రాన్సు దేశాలకు ఎగుమతి చేయబడుతుంది.

మన దేశంలో లక్క ఉత్పత్తి వివరాలు ఇవి :

| సంవత్సరం : | ఉత్పత్తి మణుగులు : |
|---|---|
| 1955-56 | 12,48,000 |
| 1956-57 | 13,15,000 |
| 1957-58 | 11,40,500 |

## వనస్పతి నూనె

ఇండియాలో 1958 నాటికి, వనస్పతినూనె తయారుచేసే ఫ్యాక్టరీలు 49 వున్నాయి. 1950 లో ఇండియాలో 1,71,600 టన్నులు, 1952 లో 1,19,000 టన్నులు 1956 లో 2,16,000 టన్నులు 1957 లో 3,20,000 టన్నులు 1958 లో 2,95,154 టన్నులు వనస్పతి నూనె తయారు చేయబడింది.

1958 లో మనదేశంలో మొత్తం 2,89,331 టన్నుల వనస్పతి నూనె వాడకం జరిగింది; విదేశాలకు 2,953 టన్నుల వనస్పతి ఎగుమతి చేయబడింది.

## తోళ్ళు

ప్రపంచంలోని అన్ని దేశాలకన్న ఎక్కువగా తోళ్ళు ఎగుమతి చేసేది, ఇండియా.

ఇండియాలో ఏడాదికి సుమారు మూడుకోట్ల 92½ లక్షల తోళ్లు (మేకలవీ, గొర్రెలవీ) దొరుకుతున్నాయనీ, వీటిలో దాదాపు రెండు కోట్ల 38 లక్షల తోళ్ళు ఇండియాలోని ఫ్యాక్టరీలలో వూనబడుతున్నవనీ, సుమారు 160 లక్షల తోళ్లు వూలకుండానే విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నవనీ అంచనా.

తోళ్లను వూనడానికి పెద్ద ఫ్యాక్టరీలు కాన్పూర్, ఆగ్రా, కలకత్తా, మదరాను నగరాలలో వున్నాయి.

తోళ్ళ ఎగుమతివల్ల ఇండియాకు దాదాపు 25 కోట్ల రూపాయలవిదేశమారకం లభిస్తున్నది. ఇండియానుంచి ఎగుమతిఅయే తోళ్లలో అత్యధికభాగం ఇంగ్లండుకే ఎగుమతి అవుతవి.

## రబ్బరు

రబ్బరు ఉత్పత్తి పూర్తిగా దక్షిణదేశంలోనే జరుగుతున్నది. దీనిలోకూడా ముప్పాతిక వంతులు, కేరళరాష్ట్రంలో జరుగుతున్నది. తరువాతి స్థానం మదరాసు రాష్ట్రానికి చెందుతుంది.

1951 అక్టోబరు నాటికి దేశంలో 37,293 రబ్బరు తోటలు వున్నాయి. వీటి మొత్తం వైశాల్యం. 2,38,115 ఎకరాలు.

1951 లో 17,150 టన్నులరబ్బరు వుత్పత్తి అయితే, 1956 లో 23,444 టన్నులు, 1957 లో 24,000 టన్నులు రబ్బరు వుత్పత్తి అయింది. 1956 లో 6500 టన్నులు, 1957 లో 7,500 టన్నుల రబ్బరును విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నాము.

## సబ్బు పరిశ్రమ

ఇండియాలో ప్రస్తుతం 70 సబ్బు ఫ్యాక్టరీలు వున్నాయి. వీటిలో 1950 లో 72,700 టన్నులు, 1951 లో 88,638 టన్నులు 1955లో 99,000 టన్నులు. 1956 లో 1,10,000 టన్నుల సబ్బులు తయారు చేయబడినవి. ఈ ఉత్పత్తిని 2,44,000 టన్నులవరకు పెంచాలని ప్రభుత్వం సంకల్పం. అయితే, సబ్బుఫ్యాక్టరీలను మాత్రం ఇంక ఎక్కువగా స్థాపించకూడదనీ, ప్రస్తుతం ఉన్నవాటిలోనే ఉత్పత్తి ఎక్కువ చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది.

## నౌకానిర్మాణం

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం, ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ లేనేలేదు. యుద్ధకాలంలో ఇండియాలో నౌకానిర్మాణ పరిశ్రమ ప్రారంభించబడింది. అయిదేళ్లలోపల ఇండియాలో మొత్తం రెండులక్షల టన్నుల బరువు మొయ్యగల నావలు నిర్మింపబడినవి. కాని దానిని భారతీయ పరిశ్రమగా పరిగణించడానికి వీలులేదు.

యుద్ధానంతరం, విశాఖపట్టణంలోని నౌకానిర్మాణాశ్రయంలో భారతీయ యాజమాన్యాన నౌకానిర్మాణం 1941 లో ప్రారంభమైంది. సింధియా కంపెనీవారు 1947 లో ఇచ్చట నిర్మించిన 'జలఉష' అనే నౌకకు ప్రథమ సముద్రయాన ఉత్సవం పండిట్ నెహ్రూ చేశారు

తరువాత నాలుగు నౌకలు నిర్మింపబడినవి. నౌకా నిర్మాణంలో తమకు చాలా నష్టం వస్తోందని సింధియా కంపెనీ తెలియజేసినందున, గవర్నమెంటు యాజమాన్యంలో నౌకా నిర్మాణం ప్రారంభమైంది. ఇలానిర్మింపబడిన మొదటి నౌక 'జలపద్మ'కు ప్రారంభోత్సవం 1950 సెప్టెంబరు 14 న పరిశ్రమ శాఖామంత్రి హరకృష్ణ మెహతాబ్ జరిపారు. రెండవ నౌక 'జలపుత్ర'కు ప్రారంభోత్సవాన్ని 1951 మార్చి 26 న రైల్వే మంత్రి ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ జరిపారు.

నాల్గవనౌక 'జల పుష్ప'కు ప్రారంభోత్సవాన్ని నిర్మాణశాఖా మంత్రి గాడ్గిల్ 1951 డిశంబరు 15 న జరిపారు. సింధియాకంపెనీవారు నౌకానిర్మాణాన్ని లాభసాటిగా నిర్వహించలేకపోయినందున, కొత్తగా రు. 77 కోట్ల మూలధనంలో హిందుస్తాన్ షిప్‌యార్డు కంపెనీ స్థాపించబడింది. ఆ కంపెనీ విశాఖపట్టణంలోని నౌకానిర్మాణశాలను తన యాజమాన్యంలోకి 1952 మార్చి 1న తీసుకుంది. ఆకంపెనీ పెట్టుబడిలో రెండువంతులు ఇండియా ప్రభుత్వానిది : ఒకవంతు సింధియా కంపెనీది. 1954-55 లో రు. 2,10,84,000 విలువగల నౌకలు, 1955-56 లో రు, 2,46,07,000 విలువగల నౌకలు ఇక్కడ నిర్మించబడినవి.

హిందుస్తాన్ షిప్ యార్డు యాజమాన్యంలో నౌకా నిర్మాణం ప్రారంభమైన తరువాత, 1958 జూలై నాటికి ఇచ్చట 15 నౌకలు నిర్మించబడినవి. అంటే, విశాఖపట్టణంలో నిర్మించబడిన నౌకల సంఖ్య మొత్తం 19 అయిందన్నమాట.

1956 నవంబరు అంతానికి, ఇండియాలోని నౌకాకంపెనీలకుగల నౌకలు మొత్తం 5,11,077 టన్నుల బరువుగల సామగ్రిని రవాణా చెయ్యగలవు.

## ఖనిజ సంపద

ఖనిజ సంపదలో ఇండియా ప్రపంచంలోని ఏ యితర దేశానికి తీసిపోదు. అయితే, యీ సంపద భూగర్భంలో ఎక్కడ వున్నదో పరిశోధన చెయ్యటంలోనూ, దానిని వెలువరించి ఉపయోగంలోకి తీసుకొని రావడంలోనూ ఆధునిక పద్ధతులలో ఇటీవలివరకు తగినంత కృషి

జరగలేదు. ఇప్పుడిప్పుడే యీ విషయంలో కొంత కృషి జరుగుతోంది. ఖనిజసంపదను బాగా పైకితీసి, ఉపయోగంలోకి తేవడానికి ప్రభుత్వం వారు ఒక ప్రణాళికను తయారు చేశారు.

ఇండియాలో దొరికే ఖనిజాలలో ముఖ్యమైనవాటిని గురించిన వివరాలు యీ క్రింద యివ్వబడినవి.

## ఇనుము, ఉక్కు

ఇండియాలో దొరికినంత ఇనుము మరే దేశంలోను దొరకడం లేదనే చెప్పవచ్చు. భూమిలోనుంచి త్రవ్వితీసిన లోహాన్ని పనిముట్ల రూపంలోనూ, ఉక్కుగా తయారు చెయ్యడంలోనూ, ఇండియాలో పెద్ద పరిశ్రమ ఏర్పడింది.

ఇనుము ఎక్కువగా బీహారు రాష్ట్రంలోనూ, ఒరిస్సా సంస్థానాలలోనూ దొరుకుతున్నది. 1956లో ఇండియాలో 48,58,000 టన్నులు, 1957 లో 50,20,000 టన్నులు, 1958లో 58,24,000 టన్నుల ఇనుము ఉత్పత్తి చేయబడింది.

1957లో 22,62,000 టన్నుల ముడి ఇనుము ఇండియానుంచి ఎగుమతి చేయబడింది. దానిలో 13,47,040 టన్నులు జపానుకూ, 4,72,[illegible] టన్నులు పోలెండుకూ, 1,38,203 టన్నులు చెకొస్లోవేకియాకు ఎగుమతి చేయబడింది.

1948లో 8,54,000 టన్నులు, 1949లో 9,33,000 టన్నులు, 1950 లో [illegible] టన్నులు, 1951 లో 10,76,000 టన్నులు, 1954లో 12,43,467 టన్నులు, 1955 లో 12,68,882 టన్నులు, 1956లో 13,16,000 టన్నులు, 1957 లో 13,42,000 టన్నులు, ఉక్కు తయారు చేయబడింది.

ప్రభుత్వ యాజమాన్యంలో మధ్య ప్రదేశంలోని భిలోయ్‌వద్ద ఒక ఉక్కు ఫాక్టరీ, పశ్చిమ బెంగాల్‌లోని దుర్గాపూర్ వద్ద ఒక ఉక్కు ఫాక్టరీ, ఒరిస్సాలోని రూర్కెలాలో ఒక ఫాక్టరి నిర్మింపబడుతున్నవి. మరొక ఉక్కు ఫాక్టరీని దక్షిణ దేశంలో స్థాపించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

భిలాయ్, రూర్కేలా వద్ద నిర్మింపబడిన ఉక్కు ఫ్యాక్టరీలలో ఉక్కు ఉత్పత్తి 1959 మధ్యలో ప్రారంభమౌతుంది.

భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీ నాగపూర్‌కు 150 మైళ్ళలో, మధ్య ప్రదేశ్‌లోని దుర్గ్ జిల్లాలో వుంది. ఈ ఫ్యాక్టరీకి ముడి ఇనుము, భిలాయ్‌కి 60 మైళ్ళ దూరంలోవున్న రాజమహాల్ ఇనుము గనుల నుంచి సప్లయి అవుతుంది. ప్రథమంలో యీ ఫ్యాక్టరీలో, ఏడాదికి రెండులక్షల టన్నుల ఇనుప గొట్టాలనూ, స్లీపరు పట్టాలనూ, 16,000 టన్నుల భారీ సామగ్రులనూ, 2,60,000 టన్నుల మధ్య రకం సామగ్రులనూ రీరోలింగు పరిశ్రమకు పనికివచ్చే 1,50,000 టన్నుల బిల్లెట్లనూ, పోత పరిశ్రమకు పనికివచ్చే 3,00,000 టన్నుల ఇనుమునూ ఉత్పత్తి చేస్తుంది.

ఈ ఫ్యాక్టరీ రష్యన్ ప్రభుత్వ సాంకేతిక, ఆర్థిక సహకారంతో నిర్మింపబడింది.

రూర్కేలా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో, కలకత్తాకు 257 మైళ్ళలో శంఖ, కోయల్ నదుల సంగమ స్థానంలో వున్నది. ఈ రెండు నదులు కలయికను బ్రాహ్మణినది అంటారు.

రూర్కేలా ఉక్కు ఫ్యాక్టరీకి కావలసిన ముడి ఇనుము, రూర్కేలాకు 45 మైళ్ళలోవున్న బార్సువా ఇనుపగనినుంచి సప్లయి అవుతుంది. ప్రథమంలో, ఈ ఫ్యాక్టరీ ఏడాదికి రెండు లక్షల టన్నులు ప్లేటులనూ, 50,000 టన్నుల పోత ఇనుమునూ ఉత్పత్తి చేస్తుంది.

ఈ ఫ్యాక్టరీ నిర్మాణానికి జర్మన్ సాంకేతిక నిర్మాణ సంస్థలు సహకారం చేశాయి.

## రా క్ష సి బొ గ్గు

భూమిలోనుంచి త్రవ్వితీసిన బొగ్గును, రాక్షసి బొగ్గు అనీ, నేల బొగ్గు అనీ అంటారు. ఈ బొగ్గును భరత ఖండంలో ముఖ్యంగా, రైళ్లను నడపడానికీ ఫ్యాక్టరీలను పని చేయించడానికి ఉపయోగిస్తున్నారు.

బొగ్గును నేలనుంచి త్రవ్వించడం, దానిని కావలసినవారికి సప్లయి చేయడం, ఈ దేశంలో పెద్ద పరిశ్రమలలో ఒకటిగా ఏర్పడింది.

ప్రస్తుతం ఇండియాలో 900 గనులనుంచి బొగ్గు తీయబడుతున్నది. వీటిలో చాలవరకు బెంగాలు, బీహారు, మధ్య ప్రదేశ్ రాష్ట్రాలలో వున్నాయి. ఈ పరిశ్రమలో సుమారు 3,20,000 మంది కార్మికులు పని చేస్తున్నారు.

బొగ్గును అత్యధికంగా ఉత్పత్తి చేసే దేశాలవరుసలో ఇండియా ఎనిమిదో స్థానాన్ని పొందుతుంది. ఈ దేశపు ఖనిజసంపదలో ప్రధాన స్థానం బొగ్గుది.

దేశంలో ఉత్పత్తి అయ్యే బొగ్గులో నూటికి 72 పాళ్లు ఝూరియా రాణీగంజ్ బొగ్గు గనులలో దొరుకుతున్నది. వీటిలో మంచి రకపు బొగ్గు ఝూరియా గనులలో దొరుకుతున్నది.

1948లో ఇండియాలోని బొగ్గుగనులలో మొత్తం 2,67,75,360 టన్నుల బొగ్గు త్రవ్వబడింది. 1949 లో 3,10,00,000 టన్నుల బొగ్గు 1951 లో 3,40,73,877 టన్నుల బొగ్గు 1952 లో 3,62,20,000 టన్నులు, 1953లో 3,58,46,818 టన్నులు, 1954లో 3,67,73,605 టన్నులు, 1955లో 3,84,30,000 టన్నులు, 1956లో 3,94,20,000 టన్నులు, 1957 లో 4,35,61,071 టన్నుల బొగ్గు త్రవ్వబడింది.

1957 లో 17,49,952 టన్నుల బొగ్గు విదేశాలకు ఎగుమతిచేయబడింది.

సిమెంటు :

సిమెంటును తయారు చెయ్యడానికి ఇండియాలో మొట్టమొదట 1904 లో మదరాసులో ఒక చిన్న ఫ్యాక్టరీ స్థాపింపబడినది. తరువాత క్రమంగా దేశంలో చాలా ఫ్యాక్టరీలు ఏర్పడి, వుత్పత్తి చాల ఎక్కువ అయింది. ప్రస్తుతం ఇండియాలో 21 సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. వీనిలో మూడు ఆంధ్రరాష్ట్రంలో వున్నాయి.

1958 నాటికి సిమెంటు పరిశ్రమలో 44కోట్ల రూపాయలు పెట్టుబడి వుంది. సిమెంటు ఫ్యాక్టరీలలో పని చేస్తున్నవారి సంఖ్య దాదాపు 40 వేలు.

సిమెంటు వుత్పత్తి వివరాలివి : 1951 లో 26,00,000 టన్నులు; 1956 లో 46,00,000 టన్నులు ; 1957 లో 56,00,000 టన్నులు ; 1958 లో 60,60,000 టన్నులు.

మెంగనీస్ :

ఇది ఉక్కును తయారు చెయ్యడానికి, రసాయన ద్రవ్యాలను బాటరీలను తయారు చెయ్యడానికి వుపయోగించే ఖనిజం.

రష్యా తరువాత, ఇండియాలో దొరికినంతగా ఈ ఖనిజం ప్రస్తుతం మరేదేశంలోను దొరకడం లేదు. దీనిని మధ్యప్రదేశ్, బొంబాయి, బీహారు, మదరాసు, మైసూరులలో ప్రస్తుతం యెక్కువగా త్రవ్వి తీస్తున్నారు. మొట్టమొదట యీ ఖనిజాన్ని ఈ దేశంలో విశాఖపట్టణం జిల్లాలో 1892 లో త్రవ్వడం ప్రారంభించారు. ఈ దేశంలో త్రవ్విన మెంగనీసులో నూటికి 76 పాళ్లు మధ్యప్రదేశ్ లోనే దొరుకుతుంది.

1957 లో మనదేశంలో 15,74,000 టన్నుల మాంగనీసు ఖనిజం ఉత్పత్తి అయింది. రాష్ట్రాలవారిగా, యీ ఉత్పత్తి వివరాలు ఇవి: ఒరిస్సా, 3,84,000 టన్నులు; బొంబాయి, 3,59,000 టన్నులు; మధ్యప్రదేశ్, 3,29,000 టన్నులు; మైసూరు, 2,62,000 టన్నులు; ఆంధ్రప్రదేశ్, 1,63,000 టన్నులు.

అభ్రకము :

ఇండియాలో విస్తారంగా దొరికే ఖనిజములలో అభ్రకము ఒకటి. ప్రపంచం మొత్తంలో దొరికే అభ్రకములో, ముప్పాతిక యీ దేశంలో త్రవ్వితీసేదే. దీనిలో నూటికి 80 వంతులు బీహారులోనూ, 20 వంతులు ఆంధ్రరాష్ట్రంలోని నెల్లూరు జిల్లాలోను దొరుకుతున్నది.

1957-58 లో మనదేశంలో 5,55,000 హండ్రెడువెయిట్లు మైకా ఉత్పత్తి అయింది. దీనిలో 4,30,000 హండ్రెడువెయిట్లు విదేశాలకు ఎగుమతి అయింది.

బాక్సైటు

అల్యూమినియం తయారు చెయ్యడానికి కావలసిన ప్రధానలోహం

బాక్సైట్. బాక్సైటును అల్యూమినియంగా తయారుచేసే యంత్రసామగ్రి ఇండియాలో లేనందున, దానిని విదేశాలకు పంపి, అల్యూమినియంగా తయారుచేసిన తరువాత యీ దేశానికి తెప్పించుకొని దానిని పాత్రలుగా తయారు చెయ్యడం జరుగుతోంది. బాక్సైట్ యీ దేశంలో చాలా ఎక్కువగా దొరుకుతున్నది. ఇది దొరికే ప్రదేశాలలో ముఖ్యమైనవి, బొంబాయి, మధ్యప్రదేశ్, బీహారు రాష్ట్రాలు.

ఇండియాలో ఏడాదికి 35,000 టన్నుల అల్యూమినియం కావాలి. 1954 లో 4,886 టన్నులు, 1957 లో 7,228 టన్నులు అల్యూమినియం తయారు చేయబడింది. అవసరాన్నిబట్టి, మిగతా అల్యూమినియం కెనడానుంచి దిగుమతి చేయబడింది.

## బంగారం

ఇండియాలో దొరికే ఖనిజములలో మూడవ ప్రధానస్థానం బంగారానిది. ఎక్కువ విలువగల యీ ఖనిజం పూర్తిగా మైసూరు రాష్ట్రంలోని కోలార్, హట్టి గనులలో దొరుకుతున్నది. 1952 లో 2,52,911 ఔన్సులు, 1953 లో 2,12,000 ఔన్సులు, 1954 లో 2,39,168 ఔన్సులు, 1955-56 లో 2,11,461 ఔన్సులు బంగారం ఇండియాలోని గనులలోనుంచి త్రవ్వబడింది. 1954 లో త్రవ్విన బంగారంలో 2,20,572 ఔన్సులు కోలారు గనులలోను, తక్కినది హట్టిగనులలోను దొరికింది.

## వెండి

1951 లో 70,370 రూపాయల విలువగల 14,612 ఔన్సుల వెండి, 1952 లో 87,464 రూపాయల విలువగల 20,485 ఔన్సుల వెండి త్రవ్వబడింది. 1955-56 లో 1,52,888 ఔన్సుల వెండి త్రవ్వబడింది.

## రాగి

ఇండియాలో దొరికే రాగి ప్రపంచపు వుత్పత్తిలో చాలాతక్కువ అని చెప్పవచ్చును. ఆంధ్రరాష్ట్రంలో, నెల్లూరుజిల్లాలో అతిస్వల్పంగా దొరుకుతుంది.

1958 లో 4,11,492 టన్నుల రాగి ఖనిజం త్రవ్వబడింది. దీని నుంచి, 7,967 టన్నుల రాగి లోహం తయారుచేయబడింది.

## ఉప్పు

మానవ శరీరానికి చాలా ముఖ్యమైన అవసరము ఉప్పు. ఇది నూరు విధాలుగా దొరుకుతున్నది. సముద్రతీరములలో సముద్రపు నీరుకు కట్టలు కట్టి ఎండబెట్టడంవల్లనూ, దేశ మధ్యభాగంలోవున్న ఉప్పునీటి సరస్సుల నీటిని ఎండబెట్టడంవల్లనూ, కొండలలో త్రవ్వి తీయడంవల్లనూ, మామూలుగా ఉప్పువలె ఉపయోగించడానికే కాక, కొండ ఉప్పుకు ఔషధ ప్రయోజనాలుకూడా వున్నవి.

ఇండియాలో ఒక మనిషి, ఏడాదికి సగటున 18 పౌనులు ఉప్పు తింటాడని అంచనా. అమెరికాలో ఒక మనిషికి 205 పౌనుల ఉప్పు ఖర్చు అవుతుంది. ప్రపంచం అంతటిలోను సగటున, మనిషి 30 నుంచి 40 పౌనుల ఉప్పు తింటాడట.

1951 లో ఇండియాలో 7,43,00,000 మణుగుల ఉప్పు తయారు చేయబడింది. 1956 లో 8,86,00,000 మణుగుల ఉప్పు ఇండియాలో తయారు చేయబడింది.

దేశీయ అవసరాలకు 1950 లో ఇండియాలో 48,00,000 మణుగుల ఉప్పు దిగుమతి చెయ్యబడింది. 1951 లో దిగుమతి అవసరం లేకపోయింది. 1952 లో జపాను, పాకిస్తాన్ దేశాలకు ఇండియానుంచి 62,44,000 మణుగుల ఉప్పు ఎగుమతి చేయబడింది.

భారతదేశంలో 1956 లో 8 కోట్ల 89 లక్షల ఉప్పు ఉత్పత్తి కాగా, 1957 లో 9 కోట్ల 83 లక్షల ఉప్పు ఉత్పత్తి అయింది. 1957 లో 1,19,29,000 మణుగుల ఉప్పు విదేశాలకు ఎగుమతి అయింది.

## పెట్రోలు

ఇది ఎక్కువగా అసాం రాష్ట్రంలో దిగ్బాయివద్ద దొరుకుతుంది. మనదేశంలో దొరికే పెట్రోలు, ప్రపంచపు మొత్తపు ఉత్పత్తిలో నూటికి 1.10 వంతులు మాత్రమే.

ఇండియాలో ఏడాదికి దాదాపు 1,50,00,000 గాలనుల పెట్రోలు

వాడకం అవుతుందని అంచనా. మనకు కావలసిన పెట్రోలులో నూటికి 90 వంతులు పెర్షియానుంచి దిగుమతి చేసుకుంటున్నాము.

## విద్య

1951 జనాభా లెఖల ప్రకారం, భారతదేశంలోని ప్రజలలో నూటికి 16.6 మంది మాత్రమే అక్షర జ్ఞానం కలవారని తేలింది.

1955 లో ఇండియాలో 1,128 కాలేజిలు, 18,497 సెకండరీ స్కూళ్లు, 11,435 మిడిల్ స్కూళ్లు వున్నాయి. కాలేజీలలో 617,715 మంది, సెకండరీ స్కూళ్ళలో 59,06,666 మంది, ప్రైమరీ స్కూళ్ళలో 1,56,65,056 మంది చదువుతున్నారు.

దేశంలో ప్రాథమిక పాఠశాలలలో చదివే విద్యార్థుల (6 ఏళ్ళు నుంచి 11 ఏళ్ళలోపు వయసుగలవారు) సంఖ్య 1950-51 లో 1,86,80,000 కాగా, 1955-56 లో 2,48,12,000,

ప్రాథమిక పాఠశాలలసంఖ్య 1950-51 లో 2,09,671 కాగా, 1955-56 లో 2,74,308.

జూనియర్ బేసిక్ పాఠశాలలసంఖ్య 1950-51 లో 1,400 కాగా 1955-56 లో 8,360.

### బహూళార్థ సాధక పాఠశాలలు

1958 డిసెంబర్ 10 తేదినాటికి దేశంలో 1,042 బహుళార్థ సాధక పాఠశాలలు వున్నాయి. రాష్ట్రాలవారిగా వాటి సంఖ్య ఇది: ఆంధ్రప్రదేశ్, 43; అసాం, 17; ఉత్తరప్రదేశ్, 43; ఒరిస్సా, 3; కాశ్మీర్, 8; కేరళ, 112; త్రిపుర, 8; పశ్చిమబెంగాల్, 376; బీహార్, 25; బొంబాయి, 164; మదరాసు, 135; మధ్యప్రదేశ్, 50; మైసూర్, 38; రాజస్థాన్, 38.

### ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్య

దేశంలో అన్నిరాష్ట్రాలలోనూ ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్యాసౌకర్యాలను పొందుతున్న విద్యార్థులసంఖ్య 1956-57 లో

63,35,335. ఆంధ్రదేశంలో, ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యా సౌకర్యాలను పొందిన విద్యార్థుల సంఖ్య, 4,03,195.

## విశ్వకళా పరిషత్తులు

1959 ఏప్రిల్ నాటికి ఇండియాలో 35 విశ్వకళాపరిషత్తులు వున్నాయి. వాటిపేర్లు, వైస్ - ఛాన్సెలర్ల పేర్లు యీక్రింద యివ్వబడినవి.

| పేరు | ఉన్న నగరం | వైస్ - ఛాన్సెలర్ |
|---|---|---|
| అన్నామలై | చిదంబరం | టి. ఎం. నారాయణస్వామిపిళ్లై |
| అలహాబాద్ | అలహాబాద్ | డాక్టర్ శ్రీ రంజన్ |
| అలీఘర్ | అలీఘర్ | కర్నల్ బి. హెచ్. జెయిదీ |
| ఆగ్రా | ఆగ్రా | కె. పి. భట్నగర్ |
| ఆంధ్ర | వాల్తేర్ | డాక్టర్ వి. ఎస్. కృష్ణ |
| ఉత్కళ్ | కటక్ | డాక్టర్ పి. కె. పరిజా |
| ఉస్మానియా | హైదరాబాద్ | డి. ఎస్. రెడ్డి |
| కలకత్తా | కలకత్తా | ప్రొఫెసర్ ఎస్. కె. సిద్ధాంత |
| కర్నాటక | ధార్వార్ | డి. సి. పవాటె |
| కాశ్మీర్ | కాశ్మీర్ | జానకినాథ్ జట్షర్ |
| కేరళ | త్రివేంద్రం | డాక్టర్ జాన్ మత్తయ్ |
| గుజరాత్ | అహమ్మదాబాద్ | హెచ్. వి. దివాటియా |
| గోరఖ్‌పూర్ | గోరఖ్‌పూర్ | బి. ఎన్. ఝా |
| గౌహతి | గౌహతి | డాక్టర్ ఎస్. కె. భూయన్ |
| జమియమిల్లియ | ఢిల్లి | డాక్టర్ ఎం. మజీద్ |
| ఢిల్లి | ఢిల్లి | డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు |
| పంజాబ్ | అంబాలా | డాక్టర్ ఎ. సి. జోషి |
| నాగపూర్ | నాగపూర్ | కె. టి. మంగళమూర్తి |
| థామసన్ ఇంజనీరింగు | రూర్కి | ఎ. ఎన్. ఖోస్లా |
| పాట్నా | పాట్నా | డాక్టర్ బి. నారాయణ |
| బీహార్ | పాట్నా | డాక్టర్ దుఖన్‌రాం |
| పూనా | పూనా | డాక్టర్ ఆర్. పి. పరంజపి |
| పూనా (మహిళ) | పూనా | కె. ఎం. జావెరి |

| | | |
|---|---|---|
| బరోడా | బరోడా | శ్రీమతి హంస మెహత |
| బొంబాయి | బొంబాయి | టి. ఎం. అద్వాని |
| మదరాస్ | ఔరంగాబాద్ | ఏ. లక్ష్మణసామి మొదలియార్ |
| మరాట్వాడా | ఔరంగాబాద్ | ఎస్. ఆర్. డోంగ్రెకారె |
| మైసూర్ | మైసూర్ | డాక్టర్ కె. వి. పుట్టప్ప |
| యాదవపూర్ | యాదవపూర్ | డాక్టర్ జి. సి. రాయ్ |
| రాజస్థాన్ | జయపూర్ | జి. సి. ఛటర్జి |
| లక్నో | లక్నో | ఆచార్య జుగళ్ కిశోర్ |
| విశ్వభారతి | శాంతినికేతన్ | క్షితీశ్ చంద్రచౌదరి |
| శ్రీ వెంకటేశ్వర | తిరుపతి | ఎస్. గోవిందరాజులు నాయుడు |
| సాగర్ | సాగర్ | డాక్టర్ ఆర్. సి. త్రిపాఠి |
| హిందూ | కాశి | డాక్టర్ వి. ఎస్. ఝా |

## జాతీయ ఆచార్యులు

భారతదేశంలో జాతీయ ఆచార్య (నేషనల్ ప్రొఫెసర్) పదవి మొట్టమొదట 1949 క్రైస్తవాబ్దిలో ఏర్పాటు చేయబడింది. ఆ పదవికి డాక్టర్ సి. వి. రామన్ నియమించబడినారు. 1958 ఆగస్టు 15 తేదీన ప్రొఫెసర్ సత్యేంద్రనాథ్ బోస్, డాక్టర్ కె. ఎస్. క్రిష్ణన్, జాతీయ ఆచార్యులుగా నియమించబడినారు. వీరి పదవీ పరిమితి ఐదేళ్లు.

విజ్ఞానులు తమ మేధాశక్తిని పరిశోధనా కృషికే పూర్తిగా వినియోగించేందుకు వీలుగా యీ పదవులను కల్పించడం జరిగింది. వీరు తమ యిష్టం వచ్చిన విశ్వవిద్యాలయంలోగాని, విద్యా సంస్థలలోగాని తమ పరిశోధనలను చేసుకోవచ్చును. వీరికి ఒక్కొక్కరికి నెలకు రూ. 2,500 జీతం యివ్వబడుతుంది.

## సాహిత్య అకాడమీ

సాహిత్య రచనలను ప్రోత్సహించడానికీ, సాహిత్యంపట్ల ప్రజాభిరుచిని పెంపొందించడానికీ, సాహిత్య రచనలో అత్యున్నతమైన నియమములను నెలకొల్పడాని, సాహిత్య అకాడమీని కేంద్ర ప్రభుత్వం స్థాపించింది.

రచయితగా పేరుపొందినవారుగాని, రచనలను ప్రోత్సహించి సాహిత్యాభివృద్ధికి తోడ్పడినవారుగాని, యీ అకాడమీలో సభ్యులుగా వుంటారు.

సభ్యులుకాక, యీ అకాడమీకి పారిషదులుకూడా వుంటారు. ఈ పారిషదుల సంఖ్య ఎప్పుడూ 12కన్న మించివుండకూడదని నియమం ఏర్పరుచబడింది. పరిగణనీయమైన సాహిత్య రచనను చేసినవారిలో అతి ముఖ్యులను మాత్రమే, పారిషదులుగా ఎన్నుకుంటారు.

ప్రతి సంవత్సరము, సుప్రసిద్ధ రచయితలను యీ అకాడమీ బహూకరిస్తుంది. బహుమతులను ఇవ్వడంలో, ప్రతిసంవత్సరమూ, అంతకు పూర్వం మూడు సంవత్సరాలలో ప్రచురితమైన రచనలను పరిశీలించి, ఉత్తమ రచనలను చేసిన వారికే బహుమతి ఇస్తుంది. ప్రతి సంవత్సరం భారతదేశంలోని 14 ముఖ్య భాషలలోని రచనలలో, ఒక్కొక్క భాషకు ఒక్కొక్క బహుమతి మాత్రమే యివ్వబడుతుంది. ఆ పధ్నాలుగు భాషలు ఏమిటంటే: అస్సామీ, బెంగాలీ, గుజరాతి, హిందీ, కన్నడ, కాశ్మీర్, మలయాళం, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం, తమిళం, తెలుగు, ఉర్దు: పై ప్రతి భాషలోను ఒక ఉత్తమ రచయితకు, ప్రతి సంవత్సరం, రు. 5000 బహుమతిఇవ్వబడుతుంది. ఒకసారి బహుమతిపొందిన రచయితకు మళ్ళీ రెండవసారికి బహుమతి ఇవ్వబడదు. ఈ బహుమతులు, సాహిత్య అకాడమీ చేసిన సిఫార్సునుబట్టి ఇవ్వబడుతవి.

పైన ఉదహరించిన 14 భాషల ప్రతినిధులున్నూ, వివిధ రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులున్నూ, యూనివర్శిటీల ప్రతినిధులున్నూ, కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులున్నూ కాక సాహిత్యరంగంలో పరిగణనీయమైన సేవచేసినవారిని విద్యామంత్రి నామినేట్ చేస్తారు.

సాహిత్య అకాడమీ మొట్టమొదటి పరిపాలనా వర్గం 1955 మార్చిలో ఎన్నుకోబడింది. దీనికి చైర్మన్ జవహర్‌లాల్ నెహ్రూ, వైస్ చైర్మన్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ; సభ్యులు, సర్దార్ కె. ఎం. పణిక్కర్, శ్రీ అన్నదశంకర్ రే, శ్రీ జైనేంద్రకుమార్ జెయిన్, శ్రీ ఉమాశంకర్ జోషి, డాక్టర్ హజారి ప్రసాద్ ద్వివేది, ప్రొఫెసర్

పి. వి. కానె, శ్రీ నామక్కల్ వి. రామలింగంపిళ్లె, శ్రీ పింగళి లక్ష్మి కాంతం.

1957 లో బహుమతిపొందిన తెలుగు గ్రంథము; శ్రీ రామకృష్ణ జీవితచరిత్ర; రచయిత, శ్రీ చిరంతనానందస్వామి.

క్రొత్తగా అక్షరాస్యులైన వయోజనులకొరకు రచింపబడినగ్రంథా లలో, యీ క్రింది తెలుగు గ్రంథాలకు ఒకొక్కదానికి రు. 500 బహు మతిని 1957 లో భారత ప్రభుత్వం ఇచ్చింది.

| గ్రంథం : | రచయిత |
|---|---|
| డాక్టరు వచ్చేలోగా ఏంచేయాలి | ఎస్. ఎల్. నరసింహారావు |
| విజ్ఞానయాత్ర (కుటీరపరిశ్రమలు) | కె. వి. వి. సత్యనారాయణవర్మ |
| సంఘజీవనం | డాక్టర్ జి. రాధాకృష్ణమూర్తి. |

## బాలసాహిత్యం

బాలలకు ఉపయోగపడే సాహిత్యాన్ని ప్రోత్సహించడానికి భారతప్రభుత్వం ఒక పథకం అనుసరిస్తున్నది. దానిక్రింద, 1956 అక్టోబరులో దేశంలో వివిధ భాషలలో 28 పుస్తకాలకు కేంద్రప్రభుత్వం. ఒక్కొక్క పుస్తకానికి రు. 500 బహుమతి నిచ్చింది. అలా బహుమతి పొందిన తెలుగు పుస్తకాలు ఇవి : బడిగంట, రచయిత, న్యాయపతి రాఘవరావు : బాలానందం, రచయిత, గిడుగు వెంకటసీతాపతి.

1958 లో బహుమతిపొందిన పుస్తకాలు : జంతు ప్రపంచం, రచయిత. వారణాసి సుబ్రహ్మణ్యం: బాలల బడిపాటలు, రచయిత, ఓ. వి. నరసింహారావు.

## సంగీత, నాటక అకాడమీ

భారతదేశంలో, నృత్య, నాటక, సంగీత కళలలో నూతన పరి శోధనలను చెయ్యడానికీ ఆ కళల అభివృద్ధికి దోహదం ఇవ్వడానికీ, ఆ కళలకు సంబంధించిన సారస్వతాన్ని పెంపొందించడానికీ,ఒక గ్రంథా లయాన్ని స్థాపించడానికీ, అవసరమైనచోట్ల ప్రదర్శనశాలలు ఏర్పాటు చెయ్యడానికీ, కళలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించడానికీ నృత్య, నాటక, సంగీత కళాపరిషత్ అనే సంస్థను కేంద్ర ప్రభుత్వం

స్థాపించింది. ఈ సంస్థ ప్రారంభోత్సవాన్ని 1953 జనవరి 28 తేదీన రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ జరిపారు.

ఈ పరిషత్ కు ఒక పరిపాలన కౌన్సిల్ వుంటుంది. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు యీ కౌన్సిల్ లో ప్రాతినిధ్యం వుంటుంది. ఈ పరిషత్ కార్యనిర్వాహణకు అయే ఖర్చును కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది.

ఈ పరిషత్ కు అధ్యక్షుడు, మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి. శ్రీ పాకాల వెంకటరాజమన్నార్; కోశాధిపతి, శ్రీ ఎం. ఎస్. భట్నాగర్; కార్యదర్శి, నిర్మలఘోష్.

ఈపరిషత్ పరిపాలనా కౌన్సిల్ 1953జనవరి 30న ఎన్నుకోబడింది.

వైస్ చైర్మన్ : శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ: సభ్యులు: రామధారీసింగ్ దినకర్; డాక్టర్ డి.జి. వ్యాస్; నిత్యానంద కానుంగో; రతంజనకర్, బాబూలాల్ గుప్త; బ్రహ్మానంద్ గోస్వామి: శ్రీమతి దేవికారాణి; పృథ్వీరాజ్ కపూర్; ఉదయశంకర్; రాయ్ ఉమానాథ్ బాలి; ప్రొఫెసర్ హుమయూన్ కబీర్; ప్రచురణశాఖ కార్యదర్శి; వి. ఆర్. దేవదర్, ఓంకార్ నాథ్ ఠాకూర్; బి. ఆర్. రాజోపాధ్యాయ, శ్రీమతి జి. చన్నమ్మ, ఆర్. చంద్రశేఖరయ్య, హరి ఉప్పల, శ్రీమతి రుక్మిణిదేవి అరండేల్, పి. ఎస్. పట్కీ, బంధా కనకలింగేశ్వరరావు, ఠాకూర్ జయదేవసింగ్, ప్రొఫెసర్ పి. సాంబమూర్తి, డాక్టర్ వి. రాఘవన్, ఎ. ఎస్. బోదాస్, శ్రీమతి వింధ్యవాసిని దేవి.

ఈ పరిషత్ సభ్యత్వం ఎన్నికద్వారా జరుగుతుంది. పరిపాలనా కౌన్సిల్ సభ్యులు, తాము ఏకగ్రీవంగా ఎన్నుకున్నవారిని పారిషదులుగా చేర్చుకుంటారు : ప్రస్తుతం పారిషదులుగా వున్నవారు:

1. ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్; 2. ఉదయశంకర్; 3. ఉస్తాద్ హాఫీజ్ అలీఖాన్; 4. పృథ్వీరాజ్ కపూర్; 5. కరైకుడి సాంబశివ అయ్యర్; 6. శిశిర్ భాదురి; 7. అరియాకుడి రామానుజ అయ్యంగార్. శ్రీమతి అంజనీబాయ్ మాల్పేకార్.

ఈ పారిషదుల సంఖ్య ఎప్పుడూ 30 మంది కంటె మించకూడదని నియమం ఏర్పరుచబడింది.

గాయకులకు బహూకరణ :

ప్రసిద్ధులైన గాయకులకు ప్రతిసంవత్సరము బహూకరణలు ఇవ్వడానికి ఇండియా ప్రభుత్వ విద్యామంత్రి కార్యాలయం నిశ్చయించింది.

1952 నుంచీ, ప్రతి ఏటా ఇలాంటి బహూకరణలు ఇవ్వబడు తున్నవి. ఒక్కొక్క బహూకరణ, రు. 1,000 రొక్కం, రు. 500 విలువగల కాశ్మీర్ శాలువ. 1959 లో ఈ బహూకరణలు పొందినవారి పేర్లు ఇవి :

కర్ణాట గాత్రం : జి. ఎన్. బాలసుబ్రమణ్యం
కర్ణాటక వాద్యం : విద్వాన్ రాజమాణిక్యం పిళ్లై
హిందుస్తాని గాత్రం : కృపారావ్ శంకర్ పండిట్
హిందుస్తాని వాద్యం : ఉస్తాద్ జహంగీర్ ఖాన్
భరతనాట్యం : శ్రీమతి గౌరిఅమ్మ
కథక్ నాట్యం : సుందరప్రసాద్
నాటకం : నటన : సి. సంబంధ మొదలియార్
నాటకం : డైరెక్షన్ : శంభుమిత్ర
ఫిలిములు : డైరెక్షన్ : సత్యజిత్ రాయ్
ఫిలిములు : నటన : అశోక్ కుమార్

ఫిలిములకు బహుమతి :

1953 డిసెంబరు 21 తరువాత, ప్రతి సంవత్సరమూ దేశంలో తయారైన ఫిలిములలో ఉత్తమమైన వాటికి మూడిటికి బహుతులను ఇవ్వడానికి, సంగీత, నాటక, అకాడమీ నిశ్చయించింది.

1958 లో తయారైన చిత్రాలలో ఉత్తమ చిత్రంగా 'సాగర్ సంగమె' అనే బెంగాలి చిత్రాన్ని నిర్ణయించి, దానికి రాష్ట్రపతి సువర్ణ పతకాన్ని యిచ్చారు.

తెలుగు భాషలో తయారైన చిత్రాలలో పెళ్ళినాటి ప్రమాణాలు అనే చిత్రానికి రాష్ట్రపతి రజతపతకం, మాంగల్యబలం అనే చిత్రానికి ప్రశంసాపత్రం లభించాయి.

# సాయుధ బలాలు

ఇప్పుడు ఇండియాలోవున్న సైన్యదళానికి పునాది ఈస్టిండియా కంపెనీవారు తమ ఫ్యాక్టరీల రక్షణకు పదిహేడవ శతాబ్దంలో ఏర్పాటు చేసుకున్న చిన్న చిన్న కాపలా దళాలు. క్రమేపీ, యీ దళాలసంఖ్య హెచ్చు చేయబడింది. ఈస్టిండియా కంపెనీవారు, దేశీయ వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, దేశీయరాజుల పరస్పర కలహాలలో, ఎవరికో ఒకరికి సహాయపడటమూ, క్రమేపీ తాముకూడా ఇండియాలో రాజ్యాన్ని సంపాదించుకోవడమూ జరగడంతో తమ సైన్యాన్ని విస్తరింపచెయ్యడమూ, సైనికులకు మంచి శిక్షణ ఇవ్వడమూ జరిగింది. బ్రిటిషువారు తయారుచేసిన యీ సైన్యంలోవున్న బ్రిటిషు సైనికులకు సోల్జర్లని, భారతీయ సైనికులకు సిపాయిలని వ్యవహారనామం వుండేది.

1857 లో సిపాయిలు సాగించిన మొదటి భారతీయ స్వాతంత్ర్య సమరఫలితంగా, ఇండియా పరిపాలనను ఈస్టిండియా కంపెని చేతిలోనుంచి బ్రిటిషు ప్రభుత్వం తీసుకున్నది. అప్పుడు ఇండియాలోని సైన్యాన్ని, బొంబాయి, మదరాసు, బెంగాల్ రాష్ట్రీయ సైన్యాలుగా, మూడు భాగాలుగా చెయ్యబడింది.

ఆనాటికి ఇండియాలోని సైన్యంలో 65,000 మంది బ్రిటిషు సైనికులు, 1,40,000 భారతీయ సైనికులూ వుండేవారు.

బ్రిటిషువారు భారతదేశంలో సైన్యాలను సమకూర్చడం ఆరంభించినప్పటినుంచి చాలా కాలందాకా, భారతీయు లెవరికీ బాధ్యతగల హోదాలను సైన్యంలో ఇవ్వలేదు. మొట్టమొదటిసారి, 1918 లో భారతీయులకు సైన్యంలో ఆఫీసరుహోదా యివ్వడం జరిగింది. తరువాత, క్రమేపీ కొద్దికొద్దిగా, కింగ్సు కమిషన్ (ఆఫీసరుహోదా)లను భారతీయులకు ఇవ్వడం జరిగినా, 1939 నాటికి భారతదేశంలోని సైన్యం అంతటిలోనూ 5000 మందికంటె ఎక్కువమంది ఆఫీసర్ల ఉద్యోగాలలో లేరు.

1939 లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన తరువాత, కొంచెం ఎక్కువగానే భారతీయులకు ఇండియా సైన్యంలో ఆఫీసరు ఉద్యోగాలు యివ్వబడినవి. యుద్ధం ముగిసేటప్పటికి, దాదాపు 8,000 మంది భారతీయులు ఆఫీసరు హోదాలో వున్నారు.

ప్రపంచయుద్ధం ముగిసిన రెండు సంవత్సరాలలో, రాజకీయ పరిస్థితులు అతివేగంగా మార్పులు చెందటముతో, సైన్యశాఖ పునర్నిర్మాణం విషయమై ఏమీ ఏర్పాట్లు జరుగలేదు. 1947 ఆగస్టు 15 తేదీన భారతదేశ విభజన జరగడంతో, భారతదేశపు సైన్యంకూడా విభజింపబడింది. ఆనాటికి భారతదేశంలోవున్న సైన్యంలో రెండు భాగాలు ఇండియావంతుకీ, ఒక భాగం పాకిస్తాన్ వంతుకీ వచ్చాయి.

దేశవిభజనతోపాటు, దేశ స్వాతంత్ర్యంకూడా లభించినందున ఇండియాలోని బ్రిటిషు సైనికులందరినీ విడుదల చెయ్యడంకూడా జరిగింది. ఇండియాలోని ఆఖరు బ్రిటిషు పటాలం, 1948 ఫిబ్రవరి 28 తేదీన ఇండియానుంచి వెళ్ళిపోయింది. అయితే కొంతమంది బ్రిటిషువారు ఇంకా ఇండియా సైన్యంలో, ఇండియా ప్రభుత్వం కోరికపై పనిచేస్తూనే వున్నారు. వీరు యుద్ధచర్యలకుగాని, సైనిక నాయకత్వానికిగాని కాక భారతీయ సైనికులకు తర్ఫీదు ఇవ్వడం, సైనికవ్యవహారాలలోని మెళుకువలను నేర్పడంలో నియమితులై వున్నారు. వీరి సంఖ్య చాల తక్కువ.

ఇండియా సర్వసైన్యాధిపతిగా మొట్టమొదటి భారతీయుని నియామకం, 1948 డిశంబరులో జరిగింది. ఈ పదవికి నియమింపబడిన జనరల్ కె. ఎం. కరియప్ప, 1949 జనవరి 15 తేదీన పదవి స్వీకారం చేశారు.

## సాయుధబలాల నిర్వహణ

ప్రస్తుతం ఇండియా సాయుధబలాల నిర్వహణ ఎలా జరుగుతున్నదంటే :

సైన్యాలన్నీ సర్వసైన్యాధిపతికి లోబడివుంటాయి. నౌకాదళాలన్నీ సర్వనౌకాదళాధిపతికి లోబడివుంటాయి. విమానదళాలన్నీ సర్వవిమానదళాధిపతికి లోబడివుంటాయి. ఈ ముగ్గురున్నూ ప్రభుత్వ రక్షణశాఖామంత్రికి బాధ్యులై వుంటారు. సైన్య నిర్వహణ విషయంలో ఏఏ విధానాలు అవలంభించాలో మొదలైనవాటిని ప్రభుత్వమండలి నిర్ణయించి, వాటిని మంత్రిమండలిలో ఏర్పాటు చేయబడిన డిఫెన్సు కమిటీద్వారా రక్షణశాఖామంత్రికి తెలియజేస్తారు. రక్షణశాఖామంత్రి, ఈ విధానాలను తన కార్యాలయంద్వారా వివిధ బలాల అధిపతులకు తెలియజేసి, అవి అమలు జరిగేటట్టు చూస్తారు.

## సైన్యం

ఇండియా సైన్యం అనేక భాగాలుగా విభజింపబడివుంది. అవేవి టంటే: కవచదళాలు; ఫిరంగిదళాలు; సైనిక ఇంజనీరుదళాలు; గుమస్తా దళాలు.

## నౌకాదళము

ఈనాటి ఇండియా నౌకాదళపు పుట్టుక, 1612 లో జరిగిందని చెప్పవచ్చును. ఆ రోజులలో డచ్చివారు, పోర్చుగీసువారు తమ నౌకలను ఆటంకపరచకుండానూ సముద్రపు దొంగలు తమ నౌకలను దోచుకోకుండానూ తమ నౌకలలో సాయుధ నావికదళాలను వుంచుకోడానికి నిశ్చయించి యీస్టిండియా కంపెనీవారు రెండు సాయుధనౌకలను ఏర్పాటు చేసుకున్నారు. క్రమేపి, యీ నౌకలసంఖ్య పెరిగి, ఇండియా ప్రభుత్వాధిపత్యంలో పెద్ద నౌకాదళమే ఏర్పడింది.

ఇండియాతీరం చాలా పొడవైనది గనుక, ప్రస్తుతంవున్న నౌకాదళం తీరరక్షణకు చాలదు. పదేళ్ళలో, ఇండియా నౌకాదళాన్ని తగినంతగా విస్తరింప చెయ్యడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని తయారు చేశారు. నౌకాదళంలో పనిచేసే నావికుల(రేటింగ్స్)కు ట్రెయినింగు బొంబాయి, కొచ్చిన్, విశాఖపట్టణములలో యివ్వబడుతున్నది.

ఎక్కువమంది యువకులు నౌకాదళంలో చేరి, అతి ముఖ్యమైన ఈ దేశరక్షణ సేవలో పాల్గొనవలసిన అవసరం ఎంతేనా వుంది.

ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందినతరువాత, అంటే 1947 ఆగస్టు 15 నుంచి, 1947 నవంబరు 29 నాటికి క్రొత్తగా ఏడు నౌకలను సుమారు 2,43,00,000 రూపాయల వ్యయంతో ఇండియా ప్రభుత్వం కొన్నారు.

ఇండియాకు ప్రత్యేకంగా ఒక డెస్ట్రాయర్ దళాన్ని ఏర్పాటు చేసే ఉద్దేశంతో ఇండియా ప్రభుత్వం బ్రిటనునుంచి మూడు నౌకలను (ఒక్కొక్కటి 1700 టన్నులు) కొన్నారు. రాజపుట్, రంజిత్, రాణా అనే పేర్లతో యీ మూడు నౌకలు బొంబాయికి 1948 జనవరి 23 తేదీన చేరినవి. ఈ నౌకలు మూడునూ 1942 లో నిర్మింపబడినవి.

ఒక్కొక్కదాని పొడవు 358 అడుగులు. ఒక్కొక్కదానిలో నాలు గేసి 4.7 అంగుళాల మూతిగల ఫిరంగులు వుంటాయి.

ప్రస్తుతం ఇండియాకు రాజపుట్, రంజిత్, రాణా, గోదావరి, గంగ, గోమతి అనే ఆరు డెస్ట్రాయర్ నౌకలూ; తీర్, కావేరి, కృష్ణ, బ్రహ్మపుత్ర, ఖుక్రి, అనే అయిదు ఫ్రిగేట్ నౌకలూ, బొంబాయి, కొంకణ, మదరాసు, బెంగాల్, రోహిల్ ఖండ్, బేసీన్, భీమునిపట్టణం అనే ఏడు మైన్ స్వీపర్ నౌకలూ, ఇన్వెస్టిగేటర్, సట్లెజ్ అనే రెండు సర్వే నౌకలు, ఢిల్లీ, మైసూర్ అనే క్రూయిజరు నౌకలు వున్నాయి.

## విమానదళం

భారతదేశంలో మొట్టమొదటి విమానదళం, 1935 ఏప్రిల్‌లో ఏర్పాటు చేయబడింది. ఆ విమానదళ బలపు సంఖ్య ఎంతంటే: మూడు విమానాలు, ఆరుగురు వైమానికులు. ఇంత స్వల్పంలో ఆరంభమైన విమానదళం, రెండవ ప్రపంచయుద్ధం ముగిసేటప్పటికి పదిస్క్వాడ్రనుల బలంగా తయారయింది. వీటిలో ఎనిమిది యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు, రెండు యుద్ధసామగ్రిని సరఫరాచేసేవి.

1947 ఆగస్టులో దేశవిభజనతోపాటు విమానదళ విభజనకూడా జరిగింది. యుద్ధచర్యలలో పాల్గొనేవిమానాలుగల స్క్వాడ్రనులు ఏడు, యుద్ధసామగ్రిని సరఫరాచేసే విమానాలుగల స్క్వాడ్రను ఒకటి ఇండియావంతుకు వచ్చాయి.

ఇండియా వైశాల్యం, ఇండియాకుగల ప్రాముఖ్యతనుబట్టి ప్రస్తుతం వున్న విమానదళపు బలం చాలదు. ఈ దళాన్ని బాగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ఇండియా విమానదళంలో బాంబరుస్క్వాడ్రనులు, జెట్ విమాన స్క్వాడ్రనులుకూడా ఏర్పాటు చేయబడుతవి, అయిదుసంవత్సరాలలో, విమానదళ బలం మొత్తం 15 స్క్వాడ్రనులు చెయ్యడం ప్రభుత్వం సంకల్పం.

ప్రస్తుతం, కోయంబుత్తూరు, జోధ్‌పూర్, అంబాలా, బెంగుళూరు, మదరాసుకలో వైమానికులకు తర్ఫీదునిచ్చే కేంద్రాలువున్నాయి. ఇండి

యాలో తర్ఫీదుపొందిన వైమానికులలో కొందరిని ప్రతిఏటా ఇంగ్లండు పంపి, ఉత్తమశిక్షణను యిప్పించడానికి కూడా ఏర్పాటు చేయబడింది.

## ఛీఫ్ ఆఫ్ స్టాఫ్

సాయుధదళాల అధిపతులను ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ అని పిలువవలసిందని భారతప్రభుత్వం 1955 లో నిర్ణయించింది. సర్వసైన్యాధిపతిని ఛీఫ్ ఆఫ్ ఆర్మీస్టాఫ్ అని నావా దళాధిపతిని ఛీఫ్ ఆఫ్ నేవల్ స్టాఫ్ అని విమాన దళాధిపతిని ఛీఫ్ ఆఫ్ ఏర్ స్టాఫ్ అని పిలుస్తారు.

## నేషనల్ కేడెట్ కోర్

ఇండియాలోని యువకులకు సైనికశిక్షణ యివ్వడానికీ, అలా శిక్షణపొందినవారిలో అర్హులైనవారికి సైన్యంలో ఉద్యోగాలు యివ్వడానికీ ఒక పథకం తయారుచేయబడింది. ఆపథకంప్రకారం ఇండియాలో నేషనల్ కేడెట్ కోర్ స్థాపింపబడింది. కేడెట్ అంటే సైనికశిక్షణ పొందే యువకుడని అర్థం. కోర్ అంటే దళం అర్థం.

ఈ పథకం ఏమిటంటే: ఈ దళం రెండుభాగాలుగా వుంటుంది. భాగానికి డివిజన్ అని పేరు. సీనియర్ డివిజన్, అంటే కాలేజి విద్యార్థులదళం: జూనియర్ డివిజన్ అంటే హైస్కూలు విద్యార్థులదళం. ఈ దళాలలో బాలుర దళాలు, బాలికల దళాలు వేరుగా వుంటాయి.

నేషనల్ కేడెట్ కోర్ లో ప్రతి విద్యార్థీ చేరాలని నిర్బంధం లేదు; ఇష్టంవచ్చినవారే చేరవచ్చును. ఇలా చేరి తర్ఫీదు పొందినవారు తప్పనిసరిగా సైన్యంలోచేరి యుద్ధ కార్యాలలో పాల్గొనాలనే నిర్బంధంకూడా ఏమీలేదు. ఈ తర్ఫీదు కేవలమూ, యువకులకు సైనిక శిక్షణనుయిచ్చి, వారు ప్రయోజకులుగా తయారయ్యేటట్లు చెయ్యడానికి ఉద్దేశింపబడింది.

జూనియర్ డివిజన్ లో చేర్చుకొనబడే కేడెట్ వయస్సు 13 ఏండ్లలోపు వుండకూడదు. 17 ఏండ్లకు మించకూడదు.

1957 ఆగస్టు 15 నాటికి నేషనల్ కేడెట్ కోర్ బలగం సంఖ్య 1,80,000. ఆక్సిలియరీ కేడెట్ కోర్ బలగం సంఖ్య, 6,71,104.

## ప్రాంతీయ సైన్య దళాలు

సైన్యంలో చేరి పనిచేస్తున్న వారికే గాక, దేశంలోని యువకులందరికీ సైనిక శిక్షణ యివ్వడానికీ, అవసరం వచ్చినప్పుడు దేశరక్షణ కార్యాలలో సైన్యానికి చేదోడుగా ఉండేటట్టు ప్రాంతీయ సైన్య దళాలను ఏర్పాటు చెయ్యడానికీ ప్రభుత్వం నిశ్చయించారు.

ప్రథమంలో యీ ప్రాంతీయ సైన్యం సంఖ్య 1,30,000 వుంటుంది. ఇది ఎనిమిది దళాలుగా విభజింపబడివుంటుంది. ఒక్కొక్క దళానికి ఒక్కొక్క ప్రాంతం నిర్ణీతమై వుంటుంది. ఆ ప్రాంతాలు ఇవి:

(1) పంజాబ్ రాష్ట్రం: తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్; ఢిల్లీ, (2) ఉత్తర ప్రదేశ్; (3) మధ్య ప్రదేశ్; తూర్పు సంస్థానాలు, (4) బొంబాయి, కతియవాడ్. (5) మదరాసు; మైసూరు, ఆంధ్ర ప్రదేశ్, (6) బీహార్; ఒరిస్సా, (7) పశ్చిమ బెంగాల్, కూచ్ బీహార్, (8) అస్సాం, త్రిపుర; మణిపూర్.

ఆంధ్ర రాష్ట్రంలో ప్రాంతీయ సైన్యదళం 1949 అక్టోబర్ 7 వ తేదీన స్థాపింపబడింది.

ఈ దళాలుచేసే పని ఏమిటంటే: యుద్ధపరిస్థితులు ఏర్పడినపుడు సైన్యానికి తగినవారు లభించేటట్టు సహాయకరంగా వుండటం: సైన్యం యుద్ధకార్యాలలో నిమగ్నమైవున్నందున, ఆంతరంగిక దేశరక్షణ కార్యాలలో పోలీసు వారికి సహాయపడుతూ అల్లరులు, కల్లోలాలు జరగకుండా శాంతిభద్రతలను కాపాడడం, తీరరక్షణ, విమానదాడి ప్రతి ఘటన మొదలైన పనులలో పాల్గొనడం. అవసరమైనప్పుడు దేశరక్షణలో పాల్గొని, దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి సహాయపడాలనే ఉత్సాహం గలవారంతా, యీ దళంలోచేరి సైనిక శిక్షణను పొందవచ్చును. ఈ దళాలకు చెందినవారికి ఏడాదికి రెండుమూడు మాసములు మాత్రమే శిక్షణ యివ్వబడుతుంది. మిగతా కాలంలో, వారు తమ మామూలు పనిపాటలను చూసుకుంటూ వుంటారు.

## నేషనల్ డిఫెన్స్ ఎకడెమీ

ఇండియాలోని సైన్య, నౌకా, విమాన దళాలలోని ఆఫీసరు ఉద్యోగాలకు భారతీయులను తయారుచేయడానికి ఒక కళాశాల (మిలిటరీ

ఎకడమీ)ను స్థాపించడానికి ఇండియాప్రభుత్వంవారు నిశ్చయించారు. ఈ కళాశాల, రెండవ ప్రపంచయుద్ధంలో భారతీయ సైన్యాలు చూపిన ప్రతిభకు చిహ్నంగా పరిగణింపబడుతుందని కూడా ప్రకటింపబడింది. అదే వుద్దేశంతో నేషనల్ డిఫెన్స్ ఎకడెమీ అనే పేరు పెట్టబడింది.

ఈ కళాశాలను ఎక్కడ స్థాపించాలో, దానికి ఏ పేరు పెట్టాలో, శిక్షణ పద్ధతులు ఎలా ఉండాలో; విద్యార్థుల వయస్సు, అర్హతలు ఎలా వుండాలో, నిర్ణయించడానికి ప్రభుత్వంవారు ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీ చేసిన సలహాలను ఆమోదిస్తూ 1948 మే 2 తేదీన ఇండియా ప్రభుత్వం చేసిన ప్రకటననుబట్టి, యీ ఎకడెమీ స్థాపన పథకం ఇది :

నేషనల్ డిఫెన్స్ ఎకడెమీ, పూనాకు 13 మైళ్ళ దూరంలోవున్న ఖరక్ వస్లలో స్థాపింపబడుతుంది. ఇండియా సైన్య, నౌకా, విమానదళాలకు ఆఫీసర్లను తర్ఫీదు చెయ్యడానికి ఇది వుద్దేశింపబడింది. దీనిలో చేర్చుకొనబడే విద్యార్థులు, కేవలము అర్హతలనుబట్టి ఎన్నుకోబడుతారు. వారి వయస్సు 15 ఏండ్లకుపైన 19 ఏండ్లకులోపు వుండాలి. దీనిలో చేరడానికి ముందు వారు మెట్రిక్యులేషను గాని, దానితో సమానమైన పరీక్ష గాని చదివివుండాలి. దానిలో చేర్చుకొనబడిన విద్యార్థులకు తర్ఫీదు, భోజనవసతి దుసులు ఉచితంగా యివ్వబడుతవి. ఇక్కడ తర్ఫీదు మూడేళ్లు వుంటుంది : నౌకాశాఖలో చేరదలచిన విద్యార్థులు మాత్రం, 15 ఏటనే చేరాలి. సైన్యశాఖలో చేరదలచిన యువకులు, మూడేళ్లు తర్ఫీదు అయిన తరువాత మరొక ఏడాది యిక్కడవుండి యితర సైన్యశాఖల గురించి నేర్చుకోవాలి.

ఖరక్ వస్లలో, యీ కళాశాలకు కావలసిన భవన నిర్మాణానికి పునాదిని 1949 అక్టోబరు 6 న పండిట్ జవహర్ లాల్ నెహ్రూ చేశారు. ఈ భవననిర్మాణం జరిగేవరకు, యీ కళాశాల డేరాడూన్ లో నిర్వహింపబడుతుంది. ఈ శిక్షణకు ఎన్నుకోబడే విద్యార్థుల మొదటి జట్టు తర్ఫీదు 1949 జనవరి 4 వ తేదీన ప్రారంభమైంది.

దీనిలో ప్రతి సంవత్సరమూ 600 లేక 700 మంది విద్యార్థులు చేర్చుకొనబడతారు.

## వీర సత్కారం

ఇండియా నౌకా, సైన్యవిమాన దళాలలో అసాధారణమైన ధైర్య స్థైర్యాలను ప్రదర్శించిన వీరులను సత్కరించడానికి, యీ క్రింది బిరుదులు యివ్వడానికి కేంద్ర ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ప్రథమ సత్కారం : పరమ వీరచక్ర
ద్వితీయ సత్కారం : మహా వీరచక్ర
తృతీయ సత్కారం : వీరచక్ర

పరమ వీరచక్రపతక సత్కారం,ఇంతకుపూర్వం బ్రిటిషు ప్రభుత్వం యిచ్చే విక్టోరియా క్రాస్ పతకంతో సమానమైన హోదాగలది. భారత ప్రజారాజ్య అవతరణ సందర్భంలో, 1950 జనవరి 26 వ తేదీన ప్రభుత్వం వీరసత్కారం చేశారు. పరమ వీరచక్ర, మేజర్ సోమనాథశర్మ, లాన్స్‌నాయక్ కరంసింగ్, కెప్టెన్ ఆర్. ఆర్. రాణె, నాయక్ యదునాథ్‌సింగ్ అనువారలకు ఇవ్వబడింది. వీరిలో మేజర్ సోమనాథశర్మ నాయక్ యదునాథ్‌సింగ్‌లకు వారి మరణానంతరం యీ సత్కారం జరిగింది. 1953 జనవరి 26 న హవల్దారు మేజరు పీరు సింగ్‌కు మరణానంతరం ఇవ్వబడింది.

చాలామందికి మహావీర్ చక్ర, వీరచక్ర సత్కారం జరిగింది. ఈ సత్కారాలన్నీ కాశ్మీర్ యుద్ధంలో పాల్గొన్నవారికే.

పరమ వీరచక్ర సత్కారాన్ని పొందినవారికి నెలకు రు. 50 భృతి ఇవ్వబడుతుంది. ఒకసారి పరమ వీరచక్రపొంది మళ్ళీ గొప్ప పని చేసినవారికి పరమ వీరచక్ర బార్ యివ్వబడుతుంది. అలా బార్ పొందినవారికి, ప్రతిబార్‌కు అదనంగా రు. 10 భృతి యివ్వబడుతుంది.

వీరచక్ర సత్కారం పొందినవారికి నెలకు రు. 28 భృతి ఇవ్వబడుతుంది. అదనంగా ప్రతి బార్‌కు రు. 8 భృతి ఇవ్వబడుతుంది.

సత్కారం పొందిన వీరుడు మరణించినట్లయితే, యీభృతి అతని భార్యకు ఇవ్వబడుతుంది.

ఈభృతి జూనియర్ కమిషన్‌డ్ ఆఫీసర్లకు అంతకు, తక్కువ హోదాగలవారికి మాత్రమే ఇవ్వబడుతుంది. కమిషన్డ్ ఆఫీసర్లకు ఇవ్వబడదు.

## అశోకచక్ర

యుద్ధచర్యలలోగాక, ఇతర సందర్భాలలో సాహస, ఔదార్యాలను ప్రదర్శించి ప్రశంసనీయమైన సేవచేసినవారికి సాయుధబలాలలో వున్నవారికేగాక ఇతర సామాన్య ప్రజలకుకూడా బహూకరణ చెయ్యడానికి 'అశోకచక్ర' పతకాన్ని ఏర్పాటుచేస్తూ, ప్రెసిడెంటు ఉత్తరువు 1952 జనవరి 12 న జరిగింది.

ఈ పతకం మూడు తరగతులు కలిగి వుంటుంది.

గొప్ప సాహసము, త్యాగము చూపినవారికి మొదటి తరగతి గొప్ప సాహసము చూపినవారికి రెండవతరగతి. ప్రశంసనీయమైన సాహసము చూపినవారికి, మూడవ తరగతి.

## లోక్ సహాయక్ సేవ

లోక్ సహాయక్ సేన 1955 లో ఏర్పాటు చేయబడింది. పౌరులలో క్రమశిక్షణ, ఆత్మవిశ్వాసం విజయాకాంక్షలను పెంపొందించడానికి ఇది ఏర్పాటు చేయబడింది. దీని పేరు బహుళ ప్రచారంలోకి రావడం వల్ల దీనిని యిప్పుడు లోక్ సేవ అనికూడా పిలుస్తున్నారు.

భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలోను. జనాభా ప్రాతిపదిక మీద నెలకొల్పబడిన శిక్షణ శిబిరాలలో లోక్ సహాయక సేవ శిక్షణ జరుపబడుతున్నది. ఒక్కొక్క శిబిరం 30 రోజులపాటు నిర్వహించబడుతుంది. తడవకు 500 మందికి శిక్షణ యిస్తారు. ఇప్పటికి సుమారుగా 350 శిక్షణ శిబిరాలు ఏర్పాటుచేయబడ్డాయి. దాదాపు 1,61,000 మంది వలంటీర్లు వాటిలో శిక్షణపొందారు. శిక్షణ పూర్తయిన తర్వాత ప్రతి వ్యక్తి అవసర సమయంలో దేశసేవ చేస్తానని ప్రమాణపత్రంపై యధేచ్ఛతో సంతకం చేస్తాడు. ఈ శిక్షణ శిబిరాలు సాధారణంగా సమాజ జాతీయ వికాస కార్యక్రమ ప్రాంతాలకు చేరువగా ఏర్పాటు చేయబడతాయి,

## ప్రజారోగ్యము

ప్రజారోగ్యము విషయంలో ప్రభుత్వంవారు శ్రద్ధతీసుకొని దీని కొరకు ఒక ప్రత్యేక డిపార్టుమెంటును స్థాపించడం జరిగి యిప్పటికి

సుమారు 80 ఏండ్లు అయింది. నగరములు పరిశుద్ధముగా వుండేటట్లు చూడడంలోనూ - అంటువ్యాధులు వ్యాపించకుండా చూడడంలోనూ, వ్యాధి చికిత్సకు ఉచితంగా సదుపాయాలు కలిగించడంలోనూ చాలా అభివృద్ధి జరిగింది. కాని ఇప్పటివరకు మనదేశంలో జరిగిన కృషి అంతా కూడా, జరుగవలసిన దానిలో పదవవంతు కూడా లేదు.

మనదేశం ప్రజారోగ్యం విషయంలో ప్రపంచంలోని యితర దేశాలతో పోలిస్తే చాలా వెనకబడివున్నది. ఇంగ్లండు జర్మనీ దేశాలలో సగటున ఒక మనిషి ఆయుర్దాయం 63 సంవత్సరాలూ, ఆస్ట్రేలియాలో 66 సంవత్సరాలూ అయితే, మన దేశంలో ప్రజల సగటు ఆయుర్దాయం 32 సంవత్సరాలు మాత్రమే అని లెక్క తేలింది.

ఇండియాలో 1957 జనవరి నాటికి 42 మెడికల్ కాలేజీలు, వున్నాయి. వీనిలో ఏడాదికి సుమారు 4,500 మంది పరీక్షలు ప్యాసయి, డాక్టర్లు అవుతున్నారు.

మనదేశంలో గవర్నమెంటు పరీక్షలు ప్యాసయిన వైద్యులు మొత్తం 70,000 మంది. అంటే సగటున ప్రతి 5,800 మంది ప్రజలకీ ఒక డాక్టరు వున్నాడన్నమాట. ఇదే లెక్కలో ఇంగ్లండులో చూస్తే ప్రతి 1200 మంది ప్రజలకీఒక డాక్టరువున్నాడు. యునైటెడ్ స్టేట్సులో ప్రతి 750 మంది ప్రజలకీ ఒక డాక్టరు వున్నాడు. మనదేశమంతటా సుమారు 22,000 మంది నర్సులు వున్నారు. దేశంలో 1,25,000 మంచాలు గల మొత్తం 8,600 ఆసుపత్రులు వున్నాయి.

అయితే, డాక్టర్లలోనూ, నర్సులలోనూ నూటికి 80 వంతులమంది పట్టణాలలోనే వున్నారు. పట్టణాలలోవుండే ప్రజలు, దేశప్రజనాభాలో పదవవంతు మాత్రమే. అంచేత, నేడు మన గ్రామస్తులకు బొత్తిగా సరియైన వైద్యసహాయమే లేదన్నమాట.

ఇక మనదేశంలో అత్యధిక సంఖ్యాకులుపడే జబ్బులు ఏమిటంటే మలేరియా, టైఫాయిడ్, రక్తగ్రహణి, కలరా, క్షయ, స్ఫోటకము, ఆహార లోపమువల్ల వచ్చే జబ్బులు.

అన్ని జబ్బులలోనూ, ఎక్కువమంది ప్రాణాలను హరిస్తున్నది మలేరియా. ఈ జబ్బు ఏడాదికి పదికోట్లమందికి వస్తోందనీ, ఏడాదికి 12½ లక్షలమంది చచ్చిపోతున్నారనీ, అంచనా.

రెండవ ప్రమాదకరమైన జబ్బు క్షయ, ఈ జబ్బువల్ల ఏడాదికి సుమారు అయిదు లక్షలమంది చనిపోతున్నారనీ, బాదాపు 35 లక్షల మంది ఈ జబ్బుతో అవస్థపడుతున్నారనీ అంచనా.

ఇండియాలో క్షయరోగుల చికిత్సకు 194 ఆస్పత్రులు మాత్రమే వున్నాయి. మామూలు ఆస్పత్రులలో 114 వార్డులు వున్నాయి. మొత్తం 10,371 మంది రోగుల పడకకు వసతివుంది. ఈ రోగ చికిత్సకు సరియైన ప్రయత్నం జరగాలంటే అధమం 4,000 ఆస్పత్రులు, సుమారు అయిదు లక్షల రోగులు వుండటానికి వసతితో స్థాపించాలని అంచనా.

మనదేశంలో స్ఫోటకంవల్ల చనిపోయినవారిలో అత్యధిక సంఖ్యాకులు, పది సంవత్సరాలలోపు పిల్లలు.

ఇండియాలో సుమారు పదిలక్షలమంది కుష్ఠురోగులున్నారు.

క్షయరోగం రాకుండా ముందు టీకాలువేసే పద్ధతి ఇటీవల కనుగొనబడింది. ఈ టీకాలను బి. సి. జి. వాక్సీన్ అంటారు. యునైటెడ్ నేషన్సుకు చెందిన ప్రపంచ ఆరోగ్యసమితి అధ్వర్యాన అనేకదేశాలలో యీ టీకాలను వెయ్యడం ఎనిమిది సంవత్సరాలుగా జరుతున్నది.

### ప్లేగు :

ప్లేగువ్యాధి కారణం ఎలుకలు. ఈ వ్యాధిగల ఎలుకలను కుట్టిన దోమలు, లేక యీగలు మనుష్యులకు ఈ వ్యాధిని తగిలిస్తాయి. ఇంటిలో ఎలుకలు లేకుండా ప్రతివారూ జాగ్రత్త పడాలి. ఎలుకలు వృద్ధి పొందడానికి సహాయకరములైన చెత్త,కుళ్లు పదార్థములు ఇంటిలోనూ, ఇంటి పరిసరములలోనూ వుండకుండా చూడాలి. ఆహార పదార్థాలను ఎలుకలు ముట్టుకోకుండా, మూతలువేసిన పాత్రలో వుంచాలి.

ప్లేగు రాకుండా ప్రతివ్యక్తి టీకాలు వేయించుకోడం మంచిది. చచ్చిపడిన ఎలుకలు ఇంటిలోగాని, ఇంటి పరిసరాలలోగాని కనపడితే, వెంటనే ఆరోగ్యశాఖాధికారులకు తెలియపరచాలి. ప్లేగు జ్వరపు లక్షణాలు కనపడినట్లయితే, ప్రతి వ్యక్తి వెంటనే వైద్యుని దగ్గరకు వెళ్ళి చికిత్స పొందాలి.

# ఆరోగ్యము : ఆహారము

మనదేశంలోని ప్రజలకు పెద్దలోపం ఏమిటంటే, విద్యా విహీనత్వంతోపాటు సరియైన ఆహారం కూడా లేకపోవడం. ఇటీవల మనదేశంలోని ప్రజల ఆహారస్థితిని పరిశీలించిన ఒక కమిషనువారు దేశంలోని జనాభాలో నూటికి ముప్ఫయిదంతులమంది, శరీరాన్ని రోగాల పాలబడకుండా తగిన దార్ఢ్యత యివ్వవలసిన దానికంటె చాలా తక్కువ ఆహారాన్ని తింటున్నారని తేల్చారు.

ఆహారం సరియైనది లేకపోవడంవల్ల మనిషికి అనేక జబ్బులు వస్తాయి. సరియైన ఆహారం తినగలిగిన శక్తిగలవారుకూడా, అనేకమంది దేహపుష్టికి కావలసిన ఆహారం ఏమిటో తెలియక కొన్ని పదార్థాలను ఎక్కువగానూ కొన్ని పదార్థాలను తక్కువగానూ తినడం జరుగుతోంది. అందువల్ల దేహానికి సమపుష్టి కలిగించవలసిన పద్ధతిలో ఆహారం సమపాళంలో అందక అనేకమంది వ్యాధుల పాలబడుతున్నారు.

ప్రతిమనిషికి తనపని తాను చేసుకోడానికి శక్తి కావాలికదా. ఈ శక్తికి తగినపుష్టిని యిచ్చే ఆహారాన్ని తినాలి. ఈ శక్తికి, శాస్త్రజ్ఞులు కేలరీ, అనే పేరు పెట్టారు. మనం తినే ఆహారపు కొలత యీ కేలరీలలో సూచిస్తారు. వివిధ వృత్తులలో వున్నవారికి, వివిధ పరిమాణంలో కొన్ని కేలరీల శక్తిగల ఆహారం కావాలి. ఈ విషయంలో శాస్త్రజ్ఞులు, యీ క్రిందిపట్టీ ప్రకారం ఆహారపు కేలరీల విలువ వుండాలని సూచించారు.

| వృత్తి | ఆహారపు కేలరీలు |
|---|---|
| గుమాస్తా | 2,600 |
| డాక్టరు | 2,760 |
| టైపిస్టు | 2,800 |
| గృహిణి | 2,800 |
| సైనికుడు | 3,150 |
| వడ్రంగి | 3,190 |
| కూలిపనివాడు | 3,610 |
| కమ్మరి | 4,120 |
| కట్టెలు కొట్టేవాడు | 5,500 |

మామూలుగా పురుషుడు చేసేపనినే చేసే స్త్రీ పురుషుడు తినే ఆహారంలో అయిదింట నాలుగు వంతులు తింటుందని అంచనా.

మనదేశంలో ప్రతి వ్యక్తి రోజుకు 2,500 కేలరీల శక్తిని యిచ్చే ఆహారాన్ని తినాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే మనదేశంలో చాలామంది తినే ఆహారం రోజుకు 1,200 కేలరీల లోపలే వుంటున్నది కాని అంతకు మించడంలేదని పరిశోధనలవల్ల తేలింది.

రోజుకి శరీరానికి 2,500 కేలరీల శక్తిని యివ్వడానికి యీ క్రింది లెక్కలో ఆహారం తినాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

| | |
|---|---|
| ధాన్యములు | 16 ఔన్సులు |
| పప్పుదినుసులు | 3 ,, |
| చక్కెర | 2 ,, |
| కూరగాయలు | 6 ,, |
| పండ్లు | 2 ,, |
| నూనెలు | 2 ,, |
| పాలు | 8 ,, |

పైన చెప్పిన కొలతలో ఆహారం తినేవారికి, ఆహార సంబంధమైన జబ్బులేవీ రావడానికి అవకాశంలేదు. అయితే యీ ఆహారం తీసుకోవడంలో కూరగాయల విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనపరచాలి. వివిధములైన విటమినులుగల కూరగాయలను, ప్రతిరోజూ మారుస్తూ తింటూ వుండాలి. లేనట్లయితే, విటమిన్ల లోపంవల్ల వచ్చే జబ్బులు వస్తాయి.

## విటమినులు

మనిషికి శక్తినిచ్చే ఆహారపదార్థాలను విటమినులు అంటారు. ప్రతిమనిషి, తన ఆహారంలో యీ విటమినులన్నీ వుండేటట్టు చూసుకోవాలి. ఈ విటమినులు ఏమిటో, అవి లోపిస్తే ఏమి జబ్బులు వస్తాయో ఏ ఆహారంలో వున్నాయో మొదలైన వివరాలన్నీ యీ క్రింద యివ్వబడినవి.

విటమిన్ 'ఏ'—ఇది శరీరానికి దార్ఢ్యాన్ని యిచ్చి, రోగ క్రిములను ఎదుర్కొనే శక్తిని దేహానికి యిస్తుంది. విటమిను 'ఏ' లోపించిన వారికి నీరసము, శ్వాసావయవములకు సంబంధించిన జబ్బులు, కంటి

జబ్బులు, సరిగా యెదగక పోవడం, రేచీకటి, మొదలైన జబ్బులుకలుగు తాయి. ఈ విటమిన్ లోపించకుండా వుండాలంటే ఆకుపచ్చని కూర గాయలు, చేపలు, చేపనూనె, పాలు, వెన్న, మీగడ, పెరుగు, నెయ్యి, గ్రుడ్లు మొదలైనవి తినాలి.

విటమిన్ 'బి' 1— ఇది జీర్ణశక్తిని కాపాడే విటమిన్. ఇది ఆహారంలో లోపించినట్లయితే, మనిషికి అన్నంమీద ఏవగింపు పుట్టడం, తూకం తగ్గిపోవడం, జీర్ణశక్తి మందగించడం, గుండెజబ్బులు, అలసట, నరముల బలహీనత, నరముల కంపము, వంటికి నీరు పట్టడం మొదలైన జబ్బులు వస్తాయి. ఈ విటమిను ఎక్కువగా మజ్జిగలోనూ, మొక్క గట్టిన ధాన్యాలలోను, మేక కాలేయములోనూ, యీస్టులోను వుంది.

విటమిన్ 'బి'2—ఇది శరీరపు ఎదుగుదలకు అవసరమైనది. ఇది ఆహారంలో లోపించినట్లయితే, చర్మరోగాలు, నాలుకపూత, నోటిపూత, కడుపులో పుండ్లు, కడుపునొప్పి, అజీర్ణము, కళ్ళజబ్బులు వస్తాయి. ఇది ఎక్కువగావుండే ఆహార పదార్థాలు ఏమిటంటె, ఈస్టు, పాలు, ఆకుకూరలు, మాంసము, మేక కాలేయము, పప్పు దినుసులు.

విటమిన్ 'సి'—దీనిని సరిపడినంతగా తినకపోతే, 'స్కర్వీ' అనే జబ్బు వస్తుంది. జీర్ణశక్తి సరిగా వుండదు. ఈ విటమిను చాలా ఎక్కువగా ఉసిరికాయలోను, టొమటో పండ్లలోను వుంది. మామిడీ, నారింజ, బత్తాయి మొదలైన పండ్లలోకూడా తగినంతగా వుంది.

విటమిన్ 'డి'—శరీర దార్ఢ్యానికి ప్రధానమైనది. చిన్న పిల్లల ఆహారంలో యీ విటమిను లోపించినట్లయితే, వారికి దొడ్డికాళ్లు పడడం, ఎముకలు గట్టిగా వుండక బొత్తపడటం మొదలైన జబ్బులువస్తాయి. గర్భిణీస్త్రీలు ముఖ్యంగా యీ విటమినును ఎక్కువగా తినాలి. ఇది ఎక్కువగావుండే పదార్థాలు ఏమిటంటే: పాలు, వెన్న, నెయ్యి, పంచదార, చేపనూనె మొదలైనవి: అంతేగాక, కొంచెంసేపు ఎండలో నిలబడితే, శరీరంలో విటమిన్ 'డి' ఉత్పత్తి అవుతుంది.

పై చెప్పిన విటమినులుకాక, శరీరరక్షణకు ప్రొటీనుపదార్థములు, శరీర దార్ఢ్యానికి పిండి పదార్థములు, ఎముక గట్టితనానికి కాల్షియం (సున్నం), రక్తవృద్ధికి లోహము (ఇనుము), కూడా తగినంతగా ఆహారంలో వుండేటట్టు చూసుకోవాలి.

ప్రొటీను పదార్థములు: పాలు, మాంసము, చేపలు, పప్పుదినుసులు.

పిండిపదార్థములు: బియ్యము, గోధుమలు మొదలైన ధాన్యములు, అరటిపండ్లు,

కాల్షియం: ప్రధానంగా పాలు, ఆకుకూరలు, తమలపాకులలో వేసుకునే సున్నం.

లోహం: ఆకుకూరలు.

## తూనిక కొలతలు

మనదేశంలో, వివిధ సాంప్రదాయాలుగల భాషా ప్రాంతాలు ఎక్కువగా వున్నందుననూ, మొదటినుంచీ దేశమంతటికీ ఒక కేంద్ర ప్రభుత్వం లేనందువల్లనూ ఒక్కొక్క ప్రాంతం, ఒక్కొక్క పద్ధతిలో తూనిక కొలతలను వాడుకలోకి తెచ్చుకున్నది.

సరియైన తూనికలను, కొలతలను వాడుకలోకి తెచ్చేబాధ్యత ప్రభుత్వానిది. ఈ విషయంలో ఒక్క బొంబాయి ప్రభుత్వంవారు మాత్రం 1932 లో శాసనరూపంలో, రాష్ట్రమంతా వాడుకలో వుండ వలసిన తూనికలను, కొలమానికలను నిర్ణయించారు. మిగతా రాష్ట్రాల ప్రభుత్వాలు యీవిషయంలో శ్రద్ధ చూపలేదు. కేంద్రప్రభుత్వం కూడా ఈ విషయంలో జోక్యం కలిగించుకోనలేదు.

రైల్వే తూకం దేశమంతటా ఒకే పద్ధతిలో అమలులో వున్నప్పటికీ, ఏప్రాంతంలో వున్నవారు ఆ ప్రాంతంలో అనాదిగా వాడుకలో వున్న తూనికలనే యిప్పటికీ పాటిస్తున్నారు. దేశం అంతటా కూడా కొలతకూ, తూకానికి కూడా, శేరును అందరూ వాడుక చేస్తూ ఉన్నప్పటికీ ఆ శేరు బరువుగాని కొలతగాని ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క విధంగా వుంది.

### దశాంశపద్ధతి

దశాంశపద్ధతిని ఇంగ్లీషులో మెట్రిక్ సిస్టం అంటారు. ఈ పద్ధతిలో అన్నిమానాలు పదులరెట్లలో వుంటాయి. తూనికలకు గ్రాములలెక్క, కొలతలకు మీటరులెక్క ప్రాతిపదికగా వుంటుంది.

10 గ్రాములు, ఒక డెకాగ్రాము; 10 డెకాగ్రాములు, ఒక హెక్టాగ్రాము; 10 హెక్టాగ్రాములు, ఒక కిలోగ్రాము. ఇవి తూనిక లెక్కలు. ఒక కిలోగ్రాము ఒక శేరు, ఆరు తులాలు.

10 మిల్లిమీటర్లు, ఒక సెంటిమీటరు; పది సెంటిమీటర్లు, ఒక డెసిమీటరు; 10 డెసిమీటర్లు, ఒక మీటరు. ఇవి కొలత లెక్కలు, ఒక మీటరు, $39\frac{3}{8}$ అంగుళాలు.

ఈ పద్ధతి ప్రతి రాష్ట్రంలోనూ, ప్రతి సంవత్సరమూ కొన్ని జిల్లాలలో అమలు పెట్టడానికి ప్రభుత్వం నిశ్చయించింది. 1958 అక్టోబరు 1 తేదిన ప్రథమంగా ఈ పద్ధతి అమలులోకి వచ్చింది. ఆనాడు, ఆంధ్ర రాష్ట్రంలోని విశాఖపట్టణం, కృష్ణ, గుంటూరు, కర్నూలు, హైదరాబాద్, వరంగల్, నిజామాబాద్ జిల్లాలలో ఈపద్ధతి అమలుజరుపబడింది.

# వార్తా పత్రికలు

భరతఖండంలో మొట్టమొదటి వార్తాపత్రిక, కలకత్తాలో ఇంగ్లీషులో 1780 సంవత్సరములో స్థాపించబడింది. అప్పటినుంచి, యీ 178 సంవత్సరాలలోనూ, దేశంలో వార్తాపత్రికలు చాలా ఎక్కువగా వెలంవడ్డాయి. అన్ని రాష్ట్రాలలోనూ, అన్ని భాషలలోనూ దినపత్రికలు వున్నాయి. అంతేగాక, ప్రతిభాషారాష్ట్రానికిచెందిన పెట్టుబడిదారులూ, ఇంగ్లీషులో కూడా దినపత్రికలను చాలా ఎక్కువగా స్థాపించారు. 1957 డిసెంబర్ 31 నాటికి మనదేశంలో వార్తాపత్రికలు, తదితర పత్రికలు 5,932 పత్రికలు ఉన్నట్లు ప్రెస్ రిజిస్ట్రారుకు వివరాలు అందినవి. ఇవికాక మరొక 971 పత్రికలు వున్నట్లూ, వాటి వివరాలు తెలుసుకొనడానికి సాధ్యపడనట్లూ ప్రకటన జరిగింది.

1958 లో భారతదేశంలో ప్రచురింపబడిన పుస్తకములలో, భాషలవారిగా అధికసంఖ్యలో ప్రచురింపబడిన పుస్తకములసంఖ్యలు ఇవి: ఇంగ్లీషు, 12,422; హింది, 4,736; బెంగాలి, 1,643; గుజరాతి, 1825; మరాఠి, 1615; తమిళం, 1,230; తెలుగు, 1,093; సంస్కృతం, 292.

తెలుగు దిన పత్రికలు :

ఆంధ్రప్రభ - మదరాసు      నార్ల వెంకటేశ్వరరావు

| | |
|---|---|
| ఆంధ్రపత్రిక - మదరాసు | శివలెంక శంభుప్రసాద్ |
| గోలకొండపత్రిక-హైదరాబాద్ | సూకల నరోత్తమరెడ్డి |
| ఆంధ్ర జనత - ,, | కె. సుబ్రహ్మణ్యం |
| విశాలాంధ్ర - విజయవాడ | కె. రాజగోపాలరావు |

తెలుగు వార పత్రికలు :

| | |
|---|---|
| ఆంధ్రపత్రిక | శివలెంక శంభుప్రసాద్ |
| కృష్ణాపత్రిక | కమలాకర వెంకట్రావు |
| జనవాణి (నెల్లూరు) | గంగా రమణయ్య |

1957 డిసెంబర్ 31 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 230 పత్రికలు వున్నాయి. వీనిలో 16 దినపత్రికలు, 76 వారపత్రికలు, 115 మాసపత్రికలు. దినపత్రికలలో తెలుగుపత్రికలు 5; ఉర్దూ 7; ఇంగ్లీషు 2; హిందీ 1; మరాఠీ 1; వారపత్రికలలో తెలుగు 48; మాసపత్రికలలో తెలుగు, 71.

మదరాసునుంచి వెలువడే పత్రికలలో తెలుగు పత్రికల వివరాలు ఇవి: దినపత్రికలు, 2; వారపత్రికలు, 7; మాసపత్రికలు 26.

# రిజర్వు బ్యాంక్

ఇండియా రిజర్వు బ్యాంక్, 1934లో ప్యాసయిన రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఆక్టు ననుసరించి 1935 ఏప్రిల్ 1 తేదీన స్థాపించబడింది.

ఒకవాటా నూరేసి రూపాయలచొప్పున, మొత్తం అయిదు కోట్ల రూపాయల మూలధనంతో యీ బ్యాంకి స్థాపించబడింది. వాటాదార్లంత రూకూడా, పూర్తిగా తమ వాటా మొత్తములను చెల్లించారు. ఈవాటాలలో, 2,20,000 రూపాయలను కేంద్రప్రభుత్వం కొంది. మిగతా వన్నీ ప్రత్యేక వ్యక్తులు కొన్నారు. ఈ వాటాదార్లకు పంచి పెట్టే డివిడెండు నూటికి అయిదు రూపాయలకు మించకూడదని నిబంధన చేయబడింది. అయితే బ్యాంకిఖర్చులు మొదలైనవన్నీ పోగా డివిడెండు ఎంత యివ్వాలనేది కేంద్రప్రభుత్వం నిర్ణయిస్తారు. గత ఏడు సంవత్స

రాలలోనూ, యీ బ్యాంకి వాటాదార్లకు, నూటికి $3\frac{1}{2}$ రూపాయల డివి డెండు యివ్వబడినది.

ఈ బ్యాంకి పరిపాలనను సాగించడానికి, పరిశీలించడానికి ఒక సెంట్రల్ బోర్డు నియమింపబడుతుంది, దానిలో 16 మంది సభ్యులు. వీరిలో రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ ఒకరు. డిప్యూటీ గవర్నర్ ఒకరు. కేంద్రప్రభుత్వంచే నామినేట్ చేయబడిన డైరెక్టర్లు నలుగురు, వాటాదార్ల తరఫున ఎన్నుకోబడిన డైరెక్టర్లు ఎనిమిదిమంది, కేంద్రప్రభుత్వంచేత నామినేట్ చేయబడిన ప్రభుత్వోద్యోగి ఒకరు.

1935 ఏప్రిల్ 1 తేదీన, ఇది స్థాపించబడినప్పటినుంచీ, ఇండియాలో కరెన్సీనోట్లను జారీచెయ్యడం, గవర్నమెంటు డబ్బును దాచడం, మొదలైన పనులు యీ బ్యాంకికి అప్పగించబడినవి. 1953 జూలై 5 తేదీన, ఇండియాలోని షెడ్యూల్డు బ్యాంకులన్నీ తమ డిపాజిట్లను రిజర్వ్ బ్యాంకిలో నే వెయ్యడం జరిగింది.

ఈ బ్యాంకికిగల ఇతర ఆఫీసులు రెండురకాలు: బ్యాంకింగుశాఖ, కరెన్సీ జారీచేసేశాఖ. బ్యాంకింగుశాఖ ఆఫీసులు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మదరాసులలోను, కరెన్సీ జారీచేసేశాఖ (ఇస్యూడిపార్టుమెంటు) ఆఫీసులు బొంబాయి, కలకత్తా, మదరాసు, కాన్పూరులలోను ఉన్నాయి. బ్యాంకింగుశాఖ బ్రాంచి ఆఫీసు ఒకటి కాన్పూర్‌లోకూడావుంది. రిజర్వ్ బ్యాంకి ఆఫీసులు లేనిస్థలాలలో, దీనిపనినంతనూ స్టేట్ బ్యాంకి నిర్వహిస్తుంది.

ఇస్యూ డిపార్టుమెంటుద్వారా, ఇండియాలో చెలామణీ అయే కరెన్సీనోట్లు అన్నీ యీ బ్యాంకి జారీ చేస్తుంది. ఈ నోట్ల చెలామణికి కేంద్రప్రభుత్వం హామీ వుంటుంది. ప్రజలకు కావలసిననోట్లను నాణెములకు తగినంతగా చెలామణీలోకి తేవడానికి, యీ బ్యాంకి ఇస్యూ ఆఫీసులలో అన్ని విలువలలోనూ నోట్లున్నూ నాణెములున్నూ నిలువలో వుంచబడినవి.

ప్రధానంగా రిజర్వ్‌బ్యాంక్ ఇండియాకు కేంద్రబ్యాంకి అని చెప్పవచ్చును. ఇదిచేసే పనులు ఏమిటంటే: నోట్లను జారీచెయ్యడం; గవర్నమెంటుకు బ్యాంకరుగాను, డబ్బు విషయములో ఏజెంటుగాను,

సలహాదారుగాను పనిచెయ్యడం, ఇండియా తరఫున సంపాదించబడిన విదేశీయ కరెన్సీకి, విదేశాలలో ఇండియాకుగల డబ్బుకు ఒక కేంద్ర ఆవర్గాను తయారుచెయ్యడం : దేశంలోని అనేక బ్యాంకుల రిజర్వ్‌ధనాన్ని కాపాడడం, అవసరమైతే వాటికి అప్పుయివ్వడం.

రిజర్వ్‌బ్యాంకిని ప్రైవేటు వ్యక్తుల వాటా ఆధిపత్యంలోనుంచి ప్రభుత్వ యాజమాన్యంలోకి తీసుకోవాలనే (నేషనలైజ్ చెయ్యడం) ప్రజాభిప్రాయాన్ని అనుసరించి 1948 అంతంలో, యీ బ్యాంకిని నేషనలైజ్ చెయ్యడానికి చట్టాన్ని ప్యాసు చేశారు. 1949 జనవరి 1 నుంచి రిజర్వ్‌బ్యాంకి ప్రభుత్వసంస్థగా దేశీయమైపోయింది. దీనికి గవర్నర్ హెచ్. వి. ఆర్. అయ్యంగార్.

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

ఇంపీరియల్ బ్యాంకిని ప్రభుత్వబ్యాంకిగా మార్చడానికిప్రభుత్వం నిశ్చయించింది. అలా చెయ్యడానికి ప్రభుత్వానికి అధికారం ఇచ్చే శాసనం 1955 మే లో పార్లమెంటులో ప్యాసయింది. 1955 జూలై 1 నుంచి ఇంపీరియల్ బ్యాంకి, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అనే పేరుతో ప్రభుత్వపరమైంది. స్టేట్ బ్యాంకి డైరెక్టర్లబోర్డు చైర్మన్‌గా పి. సి. భట్టాచార్య 1957 ఫిబ్రవరిలో నియమింపబడినారు.

# కంపెనీలు

ఇండియాలో అనేక విధములైన వ్యాపారములను సాగిస్తున్న కంపెనీలు 1955 డిసెంబరు అంతానికి 29,948 వున్నాయి. ఈకంపెనీలలో పెట్టుబడి పెట్టబడిన మొత్తం రు. 1013 కోట్లు.

మొత్తం కంపెనీలలో పబ్లిక్ కంపెనీలు, 9976, ప్రైవేటుకంపెనీలు, 19,972 పబ్లిక్ కంపెనీలలో రు. 681 కోట్లు, ప్రైవేటు కంపెనీలలో రు. 332 కోట్లు పెట్టుబడి పెట్టబడింది.

కంపెనీల నిర్వహణలో, కంపెనీ డైరెక్టర్లుగాని, మేనేజింగ్ ఏజెంట్లుగాని కంపెనీ వాటాదారులకు అన్యాయం చెయ్యకుండా కంపెనీల నిర్వహణను పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వం 1956 లో చేసిన శాసనం ప్రకారం కేంద్రప్రభుత్వంలో ప్రత్యేకంగా ఒక కంపెనీల

శాసనం నిర్వహణశాఖ యేర్పాటు చేయబడింది. ఈశాఖ ఆర్థిక మంత్రి అధీనంలో వుంటుంది. ఈ శాఖ పరిపాలనా నిర్వహణకు, దేశాన్ని అయిదు మండలాలుగా విభజించి, ఒకొక మండలానికి ఒక ప్రాంతీయ డైరెక్టరును నియమించడం జరిగింది. ఒకొక రాష్ట్రానికి ఒక కంపెనీ రిజిస్ట్రారు వుంటాడు. మండలంలోని రాష్ట్రాల రిజిస్ట్రార్లు, ఆ మండల ప్రాంతీయ డైరెక్టరు అధికారానికి లోబడి వుంటారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రపు కంపెనీ రిజిస్ట్రారు కార్యాలయం హైదరాబాద్ నగరంలో వుంది. ఆంధ్రప్రదేశ్, కేరళ, మదరాసు, మైసూరు రాష్ట్రాలు నాలుగు కలిపి ఒక మండలం. ఈ మండలానికి దక్షిణ మండలం అని పేరు, ఈ మండల ప్రాంతీయ డైరెక్టరు కార్యాలయం మదరాసు నగరంలో వుంది.

కంపెనీల నిర్వహణలో కేంద్ర ప్రభుత్వానికి సలహా సంఘం 1956 ఏప్రిల్ 1 నుంచి నియమించబడింది.

# మెట్రిక్ మానం

దేశమంతటా దశాంశమానాన్ని, మెట్రిక్ మానాన్ని అనుసరించడానికి ప్రభుత్వం చేసిన నిర్ణయం ప్రకారం, వాతావరణ వివరాలను తెలియజెయ్యడంలో వర్షపాతాన్ని మిల్లిమీటర్లలోనూ, ఎండ వేడిమిని సెంటిగ్రేడ్ డిగ్రీలలోను, మేఘాల యెత్తును మీటర్లలోనూ ప్రకటించే పద్ధతి 1957 జనవరి 1 తేది నుంచి అమలు జరపబడింది.

రెండు దుక్కులు వర్షంపడితే, పూర్వం ఒక అంగుళం వాన అని ప్రకటించేవారు. ఇప్పుడు దానినే 25.4 మిల్లిమీటర్లు అంటారు.

అదే లెఖ్కలో అంగుళాలూ, సెంటిమీటర్ల కొలత ఇది : 1 అంగుళం : 2.54 సెంటిమీటర్లు; 1 గజం, 91.4 సెంటి మీటర్లు; 1 మైలు; 1.6 కిలో మీటర్లు.

పూర్వం వాడుకలో వున్న ఫారెన్‌హీట్ డిగ్రీలకు సమంగా, ప్రస్తుతం వాడుకలోవున్న సెంటిగ్రేడ్ డిగ్రీల లెక్కలు ఇవి:

| ఫారన్ హీట్ | సెంటిగ్రేడ్ |
|---|---|
| 12 | —10 |

| | |
|---|---|
| 20 | —0.6.7 |
| 32 | 0 |
| 40 | 4.44 |
| 50 | 10 |
| 60 | 15.56 |
| 68 | 20 |
| 80 | 26.67 |
| 86 | 30 |
| 100 | 37.78 |
| 104 | 40 |

## నాణెములు ; చెలామణి

మనదేశంలో కంపెనీప్రభుత్వం టంకసాలను ఏర్పరచి నాణెము అను తయారు చెయ్యడం 1757 లో జరిగింది. ఇలా తయారు చెయ్యబడిన మొట్టమొదటి రూపాయి 1757 ఆగస్టు 26 న పోత పొయ్యబడింది. అప్పటినుంచి నాణెములపోత మన దేశంలో విరివిగా జరుగుతున్నది. అత్యంత ఆధునికమైన పరికరాలతో ఒక కొత్త టంకసాల కలకత్తావద్ద ఆలిపూర్‌లో 1952 మార్చి 19 న ప్రారంభించబడింది. దీనిలో రోజుకు 8 గంటలలో 12 లక్షల నాణెములు తయారవుతవి.

ప్రస్తుతం, ఆలిపూర్, బొంబాయి, హైదరాబాద్ నగరాలలో మూడు టంకశాలలు వున్నాయి.

ఈ టంకశాలల్లో మనదేశానికి కావలసిన నాణెములను మాత్రమే కాక, ఆస్ట్రేలియా, సిలోన్, ఈజిప్టు, సౌదీ అరేబియా దేశాలకు కూడా నాణెములు తయారు చేయబడుతూ వుంటవి.

ప్రస్తుతము ఇండియాలో డబ్బు వ్యవహారానికి ప్రధాన నాణెము రూపాయి. రూపాయి నాణెరూపములోను, నోటురూపములోనూ చెలామణిలో వున్నది. రూపాయిని మించిన విలువగల నాణెము ఏమీ చెలామణిలో లేదు.

ఇండియాలో వాడుకలో వున్న నాణెములు : రూపాయి; అర్ధ

రూపాయి; పావలా (రూపాయిలో నాల్గవవంతు); బేడ (రూపాయిలో ఎనిమిదవ వంతు), అణా (రూపాయిలో పదహారవ వంతు); అర్ధణా (రూపాయిలో 32 వ వంతు): కాని (రూపాయిలో 64 వ వంతు); దమ్మిడీ (రూపాయిలో 192 వ వంతు).

## దశాంశ నాణెములు

1957 ఏప్రిల్ 2 తేదినుంచి కొత్త నాణెములు అమలులోకి వచ్చాయి. అప్పటినుంచీ, రూపాయికి 64 కానులుకాక, 100 పైసాలు వుంటాయి. ఒక పైసా, రెండు, అయిదు, పది పైసాల నాణెములు చెలామణీలోకి వచ్చాయి. రూపాయి, అర్ధ రూపాయి, పావలా నాణెములలో మార్పు వుండదు.

కొత్త నాణెముల వాడుక అందరికీ తెలిసి, దేశమంతా బాగా ప్రాకిపోయినదాకా, పాత నాణెములుగూడా మూడు సంవత్సరాలపాటు చెలామణిలో వుంటాయి. అంతవరకూ కొత్త పైసాలను నయాపైసా అంటారు.

ప్రపంచములోని ముఖ్యదేశాలలోని ప్రధాన నాణెములు, వాటికి రూపాయి మారకపురేటు వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి :

| దేశం | నాణెము | మారకంలో రూపాయి |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | డాలరు | 4.78 |
| కెనడా | డాలరు | 4.81 |
| బ్రజిల్ | క్రూజిరో | 1.709 |
| బెల్జియం | ఫ్రాంక్ | 0.705 |
| ఫ్రాన్సు | ఫ్రాంక్ | 0.078 |
| ఇటలీ | లీరా | 0.006 |
| హాలెండ్ | గిల్డర్ | 1.247 |
| ఇంగ్లండ్ | పౌను | 13.333 |
| జర్మని | మార్క్ | 0.333 |
| ఈజిప్టు | పౌను | 13.674 |
| జపాను | ఎన్ | 0.222 |
| సిలోన్ | రూపాయి | 1.03 |

| | | |
|---|---|---|
| ఆఫ్ఘనిస్థాన్ | రూపాయి | 0.253 |
| ఆస్ట్రేలియా | పౌను | 10.667 |
| పర్షియా | రియల్ | 0.103 |

## మరణసుంకాలు

ఒక వ్యక్తి చనిపోయినప్పుడు, అతని ఆస్తి వారసులకు పోతూ వుండగా దానిమీద విధించడానికి ప్రభుత్వంవారు నిర్ణయించిన ఎస్టేటుపన్ను, లేక మరణసుంకాలకు సంబంధించిన చట్టం, 1953 అక్టోబరు 1 నుంచి అమలులోకి వచ్చింది.

ఈ చట్టం ఒక్క జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో తప్ప తక్కిన దేశం అంతటా అన్ని రాష్ట్రాలలోను చెల్లుబడి అవుతుంది. భారత దేశంలో వున్న సర్వమైన స్థిరచరాస్తులకు ఇది అనువర్తిస్తుంది. దేశాంతరాలలోవున్న స్థిరాస్తులపట్ల అనువర్తించకపోయినా, ఈ దేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొనివున్న ఎవరికి విదేశాలలో ఎట్టి చరాస్తులున్నా, వాటికి ఇది వర్తిస్తుంది.

వారసులయొక్క దూరపు దగ్గర తనాలను, వారసత్వపు పరంపరలోని తారతమ్యాన్ని గణించి, ఆ తారతమ్యాలను మెట్లుగా తీసుకొని ఈ పన్ను విధిస్తారు. ఇందులో మొదటి మెట్టు 50 వేల రూపాయలుగా నిర్ణయించబడింది. ఈ మెట్టులోపల వున్నవారి ఆస్తులకు పన్ను వుండదు.

ఆస్తి హక్కుదారులు ఒకరి తరువాత ఒకరుగా వెంట వెంటనే చనిపోవడం జరిగి, ఒకే ఆస్తికి 5 సంవత్సరాల్లోపల వారసత్వ పారంపర్యం ఏర్పడే పక్షంలో ఈ పన్నును మొదటి సంవత్సరంలో అయితే నూటికి 50 వంతులు, రెండో సంవత్సరంలో అయితే నూటికి 30 వంతులు, మూడో సంవత్సరంలో అయితే నూటికి 20 వంతులు, నాల్గో సంవత్సరంలో అయితే నూటికి 10 వంతులు తగ్గిస్తారు. ఒక వ్యక్తి మరణించిన వెనుక, ఆ ఆస్తి సంక్రమించిన వ్యక్తికూడా మొదటి వ్యక్తి మరణించిన మూడు నెలలలోగా మరణిస్తే, ఈ రెండు చావులు ఒక్క చావుక్రిందనే గణిస్తారు.

ఒక వ్యక్తి చనిపోతే, ఆ వ్యక్తి ఆస్తి ఎవరెవరికి సంక్రమిస్తుందో

వారంతా ఈ పన్నును చెల్లించాలి. ఆయా వారసులకు ఎంత ఎంత ఆస్తి వస్తుందో, ఆ ఆస్తి సగటు విలువనుకట్టి దానిమీద ఈ పన్నును లెక్కి స్తారు. ఆ ఆస్తి అట్టి వారసులకు దక్కిందా, లేదా అనే విషయం అధికారులకు అనవసరం. తన అజాగ్రత్తవల్ల ఆ వారసుడు ఆ ఆస్తిని దక్కించుకోలేకపోయినా పన్నును చెల్లించి తీరవలసిందే.

ఈ పన్నును, ఆ ఆస్తులు సంక్రమించినవారు, ఖామందు చనిపో యిన ఆరు నెలలలోగా చెల్లించాలి. ఈ లోపల ఈ పన్నుపడే ఆస్తులు ఏమేమి తమకు సంక్రమిస్తున్నాయో, వాటికి అన్నింటికి చెందిన స్టేటు మెంటును తీసుకుపోయి కంట్రోలరుకు దాఖలు పరచాలి. ఖామందు చచ్చిన రోజునుంచి ఆ పన్నును లెక్క కడతారు. అయితే పన్ను చెల్లింపును అవసరమనుకుంటే కంట్రోలరు వాయిదా వేయవచ్చు. ఈ వారసులు దాఖలు పరుచుకొన్న స్టేటుమెంట్లు సవ్యంగా వున్నాయో, అపసవ్యంగా ఉన్నాయో పరిశీలనచేసేందుకు ఎటువంటి వ్యవహార పత్రాల నైనా తనకు చూపించవలసిందని కోరే అధికారం కంట్రోలరుకు వుంది.

ఈ పన్ను ఎంతో, నిర్ణయించిన అనంతరం ఆ పన్నును కట్టవలసి వున్న వ్యక్తులకు డిమాండు నోటీసు పంపిస్తారు. పన్ను ఎంత కట్టాలి, ఎంత కాలంలో కట్టాలి, ఎవరికి కట్టాలి అన్నీ అందులో వుంటాయి. ఈ పన్ను కట్టేవాళ్ళు, ఒక ఆస్తికి సంబంధించి ఒకళ్ళకన్న ఎక్కువ వున్న ట్లయితే ఈ పన్నును సమిష్టిగా చెల్లించవచ్చు, లేక వేరు వేరుగాను చెల్లించవచ్చు.

కంట్రోలరు నిర్ణయించిన పన్నుగాని, పెనాల్టీగాని లేక ఆస్తి విలువగాని సరిగ్గా లేదనుకుంటే కేంద్ర రెవిన్యూ బోర్డుకు 90 రోజుల లోగా అప్పీళ్లు చేసుకోవచ్చు. ఆస్తి విలువను లెక్క కట్టడంలోనే తగాదావస్తే, ఆ తగాదాను మధ్యవర్తుల నిర్ణయానికి పెడతారు. బోర్డు వారి నిర్ణయాల్లోగూడా దొసగులు వున్నట్లు కన్పిస్తే, వాటిని హైకో ర్టుకు పంపవలసిందని, అట్టి నిర్ణయాలు వచ్చిన అనంతరం 90 రోజుల్లోగా బోర్డువారినే కోరాలి. అందుకు 100 రూపాయలు రుసుము కట్టుకోవాలి. బోర్డువారి నిర్ణయం బాగుండకపోతే వారసులు హైకోర్టులో అప్పీలు చేసుకోవచ్చు. అయితే అట్టి అప్పీళ్లకు హైకోర్టు అనుమతించాలి.

ఈ పన్ను విధించేటప్పుడు, దాన్ని ఎట్లా నిర్ణయించాలో తేల్చేందుకుగాను, చనిపోయిన వ్యక్తి స్థిర చరాస్తులను రెండింటిని కలిపి ఒకే ఎస్టేటుగా లెక్క కడతారు. ఇటువంటి ఆస్తి స్వార్జితమైనదైనా, కాకపోయినా, సంక్రమించినదైనా, సంక్రమించింది కాకపోయినా, మొత్తం అంతటిమీదా పన్ను వేస్తారు.

ఆస్తి అన్న పదము అర్థాన్ని ఈ శాసనం ఈ క్రింది విధంగా వివరిస్తున్నది :

(1) స్థిరాస్తులు, చరాస్తులు, (2) వీటి అమ్మకంవల్ల వచ్చిన మొత్తాలు, (3) రెండో అంశంలో పేర్కొనబడిన మొత్తాలను నగదుగావుంచినా, లేక పెట్టుబళ్లు పెట్టినా. అవీ, (4) ఈ ఆస్తుల్లో స్థిరాస్తిని చరాస్తిగా మార్చినా, చరాస్తిని స్థిరాస్తిగా మార్చినా' అట్లా మార్చిన ఆస్తులు. (5) వడ్డీలు, ఇచ్చిన అప్పులు, పుచ్చుకొన్న ఋణములు, మొదలైనవి.

ఆస్తులలో కొన్ని రకాల ఆస్తులు మృతుని తదనంతర సంక్రమించనివి వున్నాయి. అట్టివాటిమీద పన్ను వుండదు. అవి ఇవి : (1) మృతుడుగాని, మరి యెవ్వరుగాని ఒక ఉద్యోగాన్ని చేస్తూవున్నందువల్ల, దానాలు పట్టినందువల్ల, పెత్తందారీ తనం నెరపినందువల్ల వచ్చే ఆదాయం. (2) మృతుడు ధర్మకర్త మాత్రం అయిన ఆస్తి, ఇట్టి ఆస్తిలో కొంత ఆస్తిని అమ్మి, దానికిగూడా యీ మృతుడే ధర్మకర్త అయివుంటే ఆ ఏర్పాటు ఈ మరణానికి ముందు రెండు సంవత్సరాలక్రితం జరిపినదై వుండాలి. పూర్తి ధర్మకర్తృత్వం అయితే 5 సంవత్సరాలు గడవు : (3) ఆస్తి ఏదన్నా తనకు సంక్రమిస్తే, అది తన హక్కు భుక్తాలలోనికి రాకపోయినట్లయితే, దానిమీదగూడ పన్ను వుండదు. (4) మృతునికి ఒకరు రాసి యిచ్చిన ఆస్తిమీద హక్కు మరణం అనంతరం ఆ వ్రాసి యిచ్చినవారి పరం అయినప్పుడు. (5) ఒక ఆస్తియొక్క అదాయాన్ని అనుభవించడాన్ని గూర్చి భార్యాభర్తలు నా అనంతరం, నా అనంతరం అని పరస్పరం వ్రాసుకోగా, ఒకరు చనిపోగా మిగిలిన భార్యో, భర్తో, దాన్ని అనుభవిస్తుంటే అది. చట్టం అమలులోకి వచ్చిన తర్వాత ఇట్లా వ్రాసుకొన్న ఏర్పాటువున్నా, రాకముందు వ్రాసుకొన్న ఏర్పాట్లువున్నా

ఈ పన్ను ఆస్తులకు పట్టదు. (6) ఆస్తిని అమ్మితే, ఆ అమ్మిన ఆస్తినగదు (7) ఎటువంటి షరతులు లేకుండా చేసిన దానాలు వుంటే అవి.

ఈ పన్ను విధించడానికి మరణించిన వ్యక్తియొక్క స్థిరచరాస్తుల నన్నింటని గుదిగూర్చి, ఆ మొత్తం ఆస్తి విలువ రొక్కపు విలువలో ఎంత అని తేలుస్తారు.

ఒకవేళ ఆస్తికామందు చనిపోయిన కొద్దిరోజుల్లోగా, ఆ ఆస్తిని అమ్మి డబ్బు చేసినట్లయితే, ఆ అమ్మినందుకయిన ఖర్చులను కట్టుకోకుండానే, వచ్చిన మొత్తాన్నంతా ఆస్తిగా నిశ్చయిస్తారు.

ఈ మరణసుంకాన్ని నిర్ణయించేప్పుడు కొన్ని కొన్ని ఋణాలను, ఖర్చులను ఆస్తిలోనుంచి మినహాయించవలసి వుంటుంది. ఆ మినహాయించడం ఎట్లా మినహాయించాలో ఎంత ఎంత మినహాయించాలో ఈ శాసనం స్పష్టంగా పేర్కొంటున్నది.

(1) కర్మకుఅయ్యే ఖర్చులు ; ఇవి రు. 1000కి మించకూడదు. (2) ఋణాలు మొదలైనవి. (3) స్త్రీ ధనం ; భరణం మొదలైనవి. వీటిలో ఏవీ 5 వేలకు మించి వుండకూడదు. (4) విదేశాలలో ఆస్తి ఏదన్నా వుంటే. దాన్ని చూసుకునేందుకు గాని, లేకపోతే అమ్మి సొమ్మును తెచ్చుకునేందుకు గాని అయ్యే ఖర్చులు. ఈ ఖర్చులు విదేశాల్లో వున్న ఆస్థిలో నూటికి 5 వంతులకు మించకూడదు. (5) మృతుడు చనిపోకముందు కట్టవలసివున్న పన్నులు అతడు కట్టకుండా చచ్చిపోతే ఆ మొత్తాలనుగూడా ఋణాలక్రింద పరిగణించి, ఆస్తిలోంచి తీసి వేస్తారు.

ఇవి కాక ఈ పన్ను వెయ్యని సందర్భాలు కూడా మరికొన్ని వున్నాయి. ఆస్థి విలువకట్టేటప్పుడుమాత్రం అందులో వూరికే చేరుస్తారు. పన్నుయొక్క రేటును నిర్ణయించటంకోసం అట్లా చేస్తారుగాని ఆ మొత్తాలమీద పన్ను వెయ్యరు. అవి ఇవి : (1) చనిపోయే ముందు ధర్మం చేయడంకోసం చేసిన దానాలు. ఈ దానాలు మరణానికి ముందు ఆరు నెలలలోపున చేసినవై వుండాలి. రు, 2500 లకు మించకూడదు (2) చచ్చేలోపల రెండుసంవత్సరాలలోపల చేసిన ఇతర దానాలు; ఇవి 1500 రూపాయలకు మించకూడదు. (3) మరణసుంకాన్ని చెల్లించ డానికని

ఇన్సూరెన్సు పాలసీ మొత్తాలను వినియోగిస్తే, ఆ మొత్తాలమీద గూడా పన్ను వెయ్యరు. ఇది 50 వేల రూపాయలవరకు చెల్లుతుంది. (4) మృతుని ఇన్సూరెన్సు పాలసీ మొత్తాలలో 5 వేల మేరకు పన్ను విధించరు. అంటే ఆ మొత్తంలో 5 వేలను వదలి, మిగతా పై మొత్తంమీద పన్ను వేస్తారు. (5) మరణసుంకం చెల్లించడానికని గవర్నమెంటుదగ్గర దాచుకున్న డబ్బుమీద గూడా పన్ను వెయ్యరు. ఇందుకు గూడా 50 వేల రూపాయలు పరిమితి. (6) మృతుడు తనమీద ఆధారపడివున్న చుట్టాలలో స్త్రీల విషయమై పెళ్ళికని, లేకపోతే వాళ్ళ జీవనంకోసం అని ఇన్సూరు చేసివుంటే ఆ మొత్తాలు; అయితే, ఇవి ఒక్కొక్కరికి ఐదేసి వేలకు మించి చేయకూడదు. చేస్తే ఆ అయిదువేలను మినహాయించి తక్కిన మొత్తాలమీద ప్రతి సందర్భంలోను పన్ను వేస్తారు.

### వసూళ్లు

1954-55 నుంచి దేశంలో వసూలయిన మరణ సుంకాల వివరాలివి :

1954-55 : రు. 85,14,416; 1955-56 : రు. 1,73,26,765; 1956-57 : రు. 2,10,75,135.

## ఇన్ కంటాక్స్

1959 ఫిబ్రవరి 28 తేదిన ప్రతిపాదింపబడిన ఆర్థిక శాసనం ప్రకారం యీ క్రింద వివరింపబడిన రేట్లలో ఇన్ కంటాక్స్ (ఆదాయపు పన్ను) వసూలు చేయబడుతుంది. ఈ రేట్లు 1959 ఏప్రిల్ 1 నుంచి 1960 మార్చి 31 వరకు వచ్చిన ఆదాయంమీదవసూలుచేసే పన్నురేట్లు.

వివాహితుడై, సంతానంలేని వ్యక్తి మొత్తం ఆదాయంలో

(1) మొదటి రు. 3,000 మీద: పన్ను లేదు
(2) తరువాతి రు. 2,000 మీద: రూపాయికి 3 నయాపైసలు
(3) తరువాతి రు. 2,500 మీద: రూపాయికి 6 నయాపైసలు
(4) తరువాతి రు. 2,500 మీద: రూపాయికి 9 నయాపైసలు
(5) తరువాతి రు. 2,500 మీద: రూపాయికి 11 నయాపైసలు

(6) తరువాతి రు. 2,500 మీద: రూపాయికి 14 నయాపైసలు

(7) తరువాతి రు. 5,000 మీద: రూపాయికి 18 నయాపైసలు

(8) తరువాతి మొత్తంమీద, రూపాయికి 25 నయాపైసాలు

వివాహితుడై, ఒక సంతానంగల వ్యక్తికి పన్నులేని మెట్టు రు. 3,300. తరువాత, రు. 1,700 ల మీద రూపాయికి మూడు నయాపైసాలు. ఆ పైన ఆదాయానికి పైన చెప్పిన రేట్లు.

వివాహితుడై, ఒకరి కన్న ఎక్కువ బిడ్డలుగల వ్యక్తికి పన్ను లేని మొదటి మెట్టు రు. 3,600. తరువాత రు. 1,400 ల మీద రూపాయికి మూడు నయాపైసాలు. ఆపైన ఆదాయంమీద, పైన చెప్పినరేట్లే.

అవివాహితుడైన వ్యక్తి సంపాదనలో పన్ను లేని మొదటిమెట్టు రు. 1000; ఆ తరువాత రు. 4,000 ల మీద రూపాయికి 3 నయాపైసాలు. తక్కిన సంపాదనమీద పైరేట్లే.

అయితే, వ్యక్తి సంపాదన ఏడాదికి రు. 3,000 లకు మించనట్లయితేనూ, హిందూ అవిభక్త కుటుంబపు సంపాదన రు. 6,000 మించనట్లయితేనూ, ఆ సంపాదనలమీద అసలు పన్ను కట్టనక్కరలేదు.

ఏడాదికి రు. 20,000 లకు పైగా ఆదాయం వచ్చేవారు. తమ సంపాదనమీద సూపర్‌టాక్స్, సర్ చార్జికూడా ఇచ్చుకోవాలి. వీరు ఇవ్వవలసిన ఇన్‌కంటాక్స్‌పన్నురేట్లు, అవివాహితులైన వ్యక్తులు ఇవ్వవలసిన పన్ను రేట్లలో వుంటాయి.

1958 మార్చి 31 తో అంతమయిన ఆర్థిక సంవత్సరంలో, ఆదాయపు పన్ను వసూలు రు. 216 కోట్ల 51 లక్షలు.

## రాష్ట్రాలకు పంపిణీ

ఇండియాలో కేంద్రప్రభుత్వం వసూలుచేసే పన్నులలో కేంద్ర ప్రభుత్వం ఎంత తీసుకోవాలో, ఏఏ రాష్ట్రానికి ఎంత పంచిపెట్టాలో ఏఏ రాష్ట్రానికి ఎంత గ్రాంటును కేంద్ర ప్రభుత్వం ఇవ్వాలో మొదలైన విషయాలను గురించి కేంద్ర ప్రభుత్వానికి సలహా యివ్వడానికి ఇండియన్ ఫైనాన్స్ కమిషన్ 1956 జూన్‌లో నియమించబడింది. ఈ కమిషన్ సభ్యుల పేర్లు ఇవి:

చైర్మన్ : కె. సంతానం; సభ్యులు: ఉజ్జలసింగ్, లక్ష్మీశంకర్ మిశ్ర, ఎం. వి. రంగాచారి, డాక్టర్ బి. ఎన్. గంగూలి.

ఈ కమిషన్ నివేదిక 1957 నవంబర్ 15 న ప్రకటించబడింది.

కేంద్రప్రభుత్వం వసూలుచేసే పన్నులను యీ క్రింద వంతులలో పంచవలసిందని కమిషన్ సూచించింది.

ఇన్‌కంటాక్స్ వసూలు మొత్తంలో నూటికి 40 వంతులను కేంద్ర ప్రభుత్వం తీసుకొని, మిగతా60వంతులను యీక్రిందివంతులలో ఆయా రాష్ట్రాలకు పంచుతుంది. ఆంధ్రప్రదేశ్, 8.12; ఆసాం, 2.44; ఉత్తర ప్రదేశ్. 16,36; ఒరిస్సా. 3.73; కాశ్మీర్, 1.13; కేరళ, 3.64 పంజాబ్, 4,24; పశ్చిమబెంగాల్ 6.03; బీహార్, 9.9 ; బొంబాయి, 15.57; మదరాసు, 8.40; మధ్యప్రదేశ్, 6.72; మైసూర్, 5.14; రాజస్తాన్, 4.09.

పైన చెప్పినదికాక ఎస్టేట్‌డ్యూటీ, రైల్వే చార్జీలపై వేసే పన్నులు, ఎక్సైజు డ్యూటీలలోకూడా రాష్ట్రాలకువంతులు ఇవ్వబడినవి. ఆ ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు రు. 4 కోట్ల గ్రాంటు, ఎస్టేట్ డ్యూటిలో నూటికి 8.78 వంతులు, రైల్వే చార్జీలపై పన్నులలో నూటికి 8.86 వంతులు, ఎక్సైజ్ డ్యూటినుంచి రు. 205 లక్షలు యివ్వబడుతవి.

## జాతీయ ఆదాయం

భారతదేశంలో ప్రజల మొత్తం ఆదాయం, 1951-52 లో రు. 9990 కోట్లు; 1952-53 లో రు. 9860 కోట్లు; 1953-54 లో రు. 10,600 కోట్లు; 1954-55 లో రు. 10,200 కోట్లు; 1955-56 లో రు. 10,400 కోట్లు అని ప్రకటించబడింది. ఈ లెక్క ప్రకారం, ప్రజల సగటు ఆదాయం, 1951-52 లో రు. 274 అనీ, 1952-53 లో రు. 267 అనీ, 1953-54 లో రు. 282 అనీ 1954-55 లో రు. 271.9 అనీ, 1955-56 లో రు. 272.1 అని తేలింది.

## విదేశీ పెట్టుబడులు

భారతదేశంలోని పరిశ్రమలలో విదేశీయుల పెట్టుబడి ఇటీవల

ఎక్కువగా పెరిగింది. ఇలాటి పెట్టుబడులు 1948 లో రు. 287 కోట్ల 7 లక్షలు కాగా, 1955 లో రు. 487 కోట్ల 7 లక్షలు.

# నేషనల్ సేవింగ్సు

ప్రతి వ్యక్తి తాను సంపాదించేదానిలో కొంత డబ్బు, ముందు అవసరానికిగాని, వృద్ధాప్యానికిగాని దాచుకోవడం అలవాటు చేసుకోవాలి. అలా దాచుకున్న డబ్బును, అది వృద్ధిపొందే పద్ధతిలో, అసలుకి నష్టంరాకుండా పెట్టుబడిగా వినియోగించడం, జాగ్రత్తగలవారు చెయ్యవలసిన పని. అలా పెట్టుబడి పెట్టడం మూడు విధాలు. మంచి పద్ధతుల మీద నడపబడుతున్న బ్యాంకిలలో దాచుకోడం; ఇన్సూరెన్సు చెయ్యడం, నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనడం. బ్యాంకిలలో డబ్బు దాచుకోవడం విషయమై వివరాలను ఏ బ్యాంకి మేనేజరును అడిగినా చెపుతాడు. ఇన్సూరెన్సు వివరాలను, ఏ ఇన్సూరెన్సు ఏజెంటును అడిగినా చెపుతాడు. నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ల వివరాలు ఇవి:

నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు కొనడం అంటే, డబ్బును గవర్నమెంటువద్ద దాచుకోడం అన్నమాట. ఇలా దాచుకున్న డబ్బుకు అయిదేళ్లు దాచుకుంటే నూటికి ఏడాదికి మూడు రూపాయలవంతున ఏడేళ్లు దాచుకుంటే నూటికి $4\frac{1}{4}$ వంతున వడ్డి యిస్తారు. అయితే యీ సర్టిఫికెట్లను ఎన్ని సంవత్సరాల గడువుకు కొంటే అన్ని సంవత్సరాలూ అలాగే వుంచనక్కరలేదు. అవసరం కలిగినట్లయితే, గడువులోపలనే వాటిని మార్చుకోవచ్చును. అప్పటివరకు అయిన వడ్డితో సహా తమ డబ్బు తాము తీసుకొనవచ్చును.

ఈ సర్టిఫికెట్లు రు. 5; 10; 100; 1,000, 5,000 విలువలో, సేవింగ్సు బ్యాంకిగల ఏ పోస్టాఫీసులోనైనా దొరుకుతవి.

ఒక వ్యక్తి తన పేరుమీద, 2,500 రూపాయల విలువగల సర్టిఫికెట్లను కొనవచ్చును. ఈ సర్టిఫికేట్లమీద కూడే వడ్డిమీద ఇన్కంటాక్సులేదు.

# ఇన్సూరెన్సు

ఇన్సూరెన్సు వ్యాపారంలో, జీవిత భీమా వ్యాపారం చేస్తున్న

కంపెనీ లన్నిటినీ, 1956 జనవరి 19 తేదిన, కేంద్ర ప్రభుత్వం స్వాధీన పరచుకున్నది. ఆ తేదినుంచి, జవిత భీమా వ్యాపారం కేంద్ర ప్రభుత్వాధికారంలో జరుగుతున్నది.

తన స్వాధీనంలోకి తీసుకొన్న జీవిత భీమా వ్యాపారాన్ని సక్రమంగా నిర్వహించడానికీ, దానికి సంబంధించిన పరిపాలనను సంపూర్ణంగా నిర్వహించడానికీ లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనే సంస్థను కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ కార్పొరేషను 1956 సెప్టెంబరు 1 తేదినుంచి అమలులోకి వచ్చింది. ఇన్సూరెన్సు కార్పొరేషన్ చైర్మన్, పి. ఎ. గోపాలకృష్ణన్.

ఇన్సూరెన్సు వ్యాపారం సాగించడంలో, ఇండియా అయిదు ప్రాంతాలుగా విభజించబడింది. ఆ ప్రాంతాల (జోనల్) ఆఫీసులు వుండే నగరాలు ఇవి : మధ్య ప్రాంతం, కాన్పూర్ ; తూర్పు ప్రాంతం, కలకత్తా; దక్షిణ ప్రాంతం, మదరాసు ; పశ్చిమ ప్రాంతం, బొంబాయి; ఉత్తర ప్రాంతం, ఢిల్లి.

ఈ ప్రాంతీయ ఆఫీసులకు లోబడి, దేశంలో మొత్తం 83 డివిజనల్ ఆఫీసులు, 180 బ్రాంచిలు వుంటాయి.

దక్షిణ ప్రాంతానికి లోబడిన డివిజనల్ ఆఫీసులు ఈ క్రింది స్థలాలలో వుంటాయి : బెంగుళూరు, ఉడిపి, కోయంబత్తూరు, మధుర, త్రివేంద్రం, హైదరాబాద్, మచిలీపట్టణం.

ఆంధ్ర ప్రదేశ్, కేరళ, మదరాసు, మైసూరు రాష్ట్రాలు నాలుగూ, దక్షిణ ప్రాంతంలోకి వస్తాయి. ఈ ప్రాంతంలోని 8 డివిజనల్ అఫీసులకు లోబడి, 43 బ్రాంచి ఆఫీసులు వుంటాయి.

ప్రతివారు గమనించవలసిన ముఖ్యాంశాలు ఏమిటంటే :

తన జీవితంమీద ఎంతో కొంత విలువ వుండడంకోసం, తనశక్తిని బట్టి, కనీసం వెయ్యిరూపాయలకైనా ఇన్సూరెన్సు చెయ్యాలి.

అలవాటు తప్పకుండా నియమితకాలానికి, తాను చెల్లించవలసిన డబ్బును చెల్లించాలి;

ఇన్సూరుచేసిన వెంటనే, తన వయస్సును గురించిన దాఖాలాను పంపి, ఆ విషయంలో సందేహంలేకుండా చూచుకోవాలి.

పరిమితకాలంలో తాను చనిపోయినట్లయితే, తన ఇన్సూరెన్సు డబ్బును తన కుటుంబంలో ఎవరికియియ్యాలో ముందుగానే తెలియపరచుకోవాలి.

1957 లో రు. 281 కోట్ల 90 లక్షలు. 1958లో రు. 313 కోట్ల 85 లక్షలు విలువగల ఇన్సూరెన్సు పాలిసీలు జారీ చేయబడినవి.

# ఫిలిం పరిశ్రమ

భారతదేశంలో ఫిలిం పరిశ్రమకు పునాది వేసిన వ్యక్తి డి. జి. ఫల్కే: 1913 సంవత్సరములో ఇతడు తీసిన రాజా హరిశ్చంద్ర అనేది, మన దేశంలో మొట్టమొదట తయారైన ఫిలిం. తరువాత ఫిలిం పరిశ్రమను ఇంకా అభివృద్ధిలోకి తెచ్చినవారు, బాబూరావు పెయింటర్.

1913 నుంచీ 1930 వరకు 17 సంవత్సరాలు, మన దేశంలో తయారైన చిత్రాలన్నీ 'మూక' చిత్రాలేగాని, టాకీలు లేవు. టాకీలు తియ్యడం విదేశాలలో 1926 లోనే ప్రారంభమైనప్పటికీ, మనదేశంలో మొట్టమొదటి టాకీ 1931 లోగాని, తయారుకాలేదు. ఈ చిత్రం పేరు 'ఆలం ఆరా', దీనిని అర్దేషిర్ ఇరాని, కొంత మన దేశంలోనూ, కొంత ఇంగ్లండులోనూ తీశాడు. అప్పటినుంచీ, టాకీ ఫిలుములు మన దేశంలో విస్తారంగా తయారవుతూనే వచ్చాయి.

1931 లో మొట్టమొదటి తెలుగు టాకీ, ప్రహ్లాద. దీనికి డైరెక్టర్ హెచ్. ఎం. రెడ్డి. అప్పటినుంచి 1958 అంతానికి మొత్తం 478 తెలుగు చిత్రాలు తయారయాయి. 1958 లో తయారయిన తెలుగు చిత్రాలు 31.

1958 ఆఖరు నాటికి, భారతదేశంలో 255 ఫిలిం నిర్మాణసంస్థలు 900 డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు, 63 స్టూడియోలు, 29 లేబరేటరీలు వున్నాయి. ఫిలిం పరిశ్రమలో పనిచేస్తున్నవారి సంఖ్య దాదాపు లక్ష. ఫిలిం కంపెనీల ఆదాయం ఏడాదికి సుమారు 25 కోట్ల రూపాయలు.

1956 అంతానికి దేశంలోవున్న సినిమా హాలుల సంఖ్య 3,829. వీనిలో టూరింగు సినిమాలు, టెంపొరరీ సినిమాలు 999. సినిమాలను చూసే ప్రేక్షకుల సంఖ్య ఏడాదికి మొత్తం రు. 60 కోట్లు.

దేశంలో తయారయిన ఫిలిములలో నూటికి 47 వంతులు బొంబాయి లోను, 33 వంతులు మదరాసులోను, 20 వంతులు కలకత్తాలోను తయారైనవి.

1958 లో తయారయి విడుదలపొందిన చిత్రాల పేర్లు ఇవి: కొండవీటిదొంగ, ఎత్తుకుపైఎత్తు, అన్నదమ్ములు, బొమ్మలపెళ్లి, శ్రీకృష్ణ గారడి, భూలోకరంభ, గంగాగౌరి సంవాదము, భూకైలాస్, రామ భక్తహనుమాన్, చెంచులక్ష్మి, శోభ, రామాంజనేయ యుద్ధం, వీర ఖడ్గం, ఉత్తమ ఇల్లాలు, వీరప్రతాప్, మహాదేవి, బడిపంతులు, దొంగ లున్నారు జాగ్రత్త, ముందడుగు, రాజనందిని, ఆడపెత్తనం, పతిభక్తి, మంచిమనసుకు మంచిరోజులు, విజయకోట వీరుడు, కార్తవరాయనికథ, అత్తా ఒకింటి కోడలే, ఇంటిగుట్టు, పులిచేసినపెళ్లి, శ్రీకృష్ణలీలలు, పార్వతీకళ్యాణం, పెళ్లినాటి ప్రమాణాలు.

ఫిలిం సెన్సార్ బోర్డు:

ప్రభుత్వంవారు నియమించే సంస్థ. ఈ బోర్డు సర్టిఫికేటు ఇస్తేనే కాని దేశంలో ఏ ఫిలిమునూ ప్రదర్శించకూడదు. ప్రతి ఫిలిమూ నిర్మాణం పూర్తి అయిన తరువాత, దానిని యీ బోర్డులోని సభ్యులు కొందరు ముందుగా చూస్తారు. ఆ ఫిలిములో అసభ్యసంభాషణలుగాని, సన్నివేశాలుగాని వున్నట్టయితే, దానిని ప్రదర్శించడానికి అనుమతి ఇయ్యకూడదని ఆ సభ్యులు సూచిస్తారు. ఇలాంటి సెన్సారు బోర్డులు 1951 జనవరి 15 పూర్వం ప్రతి రాష్ట్రంలోనూ వుండేది.

ప్రతి రాష్ట్రములోను ఒక్కొక్క సెన్సారుబోర్డు వుండడంకన్న దేశానికంతకూ ఒకే సెన్సార్‌బోర్డువుంటే మంచిదనే ఉద్దేశంతో, అలాటి సెన్సార్‌బోర్డును ఏర్పాటు చేయడానికి ఇండియా ప్రభుత్వం ఒక చట్టాన్ని 1951 జనవరి 15 నుంచి అమలులో పెట్టారు.

ఈ బోర్డు ఆఫీసు బొంబాయిలో వుంటుంది.

ఈ బోర్డు అధికారావికి లోబడి పనిచేసే ప్రాంతీయ కార్యాలయాలు మదరాసులో ఒకటి. కలకత్తాలో ఒకటి వుంటాయి.

మదరాసుఆఫీసు నిర్వహణకు, ప్రాంతీయ ఆఫీసరు జి. టి. శాస్త్రి.

ప్రాంతీయ ఆఫీసర్లకు సలహా ఇవ్వడానికి ప్రాంతీయ సలహా కమిటీలు వుంటాయి.

ఒక ఫిలింను సెన్సార్ చెయ్యాలంటే, నిర్మాతలు ఆ ఫిలిం పొడవునుబట్టి ప్రతి వెయ్యి అడుగులకూ రు. 40 ఫీజు కట్టాలి.

ఫిలిం సెన్సార్ బోర్డువారు, ఫిలిములను సెన్సార్ చేసేటప్పుడు ఈ క్రింది విషయాలను మనస్సులో వుంచుకోవాలని ప్రభుత్వం సూచించారు: చూసేవారి నైతిక ప్రవర్తనను పాడుచేసే ఫిలుములను ప్రదర్శించ నివ్వరాదు. దుష్ప్రవర్తన, నేరములు, పాపము అసభ్య ప్రవర్తనపట్ల సానుభూతి కలిగించే ఫిలిములను ప్రదర్శింపనివ్వరాదు. సృష్టి న్యాయాన్ని, మానవులు పరిగణించే చట్టాలనూ అపహసించే ఫిలిములను ప్రదర్శింపనివ్వరాదు. ఏ కులానికి చెందిన ప్రజలకూ అవమానము కలిగించే ఫిలిములను ప్రదర్శించ నివ్వరాదు.

1959 జనవరి నాటికి అఖిల భారత ఫిలిం సెన్సార్‌బోర్డు సభ్యులుగా వున్నవారి పేర్లు ఇవి.

ఎం. డి. భట్, (చైర్మన్), మోటూరి సత్యనారాయణ, శ్రీమతి వయొలెట్ ఆల్వా; ప్రొఫెసర్ ఆర్. డి. సింహ దిన్‌కర్; ప్రొఫెసర్ ఎన్. కె. సిద్ధాంత; కార్గ్ కె. ఖండలశాలా; వి. శాంతారామ్.

# బ్రాడ్‌కాస్టింగ్

రేడియో బ్రాడ్‌కాస్టింగ్ భారతదేశంలో మొట్టమొదట 1924 లో మదరాసులో రేడియోక్లబ్ ఒకటి స్థాపింపబడటంతో ప్రారంభమైంది. కాని, ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ అనే పేరుతో ఒక కంపెనీ ఏర్పడి, 1927 జూలై 23 తేదీన బొంబాయిలో ఒక స్టేషనును, 1927 ఆగస్టు 26 తేదీన కలకత్తాలో ఒక స్టేషనును స్థాపించడంతో, బ్రాడ్‌కాస్టింగ్ సర్వీసు ప్రారంభమైంది. అయితే, యీ కంపెనీకి లాభాలు ఏమీ కిట్టక, 1930 మార్చిలో దివాలాతీసింది. 1930 ఏప్రిల్ 1 తేదినుంచి కేంద్రప్రభుత్వంవారే, బ్రాడ్‌కాస్టింగ్‌ను తమ అధికారంలోకి తీసుకున్నారు. 1932 దాకా ప్రభుత్వంవారుకూడా దీని విషయంలో తగు శ్రద్ధ చూపలేదు.

1930 లో మనదేశంలో సుమారు 7,700 మంది మాత్రమే రేడియోలను కలిగివున్నారు. 1957 నాటికి వీరి సంఖ్య 10 లక్షలకు పెరిగింది. రేడియో సెట్టు వున్న ప్రతివారు, ఆ సర్కిల్ పోస్టుమాస్టరు జనరల్ దగ్గరనుంచి లైసెన్సు తీసుకోవాలి. దీనికి ఫీజు ఏడాదికి 15 రూపాయలు.

ప్రస్తుతం మనదేశంలో 28 రేడియో స్టేషనులు వున్నాయి. అవి ఇవి: ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, జలంధర్, నాగపూర్, కటక్, రాంచి, గౌహతి, లక్నో, పాట్నా, అలహాబాద్, మదరాసు, తిరుచిరాపల్లి, విజయవాడ, ధార్వార్, కోళికోడ్, శ్రీనగర్, బెంగుళూరు, హైదరాబాద్, బరోడా, అహమ్మదాబాద్, తిరువనంతపురం, జయపూర్, అజ్మీరు, సిమ్లా, పూనా, రాజకోట, తిరుచూర్, భోపాల్.

బ్రాడ్‌కాస్టింగ్ శాఖకు ఇంగ్లీషులో ఆల్ ఇండియా రేడియో అనీ, దేశభాషలో ఆకాశవాణి అనీ పేర్లు.

# విమానసదుపాయాలు

యుద్ధానంతరం, మునుపటికన్న మనదేశంలో విమాన ప్రయాణాలు చాలా ఎక్కువగా సాగుతున్నాయి. మన దేశంనుంచి విదేశాలకు వెళ్ళడానికే కాక, దేశంలోనే ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి చాలామంది విమానాలలోనే ప్రయాణం చేస్తున్నారు.

1952 డిసెంబరు నాటికి దేశంలో, విమానాలను నడిపించి ప్రయాణ సౌకర్యాలను ఏర్పాటుచేస్తున్న కంపెనీలు తొమ్మిది వున్నాయి.

1953 జూన్‌లో ప్రభుత్వం, విమాన సర్వీసులను స్వాధీనం చేసుకొని దేశంలో సర్వీసులను నడిపే సంస్థను ఒక దానినీ, (ఇండియన్ ఏర్‌లైన్స్ కార్పొరేషన్) విదేశాలకు సర్వీసును నడిపే సంస్థను ఒకదానినీ (ఏర్ ఇండియా ఇంటర్నేషనల్) ఏర్పాటు చేసింది.

ఇండియా ప్రభుత్వపు సివిల్ ఏవియేషన్ శాఖవారు దేశంలో మొత్తం 85 విమానాశ్రయాలను తమ అధ్వర్యాన వుంచుకున్నారు.

ఇండియాలో విమానాశ్రయాలలో అంతర్జాతీయహోదాగలవి ఇవి:

1. బొంబాయి (శాంటాక్రూజ్); 2. కలకత్తా (డండం); ఢిల్లీ (పలం).

ఇండియాలో ప్రధాన హోదా గలవి :

1. అహమ్మదాబాద్; 2. అగర్తలా; 3. బేగంపేట; 4. తిరుచిరాపల్లి; 5. ఢిల్లీ (సఫ్దార్ జంగ్); 6. గౌహతి; 7. మదరాసు; 8. నాగపూర్.

మధ్యతరగతి హోదాగలవి :

1. అలహాబాద్; 2. అమృతసర్; 3. భగ్ దోరా; 4. బెనారస్; 5. బొంబాయి (జుహు); 6. బరోడా; 7. భావనగర్; 8. భోపాల్; 9. భుజ్; 10. కోయంబత్తూరు; 11. గోరఖ్ పూర్; 12. భువనేశ్వర్; 13. గయ; 14. ఇండోర్; 15. జయపూర్; 16. కైలాస్ పూర్; 17. జునఘడ్; 18. లక్నో; 19. మోహన్ బారి; 20. పాట్నా; 21. పోర్ బందర్; 22. రాజకోట; 23. తేజ్ పూర్; 24. రూప్సి; 25. త్రివేండ్రం; 26. విజయవాడ; 27. విశాఖపట్టణం; 28. ఔరంగాబాద్; 29. బలూర్ఘాట్; 30 బెల్గాం; 31. చండీఘర్; 32. కూచ్ బేహార్; 33. కమల్ పూర్; 34. ఖోవాయ్; 35. కుంబిగ్రాం; 36. మెంగుళూర్; 37. ఉత్తరలక్ష్మీపూర్; 38. పానిఘాట్.

కడపటి హోదా గలవాటిలో ఆంధ్రదేశంలో ఇవి :

కడప, దొనకొండ, రాజమండ్రి.

## రైళ్ళు

మొట్టమొదట ఇండియాలో 1853 లో బొంబాయినుంచి కల్యాణ్ వరకు $21\frac{3}{4}$ మైళ్ళు; కలకత్తానుంచి మిర్జాపూర్ వరకు సుమారు 100 మైళ్ళు, రైలుదారి వెయ్యడం జరిగింది. తరువాత అక్కడక్కడ కొద్దిగా రైలుదార్లు పడినప్పటికీ 1856 వరకు ఈ విషయంలో పెద్ద ప్రయత్నం ఏమీ జరగలేదు. తరువాత 1878 లో మదరాసు-వాలాజా రోడ్ రైల్వే 85 మైళ్ళు వేయబడింది. 1856 లో వచ్చిన కరవు (ధాత కరువు) తరువాత, కరవును నివారించడానికి నియమింపబడిన కమిషను వారు, దేశంలో రైలుదార్లు విస్తారంగావుంటే, ఆహారధాన్యాలను కరువు వచ్చిన ప్రదేశాలకు పంపడానికి ఎక్కువ సదుపాయం వుంటుందని సూచించారు. అప్పటినుంచీ రైలుదార్లు యెక్కువగా వెయ్యడం జరిగింది.

ఆ తరువాత, దేశంలో వ్యాపారం బాగా వృద్ధిపొందడమూ, ప్రజలు ప్రయాణాలను ఎక్కువ చేస్తూవుండడమూ రైల్వేల ఆదాయాన్ని వృద్ధిపొందించాయి. కంపెనీల యాజమాన్యంలోవున్న రైల్వేలు లాభం వొచ్చినకొద్దీ రైలుదార్లను ఎక్కువగా వేశాయి.

ఇటీవలివరకు, మనదేశంలో చాలా రైలుదారులు ప్రత్యేకంగా అనేక కంపెనీల యాజమాన్యంలోనే వుంటూ వచ్చాయి. కాని, ఇండియా గవర్నమెంటు, యీ కంపెనీలనుంచి రైలుదార్లన్నిటిని కొనివేశారు. ఇప్పుడు దేశంలోవున్న రైలుదార్లన్నీ, కేంద్రప్రభుత్వ పరిపాలనలో వున్నాయి.

రైల్వే వ్యవహారాలన్నిటినీ చూడడానికి, కేంద్రప్రభుత్వంలో ఒక మంత్రి వున్నాడు. ఆయనకు సలహాలు యివ్వడానికి రైల్వేబోర్డు వుంది. ఈ బోర్డుకు ఒక అధ్యక్షుడు వుంటాడు. రైల్వేల పరిపాలన అంతా ఈయన ద్వారానే జరుగుతుంది. ఈ బోర్డులో ఫైనాన్షల్ కమిషనర్ కాక ఎనిమిదిమంది సభ్యులు వుంటారు. 1959 జనవరి 1 నుంచి యీ క్రిందివారు రైల్వేబోర్డు సభ్యులుగా వున్నారు. చైర్మన్ : పి. సి. ముఖర్జి; సభ్యులు: కె. బి. మధుర్; కర్నైల్ సింగ్; చక్రవర్తి; ఎస్. ఆర్. కల్యాణరామన్, ఎన్. సి. దేబ్; ఇ. డబ్ల్యు. ఇసాక్స్; వై. పి. కులకర్ణి; ఎన్. కె. రాయ్; ఫైనాన్షల్ కమిషనర్: జె. దయాళ్.

1958 మార్చి 31 నాటికి ఇండియాలోవున్న రైలుదారి పొడవు మొత్తం 34,889 మైళ్లు.

ఇండియాలో మొత్తం 6,387 రైల్వే స్టేషనులు వున్నాయి.

1957-58 లో రైల్వే ఆదాయం : రు. 379 కోట్ల 78 లక్షలు
1957-58 లో రైల్వే ఖర్చులు : రు. 366 కోట్ల 40 లక్షలు
1957-58 లో రైల్వేల లాభం : రు. 13 కోట్ల 38 లక్షలు

గవర్నమెంటు అధీనంలోవున్న రైల్వేలు, ఇతర రైల్వేలు కలిపి, 1957-58 లో రు. 379 కోట్ల 78 లక్షల రూపాయల ఆదాయాన్ని తెచ్చాయి. దీనిలో సరకుల రవాణా చార్జీవల్ల వచ్చిన ఆదాయం రు. 229 కోట్ల 68 లక్షలు. ప్రయాణికుల రవాణావల్ల వచ్చిన ఆదాయం, రు. 119 కోట్ల 10 లక్షలు. పార్సెల్సు, లగ్గేజీ మొదలైనవాటి రవాణా వల రు. 24 కోట 23 లక్షలు.

రైల్వేలు తమ ఆదాయంలో రు. 44 కోట్ల 40 లక్షలను కేంద్ర ప్రభుత్వ రెవిన్యూ ఆదాయానికి ఇచ్చాయి.

1957-58 లో రైల్వేలో ప్రయాణం చేసినవారి సంఖ్య : 143 కోట్ల, 10 లక్షలు.

రైల్వేలద్వారా రవాణా అయిన సరుకుల బరువు మొత్తం 13,30,00,000 టన్నులు.

1958 మార్చి నాటికి రైల్వేలలో పనిచేస్తున్నవారి సంఖ్య, 11,11,026.

1957-58 లో రైల్వే వుద్యోగులకు యివ్వబడిన జీతాల మొత్తం అలవెన్సులతో సహా, రు. 172 కోట్ల 94 లక్షలు.

1957-58 లో కొత్తరైలుదారి మొత్తం 168 మైళ్లు నిర్మింపబడింది.

1957-58 లో రైల్వేలమీదవున్న పెట్టుబడి విలువ మొత్తం 1441.51 కోట్లు.

1958 మార్చి 31 నాటికి దేశంలోవున్న రైల్వే ఇంజనులు, 10,025; ప్రయాణికుల పెట్టెలు, 17,599; గుడ్సువాగన్లు, 2,75,970.

ఇండియాలోని వివిధ రైల్వే శాఖలను ప్రాంతీయ శాఖలుగా కలిపివెయ్యడానికి ప్రభుత్వం నిశ్చయించింది. వీటిలో మొదటిది, దక్షిణ రైల్వే, 1951 ఏప్రిల్ 14 న ఏర్పాటు చేయబడింది. మధ్య రైల్వే, పశ్చిమ రైల్వేలు 1951 నవంబరు 5 న ఏర్పాటు చేయబడినవి. ఉత్తర రైల్వే, తూర్పు రైల్వే, ఈశాన్య రైల్వేలు, 1952 ఏప్రిల్ 14 న ఏర్పాటు చేయబడింది. తూర్పు రైల్వే, 1955 ఆగస్టు 1 న రెండు భాగాలు చేయబడింది. ఆ భాగాలకు తూర్పు రైల్వే, ఆగ్నేయ రైల్వే అని పేరు.

1. ఉత్తర రైల్వే : 6,340 మైళ్ళు
2. పశ్చిమ రైల్వే : 5,621.
3. మధ్య రైల్వే : 5,629.
4. దక్షిణ రైల్వే : 6,159.

5. తూర్పు రైల్వే : 3,489.
6. ఈశాన్య రైల్వే : 4,805.
7. ఆగ్నేయ రైల్వే : 3,399.

## రైల్వే చార్జిలు :

వివిధ తరగతుల ప్రయాణీకులవద్దనుంచి వసూలు చేయబడే చార్జిల వివరాలు ఇవి :

ఏర్ కండిషను పెట్టెలలో : 300 మైళ్ళ లోపు ప్రయాణమునకు, ప్రతి మైలుకు 34 దమ్మిడీలు; 300 మైళ్ళ పైన ప్రతి మైలుకు 32

ఫస్టుక్లాసు : మెయిలు బండ్లలోగాని, ప్యాసెంజరు బండ్లలోగాని : 150 మైళ్ల లోపు ప్రతి మైలుకూ 18 దమ్మిడీలు; 150 మైళ్ల పైన 300 మైళ్లలోపు. ప్రతి మైలుకూ 16 దమ్మిడీలు; 300 మైళ్ల పైన ప్రతి మైలుకూ 15 దమ్మిడీలు.

సెకండ్ క్లాసు : మెయిల్ బండ్లలోగాని ఎక్స్‌ప్రెస్ బండ్లలోగాని ప్రయాణమునకు : 150 మైళ్ల లోపు ప్రతి మైలుకూ 11 దమ్మిడీలు; 150 మైళ్ల పైన 300 మైళ్ల లోపు ప్రతి మైలుకు $10\frac{1}{2}$ దమ్మిడీలు; 300 మైళ్ల పైన ప్రతి మైలుకూ $9\frac{1}{2}$ దమ్మిడీలు. ప్యాసెంజరు బండ్లలో ప్రయాణమునకు : 150 మైళ్ల లోపు ప్రతి మైలుకూ $9\frac{1}{2}$ దమ్మిడీలు; 150 మైళ్ల పైన 300 మైళ్ల లోపు ప్రతి మైలుకూ 9 దమ్మిడీలు; 300 మైళ్ల పైన ప్రతి మైలుకూ $8\frac{1}{2}$ దమ్మిడీలు.

థర్డు క్లాసు : మెయిల్ బండ్లలోగాని, ఎక్స్‌ప్రెస్ బండ్లలోగాని ప్రయాణమునకు : 150 మైళ్ల లోపు ప్రతి మైలుకూ $6\frac{1}{2}$ దమ్మిడీలు; 150 మైళ్ల పైన ప్రతి మైలుకూ 5 దమ్మిడీలు. ప్యాసెంజరు బండ్లలో ప్రయాణమునకు : 150 మైళ్లలోపు ప్రతి మైలుకూ $5\frac{1}{4}$ దమ్మిడీలు; 150 మైళ్ల పైన 300 మైళ్ళ లోపు ప్రతి మైలుకూ 5 దమ్మిడీలు; 300 మైళ్ల పైన ప్రతి మైలుకూ $4\frac{1}{2}$ దమ్మిడీలు.

ప్యాసెంజరు బండ్లలో 50 మైళ్ళ లోపు ప్రయాణంచేసేవారికి పై

చెప్పిన రేటులో చార్జిలు వర్తించవు. ప్రతి మైలుకూ 5 దమ్మిడీల చార్జ వసూలు చేయబడుతుంది.

పై చార్జిలుకాక, 30 మైళ్ళలోపు ప్రయాణం చేసేవారు తమ టిక్కెట్టు చార్జిమీద నూటికి 5 వంతులు, 31 మైలునుంచి 500 మైలు వరకూ వెళ్ళేవారు టిక్కెట్టు చార్జిమీద నూటికి 15 వంతులూ, 500 మైళ్ళపైన దూరప్రయాణం చేసేవారు టిక్కెట్టు చార్జిమీద నూటికి .0 వంతులు పన్ను చెల్లించాలి. మొదటి 15 మైళ్ళ ప్రయాణానికి ఈపన్ను వుండదు.

## రైలుదారి వెడల్పు

దీనినే గాజ్ అంటారు. ఇండియాలో రైలుదార్లు రెండు గాజ్ లలో వున్నాయి; బ్రాడ్ గాజ్, మీటర్ గాజ్. బ్రాడ్ గాజ్ వెడల్పు, $5\frac{1}{2}$ అడుగులు; మీటర్ గాజ్ వెడల్పు, 3 అడుగుల 3/8 అంగుళాలు.

## ఎలక్ట్రిక్ రైల్వేలు

బొగ్గు ఇంజనుల సహాయంతోకాక, ఎలక్ట్రిసిటీవల్ల నడుపబడే రైళ్లు ప్రస్తుతం ఇండియాలో 255.99 మైళ్లు దూరం నడుస్తున్నాయి. ఇలాటి రైళ్లు నడిచేదారి ఇది :

| | |
|---|---|
| మదరాసు బీచినుంచి తాంబరం | 18.14 మైళ్లు |
| బొంబాయినుంచి పునావరకు ; కల్యాణ్ నుంచి ఇజత్ పురివరకు | 181. 5 మైళ్లు. |
| బొంబాయి చర్చ్ గేట్ నుంచి వీరార్ వరకు : | 36.80 మైళ్లు. |

## 1959-1960 బడ్జెట్

ఇండియా ప్రభుత్వ రైల్వే మంత్రి శ్రీ జగజీవనరాం 1959-60 రైల్వే బడ్జెట్ ను, ఇండియా పార్లమెంటులో 1958 ఫిబ్రవరి 18 న ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

| | |
|---|---|
| మొత్తం ఆదాయం అంచనా : | రు. 422,03,00,000 |
| మొత్తం ఖర్చు అంచనా : | రు. 346,43,00,000 |

పెట్టుబడిమీద వడ్డీ చార్జీలు : రు. 54,41,00,000
మిగులు (అంచనా) : రు. 21,19,00,000

రైల్వేలను నడపటానికి మొత్తం రు. 283,71,00,000 అవుతుం దని అంచనా.

## రోడ్లు

రోడ్ల నిర్మాణం విషయంలో, ఇతర దేశాలతో పోల్చిచూస్తే ఇండియా చాలా వెనుకబడి వున్నదని చెప్పవచ్చు. చాలా గ్రామాలు రోడ్లతో సంబంధం లేకుండా వున్నాయి. ఎన్నో గ్రామాలకు రోడ్డు ప్రక్కనేవున్న ఏ చిన్న బస్తీలోనో దిగి డొంకదారులలో నడిచి చేరు కోవాలి. సరియైనరోడ్డు లేకపోవడంచేత గ్రామస్తులకు పట్టణాలనుంచి సరకులను తెచ్చుకోవడానికిగాని, గ్రామాలలో దొరికే పండ్లు, కూర గాయలు, పాలు, పట్టణాలకి పంపించటానికిగాని వీలులేక పోతున్నది.

బ్రిటనులో ప్రతి 100 చదరపుమైళ్ళదేశానికి 200 మైళ్ళరోడ్లూ, అమెరికాలో ప్రతి 100 చదరపుమైళ్ల దేశానికి 100 మైళ్లరోడ్లువుంటే, మనదేశంలో 100 చదరపుమైళ్ల దేశానికి 35 మైళ్ళ రోడ్లు వున్నాయి. ఈ రోడ్లుకూడా పక్కారోడ్లుకావు.

ప్రస్తుతం ఇండియాలో మూడు ట్రంకురోడ్లు వున్నాయి. కలకత్తా నుంచి మదరాసుకు ఒకటి. మదరాసునుంచి బొంబాయికి ఒకటి. బొంబాయినుంచి ఢిల్లీకి మరొకటి. ఈమూడు ట్రంకురోడ్లపొడవుసుమారు 5,000 మైళ్ళు. ట్రంకురోడ్లుకాక ట్రంకురోడ్లను జిల్లా నగరాలకుకలిపే రోడ్లూ, జిల్లానగరాలనుంచి తాలూకా పట్టణాలను కలిపేరోడ్లూ అక్కడ నుంచి కొన్ని పెద్దగ్రామాలకు వెళ్లేరోడ్లుకూడా వున్నాయి.

రోడ్లను వేయించడము, వాటిని సరిగా వుండేటట్లు చూడటము, ఏ రాష్ట్రంలో ఆ రాష్ట్రపు ప్రభుత్వపు బాధ్యత. 1929 లో కేంద్ర ప్రభుత్వంవారు సెంట్రల్ రోడ్ డెవలప్‌మెంట్ ఫండ్ అని ఒక నిధిని ఏర్పాటు చేశారు. పెట్రోల్ పన్ను అంతా యీ నిధికి ఆదాయం. వచ్చిన దానిలో నూటికి 15 వంతులు కేంద్రప్రభుత్వంవారు తమ అధీనంలోవుంచు కొని, మిగతాభాగాన్ని రాష్ట్రాలకు పంచిపెడతారు. కేంద్రప్రభుత్వ అధీ

నంలోవున్న డబ్బు, రోడ్లవిషయంలో పరిశోధనను చేయించడానికి, కేంద్రప్రభుత్వ రోడ్లశాఖకు అయేఖర్చుకి వినియోగింపబడుతుంది.

ప్రస్తుతం ఇండియాలోవున్న రోడ్ల వివరాలు ఇవి: 1956 నాటి లెక్కల ప్రకారం: ఇవి ప్రభుత్వ అధీనంలో వున్నవి.

మొత్తం రోడ్లు 3,16,668 మైళ్ళు.

మోటార్లు నడవడానికి వీలైనవి: 2,25,665 మైళ్ళు.

జాతీయ రహదార్లు మొత్తం 13,800 మైళ్ళు.

ఇవికాక మునిసిపాలిటీల అధీనంలోనూ, జిల్లాబోర్డుల అధీనంలోనూ వున్నరోడ్లు మొత్తం, 2,99,720 మైళ్ళు. వీటిలో 97,547 మైళ్ళ రోడ్లకు మాత్రమే కంకర వేయబడినది. తక్కినవి, రోడ్డుపేరుతో చెలామణి అయే కాలిదారులే.

1947 ఏప్రిల్ నుంచి 20 ఏండ్లలోగా, ప్రభుత్వ అధీనంలోవున్న రోడ్లను 3,85,226 మైళ్ళకు పెంచడానికి, వానిలో మోటార్లునడపడానికి వీలైన రోడ్లను 2,89,855 మైళ్ళకు పెంచడానికి ప్రభుత్వం నిశ్చయించినది.

# పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోన్, సదుపాయాలు

ఉత్తరాల రవాణా పద్ధతి భరతఖండంలో అక్బరుచక్రవర్తికాలం నాటికే అమలులో వున్నప్పటికీ, సరియైన మార్గంలో యీ పద్ధతి 1766 లో అమలు జరుపబడింది. అప్పుడు కేవలం ప్రభుత్వం ఉత్తరాలే రవాణా అవుతూవుండేవి. కాని ప్రజలందరికీ ఉపయోగకరమైన పోస్టేజి స్టాంపులు, కవర్లు, కార్డులు 1854 లో అమలులోకి వచ్చాయి.

టెలిగ్రాములు పంపించే సదుపాయం 1856 లో ఏర్పాటు చేయబడింది. టెలిఫోనులో ఒకచోటినుంచి మరొక చోటికి మాట్లాడే సదుపాయం 77 సంవత్సరాల క్రితం ఏర్పాటు చేయబడినా, 1913 లోనే ప్రజోపయోగార్థం టెలిఫోనులను స్థాపించడం జరిగింది. 1949 జూన్ నుంచి హిందీభాషలో టెలిగ్రాములను పంపించే సదుపాయం, ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో ఏర్పాటు చేయబడింది.

1958 మార్చి 31 నాటికి ఇండియాలోవున్న పోస్టాఫీసుల సంఖ్య 58,871. టెలిగ్రాఫ్ ఆఫీసుల సంఖ్య, 10,052.

1958-59 లో ఇండియాలోని పోస్టాఫీసులు మొత్తం 550,00,00,000 వస్తువులను బట్వాడా చేసినవి. 275 కోట్ల రూపాయల విలువగల మణి ఆర్డరులను బట్వాడా చేసినవి. 3,40,00,000 టెలిగ్రాములను అందించినవి.

1958 మార్చి డిసెంబర్ అంతానికి దేశంలో పనిచేస్తున్న టెలిఫోనులు మొత్తం 3,76,000.

1957-58 లో పోస్టల్ డిపార్టుమెంటు ఆదాయం రు. 66,36,00,000.

1958 మార్చి 31 నాటికి పోస్టల్ డిపార్టుమెంటులో పనిచేస్తున్న సిబ్బంది సంఖ్య : 3,16,617.

1958 డిసెంబరు అంతానికి దేశంలో వున్న టెలిగ్రాఫ్ ఆఫీసుల సంఖ్య, 5,895.

# పోస్టల్ రేట్లు

మనదేశంలో ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి ఎంతదూరమైనా సరే ఉత్తరాలను, పార్శెళ్ళను, టెలిగ్రాములను పంపడానికి అయ్యే ఖర్చు వివరాలు యివి :

### కార్డు

పోస్టాఫీసులో అమ్మే కార్డును 5 నయాపైసాలు పెట్టి కొనుక్కొని, దానిమీద సంగతులు వ్రాసుకోవచ్చు. లేదా విడిగా బజారులో అమ్మే వివిధరంగుల కార్డులనుకొని, వాటికి 5 నయాపైసాల బిళ్ళను కొని అంటించి పోస్టులో వెయ్యవచ్చును. ఈ కార్డుల పొడవు $5\frac{1}{8}$ అంగుళాలను, వెడల్పు $4\frac{1}{8}$ అంగుళాలను మించి వుండకూడదు. 4 అంగుళాలపొడవును, రెండు అంగుళాల వెడల్పును తక్కువ వుండకూడదు. ఒకేవూరిలో బట్వాడా చేసే కార్డుకు నాలుగు నయాపైసాల బిళ్ళ అంటిస్తే చాలు.

## కవరు

కార్డుమీద వ్రాసేదానికన్న ఎక్కువ విషయాలను వ్రాయవలసివస్తేగాని, యితరులెవరూ చూడగూడదని విషయాలు వ్రాయవలసివస్తేగాని, వ్రాసిన ఉత్తరాన్ని కవరులో పెట్టి, పైన అడ్రెసువ్రాసి పోస్టులో పడవెయ్యవచ్చును. ఈ కవరుమీద అంటించవలసిన పోస్టుబిళ్ళల విలువ, కవరు బరువునుబట్టి వుంటుంది. కవరు ఒకటిన్నర తులంగాని, దానికి లోపుగాని వుంటే కవరుమీద 15 నయాపైసాల విలువగల పోస్టుబిళ్లను అంటించాలి. ఒక తులం తరువాత అపైన ప్రతితులం బరువుకూ అదనంగా ఒక్కొక్క 10 నయాపైసాల చొప్పున అంటించాలి, కవరు లేకుండా ఇన్ లెండ్ లెటర్ మీద వ్రాస్తే 10 నయాపైసాలు.

### ఎక్స్ప్రెస్ డెలివరి :

పోస్టాఫీసువున్న ప్రతి వూళ్ళోనూ, పోస్టుబంట్రోతులు ఉత్తరాలు ఒక్కొక్క యింటికి వరుసగా యిచ్చుకుంటూ పోతారు. అలా కాక, ఉత్తరం పోస్టాఫీసుకు అందినవెంటనే చిరునామాదారునికి అందజెయ్యడానికికూడా ఏర్పాటువుంది. ఈఏర్పాటును ఎక్స్ప్రెస్ డెలివరీఅంటారు దీనికి అలా అందజేయవలసిన ఉత్తరంమీద, దాని మామూలు చార్జీలు కాక అదనంగా 13 నయాపైసాల బిళ్ళను అంటించి, స్పష్టగా కనబడే అక్షరాలలో 'ఎక్స్ప్రెస్ డెలివరీ' అని వ్రాయాలి, లేదా పోస్టాఫీసులలో ఉచితంగా యిచ్చే 'ఎక్స్ప్రెస్ డెలివరీ' అని వ్రాసిన చిన్న ఎర్ర కాగితపు ముక్కను అంటించాలి. అలా చేసినట్లయితే, ఆ వుత్తరాన్ని పోస్టాఫీసుకు అయిదుమైళ్ళలోపున ఏ అడ్రెసుకు అయినా వెంటనేఅందజేస్తారు. ఈ పద్ధతిలో పోస్టుకార్డులను, కవరులను, రిజిస్టరు చెయ్యని ప్యాకెట్టులను పంపవచ్చును.

### బుక్ పోస్టు :

అచ్చువేసిన నోటీసులు, ఉత్తరాలు కాకుండా అందరూ చదువుకోడానికి వీలున్న పత్రాలు, తక్కువ చార్జీలకు, పోస్టుద్వారా పంపవచ్చును. ఇలాటివాటికి వాటి బరువునుబట్టి, మొదటి 5 తులాలకు 8

నయాపైసాలు బిళ్ళ అంటించాలి : ఆ తరువాత ప్రతి $1\frac{1}{2}$ తులాల బరువుకీ మూడు నయాపైసాల పోస్టు బిళ్ళలను అంటించాలి,

రిజిస్ట్రేషన్ :

ఎవరికైనా ఉత్తరాలు పంపినప్పుడు, అవి ఆ చిరునామాదారునికే అందేటట్లూ, అందిన దాఖలా వుండేటట్లూ ఉత్తరాలు పంపడాన్ని రిజిస్ట్రేషన్ అంటారు. రిజిస్టర్ చేసే ఉత్తరాలకు మామూలుగా వాటికి అంటించే పోస్టు బిళ్ళలుకాక, అదనంగా 50 నయాపైసాల బిళ్ళలు అంటించాలి. చిరునామాదారు సంతకం పెట్టిన రసీదు, ఉత్తరం పంపినవారికి కావాలంటే, అదనంగా మరొక ఆరు నయాపైసాల బిళ్ళ అంటించాలి.

పార్సెళ్లు.

పోస్టుద్వారా పంపే పార్సెళ్ళకు మొదటి 40 తులాలకూ 60 నయాపైసాల బిళ్ళలను అంటించాలి. ఆ పైన ప్రతి 40 తులాలకు 50 నయాపైసాలు. 400 తులాల బరువుకు మించిన పార్సెలును తప్పనిసరిగా రిజిష్టరు చేసితీరాలి.

వి. పి.

ఏదైనా విలువగల వస్తువును ఒకరు మరొకరికి పంపి, పుచ్చుకున్న వారిదగ్గర దాని విలువను వసూలుచేసే పద్ధతి. రు. 25 అపై విలువగల వి. పి. లను, వాటి విలువకు ఇన్సూరు చెయ్యాలి. ఇదిగాక రు. 25 లోపు విలువగల వస్తువు అయితే, వి. పి. చార్జి 6 నయాపైసాలు, రు. 25 పైన విలువగల వస్తువు అయితే, అదనంగా 12 నయాపైసాలు చెల్లించాలి. అంటే వి. పి. లను విడిపించుకొనేవారు చెల్లించవలసిన డబ్బు వివరాలు ఇవి :

రు. 25 లోపు విలువగల వస్తువులకు: వస్తువులవిలువ : ఆ వస్తువుకు అయే బట్వాడా చార్జి (బరువునుబట్టి); 50 నయాపైసాలు రిజిస్ట్రేషన్ చార్జి ; 6 నయాపైసాలు ; వి. పి. చార్జి.

రు. 55 పైన విలువగల వస్తువులకు : వస్తువు విలువ, ఆ వస్తువు ట్వాడా అయే చార్జి; 50 నయాపైసాలు రిజిస్ట్రేషన్ చార్జి; 12 నయాపైసాలు వి. పి. చార్జి, ఆ వస్తువు విలువనుబట్టి ఇన్సూరెన్సు చార్జి.

అయితే, పుస్తకములను, రైల్వే పార్సెలు రసీదులను వి. పి. గా పంపినప్పుడు, వాటి విలువ ఎంత అయినాసరే, వాటిని ఇన్సూరు చెయ్యాలనే నిర్బంధంలేదు.

ఇన్సూరెన్సు :

పోస్టుద్వారా విలువగల వస్తువులను పంపేటప్పుడు ఒక వేళ ఆ వస్తువులుపోతే, ఆ వస్తువుల ఖరీదును రాబట్టుకోడానికి చేసుకొనే ఏర్పాటు. ఈ ఏర్పాటుద్వారా, రిజిష్టర్ ఉత్తరాలను, బంగారు నగలనూ, విలువగల దస్తావేజులనూ ఒక చోటినుండి మరొక చోటికి పంపవచ్చును. ఆ వస్తువులను వాటి అసలైన విలువకు మించిన మొత్తానికి ఇన్సూరు చెయ్యకూడదు. ఇలా ఇన్సూరు చేసే వస్తువుల విలువ రు. 5,000 లకు మించరాదు.

ఇలా ఇన్సూరు చెయ్యడానికి, ఆ వస్తువులు పెట్టిన కవరుకుగాని పెట్టెకుగాని దాని బరువునుబట్టి చెల్లించవలసిన చార్జి, రిజిస్ట్రేషను చార్జిలుకాక, అదనంగా, ఈ క్రింది రేటులో చార్జిలు యిచ్చుకోవాలి.

నూరు రూపాయల విలువకు మించని ఇన్సూరెన్సుకు 37 నయా పైసాలు. రు, 100 పైన, ప్రతి రు. 100 లకు 20 నయా పైసాలు.

మనిఆర్డరు :

దూరానవున్న వారికి ఎవరైనా, నమ్మకంగా చేరేలాగున డబ్బు పోస్టాఫీసుద్వారా పంపవచ్చును. ఇలా పంపే డబ్బుకు ప్రతి 5 రూపాయలకు 15 నయా పైసలు చార్జి చెల్లించాలి.

టెలిగ్రాం :

అత్యవసరంగా ఒక చోటనుంచి మరొక చోటికి కబురు అందచెయ్యడానికి టెలిగ్రాం మంచి సౌకర్యం. టెలిగ్రాములు ఇంగ్లీషులోగాని, హిందీలోగాని పంపవచ్చును. చెప్పేసంగతులకూ, టెలిగ్రాం ఎవరికి పంపుతామో వారి చిరునామాకూ ఎన్నిమాటలు వుంటాయో వానినిబట్టి చార్జీయివ్వాలి. టెలిగ్రాములు రెండు రకాలు. మామూలు టెలిగ్రాములు, యిచ్చేచోట అందువున్న వరుసలో పంపేవి. అర్జంటు టెలిగ్రాములు, అందుకోగానే పంపేవి.

మామూలు టెలిగ్రాములకు చార్జీలు: మొదటి ఎనిమిది మాటలకు గాని, అంతకు తక్కువగాని 80 నయా పైసాలు; ఎనిమిది పైన ప్రతి మాటకూ ఎనిమిది నయా పైసాలు అదనం. అర్జెంటు టెలిగ్రాములకు, ఎనిమిది మాటలకు, ఒక రూపాయి 60 నయా పైసాలు; ఆ పైన ప్రతి మాటకు 16 నయా పైసాలు,

టెలిగ్రాఫ్ మనిఆర్డరు :

అతి స్వల్ప వ్యవధిలో, దూరానవున్న వారికి డబ్బు పంపాలంటే టెలిగ్రాంద్వారా పంపవచ్చును. దానికి చార్జి, మామూలు మని ఆర్డరు చార్జీకాక, చిరునామాకూ, అతనికి తెలియపరచేవిషయాలకూ టెలిగ్రాం చార్జీ ఎంత అవుతుందో అదీ అదనంగా మరొక 14 నయా పైసాలు సర్ చార్జి చెల్లించాలి.

విదేశాలకు :

యూరప్‌కు ప్రాసేకార్డు వెల 40 నయాపైసాలు; కవరువెల అర ఔన్సు బరువుకు మించనిది 90 నయాపైసాలు.

అమెరికాకు : కార్డు, 65 నయా పైసాలు. కవరు 150 నయా పైసాలు.

కేబిల్ గ్రాం :

సముద్రాంతరంలోవున్న దేశాలకు పంపించే టెలిగ్రాములను కేబిల్ గ్రాం అంటారు.

ఇండియానుంచి, ఇంగ్లండు అమెరికాలకు కేబిల్‌గ్రాం పంపితే అయే చార్జీలు ఇవి :

ఇంగ్లండు : ప్రతిమాటకు 75 నయాపైసలు.

అమెరికా : ప్రతిమాటకు 120 నయాపైసలు.

చాలా ఉత్తరాలు సరియైన అడ్రసు వ్రాయనందున, ఎవరికి అందాలో వారికి అందక, 'డెడ్ లెటర్' ఆఫీసుకు పోతాయి. అందు చేత ప్రతి ఉత్తరంమీద సరియైన అడ్రసు వ్రాయడం ముఖ్యం.

ఆదివారం సెలవు :

ఇండియాలో పోస్టాఫీసు లన్నింటికీ ప్రతి ఆదివారమూ పూర్తిగా సెలవురోజు. ఆనాడు మామూలు వుత్తరాలు, మామూలు టెలిగ్రాములు బట్వాడా జరగవు; ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరాలు, అర్జంటు టెలిగ్రాములు మాత్రమే బట్వాడా అవుతవి. ఈ బట్వాడాకూడా అన్ని ఊళ్ళలోనూ జరగదు. పెద్ద బస్తీలలోనే.

## కార్మికుల బలం

ప్రతి సంవత్సరమూ ఇండియాలోని కార్మికుల సంఖ్య పెరుగుతూ వున్నది. 1948 లో దేశంలోని కార్మికుల సంఖ్య 23,60,201 అయితే 1957 లో దేశంలోని వివిధ ఫాక్టరీలలో పనిచేస్తున్న కార్మికులసంఖ్య దాదాపు 30 లక్షలు. వీరిలో గవర్నమెంటు ఆధీనంలోవున్న ఫాక్టరీలలో పనిచేస్తున్నవారి సంఖ్య, దాదాపు 7 లక్షలు. బట్టల మిల్లులలో పనిచేస్తున్నవారు, 9,32,855. బొగ్గుగనులలో పనిచేస్తున్నవారి సంఖ్య, నాలుగు లక్షలు. అన్ని రకముల గనులలోను పనిచేస్తున్నవారు 6 లక్షలు.

## ప్లానింగ్ కమిషన్

దేశంలో సహజసంపదనూ, మనుష్యబలాన్ని, సరిగా పరిశీలించి, యీ సంపదను సరిగా ఉపయోగించి, ప్రజల ఆర్థిక సౌష్టవాన్ని పెంపొందించడానికి తగిన నిర్మాణ కార్యక్రమాలను తయారుచేసి, వాటిని అమలు జరిపించడానికి నేషనల్ ప్లానింగ్ కమిషనును నియమించడానికి 1950 మార్చి 15 తేదీన ఇండియా ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ ప్లానింగ్ కమిషనుచేసే పనులు ఏమిటంటే: 1. దేశంలో భౌతిక, ఆర్థిక, మనుష్యసంపద యెంతవుందో, విజ్ఞాన శాస్త్రములు చదువుకున్నవారెంతమంది వున్నారో పరిశీలించడం. శాస్త్రజ్ఞులు తక్కువగావుంటే, వారి సంఖ్యను ఎక్కువ చేయడానికి మార్గాలను సూచించడం.

2. దేశసంపదను సక్రమంగా వినియోగించడానికి తగిన పథకము లను తయారు చెయ్యడం.

3. తయారుచేసిన పథకములను ఏ వరుసలో అమలు జరుపవలసినది నిర్ణయించడం.

4. దేశ ఆర్థిక సౌష్టవానికి కంటకములుగావున్న పరిస్థితులను గమనించి వాటిని తొలగించడానికి మార్గాలు చూపడం.

## కమిషన్ సభ్యులు

ఛైర్మన్ : జవహర్‌లాల్ నెహ్రూ.

డిప్యూటీ ఛైర్మన్ : టి. టి. కృష్ణమాచారి.

సభ్యులు : మురార్జి దేశాయ్, గుల్జారిలాల్ నంద, వి. కె. కృష్ణమీనన్, సి. ఎం. త్రివేది, శ్రీమన్నారాయణ్, త్రిభువన్ నారాయణ్ సింగ్.

# రాజకీయ పక్షాలు

## కాంగ్రెసు

అఖిలభారత కాంగ్రెసు మహాసభ 1885 లో స్థాపింపబడింది. అప్పుడు కేవలం మితవాదపక్షంగా ఏర్పడినా, క్రమేపీ, దేశస్వాతంత్ర్య సంపాదనకు పూనుకున్న ప్రధానసంస్థ ఇదే. దీనిలోచేరి, అనేక కష్టాలకు గురియై, ఎంతో మంది స్వాతంత్ర్య వీరులు, స్వాతంత్ర్య సమరంలో తమ ప్రాణాలను కూడా అర్పించారు. ఈనాడు, అఖిలభారత జాతీయ సంస్థగా, దేశంలోని రాజకీయకక్షలలో ప్రధాన స్థానాన్ని పొందింది.

కాంగ్రెసు మహాసభ ప్రాతినిధ్యం, భాషాయుక్త రాష్ట్ర విధానం మీద ఆధారపడివున్నది.

1959 కాంగ్రెసు మహాసభ అధ్యక్షురాలు: శ్రీమతి ఇందిర గాంధి.

### వర్కింగు కమిటి

1959 సంవత్సరానికి కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యులు వీరు.

1. శ్రీమతి ఇందిర గాంధి; 2. యు. ఎన్. ఢేబర్; 3. గోవింద వల్లభపంత్; 4. మురార్జి దేశాయ్; 5. హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం; 6. జగజీవనరాం; 7. కె. కామరాజనాడార్; 8. సర్దార్ ప్రతాపసింగ్

కై రాన్; 9. వై. బి. చవన్; 10. బి. పి. చలీహా; 11. ఎస్. నిజలింగప్ప; 12. బిజేష్ సేన్; 13. తఖత్ మల్ జెయిన్; 14. సాదిక్ ఆలి; 15. అల్లూరి సత్యనారాయణరాజు; 16. అబ్దుల్ కయూం అన్సారి; 17. డాక్టర్ బి. సి. రాయ్; 18. శ్రీమతి సుచేత కృపలాని; 19. డాక్టర్ సౌందరం రామచంద్రన్.

అల్లూరి సత్యనారాయణరాజు, సాదిక్ ఆలి, తఖత్ మల్ జెయిన్, శ్రీమతి సుచేత కృపలానిగార్లు ప్రధాన కార్యదర్శులుగా నియమింపబడినారు.

## ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు

వివిధ భాషాప్రాంతముల కాంగ్రెసు కమిటీలకు ప్రదేశకమిటీలని పేరు. ప్రదేశ కాంగ్రెసు సంఘాల అధ్యక్షులు: ఆంధ్ర, పిడతల రంగారెడ్డి; అసాం, మహేంద్రమోహన్ చౌధురి; ఉత్కళ్, రాజకృష్ణబోస్; ఉత్తరప్రదేశ్, చతుర్భుజశర్మ; కేరళ్, ఆర్. శంకర్; ఢిల్లి, శ్రీమతి సుభద్రజోషి; తమిళనాడు, కె. రాజారాంనాయుడు; పంజాబ్, సర్దార్ దర్బారసింగ్; బీహార్, నందకుమార్ సింగ్; బెంగాల్, యాదవేంద్ర నాథ్ పంజా; బొంబాయి, ఠాకూర్ భాయ్ దేశాయి; మధ్యప్రదేశ్, మహంత్ లక్ష్మినారాయణదాస్; మైసూరు, ఎస్. చన్నయ్య; రాజస్థాన్, శోభారాం; హిమాచలప్రదేశ్, స్వామిపూర్ణానంద.

## ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా పిడతల రంగారెడ్డి, 1958 ఏప్రిల్ 24 తేదిన ఎన్నుకోబడినారు. ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గసభ్యులు: అధ్యక్షుడు, పిడతల రంగారెడ్డి; ఉపాధ్యక్షులు: పి. వి. నరసింహారావు, ఆలపాటి వెంకటరామయ్య; ప్రధానకార్యదర్శి, నూకల రామచంద్రారెడ్డి; జాయింటు కార్యదర్శి, వల్లూరి బసవరాజు.

హిందుమహాసభ :

హిందువుల ప్రత్యేక హక్కులను కాపాడడానికి ఏర్పడిన సంస్థ. దేశవిభజనను తీవ్రంగా ప్రకటించింది : అధ్యక్షుడు: ప్రొఫెసర్ రాంసింగ్.

కమ్యూనిస్టుపార్టీ :

కార్మికుల అధ్వర్యాన ఏర్పడే పరిపాలనను దేశంలో స్థాపించి, ధనస్వామిత్వాన్ని నిర్మూలనంచేసి, వర్గభేదంలేని సంఘాన్ని స్థాపించడం ప్రధానాశయంగాగల సంస్థ. అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి, అజయఘోష్.

ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి : చంద్ర నాగేశ్వరరావు.

ప్రజాసోషలిస్టుపార్టీ :

1952 సెప్టెంబరువరకు, సోషలిస్టుపార్టీ అనీ, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అని వ్యవహరింపబడుతున్న రెండు పార్టీలు, 1952 సెప్టెంబరు 25 తేదీన ఒకే పార్టీగా కలసిపోయినవి. ఈ కొత్తపార్టీకి ప్రజాసోషలిస్టు-పార్టీ అని పేరు. పార్టీ అధ్యక్షుడు గంగాచరణ్ సింహ్.

# విదేశీయుల అధీనంలో వున్న ప్రాంతాలు

భారతదేశంలో ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాల ఆక్రమణలో కొంత భూభాగం వుండేది. మూడు శతాబ్దాలనాడు, వర్తకానికి భారతదేశానికి వచ్చి, దేశీయ రాజకీయవ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, ఫ్రాన్సు పోర్చుగల్ దేశాలు కొంతదేశాన్ని తమ పరిపాలనలోకి తెచ్చుకున్నవి. తరువాత వచ్చిన బ్రిటిష్ వారితో పోరాటఫలితంగా, ఈ రెండు దేశాల పలుకుబడి, వాటి పాలనలోవున్న భూభాగమూనాలువరకు తగ్గిపోయాయి. ఈ రెండు దేశాలపాలనలోవున్న ప్రదేశాలను సెటిల్మెంట్లు అని వాడుకలో అంటారు. ఈ ప్రదేశాలలో యిటీవల స్వాతంత్ర్యోద్యమం ప్రబలింది. ఫ్రెంచి సెటిల్మెంట్లలోవున్న ప్రజానాయకులు ఆ సెటిల్మెంట్లను, భారతదేశంలోని యితర ప్రాంతాలలో కలిపివెయ్యాలని కోరినందున, 1954 నవంబరు 1 తేదిన భారతదేశ ప్రభుత్వానికి ఫ్రెంచి ప్రభుత్వం అప్పగించింది. అప్పటినుంచీ ఆ సెటిల్మెంట్లు, పుదుచ్చేరి రాష్ట్రం అనే పేరుతో ఒక కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చేయబడినవి. ఇక, విదేశీయుల అధీనంలోవున్న భారత ప్రాంతం, పోర్చుగీసు ఇండియామాత్రమే. దాని వివరాలు ఇవి :

## పోర్చుగీస్ సెటిల్మెంట్

పోర్చుగీసువారు మొట్టమొదట (1510)లో భారతదేశంలో ఆక్రమించుకున్న ప్రదేశం గోవా. ఇప్పటికీ ఇది వారిపాలనలోనేవుంది. నేడు దేశంలో పోర్చుగీసువారి అధీనంలోవున్న ప్రాంతం మొత్తం 3,383 కిలోమీటర్లు. ఈ ప్రాంతమంతా బొంబాయి రాష్ట్రంలో మూడు విడివిడి ప్రదేశాలుగా వుంది. అవేమిటంటే, గోవా, డయ్యూ, డామన్. వీటన్నిటికీ రాజధాని నొవాగోవా. ఇది పశ్చిమతీరంలోవున్న మర్మగోవాకు 6 మైళ్ల దూరంలో నూతనంగా నిర్మింపబడింది. పోర్చుగీసు సెటిల్మెంట్ల గవర్నర్ జనరల్ ఇక్కడేవుంటాడు. పోర్చుగీసు సెటిల్మెంట్ల మొత్తంలో 1931లో 5,79,970 మంది ప్రజలున్నారు. తరువాత జనాభా లెఖలు తీసుకోలేదు. ఈ సెటిల్మెంట్ల మొత్తంలో నాలుగు పట్టణాలు, మూడు నగరాలు. సుమారు 600 గ్రామాలు వున్నాయి.

### మర్మగోవా :

నోవాగోవా, మర్మగోవా పట్టణాలూ, పరిసర ప్రాంతాలూ కలిసి గోవా జిల్లా అని వాడుకలో వున్నాయి. నోవాగోవా, పోర్చుగీస్ సెటిల్మెంటుకు రాజధాని అయినప్పటికీ రేవు పట్టణం మర్మగోవా. ఇది బొంబాయికి దక్షిణంగా 226 మైళ్ళ దూరంలో వుంది.

### డయ్యూ:

ఈ జిల్లా భారతదేశపు పశ్చిమ తీరాన, కథియవాడ్‌కు దక్షిణంగా వున్న చిన్న ద్వీపం. దీని వైశాల్యం సుమారు 20 చ. మైళ్ళు. ఒకప్పుడు ఇది గొప్ప వ్యాపార కేంద్రంగావుండేదిగాని, ప్రస్తుతం అనామక స్థితిలో వుంది.

### డామన్ ;

ఈ జిల్లా, బొంబాయికి ఉత్తరంగా సుమారు 100 మైళ్లదూరంలో సముద్రతీరాన వుంది. ఈ జిల్లా వైశాల్యం 86 చ. మైళ్లు.

# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందేటట్లు సమగ్రమైన కృషి అధికారరీత్యానూ, ప్రజల సహకారంతోనూ జరిగేటట్లు పథకాలను నిర్ణయిస్తూ, ప్రథమ పంచవర్ష ప్రణాళికను అమలు జరపడం 1951 లో ప్రారంభమైంది. 1956 తో ప్రథమ పంచవర్ష ప్రణాళిక కృషి పూర్తి అయింది. కాని, యీ కృషి కొన్ని రంగాలలోనే. మిగతా రంగాలలో కృషి జరపడానికి ప్లానింగ్ కమిషన్ రెండవ పంచవర్ష ప్రణాళికను తయారుచేసింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కృషి 1956నుంచీ ప్రారంభమైంది. ఆ ప్రణాళిక లక్ష్యాలను, కార్యక్రమాలను, ఖర్చులను వివరిస్తూ ప్లానింగ్ కమిషన్ చేసిన ప్రకటనను యీ క్రింద సంక్షిప్తంగా ప్రకటిస్తున్నాము. ఈ ప్రకటనలోనే, ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సాధించిన ఫలితాలుకూడా స్థూలంగా వివరింపబడినవి.

## ప్రధాన లక్ష్యాలు

తొలి పంచవర్ష ప్రణాళిక, అభ్యుదయకరమైన, బహుముఖమైన ఆర్థిక వ్యవస్థకు పునాదులు నిర్మించాలనే ప్రధాన లక్ష్యంతో రూపొందించబడింది.

తొలిపంచవర్ష ప్రణాళిక ఆర్థిక పురోభివృద్ధి కృషి సత్ఫలితాలను యిచ్చింది. వ్యవసాయోత్పత్తులు, పారిశ్రామికోత్పత్తులు ప్రశంసనీయంగా సాగాయి. ఆ అయిదు సంవత్సరాలలోను ఒక కోటి మూడు లక్షల ఎకరాల భూమి అదనంగా సాగులోకి వచ్చింది. విద్యుదుత్పాదక శక్తి ఇరువది మూడు లక్షల కిలోవాట్ గంటలనుంచి ముప్పది అయిదు లక్షల కిలోవాట్ గంటలకు పెరిగింది. రైల్వేల పునరుద్ధరణ ప్రశంసనీయంగా సాగింది. ప్రయివేటు పబ్లిక్ రంగాలలో అనేక పారిశ్రామిక ఫాక్టరీలు నెలకొల్పబడ్డాయి.

ఈ క్రింది ప్రధాన లక్ష్యాలతో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రూపొందించబడింది.

దేశంలో జీవన వ్యయప్రమాణాన్ని పెంపొందించడానికిగాను జాతీయాదాయం ఎక్కువగా పెరిగేటట్లు చేయడం.

ప్రధానమైన భారీ పరిశ్రమలకు ప్రాధాన్యంయిస్తూ పరిశ్రమలను శరవేగంతో పెంపొందించడం.

ఉద్యోగ సదుపాయాలు బాగా ఎక్కువ చేయడం.

ఆర్థిక అసమానత్వాన్ని తొలగించి ఆర్థిక స్తోమతను సమానంగా పంచడం.

పరిశ్రమలు త్వరితగతిని పెంపొందాలంటే, పరిశ్రమలకు అవసరమైన యంత్రాలను ముందుగా ఉత్పత్తి చేయాలి. ఇనుము, ఉక్కు, ఇనుము కలియని లోహాలు, బొగ్గు, సిమెంటు, భారీ రసాయనికాలు, తదితర పరిశ్రమలు ముఖ్యంగా పెంపొందించాలి.

## ప్రణాళిక స్వరూపం

ప్రణాళికాకాలంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి అభివృద్ధి కార్యకలాపాలకోసం మొత్తం 4800 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టదలచారు.

రెండో ప్రణాళికలో పరిశ్రమలకి ప్రాధాన్యతయిచ్చారు. ఈ పరిశ్రమలలో గనుల త్రవ్వకం రైల్వేల అభివృద్ధికూడా చేరివున్నాయి.

మొదటి పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలకుగాను పెట్టిన ఖర్చు అసలు అనుకున్నదానికన్న చాలా వెనకబడడంవల్ల, యీ రెండో ప్రణాళికలో పరిశ్రమలకోసం ఎక్కువసొమ్ము కేటాయించడం మరింత అవసరమైంది. మొదటి ప్రణాళికలో, భారీపరిశ్రమలకు, శాస్త్రీయ పరిశోధనకి, ఖనిజాభివృద్ధికి మొత్తం రు. 149 కోట్లు కేటాయించివుండగా సుమారు రు. 75 కోట్లు ఖర్చయినట్లు తేలులోంది. రెండోప్రణాళికలో యీ పద్దులక్రింద రు. 691 కోట్లు ప్రత్యేకించారు: ఇదిగాక గ్రామీణ, కుటీరపరిశ్రమలకోసం మరొక రు. 720 కోట్లు, రవాణా, కమ్యూనికేషన్లకు మొత్తం రు. 1384 కోట్లు కేటాయించడం జరిగింది. ఇందులో, రైల్వేలకి ప్రత్యేకంగా రు. 900 కోట్లు ఉద్దేశించారు.

ప్రణాళిక కర్యేటటువంటి రు. 4800 కోట్లు మొత్తపు ఖర్చులోనూ, రాష్ట్ర ప్రణాళికలకు రు. 2214 కోట్లు అవుతుందని తెలుస్తోంది.

## ఉత్పత్తి, అభివృద్ధి లక్ష్యాలు

వ్యవసాయక ఉత్పత్తి నూరింట 10 వంతులు పెంచాలని యీ రెండో ప్రణాళికలో సంకల్పం. ధాన్యాలఉత్పత్తి నూటికి 15 వంతులు గాని, లేదా ఒక కోటి టన్నులవరకుగాని పెంచుతారు. ఇక, తక్కిన వాటి విషయంలో, ఇంకా ఎక్కువగానే ఉత్పత్తులు సాధించాలని సంకల్పం. ఇవి ఇలా ఉంటై:

1. పత్తి నూటికి 34 వంతులు. 2. చక్కెర నూటికి 28వంతులు. 3. నూనెగింజలు నూటికి 24 వంతులు.

సమాజ అభివృద్ధి కార్యక్రమాలు, జాతీయవికాస కార్యక్రమాల రీత్యా లాభంపొందేటటువంటి జనం సంఖ్య, 6 కోట్లనుంచి, 32½కోట్లకు పెరుగుతుంది. సేద్యపు నీటి సౌకర్యం పొందే భూమి రెండు కోట్ల పది లక్షల ఎకరాలు పెరుగుతుంది. మొదటిప్రణాళికకా కాలంలో ఒకకోటి 70 లక్షల ఎకరాలు మాత్రమే ఇలా పెరిగింది. ఇక విద్యుచ్ఛక్తిఉత్పత్తి ఎక్కువ చేయడానికి 34 లక్షల కిలోవాట్ల మొదలు 68 లక్షల కిలోవాట్లవరకు అదనంగా వుత్పత్తి చేసేందుకు 1960-61 నాటికి సాధన సంపత్తి ఏర్పరుస్తారు.

1955-56 లో తయారైన వుక్కు ఉత్పత్తి 15 లక్షల టన్నులు గాగా 1960-61 కి ఇది 43 లక్షల టన్నులకి పెంచాలని సంకల్పం, ఇలానే బొగ్గు 3 కోట్ల 70 లక్షల టన్నులనుంచి 6 కోట్ల టన్నులకీ, సిమెంటు 43 లక్షల టన్నులనుంచి ఒక కోటి టన్నులవరకున్నూ, అమ్మోనియం సల్ఫేటు రీత్యా నత్రజని ఎరువులు, 4 లక్షల టన్నులనుంచి 16 లక్షల టన్నులవరకున్నూ, భాస్వరపు ఎరువులు, సూఫర్ ఫాస్ఫేటురీత్యా లక్ష టన్నులనుంచి 6 లక్షల టన్నులవరకు పెంచాలని ప్రణాళికలక్ష్యం.

## ద్వితీయ ప్రణాళికలో పెట్టుబడులు

అభివృద్ధివ్యయం రు. 4,800 కోట్లలోను రు. 1,000 కోట్లు అభివృద్ధి స్వభావంగల వర్తమానవ్యయం. మిగతా రు. 3,800 కోట్లు పెట్టుబడుల పద్దు క్రింద వస్తుంది. అంటే అది ఉత్పత్తి కార్యక్రమాలకు కేటాయించబడిందన్నమాట.

ద్వితీయ ప్రణాళికలో ప్రయివేటు రంగంయొక్క పెట్టుబడి సుమారు రు. 2,400 కోట్లు. దీనిలో రు. 500 కోట్లు సంఘటిత పరిశ్రమలకు, గనుల అభివృద్ధికి కేటాయించబడింది.

పబ్లిక్, ప్రయివేటు రంగాలను కలిపితే, ద్వితీయ ప్రణాళికా కాలానికి ఆరిక పెట్టుబడి రు. 7,200 కోట్లు. అందులో రు. 4,800 కోట్లు ప్రభుత్వరంగంలోను, రు. 2,400 కోట్లు ప్రయివేటురంగంలోను పెట్టుబడులు.

రు. 7,200 కోట్ల పెట్టుబడి కార్యక్రమం అంటే ప్రజలమీద పెద్ద బాధ్యత మోపబడిందన్నమాట.

## ఉద్యోగాలు

ద్వితీయ ప్రణాళికాకాలంలో ఉద్యోగావకాశాలను మూడు విధాలుగా కల్పించవలసివుంది. 1. నగర, గ్రామీణ ప్రాంతాల్లో ప్రస్తుతం వున్న నిరుద్యోగులకూ, 2. కొత్తగా ఉద్యోగాలను అభ్యర్థించేవారికి (వీరు ఏడాదికి 20 లక్షలు చొప్పున ఉండగలరని అంచనా వేయబడిరది), 3. గ్రామీణ ప్రాంతాల్లోనూ, నగర ప్రాంతాల్లోనూ, చాలీచాలని ఉద్యోగాలు నిర్వహిస్తున్నవారికి అధికంగా పని కల్పించడం.

నగరప్రాంతాల్లో దాదాపు 22 లక్షల 40 వేలమంది నిరుద్యోగులున్నారని తెలిసింది.

వీరికి తోడు నగరప్రాంతాల్లో ఏటేటా ఉద్యోగాలను కోరే అభ్యర్థుల సంఖ్య పెరుగుతూ వుంటుంది. వచ్చే ఐదు సంవత్సరాలలోనూ వీరి సంఖ్య దాదాపు 38 లక్షలు పెరుగుతుందని అంచనా వేయబడింది.

గ్రామీణప్రాంతాల్లో నిరుద్యోగులనూ, చాలీచాలని ఉద్యోగాలను నిర్వహిస్తున్నవారిని విడదీయడం కష్టమవుతుంది. వారి వారి ఆదాయాలు ఎంతవరకూ హెచ్చాయి అనే విషయాన్ని ఆధారంగా చేసుకొని మాత్రమే ఆ ప్రాంతాలలో ఉద్యోగావకాశకల్పనకృషిని సమీక్షించవలసివుంది. పైగా, గ్రామీణప్రాంతాల్లో భూవసతి లేకుండా కూలిపైనే ఆధారపడి జీవించే వ్యవసాయకూలీలలోకూడా నిరుద్యోగత తీవ్రం

గావుంది. గ్రామీణ ప్రాంతాల్లో యిలాంటినిరుద్యోగుల సంఖ్య దాదాపు 20 లక్షలు ఉంటుందని తెలుస్తోంది.

పైన పేర్కొన్నట్లు, ద్వితీయ ప్రణాళికా కాలంలో ఉద్యోగాలను అభ్యర్థించేవారి సంఖ్య ఒకకోటి వుంటుంది. ద్వితీయ ప్రణాళికా కాలం పూర్తయేసరికి నగర ప్రాంతాల్లో నిరుద్యోగుల సంఖ్య మరో 30 లక్షలు పెరుగుతుందని అంచనా వేయబడినట్లు పైన చెప్పబడింది. అంటే గ్రామీణ ప్రాంతాల్లో ద్వితీయ ప్రణాళిక పూర్తయ్యే నాటికి 62 లక్షల వరకూ నిరుద్యోగులు తయారవుతారన్నమాట.

ద్వితీయ ప్రణాళికాకాలంలో అదనంగా సాగులోకి వచ్చే భూవిస్తీర్ణంలో నూటికి 50 వంతుల భాగంలో కొత్తగా పనిలో ప్రవేశించే వారికి చేతినిండా పని దొరకగలదని ఆశించవచ్చును. దీని ప్రకారం గ్రామీణ ప్రాంతాల్లో మరో 16 లక్షల మందికి వ్యవసాయ రంగంలో కొత్తగా పని లభించగలదని చెప్పవచ్చును.

విద్యావంతుల నిరుద్యోగ సమస్యనుగురించి ప్రత్యేకంగాపరిశీలించవలసివుంది. ప్రస్తుతం నిరుద్యోగులుగా వున్న $5\frac{1}{2}$ లక్షల మంది విద్యావంతులకు తోడు, ద్వితీయ ప్రణాళికాకాలంలో, మెట్రిక్యులేషను పరీక్ష పూర్తి చేసుకున్న విద్యావంతులు మరో $13\frac{1}{4}$ లక్షలమంది యీ నిరుద్యోగుల జాబితాలో చేరగలరని అంచనా. రాష్ట్రప్రభుత్వాలు అందజేసిన సమాచారాన్ని బట్టి ప్రస్తుతం నిర్వహించబడుతున్న కార్యక్రమాలు సుమారు $14\frac{1}{2}$లక్షల 40 వేలమందికి ఉద్యోగాలు కల్పించగలవనిఅంచనా. నిరుద్యోగులైన విద్యావంతుల నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన సిఫార్సులన్నీ అమలు జరిగిననాడు, నిరుద్యోగులుగావున్న మరో 24లక్షల మంది విద్యావంతులకు అదనంగా ఉద్యోగాలు లభించగలవని అంచనా.

## సహకారోద్యమం

వ్యవసాయ పరిమితికిసంబంధించిన సహకారోద్యమాన్ని పునర్వ్యవస్థీకరించడానికి ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో, రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా సహాయంతో అనేక చర్యలు తీసుకోబడ్డాయి. నేడు, సహకారోద్యమంలో 23 ప్రభుత్వ సహకార బ్యాంకులూ, 499 కేంద్ర

బ్యాంకులూ, బ్యాంకు సంఘాలూ, 1,26,954 ప్రాథమిక పరపతిసౌకర్య కల్పన సంఘాలూ, 9 కేంద్ర భూమి తణఖా బ్యాంకులూ, 291 భూమి తణఖా బ్యాంకులూ, 39,306 వ్యవసాయ సంఘాలు (పరపతి సంఘాలు కావు); 8,387 పరపతి సంఘాలు (అయితే వ్యవసాయకమైనవికావు); 21,137 సంఘాలు వ్యవసాయానికి సంబంధించినవి, చివరికి 27 లక్షల పరపతి సంఘాలు వున్నాయి.

గ్రామీణ పరపతి వ్యవహార విచారణ సంఘం చేసిన సిఫార్సులు రిజర్వు బ్యాంకూ, కేంద్రప్రభుత్వమూ, భారత సహకార కాంగ్రెసూ ఆమోదించారు. వీటిలో చాలావాటిని అమలు జరపడానికి చర్యలు తీసుకున్నారు.

1955 ఏప్రిల్ మాసంలో సమావేశమైన రాష్ట్ర సహకార మంత్రులు ఒక సూచన చేశారు. ఏమిటంటే, 15 సంవత్సరాలలో దేశంలో ఉన్నటువంటి మొత్తం వ్యాపారమంతా కూడా, పరపతి మార్కెటింగు, తయారీ మొదలైనదంతా నూటికి 50 వంతులు సహకార రంగంలోకి వచ్చేరీతిగా గ్రామీణ వ్యాపార వ్యవస్థ పూర్తిగా పునర్వ్యవస్థీకరించడమే దీర్ఘ కాల లక్ష్యంగా పెట్టుకోవాలి అని. వీరు చేసిన మరి కొన్ని సూచనలు :

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రాథమిక వ్యవసాయ పరపతిసంఘాల్లో సభ్యత్వం 50 లక్షలనుంచి $1\frac{1}{2}$ కోట్ల రూపాయలవరకూ పెంచాలి; తక్కువ కాలపు ఋణాల రూపంలో సహకారోద్యమం ద్వారా యిచ్చే మొత్తం 30 కోట్లనుంచి 150 కోట్ల రూపాయలవరకూ పెరగాలి; మధ్యకాల ఋణాల మొత్తాలు 10 కోట్లనుంచి 50 కోట్ల రూపాయలవరకూ, దీర్ఘకాల ఋణాలు 3 కోట్లనుంచి 25 కోట్లవరకూ పెంచాలి,

కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రాలూ, రిజర్వు బ్యాంక్ సంప్రదించుకుని రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో సహకారోద్యమం కార్యకలాపాలు తయారు చేశారు. ప్రతి రాష్ట్రానికి యీ క్రింది పట్టిక ప్రకారం లక్ష్యాలు యిలా నిర్ణయించారు.

పరపతి:—1. పెద్ద సహకార సంఘాలు 12 వేలు; 2. తక్కువ

కాలపు ఋణాలలక్ష్యం రు. 150 కోట్లు; 3. మధ్యకాల ఋణాలలక్ష్యం రు. 50 కోట్లు; 4. దీర్ఘకాల ఋణాలలక్ష్యం రు. 25 కోట్లు.

మార్కెటింగ్ తయారీ : మార్కెటింగు సంఘాలు 1,700; పంచదార ఫాక్టరీలు 36; పత్తిగింజ పలుపు యంత్రాలు 77; ఇతర సంఘాలు 12.

గిడ్డంగులూ, నిలవ: కేంద్ర, రాష్ట్ర కార్పొరేషన్ల గిడ్డంగులు 350 మార్కెటింగు సొసైటీల గిడ్డంగులు 1,700; పెద్ద సంఘాల గిడ్డంగులు 5,000.

ఈ లక్ష్యాలు సాధించేందుకు, రిజర్వ్ బ్యాంక్ ఇచ్చే సొమ్ముకాక, ప్రణాళికలో మొత్తం 40 కోట్ల రూపాయలు కేటాయించారు.

సహకారోద్యమంలో కూడా సిబ్బంది చాలా ముఖ్యం. పెద్ద తరహా ఉద్యోగుల శిక్షణకోసం పూనాలో రిజర్వ్ బ్యాంక్ వారి అధ్వర్యం క్రింద ఒక శిక్షణ కేంద్రం ఏర్పడివుంది. మధ్యరకం సిబ్బంది తరిఫీదుకోసం ప్రస్తుతం మూడు ప్రాంతీయ కేంద్రాలున్నాయి. త్వరలో మరొక రెండు ఏర్పడవచ్చు. తాబేదారి సిబ్బందికోసం రాష్ట్రప్రభుత్వాలు 21 శిక్షణ సంస్థలు ఏర్పరచాయి. అనతికాలంలో మరొక పది ఏర్పడాలి. సమాజ, జాతీయ వికాస కార్యక్రమ రంగంలో బ్లాకులలో పనిచేయడానికి ఒక ప్రత్యేక ఉద్యోగుల తర్ఫీదు పథకం కూడా సంకల్పించారు.

## భూసంస్కరణలు

జాతీయ ప్రణాళిక కార్యక్రమంలో గ్రామపునర్నిర్మాణం సాగించడానికి సహకార సంఘాలు, గ్రామ పంచాయతీలు ప్రధాన సంస్థలు. ఈవిధంగా సాగించదగిన సంస్థాస్వరూపానికి సహకార గ్రామ నిర్వహణ అని పేరు పెట్టారు. ఈ లక్ష్యం సాధించే సాంఘిక, ఆర్థిక మార్పుల్లో భూసంస్కరణల పథకం చాలాముఖ్యమైన పాత్ర నిర్వహించవలసివుంది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద దేశంలో అంతటా కమతాలకు గరిష్ఠ పరిమితులను నిర్ణయించివేసే కార్యక్రమాన్ని పూర్తి చేయాలని ఉద్దేశించబడింది. అయిదుగురితో కూడిన కుటుంబానికి ఎంత కుటుంబ కమతం ఉండాలని సూచించబడిందో అంతకు 3 రెట్లను గరిష్ట పరిమి

లిగా నిర్ణయించాలని సిఫార్సు చేయడమైంది. కుటుంబంలో సభ్యుల సంఖ్య ఎక్కువగా వున్నప్పుడు గరిష్ఠ పరిమితిని కుటుంబ ఆస్తికి ఆరు రెట్లుగా నిర్ణయించవచ్చును. ఇంతకమించి గరిష్ఠ పరిమితిని పెంచరాదు. గరిష్ఠ పరిమితులను ఈక్రింది రకాల భూములకు వర్తింపజేయరాదు.

1. తేయాకు, కాఫీ, రబ్బరుతోటలు. పారిశ్రామిక ఆదాయంతో పాటు వ్యవసాయక ఆదాయంపైకూడా పన్ను విధించాలి. ఇట్టి భూమిని వ్యవసాయభూమిగా మాత్రం పరిగణించకూడదు.

2. ఏకఖండంగావున్న తోటలు.

3. పశువుల పెంపకం, పాడి పరిశ్రమ, ఉన్ని పరిశ్రమసాగించే స్థలాలు.

4. కట్టుదిట్టంగా వ్యవసాయం సాగిస్తూ భారీ ఎత్తున పెట్టుబడి పెట్టి ఏక ఖండంగా ఉన్న వ్యవసాయ భూములకు మాత్రం, గరిష్ఠ పరిమితిని విధించడంవల్ల ఉత్పత్తి తగ్గిపోతుందనుకొనే పక్షంలో గరిష్ఠ పరిమితి అవసరమైతే సవరించుకోవచ్చును.

గరిష్ఠ పరిమితికి పైబడిన భూమిని రాష్ట్ర ప్రభుత్వాలు స్వాధీన పరచుకొని వ్యవసాయదారులకు తగిన నష్ట పరిహారం చెల్లించాలి. 20 ఏళ్ళలో సొంతం చెల్లించి వేయగల పద్ధతిపై ఋణ పత్రాలను ఇవ్వ వచ్చును. మిగులు భూమిని రైతులకు పంపకం చేసే పక్షంలో, రైతులు న్యాయమైన శిస్తును ప్రభుత్వానికి చెల్లించవలసి ఉంటుంది.

గరిష్ఠ పరిమితిని విధించడంవల్ల లభించే భూములను పంపకం చేసేటప్పుడు, సన్నకారు రైతాంగానికీ, భూములనుండి తొలగించబడి దుస్థితి పాలైన రైతులకూ వాటిని ముఖ్యంగా పంపకం చేయాలి. పెద్ద పెద్ద ఖండాలను సహకార సంస్థలద్వారా నిర్వహించాలి. ఏవిధంగాను లాభసాటికాని చిన్న కమతాల వారిని, యజమానుల ఆమోదంతో యీ సహకార సంస్థల్లో చేర్చాలి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో భూమిలేని వ్యవసాయ కూలీలకు భూములను యిప్పించడానికి విస్తృతమైన కార్యక్రమాన్ని ఏర్పాటు చేయాలి. అయితే, ఇప్పుడే వ్యవసాయంపై ఆధారపడిన వారి

సంఖ్య చాలా హెచ్చుగా ఉన్నందున మరి కొంతమందికి మాత్రమే సేద్యంలో నిదురుకోవడానికి అవకాశం ఉంది.

## సమాజ, జాతీయ వికాస కార్యక్రమాలు

గ్రామాల్లో సాంఘిక, ఆర్థిక జీవితం మార్చే కార్యక్రమంలో సమాజ ప్రణాళికలు పద్ధతి ఆనిన్నీ, వికాస కార్యక్రమం సాధనమనిన్నీ మొదటి పంచవర్ష ప్రణాళిక సందర్భంలో నిర్వచించడం జరిగింది. ఇందులో ప్రధానాంశాలు యివి :

ఒకటి, సమాజ కార్యక్రమ పద్ధతి; రెండోది, యీ సమాజ కార్యక్రమ పద్ధతి ప్రజాసహకారంతో జాతీయ వికాస పథకం రీత్యా అమలు జరపడం; ఇక మూడోది, అధికారుల్నీ, అధికారేతరుల్నీ ఒక సమాన విషయానికిగాను సహకరింపజేసే అభివృద్ధి కార్యక్రమాలు.

ఈ సమాజ, జాతీయ కార్యక్రమాల ఫలితాలు నిర్ణయించడంలో ఒక విషయం గుర్తుంచుకోవాలి. వీటిమీద ఎంత ఖర్చయిందీ,ఖచ్చితంగా వీటివల్ల కలిగిన విషయాలేమిటి అన్న హంశాల రీత్యాకాక, యీ కార్యక్రమంవల్ల ప్రజల జీవితంలో, వారి కార్యకలాపాల్లో ఎటువంటి ప్రభావం వున్నదీ అన్న విషయాల రీత్యా, యీ ఫలితాలవిలువ కట్టాల్సి వుంటుంది. ప్రజలు యీ కార్యక్రమాల విషయంలో సహకరించడానికి ఎంత సంసిద్ధులై వున్నారో తెలుసుకోడానికి ఒక్క హంశం చాలు. ప్రభుత్వం పెట్టిన ఖర్చులో చూస్తే వీరు చేసిన సహాయం నూరింట అరవై వంతులుంది.

1955-66 వ సంవత్సరానికి మొదటి ప్రణాళిక కాలం పూర్తయే సరికి దేశపు గ్రామీణ జనాభాలో నాలుగోవంతు ప్రజ యీ కార్యక్రమం కింద లాభం పొందాలన్న లక్ష్యాల్ని సాధించడం ద్వారా యిలా అడపా దడపా కొత్త ప్రాజెక్టులు ప్రారంభించాయి. మొత్తం మీద 1,20,000 గ్రామాలూ, ఎనిమిదికోట్ల ప్రజా, 1200 డెవలప్ మెంటు బ్లాకుల రీత్యాలాభం పొందారు. ఈ పన్నెండు వందల బ్లాకుల్లోనూ ఏడు వందల బ్లాకుల్లో సమాజ కార్యక్రమాలు అమలుజరపడం జరిగింది.

రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో జాతీయ వికాస కార్యక్రమం యావత్తు దేశానికీన్నీ లాభం కలగచేయాలనీ, జాతీయ వికాస కార్యక్రమం అమలుజరుగుతున్న బ్లాకులలో నూటికి నలభైవరకు సమాజ కార్యక్రమ పథకాలకి అనువుగా మార్చాలనీ, నేషనల్ డెవలప్‌మెంటు కౌన్సిలువారు ఆమోదించారు. అంటే, మరొక మూడువేల ఎనిమిదివందల జాతీయ వికాస కార్యక్రమ బ్లాకుల్లో పనిచేయడమన్నమాట. ఇందులో కనీసం పదకొండు వందల ఇరవై అయినా, రెండవ ప్రణాళికాకాలంలో సమాజ కార్యక్రమపు బ్లాకులుగా మార్చవలసి వుంటుంది.

ఈ పై జెప్పిన అభివృద్ధి కార్యక్రమానికి సుమారు 263 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. కాని, 200 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించారు.

సమాజ, జాతీయవికాస కార్యక్రమాల నిర్వహణకీ, సాంకేతిక వ్యవహారాలకీ కూడా చాలా సిబ్బంది కావాలి. మొదటి ప్రణాళిక ఆఖరయ్యేసరికి సుమారు 84 వేలమంది యీ కార్యక్రమాల్లో జీవనోపాధి, సంపాదించుకుంటూ వుంటారని అంచనా. ప్రాజెక్టు ఆఫీసర్లు, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్లు, గ్రామ సేవకులూ, సాంఘిక విద్యోద్యోగులు, నర్సులు, డాక్టర్లు, ఓవర్సీర్లు, మెకానిక్కులు, ఇంజనీర్లు, రకరకాల వారున్నారు. ఇక రెండో ప్రణాళిక కాలంలో మొత్తం ఇంకా అదనంగా రెండు లక్షల మందికి పని దొరుకుతుందని అనుకోవచ్చు.

## వ్యవసాయోత్పత్తి

మొదటి పంచవర్ష ప్రణాళికలో సేద్యపు నీరు, విద్యుచ్ఛక్తి సప్లయిలతోపాటు వ్యవసాయోత్పత్తి వృద్ధిచేయడానికి అమలుపరచిన కార్యక్రమాల మొత్తం ఖర్చులో నూరింట 15 వంతులు కేటాయించడం జరిగింది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో ధాన్యపుగింజల ఉత్పత్తి 1,10,00,000 టన్నులనుంచి 6,50,00,000 టన్నులవరకూ, పత్తిఉత్పత్తి 13 లక్షల బేళ్ళవరకూ, జనుము 7,00,000 టన్నుల వరకూ పెరిగింది.

వ్యవసాయోత్పత్తికి సంబంధించిన ప్రధాన లక్ష్యాలు యీ క్రింది జాబితాలో తెలియజేయడమైంది.

టన్నులు లక్షలలో

| వస్తువు | 1955 లో ఉత్పత్తి అంచనా | అదనపు ఉత్పత్తి లక్ష్యము | 1960-61 సంవత్సరానికి ఉత్పత్తి అంచనా |
|---|---|---|---|
| ధాన్యపుగింజలు | 650 | 100 | 750 |
| నూనెవిత్తులు | 55 | 15 | 70 |
| చెరకు (బెల్లం) | 50 | 16 | 66 |
| పత్తి | 42 | 13 | 53 |
| ఇనుము | 40 | 10 | 50 |

పై పట్టీలో పత్తి ఉత్పత్తి బేళ్ళల్లో ఇవ్వబడినది.

ప్రణాళికా కాలంలో పెద్ద, చిన్న ఇరిగేషన్ పథకాలక్రింద రమారమి 210 లక్షల ఎకరాలభూమి అదనంగా సాగుకు వస్తుంది. ఇందులో 90 లక్షల ఎకరాల భూమిలో గొట్టపుబావుల స్కీములు మొదలైన చిన్నతరహా సేద్యపు నీటిపథకాల ద్వారా జరుగుతుంది. నత్రజని ఎరువుల వాడకం 5,10,000 టన్నులనుంచి సాలీనా 13 లక్షల టన్నుల వరకూ, అంటే మూడురెట్లు పెరుగుతుంది, మేలిరకపు విత్తులు ఉత్పత్తి చేసి వృద్ధిపరచడానికి తగుచర్యలు తీసుకుంటారు. జపాను వరి సాగుపద్ధతి మొదటి పంచవర్ష ప్రణాళికకాలం ఆఖరికి సుమారు 20 లక్షల ఎకరాల భూమిలో ప్రవేశపెట్టి చూశారు. రెండవ ప్రణాళికాకాలం ఆఖరయ్యే సరికి రమారమి 40 లక్షల ఎకరాలలో యీ పద్ధతి వ్యాపింపజేస్తారు.

రెండవ ప్రణాళికాకాలంలోవున్న ముఖ్యాంశాలలో ఒకటి కాయ కూరలు, పండ్లు ఎక్కువగా ఉత్పత్తిచేయడం. ఆహారం విషయంలో శరీర రక్షణకి అవసరమైన దినుసులు సప్లయిచేయడం రీత్యానేమి, వ్యవసాయంలో రకరకాల ఉత్పత్తులు ప్రోత్సహించడం రీత్యానేమి, పండ్లు కూరలు ఉత్పత్తి ప్రోత్సహించేందుకు ప్రణాళికలో 8 కోట్లనుంచి 9 కోట్ల రూపాయల వరకూ కేటాయించారు.

గ్రామాల్లో ఆర్థికవ్యవస్థ మెరుగుచేయడానికి, ప్రజల జీవనప్రమాణాలు వృద్ధిచేయడానికి పశువుల పెంపకము, పాడి పరిశ్రమ ముఖ్యము. పశువుల పెంపకానికి 40 కోట్ల రూపాయలున్నూ, పాడి పరిశ్రమకు 22

కోట్ల రూపాయలనూ కేటాయించడంరీత్యా, రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో, యీ రంగాలలో యింతవరకూ సాధించినదానికన్న ఇంకెంతో సిద్ధింపజేసుకోగలుగుతామని ఆశిస్తున్నారు.

రాష్ట్రాల్లో పశుపోషణకి సంబంధించిన పథకాల్లో, పశువైద్య సౌకర్యాలు, కీలకగ్రామాలు ఏర్పరచడం, గోసదనాలు, గోశాలలు ఏర్పరచడం, పశువ్యాధులు అదుపులో వుంచడానికి ఏర్పాటు చెయ్యడం చేరివుంటాయి. గోళ్ళ, గొర్రెల పెంపకం, ఉన్ని పరిశ్రమ అభివృద్ధి వీటికికూడా కొంత కేటాయింపు జరిగింది. మొదటి ప్రణాళికా కాలంలో పశువైద్యశాలలు రెండువేలనుంచి 2,500 దాకా పెరిగాయి. రెండవ ప్రణాళికా కాలంలో మరొక 1,900 వైద్యశాలలు ఏర్పరిచే ఆలోచన వుంది.

పశువుల్లో మేలురకపు పశువుల్ని వృద్ధిచేయడంకోసం కీలకగ్రామ పథకం అమలులో వుండనేవుంది. దీనిప్రకారం కొన్నికొన్ని గ్రామాల్ని కీలకస్థానాలుగా యెంచుకొని ఆయా కేంద్రాల్లో ఒక్కొక్క దాంట్లో రమారమి 5,000 ఆవుల్ని వుపయోగించడం జరుగుతుంది. మొదటి పంచవర్ష ప్రణాళికాకాలంలో ఇలాటివి ఆరువందల గ్రామాలు ఏర్పరచారు. కృత్రిమ సంయోగపద్ధతులద్వారాపశువుల్నికట్టించేందుకు 150కేంద్రాలు స్థాపించారు. రెండవ ప్రణాళికాకాలంలో లక్ష్యాలు దీనికి రెట్టింపు. రెండవ ప్రణాళికాకాలంలో ఏర్పరిచే 1200 కీలకగ్రామాలూ, 300 కృత్రిమ సంయోగకేంద్రాలు మొత్తం 3,000 పోతుల్ని, 9,36,000 మేలురకపు ఎద్దుల్ని, 10,009 ఆవుల్ని సృష్టిస్తాయనుకుంటున్నారు. బాగా పాలు యిచ్చే కొన్ని పాడి పశువుల అభివృద్ధికోసం ప్రత్యేకంగా ఫారములు ఏర్పరిచే ఆలోచనవుంది.

ఉత్పత్తిదారులకి సరైన ఫలితం లభించాలంటే వ్యవసాయ దినుసుల అమ్మకం విషయంలో శ్రద్ధ తీసుకోవడం అవసరం. ఇది గుర్తించబట్టే మొదటి ప్రణాళికా కాలంలో వ్యవసాయ ఉత్పత్తుల మార్కెటింగు చట్టం దేశంలో ముఖ్యమైన వ్యవసాయ మార్కెట్లు అన్నిటికీ వర్తింపజేశారు. 1950-51 లో ఇలా చట్టం పరిమితిలోకి వచ్చిన మార్కెట్లు 265 అయివుండగా ఆ ప్రణాళిక ఆఖరు అయేసరికి 480

వరకు పెరిగివుండాలని అంచనా. రెండో ప్రణాళిక కాలంలో మరొక అయిదారు వందల వ్యవసాయ మార్కెట్లు యీ పథకం క్రిందికి తేవాలని యోచన.

## ఇరిగేషను, విద్యుచ్ఛక్తి

తొలి పంచవర్ష ప్రణాళిక క్రింద నిర్వహించబడిన ఇరిగేషను, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలు దీర్ఘకాలిక ప్రణాళికలోని తొలిదశక్రింద పరిగణించబడినవి. రెండవ పంచవర్ష ప్రణాళికలో, తొలి ప్రణాళిక కాలంలో నిర్మాణం ప్రారంభమైన అనేక ప్రాజెక్టులను కొనసాగించవలసి రావడమేగాక, మధ్య రకం ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రాధాన్యం యివ్వబడినది. ద్వితీయ ప్రణాళిక కాలంలో ఇరిగేషను, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలకు, రు 913 కోట్లు కేటాయించబడ్డాయి. పై రెండు కార్యక్రమాలకు తొలి పంచవర్ష ప్రణాళికలలో రు. 661 కోట్లు మాత్రం కేటాయించబడ్డాయి.

తొలి పంచవర్ష ప్రణాళిక గడువులో 70 లక్షల ఎకరాల భూమి సాగులోకి తేబడింది. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద 120 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తేవడానికి తల పెట్టబడింది. ఆ మొత్తంలో 90 లక్షల ఎకరాలు తొలి ప్రణాళిక క్రింద ప్రారంభమైన ప్రాజెక్టుల వల్ల సాగులోకి వస్తుంది. మిగతా 30 లక్షల ఎకరాలు రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన ప్రాజెక్టులవల్ల సాగులోకి వస్తుంది. అంటే యీ క్రొత్త ప్రాజెక్టులవల్ల మొత్తం 150 లక్షల ఎకరాల భూమి సాగులోకి రాగలదు.

తొలి పంచవర్ష ప్రణాళిక మొదట్లో విద్యుచ్ఛక్తి కేంద్రాల ఉత్పాదక శక్తి 23 లక్షల కిలోవాట్ల గంటలు. తొలి పంచవర్ష ప్రణాళిక గడువులో ఆ మొత్తం, 34 లక్షల కిలోవాట్ గంటలకు పెరిగింది. అందులో ప్రభుత్వరంగంలో ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తి 14 లక్షల కిలోవాట్ గంటలు.

రానున్న 10 సంవత్సరాలలోనూ, విద్యుదుత్పాదక శక్తిని సాలీనా నూటికి 20 వంతులు చొప్పున పెంపొందించాలని అంచనా వేయబడింది. అంటే 1966 నాటికి నిర్ణయింపబడినలక్ష్యం ఒకటిన్నరకోట్ల కిలోవాట్ల

గంటలు. అంటే రెండవ పంచవర్ష ప్రణాళిక గడువు పూర్తి అయ్యే వరకు 68 లక్షల కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తిని పెంపొందించవలసి ఉన్నది.

## గ్రామీణ పరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికకింద గ్రామీణ పరిశ్రమలు చిన్న రకం పరిశ్రమల అభివృద్ధికోసం ఆయా బోర్డులుతయారుచేసిన ముసాయిదా పథకాలను గ్రామీణ చిన్నరకం పరిశ్రమల కమిటీవారు పరిశీలించి రు. 260 కోట్ల ఖర్చుతోకూడిన కార్యక్రమాలను తయారుచేశారు. కాని అంతిమంగా ద్వితీయ ప్రణాళికలో వీటి నిమిత్తం రు. 200 కోట్లు కేటాయింపబడింది.

గ్రామీణ చిన్నరకం పరిశ్రమల అభివృద్ధి నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు తయారుచేసిన తుదిప్రణాళికలలో రు. 127 కోట్లు కేటాయించబడింది. గ్రామీణ చిన్నరకం పరిశ్రమల కమిటీ నివేదిక ప్రకారం యీ అంచనాలను తిరిగి సవరించడం అవుతుంది.

ప్రస్తుతం అనేక రాష్ట్రాలలో యీ పరిశ్రమల నిర్వాహణ వ్యవస్థ చాలా లోప భూయిష్టంగా ఉంది. కాబట్టి, ప్రతిరాష్ట్ర ప్రభుత్వము గ్రామీణ, చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి విస్తరణ సంస్థనొక దానిని ఏర్పాటు చేసుకోవడం అత్యవసరం.

గ్రామీణ చిన్నరకం పరిశ్రమల కమిటీవారు చేసిన సూచనలు, కేంద్రప్రభుత్వం చేసిన నిర్ణయాలు, కేటాయింపును పురస్కరించుకొని ఆయా బోర్డులు తమ కార్యక్రమాలను తక్షణమే సవరించుకోవలసి ఉంటుంది.

చిన్నరకం పరిశ్రమలను అభివృద్ధి చేయాలంటే వివిధ రకాలవస్తువుల ఉత్పత్తులను విడిభాగాల ఉత్పత్తులను వేర్వేరు పరిశ్రమలకు కేటాయించి అన్ని పరిశ్రమల అభివృద్ధికి సమానంగా తోడ్పడాలి. పరిశ్రమలు ప్రైవేటు రంగానికి సంబంధించినవే అయినా, యిట్టి కేటాయింపులు జరగటం ఆవశ్యకం. ఈ వస్తూత్పత్తి కేటాయింపులను చిన్నరకం పరిశ్రమల శక్తిసామర్థ్యాలను పురస్కరించుకొని చేయాలి. మరొక

వంక ప్రజలకు వస్తువుల కొరత ఏర్పడకుండా కూడా జాగ్రత్తపడాలి. పోతే ఉత్పత్తులను ఏవిధంగా ఎంత మేరకు కేటాయించాలి అనేవిషయం ఎప్పటికప్పుడు పునస్సమీక్ష చేస్తూ ఉండాలి.

దంపుడుబియ్యం వాడకాన్ని అభివృద్ధి చేసే నిమిత్తం వీలైన చోట్ల కొత్తగా బియ్యపు మిల్లులను స్థాపించకుండా నివారించాలని సూచింప బడింది.

## పెద్దరకం పరిశ్రమలు

తొలి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయం, ఇరిగేషను, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలకు ప్రాధాన్యం యివ్వబడింది. ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామిక అభివృద్ధికి, ఖనిజ సంపదాభివృద్ధికి విశేష ప్రాధాన్యం యివ్వబడింది.

తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రభుత్వరంగంలో అనేక పారిశ్రామిక పురోభివృద్ధి పథకాలు, సింద్రీ ఎరువుల ఫాక్టరీ, చిత్తరంజన్ రైలు ఇంజన్ కర్మాగారం, భారత టెలిఫోన్ ఇండస్ట్రీస్, పెరంబూరులోని ఇంటిగ్రల్ కోచ్ ఫాక్టరీ, యంత్రపు పనిముట్ల కర్మాగారం, పెన్సిలిన్, డిడిటి, న్యూస్ ప్రింటు, సూపర్ ఫాస్ఫేటు ఫాక్టరీల లాంటివి అమలు పరచబడ్డాయి. ఉక్కు, ఇనుము పరిశ్రమ, భారీ విద్యుచ్ఛక్తి పరిశ్రమ (ప్రభుత్వరంగం నిర్వహించవలసినవి) అనుకొన్నదానికంటె ఆలస్యంగా అమలులోనికి వచ్చాయి.

ప్రభుత్వ యాజమాన్యంక్రింద మూడు ఉక్కు ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి, ప్రస్తుతం వున్నవాటిని అభివృద్ధి చేయడానికి సంకల్పించబడింది.

రెండవ ప్రణాళిక క్రింద పరిశ్రమల అభివృద్ధికి, ఖనిజ సంపదాభివృద్ధికి, ప్రభుత్వం కేటాయించిన ధనం రు 890 కోట్లు. ఇదిగాక గ్రామపరిశ్రమలు, చిన్న రకం పరిశ్రమల అభివృద్ధికి రు. 200 కోట్లు కేటాయించబడ్డాయి. ఈ పరిశ్రమల అభివృద్ధికి ప్రయివేటు రంగంలో ఎంతో తోడ్పడవలసి వున్నది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తలపెట్టబడిన పారిశ్రామిక అభి

వృద్ధి కార్యక్రమాలు యీ క్రిందివాటికి ప్రాధాన్యం యిచ్చి రూపించ బడ్డాయి.

1. ఇనుము, ఉక్కు ఉత్పత్తి పెంపుదల, యంత్రాల వుత్పత్తి, భారీ ఇంజనీరింగు, రసాయనిక పరిశ్రమలు (నత్రజని ఎరువులతో సహా.)

2. సిమెంటు, ఫాస్ఫేటు ఎరువుల వుత్పత్తి పెంపుదల.

3. ఇదివరకే వున్న జనపనార, ప్రత్తి, పంచదార పరిశ్రమల ఆధునికీకరణ అభివృద్ధి.

4. ప్రస్తుతం వున్న పరిశ్రమలో ఉత్పత్తి సామర్థ్యానికి, నికరం ఉత్పత్తిగల వ్యత్యాసాలను తొలగించి ఉత్పత్తి సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించడం.

5. వాడకం దారుల వస్తువుల ఉత్పత్తిని పెంపొందించడం.

## ప్రభుత్వయాజమాన్యంక్రింద అభివృద్ధి కార్యక్రమాలు

ద్వితీయ ప్రణాళిక క్రింద 10 లక్షల కడ్డీలు ఉత్పత్తి చేయగల మూడు ఉక్కు ఫాక్టరీలు ప్రభుత్వ రంగంలో నెలకొల్పబడగలవు. ఇది గాక యీ మూడు ఫాక్టరీలలోనూ ఒకదానిలో 3,50,000 టన్నుల ముడి ఇనుము కడ్డీలు ఉత్పత్తి చేయబడతాయి. ఒరిస్సాలోని రూర్కేలా ఉక్కు ఫాక్టరీ 7,20,000 టన్నుల ఉక్కును తయారుచేయగలదు. మధ్యప్రదేశ్ లోని భిలాయ్ ఉక్కు ఫాక్టరీలలో 7,50,000 టన్నుల ఉక్కు ఉత్పత్తులు తయారు కాగలవు. పశ్చిమ బెంగాలులోని దుర్గాపూరులో నెలకొల్పబడే ఉక్కు ఫాక్టరీ సాలీనా 7,50,000 టన్నులను ఉత్పత్తిచేయగలదు. మైసూరు ఇనుము, ఉక్కు ఫాక్టరీలో ఉత్పత్తి 1,00,000 టన్నులకు పెరుగగలదు. ద్వితీయ ప్రణాళిక ఆఖరునాటికి ప్రభుత్వరంగంలో 20 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తులు తయారు కాగలవు.

దక్షిణ భారత దేశంలో బొగ్గు కొరతగా వున్నందున దక్షిణ ఆర్కాటు జిల్లాలో నైవేలీలోని లిగ్నైటు ప్రాజెక్టు అత్యధిక ప్రధానం కాగలదు. దక్షిణ ఆర్కాటులో నెలకొల్పబడే రసాయనిక ఎరువుల ఫాక్టరీగాక మరొక రెండు రసాయనిక ఎరువుల ఫాక్టరీలు నెల

కొల్పబడనున్నాయి. వాటిలో ఒక ఫ్యాక్టరీ నాంగల్‌లో నెలకొల్ప బడుతుంది. అందులో 70,000 టన్నుల నత్రజని తయారుకాగలదు. మూడవ ఫ్యాక్టరీ రూర్కెలాలో నెలకొల్పబడుతుంది. నత్రజని ఎరువులు సాలీనా 85,000 టన్నులు యిప్పుడు ఉత్పత్తి అవుతున్నాయి. ద్వితీయ ప్రణాళిక గడువు ఆఖరునకు 3,70,000 టన్నుల ఎరువులు ఉత్పత్తి కాగలవు.

## రైల్వేలు

రు. 910 కోట్ల పెట్టుబడీ, 34,705 మైళ్ళ నిడివి గల భారత రైల్వేలు మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు పునాది వంటివి. గత కొద్ది సంవత్సరాలలోనూ రైల్వే మార్గాల విస్తరణకంటే, వున్న వాటిని ఆధునికీకరణం చేయడానికే ఎక్కువగా శ్రద్ధ వహించబడింది.

ప్రయాణీకులకూ, సరుకు రవాణాకూ సౌకర్యాలు యితోధికంగా పెంపొందించడమే ద్వితీయ ప్రణాళికలో రైల్వేల ప్రధాన లక్ష్యం. వివిధ రంగాల్లో నిర్ణయించబడిన ఉత్పత్తి లక్ష్యాల దృష్ట్యా సరుకుల రవాణా నూటికి 51 వంతులు హెచ్చగలదనీ, అంటే ప్రథమ ప్రణాళికా కాలాంతంలో 14 కోట్ల టన్నుల సరుకు రవాణా అవుతుండగా, 1960-61 ప్రాంతానికి రవాణా 18 కోట్ల 10 లక్షలకు హెచ్చగలదని అంచనా వేయబడింది. రోజురోజుకూ పెరుగుతూన్న యీ అవసరాలను తీర్చాలని రైల్వేశాఖ సమకట్టింది.

ద్వితీయ ప్రణాళికా కాలంలో ఏడాదికి 16 వందల చొప్పున అంటే ఐదేళ్ళమీద 8,000 మైళ్ళవరకూ పాత రైలుమార్గాల పునర్నిర్మాణం జరుగుతుంది. 1,600 మైళ్ల పొడవు జంట రైలు మార్గాలు వేయబడతాయి. 265 మైళ్ళ నిడివిగల మీటర్ రైలు మార్గాలు బ్రాడ్ గేజ్ రైలు మార్గాలుగా మార్చబడతాయి. దేశం మొత్తంమీద 800 మైళ్లు నిడివిగల రైలు మార్గంలో విద్యుచ్ఛక్తి రైళ్ళూ, 1,293 మైళ్ళు పొడవుగల రైలు మార్గంలో డీసెల్ కార్లు నడపబడతాయి.

రైల్వేల అభివృద్ధి కార్యక్రమానికి ద్వితీయ ప్రణాళికలో రు. 900 కోట్లు ప్రత్యేకించబడింది.

## రోడ్లు

ప్రథమ ప్రణాళికా ప్రారంభంలో భారత దేశంలో 75,000 మైళ్ళ కంకర రోడ్లూ, 1,47,000 మైళ్ల మట్టి రోడ్లూ వున్నాయి. ప్రథమ ప్రణాళికా కాలంలో 6,000 మైళ్ళ కొత్తరోడ్లూ, 20,000 మైళ్ళ మామూలు రోడ్లూ నిర్మించాలని అంచనా వేయబడింది. జాతీయ రహదారుల కార్యక్రమంలో 2,500 మైళ్ళ పాత రోడ్లు వేయబడ్డాయి. రహదార్లను కలుపుతూ 640 మైళ్ళ పొడవుగల కొత్త రోడ్లు వేయబడ్డాయి. 40 పెద్ద బ్రిడ్జిలు నిర్మించబడ్డాయి.

ద్వితీయప్రణాళికా కాలంలో రోడ్ల నిర్మాణ కార్యక్రమానికి రు. 246 కోట్లు కేటాయించబడింది. జాతీయ రహదారులు కార్య క్రమంలో 1,700 మైళ్ళ పొడవుగల పాత రహదారులు బాగుచేయబడ తాయి. బళ్ళు పోయే 1,700 మైళ్ళ పొడవుగల రోడ్లు విశాలం చేయ బడతాయి. 60 పెద్ద బ్రిడ్జీలు నిర్మించబడతాయి. ఇక తదితర కార్య క్రమంలో 1,500 మైళ్ల పొడవుగల కొత్తరోడ్లు వేయబడతాయి.

## నౌకానిర్మాణం

యుద్ధానంతరం భారత నౌకా నిర్మాణ కార్యక్రమం పురోగతి అనుకున్నంత వేగంగా సాగలేదు. ప్రథమ ప్రణాళిక ప్రారంభంలో భారత దేశంలో నౌకల మొత్తం టన్నేజీ, 3,60,707 వుంది. ఈ టన్నేజిని ఆరులక్షలకు పెంచాలని ప్రథమ ప్రణాళిక లక్ష్యం. ఈ లక్ష్యం సాధించబడగలదని అంచనా వేయబడింది. ద్వితీయ ప్రణాళికా కాలంలో యీ టన్నేజి 9 లక్షలకు పెంచాలని నిర్ణయం.

## సాంఘిక సేవా సౌకర్యాలు

ద్వితీయ ప్రణాళికలో సాంఘిక సేవా సౌకర్యాలకింద రు. 945 కోట్లు, అనగా ప్రథమ ప్రణాళికలోకంటే సుమారు రెట్టింపు కేటా యించబడింది. ప్రజలకు ఆరోగ్యం, విద్యా, గృహనిర్మాణాది సౌకర్యా లను కల్పించడంలో ప్రభుత్వాధికారుల బాధ్యతకూడా కొంత వున్నప్ప టికీ, ప్రజలలో స్వయంకృషిని రేకెత్తించి వారికి తోడ్పడం వరకే ఆ బాధ్యత పరిమితమై వుండాలి.

సాంఘిక సేవా సౌకర్యాల నిమిత్త కేటాయించిన రు. 945 కోట్లు, యీ విధంగా పంపకం చేయబడింది. విద్య, రు. 397 కోట్లు; ఆరోగ్యం పట్టణ ప్రాంతాలకు నీటిసరఫరాతో సహా, 274 కోట్లు, గృహ నిర్మాణం రు. 126 కోట్లు; కార్మికుల నిమిత్తం సౌకర్యాలు, రు. 29 కోట్లు; వెనుకబడిన తరగతుల సంక్షేమం రు. 91 కోట్లు: విద్యావంతులైన నిరుద్యోగులకు సాంఘిక పథకాలు, రు. 5 కోట్లు.

ప్రజలకు ఆరోగ్య సంరక్షణనిమిత్తం ద్వితీయ ప్రణాళికద్వారా ముఖ్యంగా యీ క్రింది లక్ష్యాలను సాధించడానికి కృషి జరుగుతుంది. అంటువ్యాధుల నివారణ; వాతావరణ పారిశుద్ధ్యాన్ని సంరక్షించడం; వైద్య సౌకర్య వ్యాప్తికి సంస్థలను ఏర్పాటు చేయడం; వైద్య ఆరోగ్య శాఖల సిబ్బంది శిక్షణ నిమిత్తం సౌకర్యాలు ఏర్పాటుచేయడం: కుటుంబ నియమనం.

1951 లో ఇండియాలో మొత్తం 8600 వైద్యసంస్థలూ, వాటిలో 1,13,000 పడకలూ వుండేవని అంచనా వేయబడింది. 1955-56 లో 1,25,000 పడకలు గలిగిన సుమారు 10,000 వైద్యసంస్థలు వున్నాయని అంచనా. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయేలోగా వైద్యసంస్థల సంఖ్య 12,600 లకు పెరుగుతుంది. ఆ వైద్యసంస్థలలో 1,55,000 పడకలు వుంటాయి. అంటే వైద్య సంస్థలు నూటికి 26 వంతులున్నూ, పడకలు నూటికి 24 వంతులున్నూ అభివృద్ధి అవుతాయి.

1950 సంవత్సరంలో దేశంలో మొత్తం 56,300 వైద్యులు వున్నారు. కాగా ప్రథమ ప్రణాళిక అంతమయేలోగా వారి సంఖ్య 70,000 కు పెరుగుతుంది. ప్రతి అయిదువేల జనాభాకు ఒక వైద్యుని చొప్పున ద్వితీయ ప్రణాళిక ముగిసేలోగా మొత్తం సుమారు 90,000 మంది డాక్టర్లు కావలసివస్తారు. అనగా ఏడాదికి 4,000 మంది డాక్టర్లను అదనంగా తర్ఫీదు చేయగలగాలి. 1950-51 లో వైద్యకళాశాలల సంఖ్య 30 ఉండగా, వాటి సంఖ్య 1955-56 లో 40 అయింది. ఈ కళాశాలలలో ప్రవేశిస్తున్న విద్యార్థులసంఖ్య 2,500 నుంచి 3,500 కు పెరిగింది. అనగా ఏడాదికి సగటున 2,000 మంది డాక్టర్లు తయారు అవుతున్నారు. 28 వైద్య కళాశాలలను అనుబంధ ఆసుపత్రులను అభివృద్ధి చేయడానికి

రాష్ట్రాలు పథకాలు తయారు చేశాయి. కేంద్రప్రభుత్వం ఆరు కొత్త వైద్య కళాశాలలను నెలకొల్పడంలో తోడ్పడుతుంది.

## విద్య

వచ్చే 10 ఏళ్ళలోగా, 14 ఏళ్ళ లోపు వయస్సుగల బాలబాలిక లందరికీ నిర్బంధ ప్రాథమిక విద్య బోధించడానికి ఏర్పాట్లు చేయాలని రాజ్యాంగంలో నిర్దేశింపబడింది. ప్రథమ ప్రణాళికను ప్రారంభించక పూర్వం దేశంలో 6 మొదలు 11 ఏళ్ళ వరకు వయస్సుగల పిల్లలలో నూటికి 42 మందికి ప్రాథమికవిద్య నేర్పడానికి అవకాశాలు వుండేవి. 11 నుంచి 14 ఏళ్ళలోపు వయస్సుగల బాలబాలికలు నూరింట 15 మందికి పూర్వం విద్యాబోధ నావకాశాలు వుండగా ఇప్పుడు నూటికి 17 మందికి విద్యాబోధనావకాశాలు ఉన్నాయి. కాని విద్యాభ్యాసం చేస్తున్న పిల్లలలో నూరింట 20 మంది మాత్రమే బాలికలు. 14 నుంచి 17 లోపు వయస్సుగల పిల్లల్లో విద్యార్థుల సంఖ్య నూటికి 6. 4 వంతులనుంచి 9 వంతులకు పెరిగింది. కాని బాలికల సంఖ్య మాత్రం మొత్తం విద్యార్థుల సంఖ్యలో 6.5 వంతులు మాత్రమే వుంది. గ్రామ ప్రాంతాలలో అనేక మంది పిల్లలు బడిలో ప్రవేశించిన 2, 3 ఏళ్లకి బడి మానుకుంటున్నారు. ఈ విధంగా డబ్బు, కాలం వ్యర్థంకాకుండా నివారించడం అత్యవసరం.

విద్యా విధానం కింద రు. 307 కోట్లు కేటాయించబడింది. సమాజ వికాస, జాతీయ విస్తరణ కార్యకలాపాలలో విద్యాబోధనకు మరికొంత మొత్తం మంజూరు చేయబడింది.

ప్రస్తుతం రూపొందించిన కార్యక్రమాలు పూర్తిగా అమలు జరిపితే, ద్వితీయ ప్రణాళిక పూర్తి అయేలోగా 5 నుంచి 11 ఏళ్లలోపు వయస్సుగల పిల్లలలో నూటికి 60 మందికిన్నీ 11 నుంచి 14 ఏళ్ల లోపు వయస్సుగల పిల్లలలో నూటికి 18 మందికిన్నీ విద్యాబోధనావకాశాలు ఏర్పడతాయి. ప్రాథమికదశలో విద్యార్థుల సంఖ్య 60 లక్షలు పెరుగుతుంది. మాధ్యమికదశలో విద్యార్థుల సంఖ్య 8,00,000 పెరుగుతుంది. ఈ లక్ష్యాన్ని సాధించడానికి 60,000 కొత్త ప్రాథమిక పాఠశాలలను 5 వేల మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పవలసి వుంటుంది. అదనంగా 12,000 ప్రాథమిక పాఠశాలలను కూడా స్థాపించవలసి వుంటుంది.

ఇటీవల యూనివర్సిటీలలోనూ కళాశాలలలోనూ చదివే విద్యార్థుల సంఖ్య అపారంగా పెరిగిపోయింది. పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో కళాశాలలలోనూ యూనివర్సిటీలలోనూ చదివేవిద్యార్థుల సంఖ్య 4,20,000 వుండగా, ప్రణాళిక అంతం నాటికి వీరి సంఖ్య 7,20,000 కు పెరుగుతుందని అంచనా వేయబడింది. ఏటా, కళలు, వాణిజ్యం, విజ్ఞానం మొదలైనవాటిలో పట్టభద్రులయే వారి సంఖ్య 41,000 నుంచి 50,000 కు పెరిగింది. ఈ సంఖ్యలనుబట్టి ఏటా పట్టభద్రు లెంతమంది వ్యర్థంగా తయారవుతున్నది స్పష్టం అవుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో సాంకేతిక విద్యావిశిక్షణ సౌకర్యాల విస్తృతి నిమిత్తం 50 కోట్ల రూపాయలు కేటాయించబడ్డాయి.

## గ్రామాభ్యుదయ ప్రణాళిక

గ్రామాభ్యుదయ ప్రణాళిక అనే పేరుతో 1958 జనవరి నాటికి, ఇండియాలో వివిధ ప్రాంతాలలో మొత్తం 2,76,000 గ్రామాలలో కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టులు అమలులో వున్నాయి. ఆ గ్రామాల మొత్తం జనాభా, 15 కోట్లు. ఇండియా ప్రభుత్వపు రెండవ పంచవర్ష ప్రణాళికలలో ఉద్దేశింపబడిన ప్రకారం కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజెక్టుల నిర్వహణ జరిగితే, 1961 నాటికి ఇండియాలోని అన్ని గ్రామాలు యీ అభివృద్ధి కార్యక్రమములో పాల్గొంటవని అంచనా.

కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమం మొట్టమొదట దేశంలో 1952 అక్టోబరు 2 వ తేదిన ప్రారంభించబడింది. ఆనాడు దేశంలోని వివిధ రాష్ట్రాలలో మొత్తం 165 ప్రాంతాలలో ఈ కార్యక్రమం ప్రారంభించబడింది. తరువాత 1953 జూన్‌లో 67 ప్రాంతాలలోను, 1953 అక్టోబరులో 52 కేంద్రాలలోను యీ కార్యక్రమం ప్రారంభించబడింది.

1953 లో 252 కేంద్రాలలో జాతీయ వికాస కార్యక్రమం ప్రారంభించబడింది. దీనినే నేషనల్ ఎక్స్టెన్షను సర్వీసు అంటారు. ఈ కార్యక్రమం ప్రకారం జరిగేపని, కమ్యూనిటీ ప్రాజెక్టు కార్య

క్రమంలో జరిగినంత ఉధృతంగా జరగదు. వికాస కార్యక్రమం జరిగిన ప్రాంతాలలో, ప్రాజెక్టు కార్యక్రమాన్ని ప్రారంభించడం సులువుగా ఉంటుంది.

ఈ రెండు కార్యక్రమాలు కలిపితే, గ్రామాభ్యుదయ ప్రణాళిక అవుతుంది. 1958 జనవరి నాటికి ఇండియాలోని వివిధ ప్రాంతాలలో మొత్తం 2,76,000 గ్రామాలకు చేరిన 2,155 కేంద్రాలలో యీ రెండు కార్యక్రమములు విడివిడిగా అమలులో వున్నాయి. ఆ గ్రామాల మొత్తం జనాభా 15 కోట్లు.

కమ్యూనిటీ ప్రాజెక్టు అంటే 2,00,000 జనాభాగల 300 గ్రామాలు గల ఒక ప్రాంతాన్ని ప్రాతిపదిక ప్రాజెక్టుగా నిర్ణయించారు. వ్యవసాయోత్పత్తులను వృద్ధిచేయడమే ఈ ప్రాజెక్టు ప్రధానాశయం. ప్రజారోగ్యానికి, పారిశుద్ధ్యానికి, విద్యాభివృద్ధికి, రోడ్ల నిర్మాణానికి సంబంధించిన కార్యక్రమాలుకూడా ఈ ప్రాజెక్టులో చేరి ఉంటవి. ప్రాజెక్టు ప్రాంతాలకన్న చిన్నవి అయిన "బ్లాకు" లలో 100 గ్రామాలు మాత్రమే చేరి ఉంటవి. వీటి రెంటికి పరిమాణంలో మాత్రమే వ్యత్యాసం ఉన్నది. మిగిలిన కార్యక్రమాలన్నీ సమానంగానే వుంటవి.

జాతీయవికాస కార్యక్రమం అంటే, ఉమ్మడి ప్రాజెక్టులు. వీటిలో స్వల్ప పరిశ్రమల ఏర్పాటుకీ వ్యవసాయాభివృద్ధికికూడా ప్రాధాన్యం ఉంటుంది.

గ్రామ సేవకులకు తరిఫీదు ఇవ్వడానికై ఏర్పరచబడే శిక్షణ కేంద్రాలన్నిటినీ, వివిధ గ్రామీణాభ్యుదయ ప్రాంతాలలోకి తీసుకొని వెళ్ళి ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికి వీలు కల్గించాలని నిర్ణయించబడింది.

ప్రజలందరికి త్రాగడానికి పరిశుభ్రమైన నీరు సరఫరా చేయడానికిగాను ప్రతి గ్రామానికి రెండు బావులు త్రవ్వించడం, గొట్టపు బావులు తీయించడం, (ఇప్పుడు నిర్దేశించిన ప్రాజెక్టు ప్రాంతాలలో నూటికి పది, గొట్టపు బావులు త్రవ్వడానికి అనువైనప్రదేశాలలో ఉన్నవి) ఇతర ప్రాంతాలలో వ్యవసాయోపయోగార్థం కాలువలు, చెఱువులు,

నూతులు త్రవ్వించి ప్రతి గ్రామంలోను కనీసం సగంభూమి అయినా ఆధునిక పద్ధతులపై వ్యవసాయం చేయబడే అవకాశం కల్పించడం; వీలున్న చోటనల్లా వ్యవసాయయోగ్యములైన బంజర్లను సాగుచేయించడం; గ్రామ పారిశుద్ధ్య కార్యక్రమంతోపాటు, గ్రామంలోని మురికి నీటి పారుదలకు ఏర్పాట్లు చేయడం; ప్రక్క గ్రామాలకు రోడ్లు వేయడం ప్రాథమిక, వయోజన విద్యలకు ఏర్పాట్లుచేయడం; ఈ కార్యక్రమాలలో ప్రధానమైనవి.

ముఖ్యంగా వ్యవసాయాభ్యుదయ కార్యక్రమాలకు స్థానిక ప్రభుత్వాలు, ప్లానింగ్ కమిషన్ కూడా విశేష ప్రాముఖ్యమిస్తున్నవి. సుశిక్షితులైన గ్రామ సేవకులద్వారా ఈ కార్యక్రమం అమలు జరుపబడింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను గురించి, మంచి విత్తనాలను ఎంచుకొనడాన్నిగురించి, ఎరువుగా వుపయోగించే పంటలను గురించి, రసాయనిక పు ఎరువులనుగురించి, కొత్తరకం వ్యవసాయ పరికరాలను వుపయోగించే విధానాలను గురించి వీరు గ్రామస్థులకు బోధిస్తారు. ఏయే ప్రాజెక్టుప్రాంతంలో ఏయే కార్యక్రమాలను అవలంబించవలసినదీ రాష్ట్రప్రభుత్వాలు అంతిమ నిర్ణయం చేస్తాయి.

ఈ అభ్యుదయ కార్యక్రమాలను ఆయా ప్రాంతాల గ్రామీణ ప్రజల యిష్టంమీదనే అమలుజరపాలిగాని, వారి అభిప్రాయాలకు విరుద్ధంగా ఏ కార్యక్రమాన్నీ అమలుజరపరాదని భారత కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలు చేసుకున్న నిర్ణయం, ఈ అభ్యుదయ ప్రణాళికకు పునాది. గ్రామస్థులు తమంత తాముగా ఈ కార్యక్రమాలను నిర్ణయించడంలో ఉత్సాహంతో పాల్గొని, వారే నడుముకట్టి క్రమంగా అనుభవం, ఆత్మవిశ్వాసం, స్వయంకృషివల్లనే ఫలితాలను, అభ్యుదయమును సాధిస్తున్నామనే వ్యక్తిగతానందమును పొందగలిగే విధంగానే ఈ కార్యక్రమాన్ని కొనసాగించాలని నిర్ణయించబడింది.

గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడంలో తోడ్పడే గ్రామ సహాయకులు, 8,21,420 మంది 1957-58 లో శిక్షణ పొందారు. వీరిలో 69,601 మంది ఆంధ్రప్రదేశ్‌లో శిక్షణ పొందారు.

## సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు

సాంఘిక సమాజాభివృద్ధి కార్యక్రమాలలో అంతర్భాగంగా దేశం అంతటా సాంఘిక (మహిళా, శిశు) సంక్షేమ కార్యక్రమాలు కూడా ప్రారంభించబడినవి. ఈ కార్యక్రమాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ పర్యవేక్షణంలో అమలు జరుపబడుతున్నాయి.

దేశంలోని గ్రామీణ సంక్షేమ కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలో ఒక్కొక్క ప్రాజెక్టుక్రింద 25 లేక 30 గ్రామాలలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. క్రమేపీ, యీ గ్రామాలసంఖ్య ఎక్కువ చేయబడుతుంది.

ప్రతి కమ్యూనిటీప్రాజెక్టు ప్రాంతంలోనూ, సంక్షేమ కార్యక్రమాల నిర్వహణకు అయిదు లేక ఆరు కేంద్రాలు ఉంటాయి. ఒకొక్క కేంద్రంలో, ఒక గ్రామసేవిక, మంత్రసాని, ఒక దాది, ముగ్గురు సంక్షేమ కార్యకర్తలు పనిచేస్తారు.

గర్భిణీ స్త్రీలకు సలహాలివ్వడం, ప్రసవ సమయంలో మంత్రసాని పని చెయ్యడం, నూలు నేయడం, కుట్టుపని జరీపని మొదలైన వృత్తులను నేర్పడం; శిశుసంరక్షణ; కుటుంబ నిర్వహణ, గృహపారిశుద్ధ్యం మొదలైన విషయాలను బోధించడం, ఇవి సాంఘిక సంక్షేమ కేంద్రంలోని ఉద్యోగుల పనులు.

అయితే ఈ కార్యక్రమాలన్నిటి నిర్వహణకు అయే ఖర్చులో నాల్గవవంతును, ఆయా గ్రామసులు భరించాలి. మిగతా మూడువంతులను కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ భరిస్తుంది. గ్రామసులు తమవంతును ఆ సంక్షేమ కేంద్రానికి కావలసిన భూమిరూపంలోగాని, కట్టడంరూపంలోగాని, డబ్బురూపంలోగాని ఇవ్వవచ్చును. పిల్లలు ఆడుకోవడానికి ఆటస్థలాలు, ప్రసూతి కేంద్రాలు మొదలైనవి ఏర్పాటు చేయబడుతాయి.

## ప్రజ సేవకు బహూకరణ

### భారత్ రత్న

కళ, సారస్వతము, శాస్త్రపరిశోధన, పరిగణనీయమైనప్రజాసేవ

చేసినవారిని, జాతి, మత, స్త్రీపుంవివక్షత లేకుండా, గౌరవించడానికి భారత్ రత్న అనే బిరుదును, ఇవ్వవలసిందిగా, ఇండియా ప్రెసిడెంటు 1954 జనవరి 5 వ తేదీన ప్రకటించారు. ఈ బిరుదముతోపాటు, ఒక బంగారు పతకంకూడా ఇవ్వబడుతుంది. ఈ బిరుదులు గౌరవార్థం ఇవ్వబడినవే కాని, వీటిని పేరుకుముందు వుపయోగించరాదు.

ఇంతవరకు యీ బిరుదు పొందినవారు: చక్రవర్తి రాజగోపాలాచారి; డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ; డాక్టర్ సి. వి. రామన్; డాక్టర్ భగవాన్‌దాస్; డాక్టర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య; జవహర్‌లాల్ నెహ్రూ; పండిత్ గోవిందవల్లభ పంత్; డాక్టర్ డి. కె. కార్వే.

## పద్మ విభూషణ్

ఏ విధంగానైనా, మహోత్తరమైన ప్రజాసేవచేసినవారిని బహూకరించడానికి పద్మ విభూషణ్ అనే పతకము ఇవ్వవలసిందిగా, ఇండియా ప్రెసిడెంటు, 1954 జనవరి 5 వ తేదీన ప్రకటించారు. ఈ పతకము మూడు తరగతులలో ఉంటుంది. 1. పద్మవిభూషణ్, 2. పద్మభూషణ్, 3. పద్మశ్రీ.

పద్మవిభూషణ్ పతకము బంగారు గిల్టుతో తయారు చేయబడినదిగా ఉంటుంది. మహోత్తమమైన ప్రజాసేవను చేసినవారికి ఇవ్వబడుతుంది.

పద్మభూషణ్ పతకము వెండితో తయారుచేయబడినదిగా ఉంటుంది. చాలా ప్రశంసార్హమైన ప్రజాసేవను చేసినవారికి ఇవ్వబడుతుంది.

పద్మశ్రీ పతకము కంచుతో తయారు చేయబడినదిగా ఉంటుంది.

ఇంతవరకు ఈ బిరుదులు పొందినవారు. పద్మవిభూషణ్ : బాల గంగాధర్ ఖేర్; వి: కె. కృష్ణమీనన్; నందలాల్ బోస్; డాక్టర్ సత్యేంద్రనాథ్ బోస్; డాక్టర్ జకిర్ హుసేన్; డాక్టర్ డి. కె. కార్వే; జె. ఆర్. డి. తాతా; డాక్టర్ సయ్యద్ ఫజల్ అలీ; శ్రీమతి జానకి బాయి బజాజ్; చందూలాల్ మాధవలాల్ త్రివేది; శ్రీ ప్రకాశ: ఎం. సి. సెతల్వాడ్; ఘనశ్యామదాస్ బిర్లా; డాక్టర్ జాన్ మత్తయ్; డాక్టర్ రాధా వినోద్‌పాల్; గగన్ విహారి లల్లూభాయ్ మెహత.

పద్మభూషణ్; పెండ్యాల సత్యనారాయణరావు; సుకుమార్ సేన్; జనరల్ కె. యస్. తిమ్మయ్య; డాక్టర్ హెచ్. జె. భాభా; డాక్టర్ శాంతిస్వరూప్ భట్నగర్; ఎం. గణపతి; డాక్టర్ జ్ఞానచంద్రఘోష్; మైథిలీశరణ్ గుప్త; రాధాకృష్ణగుప్త; రఘునాథరాయ్ హాండ; అమర్‌నాథ్ ఝా, డాక్టర్ కె. ఎస్. కృష్ణన్; మౌలానా హుసేన్ అహమ్మద్ మద్ని; జోష్ మలిహాబాది; వైకుంఠ లల్లూభాయ్ మెహత; వల్లత్తోల్ నారాయణ మీనన్; డాక్టర్ లక్ష్మణస్వామి ముదలియార్; వ్యాకరణం నరహరిరావు; జైమినిరాయ్; సత్యనారాయణ్ శాస్త్రి; శ్రీమతి ఎం. ఎస్. సుబ్బలక్ష్మి; డాక్టర్ సునీతికుమార్‌ఛటర్జి; డాక్టర్ ప్రాణకృష్ణపరీజా; ఫతేచంద్ భద్వార్, సుందరదాస్ ఖుంగార్; ఎ. ఆర్. వెంకటాచార్య; డాక్టర్ లలిత్ మోహన్ బెనర్జి; డాక్టర్ వి. ఆర్. ఖనోల్కర్; ప్రొఫెసర్ ఎం. ఎస్. తక్కర్; శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ; ఎస్. కె. డే; మాడపాటి హనుమంతరావు; శ్రీమతి రామేశ్వరి నెహ్రూ; కస్తూరి శ్రీనివాసన్; ఎం. ఎస్. తిరుమల అయ్యంగార్; శ్రీమతి రుక్మిణి అరండేల్; రాజశేఖర్‌బోస్; మేజర్ ధ్యాన్ చంద్; కర్నల్ సి. కె. నాయుడు; కున్వర్‌సేన్; డాక్టర్ ముత్తులక్ష్మి రెడ్డి; శ్రీమతి మహాదేవివర్మ; డాక్టర్ టి. ఎస్. వెంకటరామన్; భాయ్ వీరసింగ్; నవాబ్ జయిన్‌యార్ జంగ్; శ్రీమతి పుష్పవతి మెహత; జి. ఎస్. శార్దేశాయ్; ప్రొఫెసర్ కె. ఎ. నీలకంఠశాస్త్రి; డాక్టర్ రాధాకుముద ముఖర్జి, డాక్టర్ అబీద్ హుసేన్; డాక్టర్ వి. ఎల్. ఆత్రేయ; డాక్టర్ హజారి ప్రసాద్ ద్వివేది; డాక్టర్ సిద్దేశ్వర్ వర్మ; ఉస్తాద్ ముస్తాక్ హుసేన్ ఖాన్; పండిత్ ఎన్. రతంజన్ కార్; శ్రీమతి టి. బాలసరస్వతి; డాక్టర్ ఆర్. ఎం. అలగప్ప చెట్టియార్; బోషి శేన్; డాక్టర్ కె. సి. కె. ఇ. రాజా; శ్రీమతి ముత్తా ఆండాల్ వెంకటసుబ్బారావు; శ్రీమతి లక్ష్మి ఎన్. మీనన్; శ్యామనందన సహాయ; ఉస్తాద్ అల్లా ఉద్దీన్ ఖాన్; జహంగీర్ ఘాండి; రావురాజా హనుమంతసింగ్; డాక్టర్ ఎన్. ఎస్. హార్డికర్: అరియాకుడి రామానుజ అయ్యంగార్; శ్రీమతి కమలేందుమతి షా; కె. పి. ఎస్. మీనన్; ఎ. కె. ఎన్. నంబియార్; డాక్టర్ కె. వి. జి. పుట్టప్ప; ప్రొఫెసర్ పూల తిరుపతిరాజు; దేవీ ప్రసాద్ రాయ్ చౌధురి; సలీం అలి; డాక్టర్ ఆర్. జె. వకీల్;

మహారాజకుమార్ విజయ ఆనంద్; సూర్యనారాయణ వ్యాస్; డాక్టర్ ఎస్. వాడియా; అలియవర్ జంగ్; బి. వి. వారేర్కర్; బి. పి. పాటిల్; శ్రీమతి ధన్వంతి రామారావ్; ఘులాం యాజ్దాని, శ్రీమతి హంసమెహత; డాక్టర్ జె. పేమాస్టర్; కె. వాసుదేవాచార్య; ప్రొఫెసర్ ఎన్. కె. సిద్ధాంత; పి. సంబంధ మొదలియార్; ఆర్. ఎస్. దిన్కర్; జెన్సింగ్ నోర్కే; టి. ఆర్. వెంకటాచలమూర్తి.

పద్మశ్రీ : మేజర్ జనరల్ ఎస్. వి. పి. తోరాట్ ; శ్రీమతి [illegible]కం; డాక్టర్ బీర్ భాన్ భాటియా; శ్రీమతి పెరిన్ కెప్టెన్; క్షితీశ్ రంజన్ చక్రవర్తి; కుమారి అమలప్రవ దాస్; సురేంద్ర కుమార్ డే; గోవిందలాల్; డాక్టర్ వసంతరాంజి ఖనోల్కార్; శ్రీమతి అచ్చమ్మ మత్తయ్; డాక్టర్ మిత్రాదాస్; శ్రీమతి భాగ్ మెహత; అఖిల చంద్రమిత్ర; అప్పాసాహెబ్ పంత్; శంకరపిళ్లై; శ్రీమతి మృణ్మయిరే; ఋషిరాంశర్మ; మాచాని సోమప్ప; తార్లోక్ సింగ్; శ్రీ కృష్ణకాంత్ హాండిక్; దిగంబర్ వాసుదేవ్ జోగ్లేకార్; హబీబుర్ రహమాన్; డాక్టర్ బెంజమిన్; డాక్టర్ ఎస్. ఎన్. కాల్; డాక్టర్ ఎం. పి. మెహరే; శ్రీమతి మేరీక్లబ్‌వాలా జాధవ్; శ్రీమతి జరీనా కరింబాయ్; శ్రీమతి రతన్ శాస్త్రి; లక్ష్మీనారాయణ్ సాహు; పండిత్ ఓంకార్ నాథ్ ఠాకూర్; కేవల్ సింగ్ చౌధురి; ఎం. జె. బి. మానెక్ జీ; హుమయూన్ మిర్జా; డాక్టర్ సూర్యకుమారి భాజక్; డాక్టర్ సతీష్‌చంద్ర మజుందార్; డాక్టర్ ఎం. సి. మోడి; డాక్టర్ మోహన్‌లాల్; శుకదేవ పాండె; డాక్టర్ చింతామణ్ గోవింద్ పండిట్; స్థానం నరసింహారావు; డాక్టర్ ఇశాక్ శాంత్ర; డాక్టర్ సోహన్ సింగ్; జె. జె. అంజానియా; రోజర్ ఆర్. ఖతింగ్; సుధీర్‌రంజన్ ఖస్తగిర్; డాక్టర్ ఖుష్‌దేవ్ సింగ్; శ్రీమతి నళినిబాలదేవి; కె. రామయ్య; డాక్టర్ ఎస్. ఆర్. రంగనాథన్; సమరేంద్రనాథ్ సేన్; బలబీర్ సింగ్; ద్వారం వెంకటస్వామినాయుడు; ఎల్. ఎం. చిటలె; రాంప్రకాశ్ గెహ్లోట్; టి. ఎన్. జగదీశన్; మేజర్ జనరల్ గురుబక్స్‌సింగ్; ఎ. ఆర్. చెల్లాని; ఎన్. ధర్మరాజన్; దేవకి కుమార్ బోస్; శ్రీమతి దేవికారాణి; కన్వార్ దిగ్విజయసింగ్; పి. ఏకాంబర్ నాథన్; శ్రీమతి ఫతిమా ఇస్మాయిల్; కుమారి నర్గిస్; డాక్టర్ బాలరాజ్ జవాన్; డాక్టర్ బెంజమిన్ పియారిపాల్; డాక్టర్ ఎన్. పార

సారథి; సర్దార్ బల్వంతసింగ్ పూరి; ఎల్. ఎ. రామదాస్; బ్రిగడీర్ రామసింగ్; డాక్టర్ ఎ. నాగరాజరావు; సత్యజిత్‌రాయ్; మోటూరి సత్యనారాయణ; శంభు మహరాజ్; రామచంద్రవర్మ; ఎం. టి. వ్యాస్; డాక్టర్ ఆత్మారాం; డాక్టర్ బి. ఉప్పల్; బలవంతసింగ్ నాగ్; జి. జి. కార్ఖానిస్; హెచ్. ఎన్. సెత్నా; కొమరవోలు చంద్రశేఖరన్; లక్ష్మణసింగ్ జంగ్‌పాంగీ; ఎం. బి. దివాన్; ఎం. కె. మధుల్లా; మిహిర్‌సేన్; జమెదార్ మిల్ఖాసింగ్; ఓంప్రకాశ్ మధుర్; ఓంకార్ శ్రీనివాస మూర్తి; పి. కె. పణిక్కర్; పి. ఎల్. మజుందార్; పి. జి. మెహత; శ్రీమతి రత్నమ్మ ఇసార్; శ్రీమతి శైలబాలదాస్; డాక్టర్ ఎస్. పట్వర్ధన్; సురేంద్రనాథ్ కార్.

## 'లా' విషయాలు

మన దేశంలో అమలులో వున్న 'లా'సూత్రాలంగానైనా ప్రతివ్యక్తి తెలిసికొని వుండాలి. ఇది చాలా ముఖ్యం. 'లా' తెలియక తప్పు చేశానన్నంత మాత్రాన శిక్ష తప్పదు. అందువల్ల, సాంఘిక జీవనంలో జన సామాన్యం ముఖ్యంగా తెలిసికోవలసిన కొన్ని విషయాలు యీ క్రింద సూచించబడినవి.

### రసీదులు :

తెల్లవారిలేస్తే పడుకునేదాకా డబ్బు వ్యవహారాలతో నిమిత్తము లేకుండా ఎవరికీ జరగదు. ఒకరికి పైకం యిచ్చినప్పుడుగాని ఇంకొకరి నుండి పుచ్చుకున్నప్పుడుగాని రసీదులు వ్రాసుకొనడం ఉత్తమమైన పద్ధతి. జరిగిన లావాదేవీలకు ఇవి సాక్ష్యంగా ఉండడంవల్ల, లేనిపోని తగాదాలకు తావుండదు. ఈ రశీదులు ఒక ప్రత్యేకమైన విధంగా వుండాలనే నియమం లేదు. ఫలానావారు ఫలానా మొత్తం ఫలానా దానికిగాను యిచ్చినారు గనుక ముట్టిందని వ్రాసి, సంతకంచేసి తారీకు వేస్తే సరిపోతుంది. ఇరవై రూపాయలకు మించని పక్షంలో ఏలాంటి స్టాంపును అంటించనక్కరలేదు. ఆ మొత్తాన్ని మించినపుడు మాత్రం పది నయాపైసాల రెవిన్యూ చీటిని అంటించి ఆ బిళ్ళమీద సంతకం చేయవలసివుంటుంది. ఈ చీటీని అంటించకపోతే ఆరశీదుకు విలువ వుండదు.

ప్రామిసరి నోట్లు :

ఎవరో అదృష్టవంతులుతప్ప జనబాహుళ్యం అప్పులనిచ్చి పుచ్చుకోకుండా జీవయాత్ర సాగించలేరు. ఏ వ్యవహారమైనా నోటిమాటతో కంటె వ్రాతమూలంగా నిర్వహించుకుంటే ఉభయులకు శ్రేయస్కరం. అందువల్ల ఫలాన తేదీన ఫలానా నేను ఫలానివాని దగ్గర ఫలానా మొత్తాన్ని ఫలానా కారణంవల్ల పుచ్చుకున్నాను. కాబట్టి ఫలానా వడ్డీతో అయే అసలు ఫాయిదాలను వారు కోరినప్పుడు వారికిగాని వారి ఆర్డరుకుగాని ఇవ్వగలవాడను, అని వ్రాసి పదినయాపైసాల చీటి అంటించి దస్కతు చేయాలి. నోటు తాలూకు మొత్తం రు. 250కి మించనట్లయితే ఒక పది నయాపైసాల రెవిన్యూస్టాంపు సరిపోతుంది. రు. 250 నుండి రు. 1000 వరకు 15 నయాపైసాల స్టాంపు, ఆపైన ఎంతమొత్తానికైనా 25 నయాపైసాల చీటి అతికిస్తే చాలు : అడిగినప్పుడు కాకుండా మారకపు (ఎక్స్ఛేంజ్) బిల్లుమాదిరి తీరుమానం చేయదలచిన నోట్లకు రెండు రూపాయల స్టాంపు వేయాలి. ప్రతినోటుమీద ఇద్దరైనా సాక్షి సంతకాలు వుంటే మంచిది. నోటు వ్రాసిన వ్యక్తి సాక్షుల ఎదుటనే సరితకం చేయాలి.

నోటు వ్రాయించుకున్నవారు వ్రాసినవారికి తెలియపరిచి ఎవరికైనా నోటును ప్రతిఫలంకోసం ట్రాన్స్ఫర్ చేయవచ్చును. నోటు వ్రాసిన తేది లగాయతు, మూడేండ్లలోపుగా ఆ తాలూకు మొత్తాన్ని వసూలు చేసుకోవటమో లేక దావా వేయటమో జరగకపోతే ఆ నోటు కాలదోషము పట్టిపోతుంది, ఈ గడువు దాటేలోపల నోటువ్రాసిన వారిచేత కొంత సొమ్ము చెల్లు వేయించి వారిచేతనే నోటు వెనుకభాగం మీద ఆ విషయం వ్రాయించడమో లేక నోటును, తిరిగి వ్రాయించుకోవడమో చేయవలసి ఉన్నది.

చెక్కులు :

పెద్ద మొత్తాలను ఇనుప పెట్టెలలో పెట్టి పదిలపరచుకొనడము, ప్రామిసరినోట్లమీద అప్పులివ్వడము వివేకమైనపనులుకావు. ఒకొక్కప్పుడు అసలుకే మోసం రావచ్చును. వడ్డీ తక్కువ అయినప్పటికీ బ్యాంకిలలో వేసుకుంటే మంచిది. బ్యాంకిలో అక్కౌంటు ఉన్న

ట్లయితే చేతిలో ఎక్కువరొక్కం ఉంచుకోవలసిన అగత్యం ఉండదు. ఇవ్వవలసినవారికి చెక్కును వ్రాసియిస్తే సరిపోతుంది. ఈ చెక్కులలో పుచ్చుకొనేవారి పేరు, ఇచ్చేమొత్తం, తారీఖు, వ్రాసి బ్యాంకువారికి నమూనాగా ఇచ్చినవిధంగా సంతకం చేయాలి. ఇవి అన్యులచేతులలో పడకుండా ఉండటానికి క్రాస్ చేయవలసి ఉంటుంది. అంటే చెక్కు మీద ఎడమవైపు పైభాగాన ఒక దానిక్రింద ఒకటిగా రెండు ఏటవాలు గీతలుగీసి, ఆ గీతలమధ్య 'అండుకో' అని వ్రాయాలి. అప్పుడు ఈ చెక్కుతాలూకు మొత్తము బ్యాంకీలలో అక్కౌంటువున్న వారిపరంగా మాత్రమే ఇవ్వబడుతుంది. ఒకసారి చెక్కు పుట్టినతరువాత ఎవరికైనా ట్రాన్స్ఫర్ చేయివచ్చును. ఆరుమాసాలలోపుగా సొమ్ము చేసుకోక పోతే చెక్కు రద్దు అవుతుంది. హుండీల విషయంకూడా ఇంతే. ఇవి వ్యాపారస్తులకు ఎంతో ఉపయుక్తంగా ఉంటాయి. పొరుగూళ్ళవారికి ఈ బ్యాంకి హుండీలద్వారా తక్కువ ఖర్చులతో ఎంత డబ్బునైనా సులభంగా పంపవచ్చును. చెక్కులపరంగా డబ్బు ఇచ్చినప్పుడు ఒక వేళ రశీదులు తీసికోకపోయినా ప్రమాదముండదు.

ఎగ్రిమెంట్లు :

వ్యాపారంలోగాని మరి ఇతర వ్యవహారాలలోగాని అనుకున్న ఒడంబడికలను లిఖితపూర్వకంగా నిర్ణయించుకుంటే ఉభయపార్టీలకు మంచిది. సాధ్యమైనంతవరకు ఈ అగ్రిమెంట్లను లాయర్లచేత వ్రాయించుకుంటే, న్యాయబద్ధంగాని అవకతవక షరతులకు అవకాశం ఉండదు. ప్రతిఫలశూన్యమైన కంట్రాక్టుఅగ్రిమెంట్లు చెల్లవు. మోసంవల్ల, వత్తిడివల్ల పొరబాటువల్ల ఏర్పడిన అగ్రిమెంట్లను రద్దుచేసుకోవచ్చును. సాధారణపు ఒడంబడికలను రూపాయిన్నర స్టాంపు పేపరుమీద వ్రాసుకోవాలి.

పవర్ ఆఫ్ అటర్నీ :

ఒక ప్రత్యేక వ్యవహారాన్ని గాని లేక సర్వవిధ వ్యవహారాలను గాని తన తరఫున నిర్వహించడానికి ఒక వ్యక్తి మరొక వ్యక్తికి న్యాయబద్ధంగా అధికారం ఇవ్వవచ్చును. ఇది లిఖితపూర్వకంగా జరగాలి. వీటిని పవర్ ఆఫ్ అటర్నీ అంటారు. ఒక్క ప్రత్యేక విషయానికయితే స్పెషల్ పవర్, సర్వవిషయాలకైతే జనరల్ పవర్ పత్రాలను

వ్రాయాలి. ఒకరి తరఫున దస్తావేజును రిజిష్టరు చేసేందుకు ఇచ్చే పవరుకు ముప్పావలా స్టాంపు పేరుమీద వ్రాయాలి. స్పెషల్ పవరుకు రూపాయిన్నర స్టాంపు ఉపయోగించాలి. జనరల్ పవరుకు పదకొండు రూపాయల పావలా స్టాంపు అవసరం. ఈ పత్రాలలో "ఫలానా నేను ఫలానావారికి నాతరఫున ఫలానా కార్యనిర్వహణకు అధికారం ఇచ్చు చున్నాను, కాబట్టి అందరు తెలుసుకోవలసినది" అని వ్రాసి, సంతకంచేసి, తారీఖు వేయాలి. సాక్షుల సంతకాలుకూడ అవసరం. ఈపవరుపత్రాలు రిజిష్టరు చేయిస్తే ఇంకా మంచిది.

కౌళ్లు :

తెలుగుదేశంలో సాధారణంగా కొద్దో గొప్పో భూవసతి లేని వాళ్లు అరుదు. స్వంతంగా వ్యవసాయం చేసుకొనేవాళ్ళకంటే సాగుకు ఇతరులకిచ్చేవాళ్ళే అధికంగాఉంటారు. అటువంటప్పుడు రైతువల్ల కౌలు వ్రాయించుకొనటము, రైతుకుభూస్వామి కబూలియత్ వ్రాసియివ్వటము ఆచారంగా ఉంటున్నది. ఈ రెండు పత్రాలలోను విషయాలు ఒకే విధంగా ఉంటాయి. ఉభయపార్టీలపేర్లు, సాగుకు ఇచ్చిన పొలం విస్తీర్ణం రైతు చెల్లించవలసిన ధాన్యము లేక పైకము పరిమితికాలం మొద లైన షరతులను ఉదహరించాలి. సాక్షి సంతకాలుకూడ అవసరం. ఈ పత్రాలను ఉచితమైన స్టాంపును పెట్టి రిజిష్టరుచేస్తే మంచిది. సంవత్సరానికి మించిన కౌళ్ళ సందర్భంలో తప్పకుండా రిజిష్టరుచేయుట అవసరం.

ఇదేవిధంగా నివేశన స్థలాలనుగాని ఇండ్లనుగాని అద్దెకు పుచ్చుకున్నప్పుడు లీజు పత్రాలు వ్రాసుకొనటం శ్రేయస్కరమైన పద్ధతి. అద్దె మొత్తాన్నిబట్టి స్టాంపు కాగితంమీద వ్రాసి రిజిష్టరు చేయించుకోవాలి. ఎప్పటికప్పుడు అద్దె రశీదులను తీసుకొని భద్రపరచుకోవలసి ఉంటుంది.

ఆస్తి విక్రయం

చరాస్తులను విక్రయించినప్పుడు వ్రాతకోత అవసరంలేదు. ప్రతిఫలం పుచ్చుకొని స్వాధీనం చెయ్యగానే అన్ని హక్కులు కొన్నవాడికి

సంక్రమించగలవు. కొనుక్కున్న వాళ్లు రశీదులు పుచ్చుకొనడం ఉత్తమం. విలువైన వస్తువుల అమ్మకం లిఖితపూర్వకంగా జరిగితేనే మంచిది. స్థిరాస్తి అమ్మకం విషయంలో నూరు రూపాయలకు తక్కువగా ఉండేట్లయితే పత్రాన్ని రిజిష్టరు చేయ నక్కరలేదు. స్వాధీనం చేస్తే సరిపోతుంది. ఆస్తి విలువ అంతకు మించినట్లయితే దస్తావేజును వ్రాయించి రిజిష్టరు చేయించాలి. లేకపోతే చెల్లదు.

స్థిరచరాస్తులను కొనుక్కునేటప్పుడు ప్రతిఫలం అప్పుడే చెల్లించి రిజిష్టరు చేయించుకోడానికి వీలు కానప్పుడు క్రయపు అగ్రిమెంటును వ్రాసుకుంటేనే మంచిది. ఆస్తి వివరాలను, ధరను, ఉభయుల పేర్లను ఇచ్చిన బయానాను, రిజిష్టరుచేసే గడువును, ఆ విధంగా జరగకపోతే జరగవలసిన నిర్ణయాన్ని ఈ అగ్రిమెంటులో వ్రాసుకోవాలి. పెట్టుకున్న గడువు దాటిపోక మునుపే లాయరుచేత దస్తావేజును వ్రాయించి, రిజిస్ట్రారు సమక్షంలో పైకం చెల్లించి రిజిష్టరు చేయించితే మంచిది. ఆస్తి కొనుక్కునేముందు ఆ అమ్మేవాడికి ఆస్తిమీద సర్వ హక్కులు కలవా లేవా అని విచారించాలి. పూర్వపు దస్తావేజులను పరిశీలించడమేగాక పన్నెండు సంవత్సరాల లోపుగా జరిగిన అన్యాక్రాంతాలను ధృవపరిచే ఎన్‌కంబరెన్సు సర్టిఫికేటునుకూడా తెప్పించి చూచుకోవాలి. ఆ సమయంలో అద్దెగాని కౌలుగాని పుచ్చుకొన్న వారి స్వాధీనంలో ఆస్తి వున్నట్లయితే వారిచేత కొన్నవారి హక్కులను లిఖిత పూర్వకంగా ఒప్పందం చేయించాలి.

తాకట్లు :

ఆధారం లేకుండా సులభంగా అప్పు పుట్టదు. కాబట్టి స్థిరచరాస్తుల తాకట్లు అమలులోనికి వచ్చినాయి. వస్తువులను కుదువపెట్టినప్పుడు అందుకు సాక్ష్యంగా తాకట్టు పెట్టుకున్నవారి దగ్గరనుంచి పూర్తి వివరాలతో రశీదును పుచ్చుకోవాలి. స్థిరాస్తి తాకట్లు అనేక విధాలుగా వుంటాయి. అన్ని విధాల తాకట్లలో ఆస్తిదస్తావేజులు రిజిష్టరు చేయించుకోవటం అవసరం. సామాన్యపు తాకట్టులో ఆస్తి తాకట్టు పెట్టినవాడి స్వాధీనంలోనే వుంటుంది. తాకట్టు గడువులోపల అప్పును చెల్లించి తాకట్టును రద్దు చేయని పక్షంలో దావా వేయవలసి వుంటుంది.

స్వాధీనపు తనఖాలో ఆస్తిని అప్పు యిచ్చినవాడికి స్వాధీనము చేయవలసి వుంటుంది. గడువులోపుగా ఆ స్తిమీదవచ్చే అయివేజులవల్లగాని, రొక్కపూర్వకంగా గాని అప్పు అసలు ఫాయిదాలను చెల్లువేయగానే ఆ స్తి తిరిగి స్వాధీనమవుతుంది. ఈ తాకట్టు దస్తావేజునుగూడా రిజిస్టరు చేయించాలి. రాజధాని నగరాలలో మాత్రమే ఆస్తి తాలూకు టైటిల్ పత్రాలను తాకట్టు పెట్టి అప్పు తీసుకోవచ్చును. ఆస్తి ఎక్కడవున్నా పట్టింపులేదు. పత్రాలను మాత్రము మద్రాసులో స్వాధీనం చేసే ఈ విధమైన తాకట్టును కరారు చేసుకోవచ్చును. ఒకే ఆస్తిమీద ఎన్ని తాకట్లయినా వుండవచ్చును. అయితే తీర్మానం మాత్రం వరుసక్రమాన జరుగుతుంది. తరువాతి తాకట్లు, ముందు తాకట్లకు లోబడి వుంటాయి. పన్నెండేళ్లు దాటితే తాకట్లు కాలదోషం పట్టగలవు.

భాగస్తులు :

వ్యాపారంలో ఒక్కొక్కప్పుడు భాగస్తులను తీసుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. అటువంటి సందర్భంలో ఎంతటి ఆప్తులైనా, స్నేహితులైనా వ్యవహారరీత్యా పార్ట్నరుషిప్ అగ్రిమెంటును వ్రాసి రిజిష్టరు చేయించుకుంటే అంత్యనిష్ఠూరం ఉండదు. అదిగాక రిజిష్టరు చేయించక పోయినట్లయితే కొన్ని సాధక బాధకాలుంటాయి. ఈ భాగస్వాములు ఇతరులమీద కోర్టువ్యవహారాలు జరపటానికి వీలుండదు. అపైన భాగస్వాముల మధ్య తగాదాలు వచ్చినప్పుడుకూడ అనేక అడ్డంకులు సంభవిస్తాయి. మైనర్లతో భాగస్వామికం ప్రమాదమైనది. ఒక వ్యవహారంకోసం ఏర్పడిన భాగస్వామికం ఆ వ్యవహారం పూర్తికాగానే రద్దు అవుతుంది. కాలపరిమితి పెట్టుకున్న భాగస్వామికం గడువు దాటగానే రద్దవుతుంది. మిగతా భాగస్వామికాలలో ఏ ఒక భాగస్వామి అయినా తక్కినవారికి నోటీసు ఇచ్చి భాగస్వామికాన్ని రద్దు చేయవచ్చును. అందరు భాగస్వాముల సమ్మతిమీద ఏవిధమైన భాగస్వామికమైననూ విచ్ఛిన్నం కాగలదు. భాగస్వామికం అమలులో ఉన్నంతవరకు వ్యవహార నిర్వహణంలో ప్రతీ భాగస్వామి చర్యకు తక్కిన భాగస్తులు బద్ధులవుతారు.

హామీలు :

ఒకరికిగాను మరొకరు హామీయిచ్చి బాధ్యత తీసికొనటం ప్రమాదకరమైన విషయం. ఎంతో జాగ్రత్తతో సంచరించాలి. హామీఇచ్చిన వాడికి అసలు బాధ్యుడితోపాటు సమాన బాధ్యత ఉంటుంది. అసలు బాధ్యుడిమీద ముందుగా చర్య తీసుకోమని కోరటానికి వీలుండదు. వ్యక్తిగతంగా గాని ఆస్తులతో గాని హామీ ఉండడం ప్రమాదకరం.

నష్టపరిహారాలు :

ప్రతి వ్యక్తికి స్వతస్సిద్ధంగా అనేక హక్కు లుంటాయి. ఈ హక్కులు వ్యక్తిగతంగానైనా ఉండవచ్చును. స్వేచ్ఛ నరికట్టినపుడు గాని, శరీరానికో మనస్సుకో బాధ కలిగించినప్పుడుగాని, గౌరవప్రతిష్ఠలకు భంగంకలిగినప్పుడు, ఆస్తిపాస్తుల స్వాధీనానుభవాలను నిరోధించినప్పుడుగాని, అందుకు కారకులైనవారినుంచి కోర్టులద్వారా నష్టపరిహారాలు పుచ్చుకోవచ్చును. చేసుకున్న ఒడంబడికలకు వ్యతిరేకంగా ప్రవర్తించినప్పుడుగూడ పరిహారాలు కోరవచ్చును. ఈ విషయంలో తెలియక పోవడంవల్ల నైతేనేమి ఉపేక్షవల్ల నైతేనేమి అనేకులు శ్రద్ధవహించక తమ హక్కులను నిలబెట్టుకోటానికి ప్రయత్నించరు.

నేరాలు :

క్రమపరిపాలనకోసం కొన్ని చర్యలను ప్రభుత్వం నేరాలుగా పరిగణించి 'లా' ప్రకారం దండిస్తుంది. ప్రభుత్వ నిర్వహణకు ప్రతిబంధకాలయినవి, దేశంలో శాంతికి భంగకరములయినవి, నైతికంగా హేయములైనవి, ప్రజలకు దేహరీత్యాగాని మానసికంగా గాని బాధాకరములయినవి, ఆస్తిపాస్తుల పైగల హక్కులకు ప్రమాదకరములయినవి మొదలైన కృత్యాలు నిషేధించబడినవి. వీటి కారకులను న్యాయస్థానాలు విచారణచేసి నేరం రుజువయిన పక్షంలో జుల్మానా వల్లగాని, కైదులవల్లగాని లేక రెంటివల్లగాని, శిక్షిస్తాయి. నేరం చేసినవాళ్ళేకాక అందుకు సహాయకులు ప్రేరేపకులు గూడా దండించబడుతారు. రాజద్రోహం, నోట్లను తయారుచేయటం, అవినీతిపనులు, దొంగతనం, ఘాతపరచుట, హత్య, మాననష్టం చేయటం మొదలైనవి, ఈ తరగతి క్రిందికి

వస్తాయి. ఇలాటివి జరగకుండా చూచేందుకు పోలీసుశాఖ వారికేగాక ప్రజలకు కూడా కొంత అధికారం ఉన్నది. అయితే నేరస్తులను విచారణచేసి శిక్షించే అధికారం ప్రభుత్వానికి మాత్రమే వుంటుంది. ఈ బాధ్యతను ప్రజలు నిర్వహించటానికి ఎంతమాత్రము వీలులేదు. ఈ సందర్భంలో నేరనిరూపణకోసం వ్యక్తులను పోలీసువారు హింసించటానికి హక్కు లేదు.

## కోర్టు ధిక్కారము :

న్యాయస్థానాలను ధిక్కరించడం నేరమవుతుంది. కోర్టువారి ఆజ్ఞలను ఉత్తరువులను ఉల్లంఘించకూడదు. ఏదైనా కోర్టులో విచారణలో ఉన్న విషయాలను విమర్శించ గూడదు. న్యాయాధిపతులను అధికారరీత్యా తూలనాడగూడదు : ఆవిధంగాచేస్తే జుల్మానాలవల్లగాని ఖైదులవల్లగాని దండించబడుతారు. పౌరుల హక్కులను కాపాడేవి న్యాయస్థానాలు. న్యాయమూర్తుల దృష్టిలో తారతమ్యాలకుగాని, ముఖమాటానికిగాని, ఆదరాభిమానాలకు తావులేదు.

## బాధ్యతలు :

సంఘం మేలుకోసం ప్రజలు పౌరసత్వ విధులను నిర్వర్తించవలసి వుంటుంది, నేరాలనుగురించి నేరసులనుగురించి తెలిసిన విషయాలను ప్రభుత్వోద్యోగులకు తెలియజేయాలి. కుటుంబములో జననమరణాలు సంభవించినపుడు, మశూచికాది అంటువ్యాధులు తటస్థించినపుడు అధికారులకు ఎరుకపరచాలి. సకాలంలో టీకాలు వేయించడం, పరిసరాలలో మాలిన్యం చేయకుండా ఉండడం, గృహనిర్మాణ విషయాలలో ముందుగా అధికారుల అనుమతి పొందడం, చెల్లించవలసిన పన్నులను సకాలంలో చెల్లించడం మొదలైనవి పౌరసత్వపు విధులు. వీటిని ఉల్లంఘిస్తే శిక్షకు పాల్పడవలసివస్తుంది.

తనకుగాని తనవారికిగాని సంబంధించిన ఉత్తరాలను ఉచితంగాగాని, ఫలాపేక్షతోగాని గ్రామాంతరాలకు చేరవేయటం నేరమవుతుంది. కవర్లలో డబ్బును పంపటంకూడా అంతే. రిజిస్టరు చేయకుండా పంపిన వస్తువులుగాని. ఉత్తరాలుగాని పోయినప్పుడు పోస్టు

వాళ్లు నష్టానికి బాధ్యులుకారు. డబ్బును కవర్లలో పెట్టి పంపునప్పుడు ఇన్సూర్యు చేయాలి. అధికారం పొందకుండా ఒకరి తపాలాను మరొకరు తీసుకోకూడదు: రేడియోలు వున్నవాళ్ళు లైసెన్సు రుసుములను పోస్టాఫీసుకు చెల్లించకపోతే జుల్మానా పడుతుంది.

ఇవిగాక మనం ముఖ్యంగా గమనించవలసిన చట్ట నిబంధనలు ఏమిటంటే.

మన రాష్ట్రప్రభుత్వం జారీచేసిన చట్టాలప్రకారం మత్తుపదార్థాలు నిషేధించబడినవి. కల్లు, సారాయి, గంజాయి మొదలైన నిషావస్తువులను అమ్మటంగాని, కొనడంగాని, ఉంచుకొనడంగాని, చేసినట్లయితే, జుల్మానాకుగాని ఖైదుకుగాని పాలుబడవలసివస్తుంది. వీటిని తయారుచేసే పరికరాలను ఉంచుకున్నప్పటికి శిక్షార్హులు కాగలరు.

ఆంధ్ర ప్రభుత్వపు షాపులు వగైరాల చట్టప్రకారం కొన్ని నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. షాపులు, దుకాణాలూ, హోటళ్లు మొదలైనవి వారానికి తప్పని సరిగా ఒకనాడు మూసి ఉండాలి. రోజుకు పని ఎనిమిది గంటలకు మించకూడదు. నాలుగేసి గంటల కొకసారి ఒక గంటసేపు విరామం ఇచ్చితీరాలి. పద్నాలుగేళ్లు నిండని పిల్లవాళ్ళను పనికి నియోగించకూడదు. ఏడాది పనిచేసినవాళ్లకు జీతంతో సెలవులు యివ్వాలి. ఈ నిబంధనలను ధిక్కరిస్తే శిక్షకు పాత్రులవుతారు.

వసతి గృహముల చట్టప్రకారము ఇంటి ఖామందు అద్దెకు ఉన్నవారిని నిష్కారణంగా వెళ్ళగొట్టేందుకు వీలులేదు. అనుకున్న తేదికి సక్రమంగా అద్దె ఇచ్చినంతవరకు ఖాళీచేయమనడానికి వీలులేదు. ఇష్టం వచ్చినట్లు బాడుగను హెచ్చించకూడదు. ఆ విధంగా పెంచితే రెంట్ కంట్రోల్ ఆఫీసరుకు పిటిషన్ పెట్టి క్రమమైన అద్దె నిర్ణయించమని అద్దెకున్నవాళ్లు కోరవచ్చును. ఇంటి ఖామందు కొన్ని సందర్భాలలో అద్దెకున్నవారిని అద్దె కంట్రోలర్ ద్వారా ఖాళీచెయ్యమని కోరవచ్చును. సక్రమంగా అద్దె ఇవ్వనపుడు, ఖామందు అనుమతిలేని ఇంటినిగాని ఇంటిభాగాన్నిగాని ఇతరులకు అద్దెకిచ్చినప్పుడు, అనుకున్నదానికి విరుద్ధంగా ఇంటిని వినియోగించినప్పుడుఖామందు కాపురం వుండేందుకు వేరేస్వంత

ఇల్లు లేనప్పుడు, అద్దెకున్నవారిని వెళ్లగొట్టవచ్చును. ఇల్లు ఖాళీకాగానే కంట్రోలరుకు వెంటనే తెలియజేయవలసి వుంటుంది. అందుకు భిన్నంగా నడచినవారు జుల్మానాకు పాత్రులవుతారు.

విల్ నామా :

మైనారిటీ వెళ్ళి మతి తిన్నగావున్న ప్రతివ్యక్తి తనకు సంపూర్ణ హక్కున్న స్థిరచరాస్తులను తన తదనంతరం సంక్రమించవలసిన విధానాన్ని విల్ నామాద్వారా నిర్ణయించవచ్చును. ఆ వ్యక్తి జీవితకాలంలో విల్ నామా అమలులోకి రావటానికి వీలులేదు. అందువల్ల మరణించే లోపుగా ఎన్ని విల్ నామాలైనా ఒక్కొక్కప్పుడు వ్రాయవచ్చు, కాని తేదీనిబట్టి చివర వ్రాసిన వీలునామాయే లాప్రకారం చెల్లుతుంది. వీలునామాను తాను వ్రాసిగాని, మరొకరిచేత వ్రాయించిగాని కనీసం ఇద్దరు సాక్షుల సమక్షంలో సంతకం చేయాలి. అప్పుడే సాక్షులుకూడా దస్కతులు పెట్టాలి. ఉత్తరోత్రా ఈ విల్ నామావల్ల లాభంపొందే వాళ్ళు సాక్షులుగా వుండేందుకు పనికిరారు. విల్ నామా పత్రాన్ని రిజిష్టరు చేయవలసిన అగత్యంలేదు, కాని చేస్తే మంచిది.

స్వార్జితమైన స్థిరచరాస్తులను అప్రతిబంధకమైన సర్వహక్కులూ వున్న వ్యక్తి తన యిష్టంవచ్చినవారికి ఉచితంగా ఇచ్చివేయవచ్చును. చరాస్తుల విషయంలో లిఖితపూర్వకమైన పత్రం అవసరంలేదు. ఇచ్చివేస్తున్న ఉద్దేశాన్ని వెల్లడించి ఆస్తిని స్వాధీనపరిస్తే సరిపోతుంది. పత్రం వ్రాసుకుంటేమాత్రం రిజిష్టరు చేయించి ఆస్తిని స్వాధీనం చేయాలి. మోసం, పొరబాటు మొదలైన కారణాలవల్ల తప్ప, ఇచ్చిన దానాన్ని సాధారణంగా ఉపసంహరించుకోటానికి వీలులేదు.

భీమా :

భీమా చేసుకునే ఆచారం దేశమంతటా వ్యాపించినది. భీమా అనేక విధాలు. జీవిత భీమా, అగ్నిభీమా, మోటారుభీమా, మొదలైనవి అందరూ ఎరిగినవే. భీమా చేస్తున్నప్పుడు పాలసీఫారంలో అడిగిన అన్ని విషయాలను యదార్థంగాను, స్పష్టంగాను, దాచకుండాను తెలియచేయుట మవసరం. అట్లా తెలియచెయ్యకపోతే పాలసీ పాకానికి వచ్చి

నప్పుడు ఇన్సూరెన్సు ఆఫీసులు డబ్బు ఇచ్చేందుకు నిరాకరిస్తాయి. అందు వల్ల అనేకులు నష్టపడుతున్నారు. పాలసీని ఎవరికి సంక్రమించేటట్లు నిర్ణయించుకున్నారో వారి పేరును ఉదహరించి అధికారులు గుర్తించేటట్లు చూడాలి. లేకపోతే పాలసీదారుని మరణానంతరం తగాదాలు వచ్చి వారసత్వపు సర్టిఫికెట్ కోసం కోర్టుకు పోవలసివస్తుంది.

హిందూలాను గురించిన అనేక విషయాలు పరంపరాగతంగా జనబాహుళ్యానికి తెలిసే వుంటాయి. వాటినిగురించి స్థూలంగా చెప్పటం కూడా కష్టమైనపని. సాధారణంగా అందరికి సంబంధించిన కొన్ని ముఖ్య అంశాలు ఇక్కడ చెప్పబడినవి: కాని ఈ విషయంలో ఎప్పటికప్పుడు మార్పులు వస్తూంటాయి కాబట్టి అవసరమైనప్పుడు లాయర్ల సలహా తీసి కొంటే మంచిది.

స్త్రీ పురుషులకు పద్దెనిమిదేండ్లు నిండేవరకు మైనారిటీ ఉంటుంది. కోర్టు ఆఫ్ వార్డ్సు ఆధీనంలో వున్నవారు ఇరవై ఒక్క సంవత్సరం నిండితేనేగాని మేజరు కారు. మైనర్లకు గార్డియన్ తండ్రి. తండ్రి లేక పోతే తల్లి గార్డియనవుతుంది, భార్యకు భర్త గార్డియన్. కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఈ అధికారాన్ని కోర్టులే చెలాయించుతాయి.

## సమిష్టి ఆస్తి :

సమిష్టి కుటుంబము, కుటుంబ ఆస్తి అనే సంస్థలు కేవలం హిందూ న్యాయవిధానానికి చెందినవి. ఒకొక్క మూల పురుషుడి సంతతి యావత్తూ సమిష్టి కుటుంబంగా పరిగణించబడుతుంది. పుత్రపౌత్రాదులు, వారిభార్యలు, అవివాహిత పుత్రికలు మొదలైనవారు దీనిలో సభ్యులు. కుటుంబం సమిష్టిగా ఉన్నదనటానికి ఉమ్మడి ఆస్తిపాస్తులు ఉండ నవసరంలేదు. నివాస భోజనాది విషయాలలో ఉండే కూడిక దీనికి ముఖ్య లక్షణం.

ఈ సమిష్టి కుటుంబానికి చెందిన ఆస్తిలోని హక్కులు సమిష్టిగా ఉంటాయి. పుత్రపౌత్రాదులకు జన్మమునుబట్టి ఆ ఆస్తిలోని హక్కు ఏర్పడు తుంది. వీరిసంఖ్య అధికమైనకొద్దీ వారివారి వాటా తగ్గుతూ ఉంటుంది. ఆవేవిధంగా వారిలో ఎవరైనా గతించినప్పుడు గతించినవారివంతు మిగతా

వారి ఆస్తిలో కలిసిపోతుంది. వ్యక్తిగతమైన సంపాదనలు కుటుంబాస్తిలో వాటంతటగా కలిసిపోవు.

విభాగాలయ్యేదాకా తండ్రి; తండ్రి లేనిపక్షంలో వారసులలో పెద్దవాడు, కుటుంబకర్తగా వ్యవహరిస్తాడు. కుటుంబానికి సంబంధించిన సక్రమమైన ఋణాలకోసం కుటుంబాస్తిని విక్రయించేందుకు తండ్రికి హక్కుంది. విభాగానంతరం కూడ తండ్రిచేసిన న్యాయబద్ధమైన అప్పులకు కొడుకులు వారి వాటాకు సంబంధించినంతవరకైనా బాధ్యులవుతారు. కుటుంబాస్తిని పంచుకొన్న వారసులు కుటుంబానికి చెందిన కొందరిని పోషించవలసి వుంటుంది. ప్రస్తుతం కుటుంబ ఆస్తిలో స్త్రీలకు కూడ పురుషులతో సమానంగా హక్కు ఏర్పడ్డది.

**పిత్రార్జితం :**

తండ్రి మరణానంతరం అతడి పిత్రీయ స్వార్జితాది యావదాస్తి కొడుకులకు, కొడుకులు లేనిపక్షంలో పౌత్రాదులకు సంక్రమిస్తుంది. పుత్ర పౌత్రాదులు ఎవరూ లేనప్పుడు దౌహిత్రుడికి చెందుతుంది. తల్లి స్త్రీధనపు ఆస్తి కుమార్తెలకు చెందుతుంది. సంతానం లేకుండా భర్త మరణిస్తే భార్య యథేచ్ఛగా ఆస్తిని అనుభవించవచ్చు.

**దత్తత :**

సంతానం లేనప్పుడు దత్తత చేసుకోవచ్చును. దత్తత చేసుకోకుండా భర్త మరణించినట్లయితే భార్య, తన యిష్టంవచ్చిన బాలునిగాని, బాలికనుగాని దత్తత చేసుకోవచ్చును. అయితే, దత్తులు 15 ఏండ్లలోపు వయస్సుకలవారై, అవివాహితులుగా వుండవలెను.

**సలహా :**

దేశంలో అమలులోవున్న న్యాయవిధానాన్ని సమగ్రంగా ఇక్కడ విశదీకరించడానికి అవకాశంలేదు. కాబట్టి కొన్ని ముఖ్య విషయాలను మాత్రమే సూచించడమైంది, సందర్భాన్నిబట్టి అవసరమైనప్పుడల్లా న్యాయవాదుల సలహాను తీసికొనటం మంచిది. కోర్టులచుట్టూ తిరిగేవారి సహాయంతో వ్యవహారాలను చక్కబెట్టుకోవాలని చూస్తే కోర్టు పాలు గాక తప్పదు. దీర్ఘరోగిసగం వైద్యుడే కావచ్చును. అంతమాత్రాన ప్రతి

శాశించిన వారు ఎవరూ అలాంటివాడిచేత వైద్యం చేయించుకోరు. అదే విధంగా కోర్టువ్యవహారాలతో కొద్దో గొప్పో పరిచయంవున్న వ్యక్తులను స్వంతవ్యవహారాలను వప్పగించకూడదు. అవకాశం దొరికినపుడల్లా లేని పోని పేచీలు కల్పించి దాని ఫలితంగా తయారయ్యే తగాదాలవల్ల జీవనోపాధిని సంపాదించేవాళ్ళు ప్రతిగ్రామంలోనువుంటారు. వీళ్ళనుసంప్రదించి వారి సలహాలను తీసుకోడం కేవలం అవివేకమైనపని. పత్రాలను దస్తావేజులను వీరిచేత వ్రాయించినట్లయితే తెలిసిచేసేవి తెలియకచేసేవి అనేక అవకతవకలు ఏర్పడక తప్పదు. అంతేకాక ఒక్కొక్కప్పుడు ఇలాంటి వ్యక్తులు ఉభయ పార్టీలకు ఒకే విషయంలో స్వలాభంకోసం సలహాలను ఇచ్చి అనవసరపు చిక్కులను తెచ్చిపెడతారు. అందువల్ల వీలైనంతవరకు వీరితో ఏ ప్రమేయమూ పెట్టుకోకుండా వుండటం మంచిది.

## మధ్యవర్తిత్వం :

పట్టుదలకోసం కోర్టులకు ఎక్కటంవల్ల ఏలాంటిలాభమూవుండదు. డబ్బుతో కూడుకుని వుండేది కోర్టు వ్యవహారం. సాధారణంగా అనేక సందర్భాలలో వ్యాజ్యాలు గెలిచినా ఓడినా పర్యవసానము ఒకటిగానే పరిణమిస్తుంది. సాధ్యమైనంతవరకు అంకురించిన తగాదాలను సంప్రదింపులతో అణచివేయటం శ్రేయస్కరం. ఈ విధంగా సమాధానం కుదరక పోతే యోగ్యులైన 'పెద్ద మనుష్యులను మధ్యవర్తులుగా నియమించి పరిష్కారం చేసుకోవటం మంచిది. ఉభయపార్టీల అంగీకారంమీద మధ్యవర్తులు ఏ పరిష్కారాన్ని అయినా తీర్చవచ్చును. వారులిఖితపూర్వకంగా ఇచ్చిన తీర్పును కోర్టులు ఆమోదించి డిక్రి ఇవ్వగలవు. ఈ మధ్యవర్తిత్వానికి ఒప్పుకున్న రెండు పక్షాలవారు ఈ డిక్రీకి బద్ధులవుతారు. సంప్రదింపులవల్ల పరిష్కారంకాని సందర్భాల్లో తప్ప కోర్టులకు ఎక్కవలసిన అవసరం వుండకూడదు. 'లా'కు సంబంధించిన ప్రతి వ్యవహారంలోను ఎప్పటికప్పుడు న్యాయవాదుల సలహాలను పొందటం ఉచితమైన పద్ధతి.

## వివాహాలు :

18 ఏండ్లలోపు పురుషుడు, 15 ఏండ్లలోపు బాలికలు పెండ్లి చేసుకొన కూడదు. భార్య జీవించియుండగా పురుషుడు మరొక స్త్రీని న్యాయబద్ధంగా పెండ్లాడడానికి వీలులేదు. రెండవ వివాహము చెల్లక

పోగా భర్త శిక్షార్హుడు కాగలడు. వర్ణాంత వివాహాలు చేసుకోదలచిన వారు రిజిష్టరు వివాహం చేసుకుంటే మంచిది. వితంతువులు న్యాయబద్ధంగా వివాహం చేసుకోవచ్చు. భర్త సరిగా చూడక బాధలు పెట్టు సందర్భంలో భార్య వేరే ఉండి మనోవర్తి కోరవచ్చును. కొత్తగా చేయబడిన చట్టాన్ని అనుసరించి ఇకముందు విడాకుల అవకాశం ఏర్పడినది. అవినీతి అంటువ్యాధులు మొదలైన కారణాలవల్ల వివాహ విచ్ఛిన్నం కోర్టుద్వారా మాత్రమే జరగవలసియున్నది.

ఇటీవలివరకు న్యాయవిధానం దేశమంతటా ఒకే విధంగా అమలు జరగడంలేదు. బంగాళా దేశంలో దాయభాగ విధానం, బొంబాయి మదరాసు రాష్ట్రాలలో మితాక్షరసూత్రం, ఇతర ప్రాంతాలలోమయూఖాది సూత్రాలు అనుసరణలో ఉన్నవి. భారతదేశం మొత్తంమీద హిందువులకు సంబంధించినంతవరకూ ఒకే న్యాయ విధానం ఉండడం అవసరమని ప్రభుత్వం నిశ్చయించి 'హిందూ లా కోడ్' ఒక దానిని ప్రముఖులైన వారిచేత తయారుచేయించింది. ఈ బిల్లును పార్లమెంటు ఆమోదించినది. చట్టం అమలులోకి వచ్చింది. ఈ కోడ్ ప్రకారం ఇదివరకు అమలులోవున్న న్యాయవిధానం చాలవరకూ మారిపోయింది. సమిష్టి కుటుంబపు ఆస్తిలో పుత్ర పౌత్రాదులకు జన్మనుబట్టి హక్కు ఏర్పడినప్పటికి యావదాస్తిని తండ్రి తన యిష్టంవచ్చినట్లు వినియోగించటమే గాక విల్ నామాద్వారా సంక్రమింపచేయవచ్చును. తండ్రిబ్రతికి వున్నంతవరకు పుత్రాదులకు ఆస్తిలో హక్కు ఉండదు : భాగం పంచమని అడిగేందుకు వీలుపడదు. తండ్రి మరణానంతరం విల్ నామా ఏదీ లేనియెడల ఆస్తిని సన్నిహిత వారసులు పంచుకుంటారు, కుమారుల తోపాటు తల్లికి, కుమార్తెలకు కూడా ఆస్తిలో భాగం పంచి ఇవ్వవలసి ఉంటుంది. ఏకపత్నీత్వానికి, విడాకులకు ముఖ్యస్థానం ఉంటుంది.

## రాజ్యాంగ సంస్కరణలు

బ్రిటిషు ప్రభుత్వంవారు ఈస్టిండియా కంపెనీ చేతినుంచి భారతదేశ పరిపాలనా బాధ్యతను, 1858 లో తమచేతిలోకి తీసుకున్నారు. తరువాత, 1861 లో బెంగాల్, బొంబాయి, మదరాసు,

పంజాబ్ సరిహద్దు రాష్ట్రాలలో చిన్న శాసన సభలను ఏర్పాటు చెయ్యడమూ, 1863 లో స్థాపించబడిన కేంద్రశాసనసభకు, అనధికార సభ్యులను నియమించడమూ జరిగింది. అయితే ఈ శాసనసభలకు నిజమైన అధికారాలు ఏమీ లేవు. 1892 లో కేంద్రశాసన సభ్యులకు, ప్రభుత్వం వారి బడ్జెటునుగురించి చర్చించడానికి, పరిపాలనా వ్యవహారాలలో కొన్నిటిని గురించి ప్రభుత్వ చర్యలను విమర్శించడానికీ అధికారం ఇవ్వబడింది.

కాని, కొంతవరకు చెప్పదగిన సంస్కరణలు 1908 లో అమలు జరుపబడినవి. వీటినే, మింటో—మార్లెసంస్కరణలు అంటారు. వీటి వల్ల శాసనసభాసభ్యుల సంఖ్య కొంచెం పెంచబడింది. సభలలో అనధికార సభ్యులసంఖ్య, అధికార సభ్యులకన్న ఎక్కువ చేయబడింది. కొన్ని నిబంధనలకులోబడి, శాసనసభ్యుల ఎన్నికలకు వీలు గలుగచేయబడింది. మొట్టమొదటిసారి, రాజప్రతినిధి కౌన్సిళ్ళలో భారతీయుణ్ణి నియమించడం జరిగింది. అంతేకాక, రాష్ట్రీయ గవర్నరుల కౌన్సిళ్లలో కూడా, భారతీయులను నియమించడం జరిగింది. ప్రజాక్షేమానికి సంబంధించిన విషయాలన్నిటినిగురించి, శాసనసభలలో చర్చించడానికి వీలు కలుగ చేయబడింది,

1919 చట్టప్రకారం మళ్ళీ కొత్త సంస్కరణలు అమలులోకి వచ్చాయి. వీటికి మాంటెగు—ఛెమ్సుఫర్డు సంస్కరణలు అని పేరు. ఈ సంస్కరణలవల్ల, రాష్ట్రాలలో ద్వంద ప్రభుత్వం అమలు జరుపబడింది. శాసనసభలు చర్చించే విషయాలకు సంబంధించిన పరిపాలన సాగించే మంత్రులు వేరు: గవర్నరుకు లోబడి, ప్రజల యిష్టానిష్టములతో సంబంధంలేకుండా పరిపాలించే ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు వేరు. భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోను శాసన సభలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ 1919 చట్టం 1921 జనవరిలో అమలులోకి వచ్చింది.

తరువాత సైమన్ కమిషన్ నివేదికను అనుసరించి, 1935 చట్టం 1937 ఏప్రిల్ లో భారతదేశంలో అమలు జరుపబడింది. ఈ చట్ట ప్రకారం రాష్ట్రాలకు స్వపరిపాలనాధికారం ఎక్కువగా యివ్వబడింది. కాని రాష్ట్రీయ గవర్నరులకు రాష్ట్రీయ మంత్రివర్గాల నిర్ణయాలను

పార్లమెంటుకీ, రాష్ట్రశాసనసభలకీ ఎన్నికలు జరిపించడానికి ఎలెక్షన్ కమిషను ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. ఈ కమిషన్‌లో చీఫ్ ఎలెక్షను కమిషనర్లు వుంటారు.

భారతదేశపు పౌరులుగావుండి, 21 సంవత్సరాల వయస్సు నిండిన స్త్రీ పురుషులందరికి పార్లమెంట్ లోక్ సభ ఎన్నికలలోనూ, రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలలోనూ పాల్గొనడానికి ఓటు హక్కువుంది. మతిస్థిరం లేనివారికి, నేరముచేసి శిక్షబడినవారికి ఓటు హక్కు లేదు.

పార్లమెంటు లోక్ సభలో షెడ్యూల్డుక్లాసెస్ (హరిజనులు) కు కొన్ని స్థానాలు ప్రత్యేకింపబడినవి.

ఆంగ్లో-ఇండియనుజాతి తరఫున తగినంతమంది సభ్యులు పార్లమెంటు లోక్‌సభకు ఎన్నుకోబడలేదని ప్రెసిడెంటుకు తోచినపక్షంలో ఇద్దరికి మించకుండా ఆంగ్లో-ఇండియనులను లోక్ సభకు ప్రెసిడెంట్ నామినేట్ చేయవచ్చును.

రాష్ట్ర శాసనసభలలోకూడా షెడ్యూల్డుక్లాస్ వారికి స్థానాలు ప్రత్యేకించబడాలి. రాష్ట్ర మొత్తం జనాభాలో షెడ్యూల్డుక్లాస్ ప్రజలు ఎన్నోవంతో, రాష్ట్రశాసనసభ సభ్యులలో అన్నోవంతుమంది షెడ్యూల్డుక్లాసెస్ సభ్యులు వుండేటట్లుగా స్థానాలు ప్రత్యేకించబడాలి.

ఏ రాష్ట్రశాసనసభలోనైనా ఆ రాష్ట్రంలోని ఆంగ్లో-ఇండియను ప్రజలకు తగిన ప్రాతినిధ్యం లభించలేదని ఆ రాష్ట్ర గవర్నరుకుతోచినట్లయితే, ఆ సభకు సభ్యులుగా తగినంతమందిని ఆయన నామినేట్ చెయ్యవచ్చును.

అయితే, రాజ్యాంగ విధానం అమలులోకి వచ్చిన పది సంవత్సరాల అనంతరం షెడ్యూల్డుక్లాసెస్ ప్రజలకును, ఆంగ్లో-ఇండియనులకును పార్లమెంట్‌లోను, రాష్ట్ర శాసనసభలలోను స్థానాలను ప్రత్యేకించడం రద్దయిపోతుంది.

ఇండియాలో ప్రభుత్వభాషగాహిందీ పరిగణించబడుతుంది. ఈ భాషకు లిపి, దేవనాగరి.

అయితే, రాజ్యాంగం అమలులోకివచ్చిన తరువాత పదిహేను సంవత్సరాలదాకా, ఇంగ్లీషుభాష ప్రభుత్వభాషగా ఉపయోగింపపడు తుంది. ఈపదిహేను సంవత్సరాలలో, ఇంగ్లీషుతోపాటు హిందీనికూడా ప్రభుత్వభాషగా ఉపయోగించవచ్చునని ప్రెసిడెంట్ వుత్తరువు చెయ్యవచ్చును.

పదిహేను సంవత్సరాలు గడచిన తరువాతకూడా, ఇంగ్లీషును ప్రభుత్వభాషగా వుపయోగించవచ్చునని పార్లమెంట్ శాసనం చెయ్యవచ్చు.

ఈ రాజ్యాంగవిధానం అమలులోకి వచ్చిన అయిదు సంవత్సరాల తరువాత, ఆతరువాత మరొక అయిదు సంవత్సరాల అనంతరము-ప్రెసిడెంటు ఒక కమిషనును నియమించాలి. ఈ కమిషనుపని ఏమిటి దేశంలో ప్రభుత్వకార్యకలాపాలలో హిందీభాషను ఎంతవరకు ఉపయోగించవచ్చునో సిఫారస్ చెయ్యడం,

రాష్ట్రాలలో హిందిగాని, ప్రజలు రాష్ట్రంలో మాట్లాడే భాషలలో ఏదో ఒక భాషనుగాని, అన్నిభాషలనుగాని ప్రభుత్వభాషగా ఉపయోగించాలని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించవచ్చును. అయితే, ఒక రాష్ట్రప్రభుత్వం మరొక రాష్ట్రప్రభుత్వంతో జరిపే వ్యవహారాలన్నీ ఇండియా ప్రభుత్వం ప్రభుత్వ భాషగా వుపయోగించే భాషలోనే జరపాలి.

రాజ్య సభకు వివిధ రాష్ట్రాలనుంచి ఎన్నుకొనబడిన సభ్యుల సంఖ్య ఇది :

ఆంధ్రప్రదేశ్, 18; ఆసాం, 7; ఉత్తరప్రదేశ్, 34; ఒరిస్సా, 10; కాశ్మీర్, 4; కేరళ, 9; పంజాబ్, 11; పశ్చిమ బెంగాల్, 16; బీహార్, 22; బొంబాయి, 27; మదరాసు, 17; మధ్యప్రదేశ్, 16; మైసూరు, 12; రాజస్తాన్, 10; ఢిల్లి, 3; త్రిపుర, 1; మణిపూర్, 1; హిమాచల ప్రదేశ్, 2; ప్రెసిడెంట్‌చే నామినేట్ చేయబడినవారు, 12.

లోక్ సభకు వివిధ రాష్ట్రాలనుంచి ఎన్నుకోనబడిన సభ్యుల సంఖ్య ఇది :

ఆంధ్రప్రదేశ్ 43; ఆసాం 13; ఉత్తరప్రదేశ్ 86; ఒరిస్సా 20; కాశ్మీర్ 6; కేరళ 18; పంజాబ్ 22; పశ్చిమ బెంగాల్ 36; బీహార్ 53; బొంబాయి 66; మదరాసు 41; మధ్యప్రదేశ్ 36; మైసూరు 26; రాజస్తాన్ 22; అండమాన్ నికోబార్ దీవులు 1; ఢిల్లీ 5; త్రిపుర 2; మణిపూర్ 2; హిమాచలప్రదేశ్ 4.

లోక్ సభ నియోజకవర్గాల సంఖ్య మొత్తం 403. వీటిలో 91 ద్విసభ్యనియోజక వర్గాలూ, 312 ఏకసభ్యనియోజక వర్గాలు వున్నాయి. 16 ఏకసభ్యనియోజకవర్గాలు షెడ్యూల్డు జాతులకు ప్రత్యేకించబడ్డాయి.

మొత్తం సభ్యులలో, 76 స్థానాలు షెడ్యూల్డు కులాలకు చెందిన వారికీ, 31 స్థానాలు షెడ్యూల్డు జాతులకు చెందినవారికీ ప్రత్యేకించ బడినవి.

## రాష్ట్ర శాసన సభలు

వివిధ రాష్ట్రాలలోని లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుల సంఖ్య యీ క్రింది విధంగా నిర్ణయించబడింది.

ఆంధ్ర ప్రదేశ్ 301; ఆసాం; 108; ఉత్తర ప్రదేశ్ 430; ఒరిస్సా 140; కాశ్మీర్ 75; కేరళ 126: పంజాబ్ 154; పశ్చిమ బెంగాల్ 252; బీహార్ 318; బొంబాయి 396; మదరాసు 205; మధ్య ప్రదేశ్ 288; మైసూర్ 208; రాజస్తాన్ 176.

లెజిస్లేటివ్ కౌన్సిళ్లుగల యీ క్రింది రాష్ట్రాలలో, ఆ కౌన్సిళ్ళ సభ్యత్వపు సంఖ్య యీ క్రింది విధంగా నిశ్చయింప బడింది.

| | |
|---|---|
| ఆంధ్ర ప్రదేశ్ | 90 |
| ఉత్తరప్రదేశ్: | 72 |
| పంజాబ్: | 40 |
| పశ్చిమ బెంగాల్: | 51 |
| బీహార్: | 72 |

| | |
|---|---|
| బొంబాయి: | 72 |
| మదరాసు: | 50 |
| మధ్యప్రదేశ్: | 72 |
| మైసూర్: | 40 |

ఇండియా ప్రజారాజ్యం అయినతరువాత, వయోజన ఓటింగు పద్ధతిలో మొట్టమొదటిసారి ఎన్నికలు దేశమంతటా 1951 అక్టోబరు 25 వ తేదీన ప్రారంభమై, 1952 ఫిబ్రవరితో అంతమైనవి.

రెండవసారి ఎన్నికలు 1957 ఫిబ్రవరిలో ప్రారంభమై మార్చితో ముగిసినవి. ఈ ఎన్నికలలో పార్లమెంటుకు 12 మంది, రాష్ట్రశాసన సభలకు 22 మంది సభ్యులు పోటీ లేకుండా ఎన్నుకోబడినవారు. ఇలా ఎన్నుకోనబడినవారంతా కాంగ్రెసు పార్టివారే.

ఈ లోక్ సభ ప్రథమ సమావేశం 1957 మే 10 తేదీన జరిగింది.

## ఓటర్లు

1957 ఫిబ్రవరి - మార్చిలో ఎన్నికలు జరిగినప్పుడు దేశంలో ఏ రాష్ట్రంలో ఎంతమంది ఓటర్లు వున్నదీ యీ క్రింద వివరించబడినది:

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్: | 1,70,60,565 | మదరాసు: | 1,75,99,056 |
| అసాం: | 43,74,039 | మధ్యప్రదేశ్: | 1,38,80,209 |
| ఉత్తరప్రదేశ్: | 3,47,70,434 | మైసూర్: | 1,01,23,618 |
| ఒరిస్సా: | 79,51,805 | రాజస్తాన్: | 86,93,031 |
| కేరళ: | 75,59,047 | ఢిల్లి: | 9,76,306 |
| పంజాబ్: | 91,12,743 | త్రిపుర: | 3,45,849 |
| పశ్చిమ బెంగాల్ | 1,51,18,061 | మణిపూర్: | 3,30,111 |
| బీహార్: | 1,95,63,747 | హిమాచలప్రదేశ్: | 6,84,628 |
| బొంబాయి: | 2,43,86,525 | మొత్తం: | 19,31,29,924 |

## రాష్ట్రపతి ఎన్నిక

రెండవసారి రాష్ట్రపతి ఎన్నిక 1957 మే 6 తేదిన జరిగింది. రాష్ట్రపతి పదవికి డాక్టరు రాజేంద్రప్రసాద్, చౌదరి హరిరాం, నాగేంద్ర నారాయణ్ దాస్ పోటీ చేశారు.

డాక్టర్ రాజేంద్రప్రసాద్‌కు 4,99,698 ఓట్లు, నాగేంద్రనారాయణదాస్‌కు 2,000 ఓట్లు, చౌదరి హరిరాంకు 1,498 ఓట్లు వచ్చినవి. రాష్ట్రపతిగా డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడినట్లు ప్రకటన మే 11 తేదిన జరిగింది. మళ్ళీ రాష్ట్రపతిగా, మే 13 తేదిన డాక్టర్ రాజేంద్రప్రసాద్ పదవీ స్వీకారం చేశారు.

ఉప రాష్ట్రపతిగా డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పోటీలేకుండా ఎన్నుకోబడినారు.

# భారత్ ప్రభుత్వం

రాష్ట్రపతి (ప్రెసిడెంటు): డాక్టర్ రాజేంద్రప్రసాద్

పదవి స్వీకారం: 1957 మే 13.

సెక్రటరి: ఎ. వి. పాయ్.

మిలిటరి సెక్రటరి: మేజర్ జనరల్ సర్దార్ హరనారాయణ్ సింగ్.

రాష్ట్రపతిజీతం, రాజ్యాంగ నిర్ణయప్రకారం, నెలకు రు.10,000; అలవెన్సు రు. 3,000. కాని, 1956 ఏప్రిల్ వరకు, రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ తను జీతంలో నూటికి 15 వంతులు తగ్గించుకొని, నెలకు రు. 8,500 జీతము, రు. 3,000 అలవెన్సు తీసుకొనేవారు. 1956 ఏప్రిల్ నుంచి అలవెన్సుకూడా తీసుకోవడం మానేసి, జీతం 6,000 మాత్రమే తీసుకుంటున్నారు. 1957 మే నుంచి జీతం రు. 5,000 మాత్రమే తీసుకుంటున్నారు.

ఉపరాష్ట్రపతి: డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ.

## మంత్రి మండలి

పదవీ స్వీకారం: 1957 ఏప్రిల్ 17.

జవహర్‌లాల్ నెహ్రూ: ప్రధానమంత్రి; విదేశవ్యవహారాలు, అణుశక్తిశాఖ

పండిత్ గోవిందవల్లభ పంత్: దేశీయాంగమంత్రి

మురార్జి దేశాయ్: ఆర్థిక మంత్రి
జగజీవన్‌రాం: రైల్వేమంత్రి
గుల్జారిలాల్ నందా: కార్మికమంత్రి, ప్రణాళికశాఖ, ఉద్యోగకల్పన
లాల్‌బహదూర్‌శాస్త్రి: వాణిజ్య, పరిశ్రమలమంత్రి
సర్దార్ స్వరణ్‌సింగ్: ఉక్కు, గనులు, ఇంధనం శాఖలమంత్రి
కేశంపల్లి చెంగల్రాయరెడ్డి: వర్క్స్, భవననిర్మాణం, సప్లయి శాఖలమంత్రి
అజిత్‌ప్రసాద్ జెయిన్: ఆహార, వ్యవసాయమంత్రి
కెంగలిల్ కృష్ణన్ కృష్ణమీనన్: రక్షణమంత్రి
సదాశివ్ కానోజీ పాటిల్: రవాణామంత్రి, తంతి తపాలా శాఖలు
హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం: నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖమంత్రి
అశోక్‌కుమార్ సేన్: న్యాయశాఖమంత్రి

## కాబినెట్ హోదా లేని మంత్రులు

సత్యనారాయణసింహ: పార్లమెంటరీ వ్యవహారాలు
డాక్టర్ బాలకృష్ణ విశ్వనాథ్ కేస్కర్: సమాచార, ప్రసారశాఖ
దత్తాత్రేయ పరశురామ కర్మార్కర్: ఆరోగ్యశాఖ
డాక్టర్ పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్; ఆహార, వ్యవసాయశాఖ
కేశవదేవ మాలవీయ: ఉక్కు, గనులు, నూనెశాఖ
మెహర్‌చంద్ ఖన్నా: కాందిశీకుల పునరావాసము
నిత్యానంద కనుంగో: వాణిజ్య, పరిశ్రమలశాఖ
రాజ్ బహదూర్: రవాణా, తంతి, తపాలా శాఖలు
బల్వంత్ నాగేశ్ దాతార్: దేశీయాంగ శాఖ
మనుభాయ్ షా: వాణిజ్య పరిశ్రమల శాఖ
సురేంద్రకుమార్ దే: సమాజాభివృద్ధిశాఖ
డాక్టర్ కాలూలాల్ శ్రీమాలి: విద్య

హుమయూన్ కబీర్ : విజ్ఞాన పరిశోధన, సంస్కృతి
బెజవాడ గోపాలరెడ్డి : ఆదాయ, వ్యయశాఖ

## డిప్యూటి మంత్రులు

సర్దార్ సుర్జిత్ సింగ్ మజీతియా : రక్షణశాఖ
అబీద్ అలి : కార్మికశాఖ
అనిల్ కుమార్ చందా : వర్క్సుశాఖ
ఎం. వి. కృష్ణప్ప : ఆహారశాఖ
జయ్‌సుఖ్ లాల్ హాథి : నీటి పారుదల, విద్యుచ్ఛక్తి
సతీశ్ చంద్ర : ప్లానింగ్
బలిరాం భగత్ : ఆర్థికశాఖ
డాక్టర్ మనోమోహన్ దాస్ : విద్యా, వైజ్ఞానిక పరిశోధన
షా నవాజ్ ఖాన్ : రైల్వేలు
శ్రీమతి లక్ష్మి ఎన్. మీనన్ : విదేశాంగశాఖ
శ్రీమతి వయొలెట్ ఆల్వ : దేశీయాంగశాఖ
కొత్త రఘురామయ్య : రక్షణశాఖ
ఎ. ఎం. తామస్ : ఆహార, వ్యవసాయశాఖ
ఆర్. ఎం. హజార్ నవీస్ : న్యాయశాఖ
ఎస్. వి. రామస్వామి : రైల్వేలు
అహమ్మద్ మొహియుద్దీన్ : విమాన సౌకర్యాలు
శ్రీమతి తారకేశ్వరి సిన్హా : ఆర్థికశాఖ
పి. ఎస్. నాస్కర్ : కాందిశీకుల పునరావాసము
బి. ఎస్. మూర్తి : సమాజాభివృద్ధిశాఖ

## పార్లమెంటరీ సెక్రటరీలు

జి. రాజగోపాలన్, రేడియో సమాచారశాఖ; సాదత్ ఆలిఖాన్, విదేశ వ్యవహారాలు; పూర్ణేంద్రనాథ్ హజారికా, విదేశ వ్యవహారాలు; ఫతేసింహరావ్ ప్రతాప్‌సింహరావ్ గాయక్వాడ్, రక్షణ, ఎల్. ఎన్. మిశ్ర, ప్లానింగ్; శ్యామధార్ మిశ్ర, సమాజాభివృద్ధిశాఖ; ఆనందచంద్ర జోషి, ప్రచురణ శాఖ; గజేంద్రప్రసాద్ సింహ, ఉక్కు పరిశ్రమ.

## మంత్రుల జీతాలు

మంత్రుల జీతాలు నెలకు 2,250; వీరికి జీతంకాక, వారి అవసరా ననుసరించి నెలకు రు. 500 లకు మించకుండా తగిన మొత్తాన్ని అల వెన్సుగా యిస్తారు. జీతం విషయంలో మంత్రులకూ, కాబినెట్ హోదా లేని మంత్రులకూ తేడా ఏమీ లేదు. కేబినెట్ హోదాలేని మంత్రులకు అలవెన్సు వుండదు.

ప్రతి మంత్రికీ, అన్ని హంగులూవున్న ఉచిత గృహ వసతి ఉంటుంది.

ఇన్‌కం టాక్స్ పోగా, మంత్రికి నెలకు రు. 1,600 మాత్రం మిగులుతుందని అంచనా వేయబడింది.

డిప్యూటి మంత్రులకు జీతం: నెలకు రు. 1,750.

దేశంలోని ఆర్థిక పరిస్థితి కారణంగా, 1957 జూన్ 14 నుంచి, మంత్రులు తమ జీతంలో నూటికి పదివంతులు తగ్గించుకున్నారు.

# పార్లమెంట్

లోక్ సభ సభ్యులు, 505. రాజ్యసభ సభ్యులు 250. వివిధ రాష్ట్రాలనుంచి, ఆయా సభలకు ఎన్నుకోబడిన సభ్యుల పేర్లను, రాష్ట్రాల వారిగా పూర్తి లిస్టును యీ క్రింద ప్రచురించాము. ప్రజలచే ఎన్నుకొన బడిన సభ్యులు గలది లోకసభ; ప్రజాప్రతినిధులచే ఎన్నుకొనబడిన సభ్యులు గలది రాజ్యసభ. అంచేత రాజ్యసభ వివరాలు ముందూ, లోక్ సభ వివరాలు తర్వాత ఇవ్వబడినవి. రాజ్యసభలోని సభ్యులలో ప్రతి రెండేళ్ళకూ మూడవవంతుమంది, తమ సభ్యత్వానుంచి విరమిస్తారు. వారిస్థానంలో క్రొత్తవారు ఎన్నుకోబడుతారు. 1964, 1962, 1960 లో సభ్యత్వంనుంచి విరమించేవారిపేర్లు ఆ సంవత్సరాలసంఖ్య ప్రక్కన ఉదహరించబడినవి. ఈ విరమణ సూత్రం చైర్మన్‌కు వర్తించదు. ఆయన పదవి పరిమితి అయిదేళ్లు.

# రా జ్య స భ

## చైర్మన్

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ (రు. 3,250)

## డిప్యూటీ చైర్మన్ :

ఎస్. వి. కృష్ణమూర్తి రావు (రు. 2,000)

## ఆంధ్రప్రదేశ్ : 18 :

1964: చార్ల వెంకటేశ్వరరావు, హెన్రీశామ్యూయెల్, శ్రీమతి సీత యుధవీర్, ఎస్. చెన్నారెడ్డి, కె. ఎల్. నరసింహం, ఎ. చక్రధర్. 1962: అడ్డూరి బలరామరెడ్డి, విల్లూరి వెంకటరమణ, వేముల చిన్నకేశవ రావు, శ్రీమతి యశోదరెడ్డి, డాక్టర్ రాజబహదూర్ గౌడ్, ఎన్. నరోత్తమరెడ్డి. 1960: మాకినేని బసవపున్నయ్య, జయంతి వెంకట రామేశ్వరవల్లభ రావు, అల్లూరి సత్యనారాయణరాజు, బెజవాడ గోపాల రెడ్డి, అక్బర్ అలీఖాన్, వీరమాచనేని ప్రసాదరావు.

## అస్సాం : 7 :

1964: మౌలానామహమ్మద్ తాయెబుల్లా; జయభద్ర హగ్జెర్; 1962: శ్రీమతి పుష్పలతదాస్, పూర్ణచంద్రశర్మ, లీలాధర్ బరూవా; 1960: ఎస్. సి. దేవ్, శ్రీమతి దేవవతి బురగోహైన్.

## ఉత్తర ప్రదేశ్ : 34 :

1964: పండిత్ గోవిందవల్లభపంత్, తారకేశ్వరపాండె, నవాబ్ సింగ్ చౌహన్, జగన్నాథ్ ప్రసాద్, ధర్మదాస్, మహావీర్ ప్రసాద్, శ్యామధర్ మిశ్ర, శ్యామసుందర్ నారాయణ్, ఫరీదుల్ హక్, డాక్టర్ జడ్. ఎ. అహమ్మద్, రాజా అజిత్ ప్రసాద్ సింగ్.

1962: అఖ్తర్ హుసేన్, అల్గురాయ్‌శాస్త్రి, హరిప్రసాద్ సాక్సెనా, జసావుద్ సింగ్ బిష్ట్, జస్పత్ రాయ్‌కపూర్, పి. ఎన్. సప్రూ, రాం కృపాల్ సింగ్, రాంప్రసాద్ తంత, శ్రీమతి చంద్రావతి లక్ష్మణ

పాల్, శ్రీమతి అనిసా బీగం కిద్వాయ్, శ్రీమతి సావిత్రిదేవి నిగం, పండిత్ హృదయనాథ్ కుంజ్రూ, జోగేష్ చంద్ర ఛటర్జి.

1960: పురుషోత్తందాస్ టాండన్, అమరనాథ్ అగర్వాల్ అనులోక్ చంద్, బ్రజ్ బిహారిశర్మ, గోపీనాథ్ సింగ్, మహమ్మద్ ఫరూకి, రాంచంద్ గుప్త, హరివల్లభ్ త్రిపాఠి, అహమద్ సయ్యద్ ఖాన్, పండిత్ బాలకృష్ణశర్మ.

ఒరిస్సా: 10:

1946 : హరిహర్ పటేల్, దివాకర్ పట్నాయక్, విభుదేందు మిశ్ర. 1962 : భగీరథి మహాపాత్రో, మహేశ్వర్ నాయక్, అభిమన్యు రథో, గోవిందచంద్రమిశ్ర, 1960: విశ్వనాథదాస్, స్వప్నానంద ప్రాణిగ్రాహి. (ఒకస్థానం ఖాళీ)

గ్ర్ : 4:

1964 : సర్దార్ బుధ్ సింగ్; కర్నల్ పీర్ మహమ్మద్ ఖాన్;
1962 : ఆగా సయ్యద్ మహమ్మద్ జలాలీ; 1960: పండిత్ త్రిలోచనదత్.

కేరళ : 9 :

1964 : బి. ఎ. సోలమన్; డాక్టర్ సుబ్బారావు, శ్రీమతి కె. భారతి. 1962: డాక్టర్ పి. జె. తామస్, కె. పి. మాధవనాయర్, ఎం. యన్. గోవిందన్ నాయర్; 1960 : పి. నారాయణన్ నాయర్, ఎన్. సి. శేఖర్, కె. మాధవమీనన్ :

పంజాబ్ : 11 :

1964: రాజకుమారి అమృత్ కౌర్, జగన్నాధ్ కౌశల్, డాక్టర్ మధురాం, సర్దార్ దర్శన్ సింగ్ ఫెరుమన్. 1962: దివాన్ చమన్ లాల్, సర్దార్ జెయిల్ సింగ్, జుగల్ కిశోర్, రఘుబీర్ సింగ్ పంజహారి. 1960: జాతెదార్ ఉద్దంసింగ్ నాగకో, ఎం. హెచ్. ఎస్. నిహాల్ సింగ్, డాక్టర్ అనూప్ సింగ్.

పశ్చిమ బెంగాల్ : 16

1964: సంతోష్‌కుమార్ బాసు; శ్రీమతి మాయాదేవి చిత్రిణి అన్సారుద్దీన్ అహమ్మద్; భూపేశ్ గుప్త; డాక్టర్ అతీంద్రనాథ్ బోస్; 1962: ప్రొఫెసర్ హుమయూన్ కబీర్, ప్రభుదయాళ్ హిమత్ సింగ్‌క, సత్యేంద్ర ప్రసాద్ రాయ్, మెహర్‌చంద్ ఖన్నా, సురేంద్ర మోహన్ ఘోష్. 1960: మృగాంక్ మోహన్‌సూర్, డాక్టర్ నళినాక్షదత్, సి. సి. బిశ్వాస్, రాజపత్‌సింగ్ దుగార్, అబ్దుల్ రజాక్ ఖాన్, డాక్టర్ నీహార్ రంజన్‌రాయ్.

బీహార్ : 22

1964: అహమ్మద్ హుసేన్, అవధేశ్వర ప్రసాద్‌సింహ, బ్రజకిశోర్ ప్రసాద్ సింహ, రాంబహుదుర్‌సింహ, శీలభద్రయాజి, దేవేంద్ర ప్రసాద్‌సింహ, శ్రీమతి జహనారా, కాంతసింగ్. 1962: రాంగోపాల్ అగర్వాలా, తాజముల్ హుసేన్, మజాహిర్‌ఇమాం, కిశోరిరాం, మైకేల్ జాన్, షా మహమ్మద్ ఉమేర్, గంగా చరణ్ సింహ, కృష్ణ మోహన్ ప్యారాసింహ. 1960: తిమొడోర్ బోద్రా, రాంధారిసింహ దిన్‌కర్, కైలాస్ విహారిలాల్, లక్ష్మి ఎన్. మీనన్, డాక్టర్ పూర్ణచంద్ర మిత్ర, మహేశ్ శరణ్, రాజేంద్ర ప్రతాప్ సింహ.

బొంబాయి : 27

1946: అబీద్ అలి జాఫర్ భాయ్; బాబుభాయ్ చినాయ్; ఎస్. పాటిల్; రామరావ్ దేశ్‌ముఖ్; రోహిత్ దవె; లాల్జి పెండ్సే; బి. డి. ఖోరగ్డె; దాహ్యాభాయ్ పటేల్; 1962: టి. ఆర్. దేవగిరికార్, డాక్టర్ ఎం. డి. డి. గిల్డర్, డి. వై. పవార్, మణిలాల్ చతుర్భాయ్ షా, పి. ఎన్. రాజభోజ్, వి. కె. ధాగె, మగన్‌లాల్ బి. జోషి, మేఘరాజ్ పేత్రాజ్ షా, డాక్టర్ రఘువీర, డాక్టర్ డబ్ల్యు. ఎస్. బార్లింగే, జి. ఆర్. కులకర్ణి, ఎం. డి. తుంపల్లివార్. 1960: దేవకినందన్ నారాయణ్, శ్రేయాంస్ ప్రసాద్ జైయిన్, సోనుసింగ్ డి. పటేల్, డాక్టర్ డి. హెచ్. వరియావ, నరసింగరావ్ దేశముఖ్, పి. టి. లువా, కాజిసయ్యద్ కరీముద్దీన్, రాజభావ్ డాంగ్రే.

## మదరాసు : 17 :

1964 : టి. ఎస్. అవినాసలింగంచెట్టియార్, జి. రాజగోపాలన్, బి. పరమేశ్వరన్, ఎస్. చత్తనాథ కరయాలార్, ఎస్. ఎం. లింగం, హెచ్. డి. రాజా. 1962: ఎస్. వెంకటరామన్, అబ్దుల్ రహీం, శ్రీమతి టి. నల్లముత్తు రామస్వామి, దావూద్ అలిమిర్జా, డాక్టర్ ఎం. రామస్వామిమొదలియార్. 1960 : ఎన్. రామకృష్ణఅయ్యర్, కె. సదానందహెగ్డె, పి. ఎస్. రాజగోపాల్ నాయుడు, టి. వి. కమలాస్వామి, టి. ఎస్. పట్టాభిరామన్, టి. భాస్కరరావు.

## మధ్యప్రదేశ్ : 16 :

1964 : ఠాకూర్ నిరంజన్ సింగ్, బనారసిదాస్ చతుర్వేది, టి. డి. పుస్తకె, శ్రీమతి డాక్టర్ సీతపరమానంద్, దయాళ్ దాస్ కురె, వి. వి. సర్వాటె. 1962: రాంసహాయ్, శ్రీమతి రుక్మిణిబాయ్, మహమ్మద్ అలి అన్సారి, డాక్టర్ ఆర్. పి. దుబె. 1960 : గోపికృష్ణ విజయవర్గీయ, డాక్టర్ రఘువీరసింగ్, భానుప్రతాప్‌సిం. రతన్ లాల్ గ్ మాలవీయ, కెప్టెన్ అవదేశ్ ప్రతాప్‌సింగ్, శ్రీమతి కృష్ణకుమారి.

## మైసూర్ : 12 :

1964 : బి. పి. బసవప్పచెట్టి, మహమ్మద్ వలియుల్లా, శ్రీమతి అన్నపూర్ణాదేవి తిమ్మారెడ్డి, ముల్కా గోవిందరెడ్డి. 1962 : ఎస్. వి. కృష్ణమూర్తిరావు, శ్రీమతి వయొలెట్ జోషిం ఆల్వ, ఎస్. హార్డికర్, జనార్దన్ రావ్ దేశాయ్, 1960 బి. శివరావు. బి. సి. నంజుండయ్య. లాల్ చంద్ హిరా చంద్ దోషి, బి. ఎం. గుపె.

## రాజస్తాన్ : 10 :

1964 : హరదేవ్ జోషి, తికారాం పలీవాల్. కేశవానంద్. 1962: డాక్టర్ కె. ఎల్. శ్రీమాలి, శ్రీమతి శారదభార్గవ, కున్వర్ జస్వంత్ సింగ్, మౌలానా అబ్దుల్ షకూర్, 1960 : జయనారాయణ్ వ్యాస్, ఆదిత్యేంద్ర, విజయసింగ్.

ఢిల్లీ : 3 :

1964 : బేగం సాదికా, 1962: కె. సి. దే; 1960, ఓంకార్ నాథ్.

త్రిపుర :

1962 : అబ్దుల్ లతీఫ్.

మణిపూర్ : 1 :

1962 : లలిత్ మాధవ్ శర్మ.

హిమాచల ప్రదేశ్ :

1964: ఆనందచంద్. 1964 : శ్రీమతి లీలాదేవి.

ప్రెసిడెంట్ చే నామినేట్ చేయబడినవారు : 12:

1964 : ఎ. ఎన్. ఖోస్లా, డాక్టర్ పి. వి. కానె, కాకా సాహెబ్ కలేల్కర్, మైథిలీశరణ్ గుప్త. 1962 : డాక్టర్ జకిర్ హుసేన్, శ్రీమతి రుక్మిణిదేవి అరండేల్, ప్రొఫెసర్ నారాయణదాస్ ఆర్. మల్కాని, బి. వి. వారేర్కర్, 1960 : సత్యేంద్రనాథ్ బోస్, ప్రొఫెసర్ ఎ. ఆర్. వాడియా, పృథ్వీరాజ్ కపూర్, మోటూరి సత్యనారాయణ.

## లోక్ సభ

ఇండియాలోని వివిధరాష్ట్రాలకు ప్రస్తుతపు లోక్ సభలో గల సభ్యత్వపు వివరాలు ఇవి:

ఆంధ్ర, 43; ఆసాం, 12; ఉత్తరప్రదేశ్, 86; ఒరిస్సా, 20; కాశ్మీర్, 6; కేరళ, 18; పంజాబ్, 22; పశ్చిమబెంగాల్, 36; బీహార్, 53; బొంబాయి. 66; మదరాసు, 41; మధ్యప్రదేశ్, 36; మైసూర్, 26; రాజస్తాన్, 22; అండమాన్ నికోబార్ దీవులు 1; ఢిల్లీ, 5; త్రిపుర, 2; మణిపూర్, 2; హిమాచలప్రదేశ్, 4; ఆసాం కొండజాతుల ప్రతినిధి 1; ప్రెసిడెంట్ చే నామినేట్ చేయబడిన ఆంగ్లో ఇండియనులు 2; మొత్తం 505.

స్పీకరు: మాడభూషి అనంతశయనం అయ్యంగార్, జీతం: రు. 3,250.

డిప్యూటీ స్పీకరు: సర్దార్ హుకుంసింగ్; జీతం రు. 2,000.

సెక్రటరి: ఎం. ఎన్. కౌల్

## ఆంధ్రప్రదేశ్

మొత్తం స్థానాలు 43; వీనిలో షెడ్యూల్డుకులాలకు 6; షెడ్యూల్డుజాతులకు 2 స్థానాలు ప్రత్యేకించ బడినవి.

కాంగ్రెసు: 37. ఎం. వి. గంగాధరశివ, షెడ్యూల్డుకులాలు, చిత్తూరు; సంగం లక్ష్మీబాయి, వికారాబాద్; డి. సత్యనారాయణ రాజు, రాజమండ్రి; టి. ఎన్. విశ్వనాథరెడ్డి, రాజంపేట; ఈ నలుగురూ పోటీలేకుండా ఎన్నుకోబడినారు.

పి. హనుమంతరావు, మెదకు; వి. రామిరెడ్డి, కడప; వినాయకరావు విద్యాలంకార్, హైదరాబాద్ నగరం; అహమద్ మొహియుద్దీన్, సికందరాబాద్ నగరం; బి. రాజగోపాలరావు, శ్రీకాకుళం; దుగ్గిరాల బలరామకృష్ణయ్య, గుడివాడ; హరీస్ చంద్ర హెడా, నిజామాబాద్; డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, విజయవాడ; కొత్త రఘురామయ్య, గుంటూరు; మండలి వెంకటకృష్ణారావు, మచిలీపట్టణం; మాడభూషి అనంతశయనం అయ్యంగార్, చిత్తూరు జనరల్; సాదత్ అలిఖాన్, వరంగల్; ఇటుకల మధుసూదనరావు, మహబూబాబాద్; దీవనపల్లి రాజయ్య, నల్లగొండ రిజర్వ్డ్; రాజా రామేశ్వరరావు, మహబూబ్‌నగర్ జనరల్; పులి రామస్వామి, మహబూబ్ నగర్, రిజర్వ్డ్; ఆర్. నారప రెడ్డి, ఒంగోలు; ఎన్. జి. రంగ, తెనాలి; ఉస్మాన్ అలిఖాన్, కర్నూలు; కుమారి మోతే వేదకుమారి, ఏలూరు; పి. వెంకటసుబ్బయ్య, ఆదోని; కె. ఆశన్న, ఆదిలాబాద్: శ్రీరంగారావు, కరీంనగర్, జనరల్; ఎం. ఆర్. కృష్ణ, కరీంనగర్, రిజర్వ్డ్; కె. వి. రామకృష్ణారెడ్డి, హిందూపూర్; బి. సత్యనారాయణ, షెడ్యూల్డు జాతులు, పార్వతీపురం, రిజర్వ్డ్; చేగిరెడ్డి బాలిరెడ్డి, మార్కాపురం; రేబాల లక్ష్మీనరసారెడ్డి, నెల్లూరు జనరల్; బి. అంజనప్ప, నెల్లూరు రిజర్వ్డ్; మొసలికంటి తిరు

మలరావు, కాకినాడ జనరల్; బి. ఎస్. మూర్తి, కాకినాడ రిజర్వ్డ్; మిస్సుల సూర్యనారాయణమూర్తి, గోలుకొండ, జనరల్; కంకిపాటి వీరన్నపాడల్, గోలుకొండ, రిజర్వ్డ్.

కమ్యూనిస్టులు : 2

ఉద్దంరాజు రామం, నరసాపురం; తరిమెల నాగిరెడ్డి, అనంతపురం.

పీపుల్సు డెమొక్రటిక్ ఫ్రంట్: 2

దేవులపల్లి వెంకటేశ్వరరావు, నల్లగొండ, జనరల్; టి. బి. విఠల్ రావు, ఖమ్మమెట్.

సోషలిస్టులు : 2

పూసపాటి విజయరామ గజపతిరాజు, విశాఖపట్టణం; డిప్పల సూరిదొర, షెడ్యూల్డ్ జాతులు, పార్వతీపురం జనరల్.

## అసాం

మొత్తం స్థానాలు 12. వీనిలో షెడ్యూల్డు కులాలకు ఒకటి, షెడ్యూల్డు జాతులకు 2 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు 10: విజయచంద్రభగవతి; నివారణ్ చంద్రనాస్కర్, షెడ్యూల్డు కులాలు; ఇద్దరూ పోటీలేకుండా ఎన్నిక అయారు.

హేం బారువ; లీలాధర్ కటాకి; శ్రీమతి రాణి మంజులాదేవి; ధరణీధర్ బసుమతారి; జోగేంద్రనాథ్ హజారికా; ద్వారక్ నాథ్ తివారి; ప్రఫుల్ల చంద్రబారువ; మొఫిదా అహమద్.

ప్రజా సోషలిస్టు: 1 అంజాద్ అలి.

తూర్పు ఇండియా కొండజాతుల యూనియన్ 1: హూవర్ హిన్యూటా.

## ఉత్తర ప్రదేశ్

మొత్తం స్థానాలు 86. వీనిలో షెడ్యూల్డు కులాలకు 18 స్థానాలు ప్రత్యేకించ బడినవి.

కాంగ్రెసు : 71

మునీశ్వర్‌దత్ ఉపాధ్యాయ; రాజా సయ్యద్ అహమద్ మెహ్ది; సర్దార్ జోగేంద్రసింగ్; సతీశ్ చంద్ర, సుమంత ప్రసాద్, హరప్రసాద్

సింగ్; రాజాదినేశ్ సింగ్; కె. డి. మాలవీయ; హిఫ్జుర్ రహమాన్; లాల్ బహదూర్ శాస్త్రి; రఘువీర్ సహాయ్; ఉమ్రావ్ సింగ్; సేట్ అచల్ సింగ్; రాంశరణ్; రోషన్ లాల్; అన్సర్ హర్వానీ; జవహర్ లాల్ నెహ్రూ; మసూరియాదిన్; రాజారాం; పన్నాలాల్; ఎ. జె. వై. ఖ్వాజా, నర్ దేవ్; రాంశంకర్ లాల్; చౌధురి బదన్ సింగ్; కృష్ణచంద్ర శర్మ; రఘువీర్ దయాళ్ మిశ్ర; కనయాలాల్ వాల్మీకి; తులారాం; బీర్బల్ సింగ్; గణపత్ రాం; భగవాన్ దిన్; సి. డి. పాండే; డాక్టర్ బి. వి. కేస్కర్; రాధామోహన్; మూల్ చంద్; అబ్దుల్ లతీఫ్; పులిన్ విహారి బెనర్జి; రాంసేవక్ యాదవ్; స్వామి రామానంద్; దినేశ్ ప్రతాప్ సింగ్; సింహాసన్ సింగ్; మహాదేవ్ ప్రసాద్; మహావీర్ త్యాగి: షానవాజ్ ఖాన్; అజిత్ ప్రసాద్ జెయిన్; సుందర్ లాల్; గోవింద మాలవీయ; కాశీనాథ్ పాండె; డాక్టర్ సుశీలనయ్యర్; కలికా సింగ్; విశ్వనాథప్రసాద్; రఘునాథ్ సింగ్; విష్ణుచరణ్ దుబ్లిష్; భక్తదర్శన్; ఫిరోజ్ గాంధి; బాయ్జ్ నాద్ కురీల్; కృష్ణచంద్ర; విశ్వనాథ్ బాయ్; శ్రీమతి ఉమ నెహ్రూ; ప్రాగిలాల్; జె. ఎన్. విల్సన్, రూప్ నారాయణ్; మనులాల్; లక్ష్మీరామ్; విశాంబర్ దయాళ్; శ్రీమతి గంగాదేవి; చెడ్డా లాల్; నారాయన్ దిన్; ప్రభు నారాయణ్ సింగ్; మహారాజా మానవేంద్రషా.

ప్రజాసోషలిస్టు: 4 బ్రిజ్ రాజ్ సింగ్; ఖుష్వత్ రాయ్ భయ్యా లాల్; బన్సీదాస్ ధంగర్; రాంజీవర్మ;
స్వతంత్రులు :

జగదీశ్ అవస్థి; రాంఘురీబ్; ఎన్. ఎం. బెనర్జి, ప్రొఫెసర్ శిబ్బన్ లాల్ శాక్జెనా; రాజామహేంద్రప్రతాప్: అర్జున్ సింగ్; భిషణ్ చంద్రసేట్; రాంసేవక యాదవ్
కమ్యూనిస్టులు: 1: సరయు పాండె
జనసంఘ:2: అతుల్ విహారి బాజ్ పాయ్; షివ్ దీన్.

## ఒరిస్సా

మొత్తం స్థానాలు 20. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 4, షెడ్యూల్డు జాతులకు 4 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు : 7 : నిత్యానంద కానుంగో; నరసింగ్ చరణ్ సామంత సింగర్; ఆర్. జగన్నాథ రావ్; టి. సంగన్న; మోహన్ నాయక్; భగవత్ సాహు; ఖాను చరణ్ జెన.

స్వతంత్రులు : 2:

లక్ష్మీనారాయణ భంజ్ దేవ్; ఉమాచరణ పట్నాయక్.

ఝార్ ఖండ్ : 1 : రామచంద్రమఝి, కొండజాతులు.

గణతంత్ర పరిషద్ : 7 : చంద్రమణికాలో; సురేంద్రమహంతి, అర్ధకార్ సుపాకర్; వనమాలి కుంభర్: బద్కుమార్ ప్రతాప్‌గంగాదేవ్; మహారాజా ప్రతాప్ కిశోర్ దేవ్; విజయచంద్ర ప్రధాన్.

కమ్యూనిస్టు : 1 : చింతామణి పాణిగ్రాహి;

ప్రజా సోషలిస్టు : 2 : సురేంద్ర నాద్ ద్వివేది: వైష్ణవ్ చరణ్ మల్లిక్.

## కాశ్మీర్

మొత్తం స్థానాలు 6:

బక్షి అబ్దుల్ రషీద్; లాలా తాకూర్దాస్; శ్రీమతి కృష్ణ మెహత; మౌల్వి అబ్దుల్ రహమన్; షేక్ మహమద్ అక్బర్; అలి మహమ్మద్ తారీక్.

## కేరళ

మొత్తంస్థానాలు 18. వీనిలో షెడ్యూలు కులాలకు 2 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు : 6 మాత్యూ మనియంగడన్; ఎ. ఎం. తామస్; ఎం. కె. జినచంద్రన్; జార్జి తామస్ కొట్టుకాపల్లి; కె. పి. కుట్టికృష్ణన్ నాయర్; వి. ఈశ్వరన్.

స్వతంత్రులు : 1 : ఎస్. ఈశ్వర అయ్యర్.

ముస్లిం లీగ్ : బి. పోకర్.

కమ్యూనిస్టులు : 9 : ఎం. కె. కుమారన్; ఎ. కె. గోపాలన్; టి. సి. నారాయన్ కుట్టి; పి. కె. వాసుదేవన్ నాయర్; కె. కృష్ణన్; పి. టి. పున్నూస్; వి. పి. నాయర్; కె. కొడియన్; పి. కున్హాన్.

ప్రజా సోషలిస్టు : 1 : డాక్టర్ కె. బి. మీనన్.

## పంజాబ్

మొత్తం స్థానాలు, 22; వీరిలో షెడ్యూల్డు కులాలకు 5 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు : 21 రామకృష్ణన్; సర్దార్ సుర్జిత్ సింగ్ మజీతియా; సర్దార్ బలదేవసింగ్; దివాన్ చంద్ శర్మ; జ్ఞాని గురుముఖ్ సింగ్ ముసాఫిర్; పండిత్ ఠాకూర్ దాస్ భార్గవ; సర్దార్ ఇక్బల్ సింగ్; శ్రీమతి సుభద్రబాయ్ జోషి; చునిలాల్; సర్దార్ అజిత్ సింగ్ సర్హాది; సర్దార్ బహదూర్ సింగ్; మూల్ చంద్ జైన్; సర్దార్ స్వరణ్ సింగ్; సాధురాం; చౌధురి రణవీర్ సింగ్; సర్దార్ హుకుంసింగ్; అచింత్ రా; సర్దార్ అజిత్ సింగ్; హెంరాజ్; దల్జిత్ సింగ్.

కమ్యూనిస్టు : 1 : ప్రతాప్ సింగ్

## పశ్చిమ బెంగాల్

మొత్తం స్థానాలు 36. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 6. షెడ్యూల్డ్ జాతులకు 2 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు : 23 తియొడోర్ మాన్నెన్; శ్రీమతి రేణుక రే; శ్రీమతి ఇళపాల్ చౌధురి; నికుంజ బిహారి మైతి; ఉపేంద్రనాథ్ బర్మన్; చపల కాంతభట్టాచార్య; మర్ధి సెలుకు, నరసింగమల్ల ఉగల్సందదేవ్; సుబోధ్ హంసదా; అతుల్యఘోష్; డాక్టర్ మనోమోహన్ దాస్; సతీశ్ చంద్ర సామంత; డాక్టర్ రాంగతిబందోపాధ్యాయ; పశుపతిమండల్: జితేంద్ర నాథ్ లాహిరి; మహమ్మద్ ఖుదాబక్ష్; అశోక్ కుమార్ సేన్; అయణచంద్ర గుహా; అనిల్ కుమార్ చందా; కమల్ కృష్ణదాస్; పరేశ్ నాథ్ కయాల్ పూర్ణేందు శేఖర్ నాస్కర్.

కమ్యూనిస్టులు : 6: ప్రభాత్ కార్; మహమ్మద్ ఇలియస్; సాధన్ చంద్రగుప్త; శ్రీమతి రేణు చక్రవర్తి; ప్రొఫెసర్ హీరేన్ ముఖర్జి; కంసారి హాల్డర్.

విప్లవ్యాపనరీ సోషలిస్టుపార్టి : 1 : త్రిదివ్ చౌదరి.

పార్వర్డ్ బ్లాక్ : 2 : సుబిమన్ ఘోష్; అరవిందఘోశాల్.
ప్రజాసోషలిస్టు : 2 : ప్రమధనాధ బెనర్జి; విమలకుమార్ ఘోష్.
లోక్ సేవక్ సంఘ : 1 : విభూతిభూషణ్ దాస్ గుప్త.

## బీహార్

మొత్తం స్థానాలు 53. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 7, షెడ్యూల్డ్ జాతులకు 5 స్థానాలు ప్రత్యేకించబడినవి.
కాంగ్రెసు : 40 :

రామేశ్వరసాహు, జగజీవనరాం, ఇద్దరూ షెడ్యూల్డ్ కులాలు, పోటీలేకుండా ఎన్నిక.

ప్రభాత్ చంద్రబోస్; మహేంద్రకుమార్ ఘోష్; సారంగధర్ సింహ; విభూతిమిశ్ర; శ్రీమతి తారకేశ్వరిసింహ; విపినవిహారివర్మ; భోలా రవుత్; దిగ్విజయ నారాయణ్ సింగ్; ద్వారకనాథ్ తివారి; సత్యనారాయణ్ సింహ; కైలాసపతి సింగ్; శ్రీమతిశకుంతలదేవి; అనిరుధసింగ్; డాక్టరు సయ్యద్ మహమద్; బనారసిప్రసాద్ ఝుంఝుంవాలా; ఝులన్ సింహ; ఫణిగోపాల్ సేన్‌గుప్త; గజేంద్రప్రసాద్ సింహ; జియాలాల్ మండల్; శ్యామనందన్ మిశ్ర; శ్రీ నారాయణ్ దాస్; బ్రజేశ్వర్ ప్రసాద్; మహమ్మద్ తహిర్; మహేంద్రనాథ్ సింగ్; బనారసి ప్రసాద్ సింహ; నయనతారదాస్; మధుర ప్రసాద్ మిశ్ర; శ్రీమతి సత్యభామదేవి; రామధానిదాస్; రాజేశ్వర్ పటేల్; చంద్రమణిలాల్ చౌధురి; పాయ్‌కా ముర్ము; లలిత్ నారాయణ్ మిశ్ర; భోలి సర్దార్; రామసుభగ్ సింగ్; సత్యేంద్రనారాయణ్ సింగ్; బాలీరాం భగత్; భోలానాథ్ విశ్వాస్.

ఝార్ ఖండ్ : 6 ఎం. ఆర్. మసాని; జయపాల్ సింగ్; ఇగ్నెస్ బెక్; శంభుచరణ్ గొడ్సెరా; సురేశ్ చంద్ర చౌధురి; దేవిశరణ్.

జనత : 3 : శ్రీమతి లలిత రాజ్యలక్ష్మి; కాజి ఎస్. ఎ. మతిన్; శ్రీమతి విజయరాజె.

ప్రజాసోషలిస్టు : 2 : ఆచార్య జె. బి. కృపలాని; రాజేంద్రసింగ్; అశోక మెహత.

స్వతంత్రులు : 1 : మహారాజకుమార్ కమల్ సింగ్.

## బొంబాయి

మొత్తం స్థానాలు 66. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 7, షెడ్యూల్డ్ జాతులకు 5 స్థానాలు ప్రత్యేకించబడినవి. కాంగ్రెసు: 38 మనుభాయ్ నిచ్ఛాభాయ్‌పటేల్; శ్రీమతి జయబెన్ విజూభాయ్ షా; జలీభాయ్‌ఖోయాభాయ్‌దీన్‌దోడ్; డి. వై. గోహోకార్; బలవంత రాయ్ జి. మెహత; కె. ఎం. జెధి; మనుభాయ్ ఎం. షా; జైశుఖ్‌లాల్ శంకర్‌హథి; భావన్‌జీ ఎ. ఖింజి; మానెక్‌లాల్ మగన్‌లాల్ గాంధి, నరేంద్ర పి. నత్వాని; రఖ్మాజీ ధోండిబా; మహారాజా ఫతేసింగ్ రావ్ గాయెక్‌వాడ్; జి. సి. ఓజా; చంద్రశేఖర్; ఎం. భట్; వి. కె. కృష్ణ మీనన్; ఎస్. కె. పాటిల్; చగన్‌లాల్ మాధారిలాల్ కేదారియా; కులారిలాల్ బులాకిరాం నంద; స్వామి రామానందతీర్థ; కమలనయన్ బజాజ్; వెంకటిరావ్ శ్రీనివాసరావు; అక్బరుభాయ్ డి. చౌదా; టి. హెచ్. సోనవానె; కుమారి మణిబెన్ పటేల్; ఎం. ఎస్, ఆనే; వాగోరావ్ కేరోజి; పంజాజ్‌రావ్ ఎస్. దేశముఖ్; ఎస్. ఆర్. రానె; కె. జి. దేశముఖ్; వి. ఎన్. స్వామి; డి. ఎన్. కంబ్లి. డాక్టర్ జి. బి. ఖేద్కార్; ఎల్. ఎస్. భట్కార్; ఆర్. ఎం. హజార్ నవీస్. బి. ఆర్. వాస్నిక్; మురార్జి దేశాయ్.

పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టి: 4

దాజిసాహెబ్ రామారావ్ చవన్; ఆర్. బి. రవుత్; బి. పి. పాటిల్; బి. ఎన్. మహాగాంకార్.

ప్రజాసోషలిస్టు : 5:

యాదవ్ నారాయణ్ జాదవ్; నాథ్‌బాపుపాయ్; నాషిర్ బరూచా; లక్ష్మన్ వేదువాల్వి; నారాయణ్ గణేష్‌గోరే.

మహాగుజరాత్ జనతపరిషత్ : 4 :

పురుషోత్తందాస్‌రణఛోడ్‌దాస్‌పటేల్; ఠాకూర్ శ్రీఫతేసింహజీ దాభి; ఇందులాల్ యాజ్ఞిక్; జస్వన్‌దాస్ పరమార్.

షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్ : 6 :

బి. డి. సాలుంకె; బి. కె. గాయక్‌వాడ్; బి. సి. కంబ్లె; ఎస్. కె. దిఘె; జి. కె. మణే; హరిహరరావ్ సొనులే;

జనసంఘ: 2: పి. ఆర్. అస్సర్; యు. ఎల్. పాటిల్.
కమ్యూనిస్టులు: 4: నానారామచంద్రపాటిల్; శ్యామరావ్ వి. పరు లేఖర్; ఎల్. ఎం. మధేరా, ఎస్. ఎ. డాంగె.

స్వతంత్రులు: జె. జి. మోరె: ఆర్. కె. ఖడిల్ కార్: మోతిసింగ్ బహదూర్ సింగ్ టాకూర్, అంకశరావ్ ఘోరె.

## మదరాసు

మొత్తం స్థానాలు 41. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 7 స్థానాలు ప్రత్యేకించబడినవి.
కాంగ్రెసు : 31 :

టి. గణపతి; (పోటీ లేకుండా ఎన్నిక); డాక్టర్ పి. సుబ్బ రాయన్; సి. ఆర్. పట్టాభిరామన్; ఆర్. రామనాథన్ చెట్టియార్; పి. ఆర్. రామకృష్ణన్; భారతి నారాయణస్వామిచెట్టియార్; కె. ఎస్. రామస్వామిగౌండర్; ఎం. శంకరపాండియన్ పిళ్లై; సి. ఆర్. నరసింహన్; సి. నంజప్ప; ఎం. పళనియాండి; ఎం. దొరస్వామి గౌండర్; ఎస్. వి. రామస్వామి; టి. టి. కృష్ణమాచారి; ఆర్. ఎస్. అరుముగం; ఎం. కె. ఎం. అబ్దుల్ సలాం; పి. టి. తానుపిళ్లై; సుబ్బయ్య అంబాళం; కె. పెరియసామి గౌండర్; ఆర్. గోవిందరాజులు నాయుడు; ఆర్. కనక సబై పిళ్లై; ఎల్. ఎళయపెరుమాళ్; ఎస్. తానులింగనాడార్; ఘులాం మోహిదీన్; ఎస్. సి. బాలకృష్ణన్; ఎస్. ఆర్. అరుముగం; ఎస్. ఆర్. మునుస్వామి; ఎం. ముత్తుకృష్ణన్; కె. ఆర్. సంబంధం; ఎం. అయ్యా కణ్ణు; ఎ. వైరవన్.

కాంగ్రెసు సంస్కరణకమిటి ఎన్. పి. మన్నాగగౌండర్; టి. డి. ముత్తుకుమారస్వామి నాయుడు. కమ్యూనిస్టులు 2: శ్రీమతి పార్వతి కృష్ణన్; కె. టి. కె. తంగమణి. స్వతంత్ర 3: ఆర్. ధర్మలింగం; డాక్టర్ ఎ. కృష్ణస్వామి; ఎన్. శివరాజ్. ఫార్వర్డ్ బ్లాక్ 1: యు. ముత్తురామలింగదేవర్; సోషలిస్టు 1: ఎస్. సి. సి. అంతోనిపిళ్లై; ద్రావిడ మున్నేట్ర కళగం 1: ఇ. వి. కె. సంపత్.

## మధ్యప్రదేశ్

మొత్తం స్థానాలు 36. వీనిలో షెడ్యూల్డ్ కులాలకు 35, షెడ్యూల్డ్ జాతులకు 7 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు : 35 : మంగ్రుబాబువికే (షెడ్యూల్డ్ కులాలు, పోటీ లేకుండా ఎన్నిక).

మానక్‌లాల్, మహారాణి విజయరాజెసింధియా, మోహన్‌లాల్, బాప్లివాల్, కె. ఎల్. ఖాదివాలా, శేట్ గోవిందదాస్, అమరసింగ్, రాంసింగ్‌వర్మ, శ్రీమతి మేమునా సుల్తానా, చింతాన్‌మఝ్రుగి, లీలాధర్ జోషి, కనయ్యాలాల్; సురటి క్రిష్టయ్య, కొండజాతులు; రేషంలాల్, అమర్‌సింగ్ సెహగల్, విద్యాచరన్‌శుక్ల, శ్రీమతి మినిమాత, రాధాచరన్, సూరజ్ ప్రసాద్, రాధేలాల్ వ్యాస్, శివదత్, రాబులాల్ సూరజ్ మనుతివారి, జ్వాలాప్రసాద్‌జోషి, రామ్ సహాయ, మోతిలాల్ మాలవీయ, నారాయణరావువాడియా, బాబునాథ్‌సింగ్, ఆనందచంద్రజోషి, కమల్ నారాయణసింగ్, భికులాల్ లక్ష్మీచంద్, శ్రీమతి సహోద్రబాయ్ మురళీధర్, మహారాజకుమార్ చండికేశ్వర్ శ్వరన్ జు దేవ్‌సింగ్, రాజావీరేంద్ర బహదూర్‌సింగ్. రాణికేసర్ కుమారిదేవి.

హిందూమహాసభ : బ్రిజ్ నారాయన్ బ్రజేష్.

## మైసూర్

మొత్త స్థానాలు 26. వీనిలో షెడ్యూల్డు కులాలకు ८ స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు 23: హెచ్. సిద్ధనంజప్ప, దొడ్డతిమ్మప్ప (షెడ్యూల్డు కులాలు) పోటీ లేకుండా ఎన్నిక. శేకూర్ సుబ్రహ్మణ్యం; బి. ఎన్. దాతార్: ఎన్. కేశవ అయ్యంగార్; కె. సి. ఒడయార్; డాక్టర్ జి. ఎస్. మేల్కొటె; ఎం. కె. శివనంజప్ప; ఎ. వి. కృష్ణప్ప; హెచ్. జి. దాసప్ప; డి. పి. కర్మార్కర్; జోషింఅల్వ; ఆర్. బి. బీదరి; సంగప్ప అగడి; సి. ఆర్. బసప్ప; కె. ఆర్. ఆచార్; టి. ఆర్. నెస్వి; యు. ఎస్. మల్లయ్య; కె. సి. రెడ్డి; ఎం. శంకరయ్య; ఎం. శిద్దయ్య; మహదేవప్ప రాంపురె శంకరదేవ్.

ప్రజాసోషలిస్టు 1: జె. మహమ్మద్ ఇమాం. స్వతంత్రులు 1: ఎం. ఎస్. సుగంధి. షెడ్యూల్డుకాస్టు ఫెడరేషన్ 1: కట్టి దత్తఅప్ప.

## రాజస్థాన్

మొత్తం స్థానాలు 22: వీటిలో షెడ్యూల్డ్ కులాలకు 3, షెడ్యూల్డు జాతులకు 2 స్థానాలు ప్రత్యేకించబడినవి.

కాంగ్రెసు 19: పండిత్ ముకుట విహారిలాల్ భార్గవ; రామేశ్వర్ తాంతియా; జస్వంత్ రాజ్ మెహత; రమేశ్ చంద్రవ్యాస్; జి. డి. సోమాని; మధురాదాస్ మధుర్; హరీశ్ చంద్రమధుర్; సూరజ్ రతన్ దామని; శోభారాం; భోగ్జి; నేమి చంద్ కాస్లివాల్; ఓంకార్ లాల్ జమ్నాలాల్; పండిట్ హీరాలాల్ శాస్త్రి; జగన్నాథ్; రాజబహదూర్; మాణిక్యలాల్ వర్మ: దీనబంధు: రాధేశ్యాం మొరార్కా; పన్నాలాల్.

స్వతంత్రులు 3: హరీస్ చంద్ర; మహారాజా రఘునాద్ సింగ్; మహారాజా కర్ణసింగ్.

## ఢిల్లి

మొత్తం స్థానాలు 5: వీనిలో షెడ్యూల్డు కులాలకు ఒక స్థానం ప్రత్యేకించబడింది.

కాంగ్రెసు: శ్రీమతి సుచేత కృపాలిని; రాధారమన్; బ్రహ్మ ప్రకాశ్; సి. కృష్ణన్ నాయర్, నవల్ ప్రభాకర్ (షెడ్యూల్డు కులాలు)

## త్రిపుర

మొత్తం స్థానాలు 2: వీనిలో షెడ్యూల్డు జాతులకు ఒక స్థానం ప్రత్యేకించబడింది.

కాంగ్రెసు: 1: బంశీ దేవ్ బర్మన్, షెడ్యూల్డు జాతులు.

కమ్యూనిస్టు: 1: దశరధనాథ్ దేవ్, షెడ్యూల్డు జాతులు.

## మణిపూర్

మొత్తం స్థానాలు 2: వీనిలో షెడ్యూల్డు జాతులకు ఒక స్థానం ప్రత్యేకించబడింది.

సోషలిస్టు: రిషాంగ్ కైషింగ్; రంగ్ సుంగ్ సూయిసా.

## హిమాచల ప్రదేశ్

మొత్తం స్థానాలు 4: వీనిలో షెడ్యూల్డు కులాలకు ఒక స్థానం ప్రత్యేకించబడింది.

కాంగ్రెసు: రాజా జోగీంద్రసేన్; డాక్టర్ వై. ఎస్. పరమార్; పండిత్ పద్మదేవ్; నేక్రాం.

ఆంగ్లో - ఇండియనుల తరఫున ప్రెసిడెంట్ చే నామినేట్ చేయబడినవారు:

ఫ్రాంక్ ఆంతోనీ; ఎ. ఇ. టి. బారో,

ఆసాం కొండజాతుల ప్రతినిధిగా ప్రెసిడెంట్ చే నామినేట్ చేయబడినవారు: 1:

చా ఖమాన్ గొహైన్,

అండమాన్, నికోబార్ దీవుల ప్రతినిధిగా ప్రెసిడెంట్ చే నామినేట్ చేయబడినవారు: 1:

లక్ష్మణ సింగ్.

### లోక్ సభలో వివిధ పార్టీల బలాలు:

కాంగ్రెసు, 367; కమ్యూనిస్టు, 27; ప్రజా సోషలిస్టు 20; భారతీయ జనసంఘు, 4; గణతంత్రపరిషత్తు, 7; ఝూర్ ఖండ్, 6; జనత, 3; పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్, 2; పెజంట్స్ అండ్ వర్కర్స్, 4; షెడ్యూల్డ్ కాస్టుస్ ఫెడరేషన్, 6; హిందూమహాసభ, 1; ఫార్వర్డ్ బ్లాక్ మార్కిస్టు, 2; స్వతంత్రులు, 43.

### స్త్రీ సభ్యులు:

లోక్ సభలో 28 మంది స్త్రీ సభ్యులు వున్నారు. రాష్ట్రాల వారిగా వారి సంఖ్యలు ఇవి:

ఆంధ్ర, 3; ఆసాం, 2; ఉత్తరప్రదేశ్, 3; కాశ్మీర్, 1; పంజాబ్, 1; పశ్చిమ బెంగాల్, 3; బీహార్, 5; బొంబాయి, 3; మదరాసు, 1; మధ్యప్రదేశ్, 5; ఢిల్లి, 1.

## సభ్యుల జీతాలు

పార్లమెంటు సభ్యులకు నెలకు రు. 400 జీతం, సమావేశానికి హాజరైన రోజుకు రు. 21 అలవెన్సు. ఫస్టుక్లాసులో దేశంలో ఎక్కడి కయినా ప్రయాణం చెయ్యడానికి రైల్వే ప్యాసు ఇవ్వబడుతుంది. ఇది కాక, సభాసమావేశానికి వెళ్ళే ప్రయాణానికి అదనంగా ఒక ఫస్టు క్లాసు చార్జి, ఒక థర్డు క్లాసు చార్జి ఇవ్వబడుతుంది.

## విదేశాలలో భారతదేశ ప్రతినిధులు

| | | |
|---|---|---|
| ఇంగ్లండు : | హై కమిషనర్ : | శ్రీమతి విజయలక్ష్మి పండిట్ |
| కెనడా : | ,, | సి. ఎస్. వెంకటాచార్ |
| ఆస్ట్రేలియా : | ,, | |
| సింహళం : | ,, | వై. డి. గుండేవియా |
| పాకిస్తాన్ : | ,, | రాజేశ్వర దయాళ్ |
| యునైటెడ్ స్టేట్స్ : | రాయబారి : | ఎం. సి. చగ్ల |
| రష్యా | ,, | కె. పి. ఎస్. మీనన్ |
| చైనా : | ,, | జి. పారసారథి |
| యునైటెడ్ నేషన్స్ : | ,, | చంద్రశేఖర్ ఝా |
| ఇరాన్ : | ,, | |
| ఇరాక్ : | ,, | ఐ. ఎస్. చోప్రా |
| అఫ్ఘనిస్తాన్ : | ,, | భగవత్ దయాళ్ |
| ఫ్రాన్సు : | ,, | ఎన్. రాఘవన్ |
| నేపాల్ : | ,, | భగవాన్ సహాయ |
| చెకొస్లోవేకియా : | ,, | విజయకృష్ణ ఆచార్య |
| రుమేనియా : | ,, | ,, |
| యుగోస్లావియా : బల్గేరియా : గ్రీస్ : | ,, | నవాబ్ అలి యావర్ జంగ్ |

| | | |
|---|---|---|
| బర్మా: | ,, | లాల్జి మెహరోత్రా |
| థాయ్‌లెండ్: | ,, | ఆనందమోహన్ సహాయ |
| సౌదీ అరేబియా: | ,, | ముస్తఫా కమల్ కిద్వాయ్ |
| టర్కీ: | ,, | సుందరనారాయణ్ హాక్సర్ |
| హాలెండు: | ,, | జాన్ ఎ. తివీ |
| ఇటలీ: | ,, | జాన్ ఎ. తివీ |
| అరబ్ రిపబ్లిక్: | ,, | ఆర్. కె. నెహ్రూ |
| ఇండోనేషియా: | ,, | డాక్టర్ జగన్నాథ్ ఖోస్ల |
| బ్రజిల్: | ,, | |
| పశ్చిమ జర్మని: | ,, | బి. ఎఫ్. హెచ్. త్యాబ్జి |
| జపాన్: | ,, | |
| నార్వే: | ,, | మహరావు శ్రీ మదనసింహజీ |
| కంబోడియా: | , | వి. మహదేవనాయర్ |
| బెల్జియం: | ,, | వి. ఎన్. కౌల్ |
| లావోస్: | ,, | పేరాల రత్నం |
| అర్జెంటైనా | ,, | పి. అచ్యుత మీనన్ |
| స్విట్జర్లెండ్: | ,, | ఎం. కె. వెల్లోడి |
| ఆస్ట్రియా. | ,, | ఆర్థర్ ఎస్. లాల్ |
| డెన్మార్కు: స్వీడన్: | ,, | కేవలసింగ్ చౌధురి |
| ఫిన్లెండ్: | ,, | ఎ. జె. దేశాయ్ |
| అబిస్సీనియా: | ,, | నిరంజన్ సింగ్ గిల్ |
| ఫిలిప్పైన్స్: | ,, | శంకరనాథ్ మైత్ర |
| మలయా: కమిషనర్: | ,, | శిశిర్ కుమార్ బెనర్జి |
| టిబెట్: పొలిటికల్ ఆఫీసర్ | | బి. కె. కపూర్ |

## భారత దేశంలో విదేశ ప్రతినిధులు

| | | |
|---|---|---|
| బ్రిటన్: | హైకమిషనర్: | మాల్కం మెక్డొనాల్డ్ |
| ఆస్ట్రేలియా: | ,, | డబ్ల్యు. ఆర్. క్రోకర్ |
| కెనడా: | ,, | సి. ఎ. రోనింగ్ |

| | | |
|---|---|---|
| సింహళం: | హైకమిషనర్ | సర్ రిచర్డ్ అలువిహారి |
| పాకిస్తాన్: | ,, | డాక్టర్ ఓమర్ హయత్ మాలిక్ |
| మలయా: | ,, | ఎస్. చెల్వసింగం మెకింటైర్ |
| ఫ్రాన్సు: | రాయబారి | కౌంట్ స్టానిస్లాస్ ఆస్ట్రోరాగ్ |
| అమెరికా: | ,, | ఎల్స్వర్త్ బంకర్ |
| చైనా: | ,, | పాన్ జు-లి |
| ఇటలీ: | ,, | డాక్టర్ పాలో టార్టిజ్ |
| ఇరాన్: | ,, | మోష్ ఫెజీ కజెమి |
| హాలెండు: | ,, | ఎ. ఎం. ఎ. విన్ కెల్ మన్ |
| థాయ్ లెండ్: | ,, | బన్ చారో యెంచాయ్ |
| నేపాల్: | ,, | మహేంద్ర విక్రమషా |
| రష్యా: | ,, | పి. కె. పొనోమరెంకో |
| బర్మా: | ,, | యు ధా ఆంగ్ |
| చెకొస్లోవేకియా | ,, | ఎఫ్. కోంజాలా |
| స్విజర్లెండ్: | ,, | డాక్టర్ క్లెమెంట్ - ఆల్బర్ట్ రెజోనికో |
| బెల్జియం: | ,, | స్టెపాన్ హులెట్ |
| ఆఫ్ఘనిస్తాన్: | ,, | సర్దార్ జనరల్ మహమ్మద్ మొఇర్ ఖాన్ |
| వాటికన్: | ,, | రివరెండ్ మార్టిన్ హెచ్. లూకాస్ |
| అరబ్ రిపబ్లిక్: | ,, | అహమద్ హాసన్ ఎల్ - ఫెకీ |
| స్వీడెన్: | ,, | మిసెస్ ఆల్వా మిర్డెల్ |
| నార్వే: | ,, | హాన్స్ ఒలావ్ |
| ఫిన్లెండ్: | ,, | డాక్టర్ ఆరోపాకాస్లాహి |
| ఇండోనేషియా: | ,, | మేజర్ జనరల్ ఆర్. హెచ్. అబ్దుల్ కాదర్ |
| డెన్మార్క్: | ,, | హారీ టాయ్ బెర్గ్ ఫ్రాంజెన్ |
| యుగోస్లావియా: | ,, | |
| అర్జెంటైనా: | ,, | ప్రొఫెసర్ విన్సెంట్ ఫాటోన్ |
| మెక్సికో: | ,, | పోర్టెస్ గిల్ |
| పశ్చిమ జర్మనీ | ,, | డాక్టర్ విల్హెల్మ్ మెల్చెర్స |
| ఇతియోపియా: | ,, | రాస్ ఇమ్రు |
| ఫిలిప్పైన్స్: | ,, | మాన్యుయెల్ ఎ. అల్సాటె |

| | | |
|---|---|---|
| జపాన్ : | ,, | సీజిరో యోషిజావా |
| టర్కీ : | ,, | హికాబి ఎకించి |
| ఇరాక్ : | ,, | కాసిం హసన్ |
| హంగరీ : | ,, | పీటర్ కోసో |
| పోలెండ్ : | ,, | డాక్టర్ జూలియస్ కాజ్ సుకీ |
| కంబోడియా : | ,, | వార్ కమెల్ |
| మంగోలియా : | ,, | బియన్ బతార్ ఒషిర్ బత్ |
| రుమేనియా : | ,, | నికోల్ కియోరో |
| ఆస్ట్రియా : | ,, | డాక్టర్ అర్నో హలూపా |
| మొరాకో | ,, | డాక్టర్ అహమద్ బెనాబుద్ |

## ఇండియా సాయుధ దళాధిపతులు

సైన్యాధిపతి : జనరల్ కె. ఎస్. తిమ్మయ్య

నౌకాదళాధిపతి : రియర్ అడ్మిరల్ రామదాస్ కటారి

విమాన దళాధిపతి : ఏర్ మార్షల్ ఎస్. ముఖర్జి

## సుప్రీంకోర్టు

ప్రధాన న్యాయమూర్తి : సుధిరంజనదాస్ (రు. 7000)

| | | |
|---|---|---|
| జడ్జిలు : | నత్వారిలాల్ హారిలాల్ భగవతి | (రు.5,000) |
| | బచ్చు జగన్నాథదాసు | ,, |
| | భువనేశ్వర ప్రసాద్ సింహ | ,, |
| | సయ్యద్ జాఫర్ ఇమాం | ,, |
| | ఎస్. కె. దాస్ | ,, |
| | జీవన్‌లాల్ కపూర్ | ,, |
| | ప్రహ్లాద్ బాలాచార్య గజేంద్రగడ్ కార్ | ,, |
| | అమల్ కుమార్ సర్కార్ | ,, |
| | కోకా వెంకట సుబ్బారావు | ,, |
| | కైలాస్‌నాథ్ వాంచూ | ,, |
| | మహమ్మద్ హిదయతుల్లా | ,, |

## యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్

| | |
|---|---|
| చైర్మన్: | వి. ఎస్. హెజ్మాడి |
| సభ్యులు: | ఎస్. వి. కానుంగో |
| | జి. సి. ఛటర్జి. |
| | డాక్టర్ సి. వి. మహాజన్ |
| | జె. ఎన్. ముఖర్జి |
| | సి. సి. వర్మ |
| | డాక్టర్ జి. ఎస్. మహాజని |
| | ఎస్. హెచ్. జహీర్ |

## యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్

చైర్మన్ : చింతామణి దేశముఖ్; సభ్యులు: పండిట్ హృదయ నాథకుంజ్రూ, డాక్టర్ జాన్ మత్తయ్, డాక్టర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్, ప్రొఫెసర్ ఎస్. కె. సిద్ధాంత, కె. జి. సయ్యదైన్, పి. సి. భట్టాచార్య, దివాన్ ఆనందకుమార్.

## ఇండియా ప్రభుత్వంలో కొందరు ముఖ్య ఉద్యోగులు

| | |
|---|---|
| ఆడిటర్-జనరల్ : | ఎ. కె. చంద |
| ఆర్కియాలజీ డైరెక్టర్ జనరల్ : | ఎ. ఘోష్ |
| ప్రిన్సిపాల్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్ : | టి. వి. ఆర్. చారి |
| ఆహారశాఖ డైరెక్టర్ జనరల్ : | ఎ. జమాన్ |
| మెడికల్ సర్వీసెస్ డైరెక్టర్ జనరల్ | డాక్టర్ ఆర్. విశ్వనాథన్ |
| టెక్స్టయిల్ కమిషనర్ : | టి. పి. భరత్ |
| పశురక్షణశాఖ కమిషనర్ : | పి. ఆర్. నంద |
| రీసెటిల్మెంట్, ఎంప్లాయిమెంట్ డైరెక్టర్ జనరల్ : | డాక్టర్ ఎన్. దాస్ |
| డైరెక్టర్ జనరల్ ఆఫ్ సివిల్ ఏవియేషన్ | ఎ. సి. జెయిన్ |
| డైరెక్టర్ జనరల్ ఆఫ్ షిప్పింగ్ | నాగేంద్రసింగ్ |

| | |
|---|---|
| అటర్నీ జనరల్: | ఎం. సి. సెతల్వాడ్ |
| ఇన్సూరెన్సు కంట్రోలర్ : | ఎ. రాజగోపాలన్ |
| రిజిస్ట్రార్ జనరల్ : | ఆర్. ఎ. గోపాలస్వామి |
| ఎన్నికల కమిషనర్ : | కె. వి. కె. సుందరం |
| షెడ్యూల్డు జాతుల కమిషనర్: | లక్ష్మీదాస్ శ్రీకాంత్ |
| సొలిసిటర్ జనరల్: | వి. కె. దఫ్తారి |
| ఆలిండియా రేడియో డైరెక్టర్ జనరల్: | జె. సి. మధుర్ |
| అడవుల ఇన్‌స్పెక్టర్ జనరల్: | సి. ఆర్. రంగనాథన్ |
| నేషనల్ సేవింగ్స్ కమిషనర్ : | ఎన్. వి. నాయుడు |
| సర్వేయర్ జనరల్: | బ్రిగడీర్ గంభీర్ సింగ్ |
| ఆరోగ్యశాఖ డైరెక్టర్ జనరల్: | లెఫ్టినెంట్ కర్నల్ జస్వంత్ సింగ్ |

## సెక్రటేరియట్

మంత్రులూ, మంత్రివర్గాల కార్యదర్శులూ పనిచేసుకొనే ఆఫీసు లన్నిటినీ కలిపి సెక్రటేరియట్ అంటారు. ఇండియా ప్రభుత్వ సెక్రటేరియట్‌ను సెంట్రలు సెక్రటేరియట్ అంటారు. ఇండియా ప్రభుత్వ స్థానం ఢిల్లీ కనుక, సెంట్రలు సెక్రటేరియట్ ఢిల్లీలోనే వుంటుంది.

## బడ్జెటు

1959-60 సంవత్సరానికి బడ్జెటును 1959 ఫిబ్రవరి 28 న పార్లమెంటులో ఆర్థిక మంత్రి మురార్జీ దేశాయ్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 757,51,00,000 |
| వ్యయం అంచనా : | రు. 839,18,00,000 |
| లోటు అంచనా : | రు. 81,67,00,000 |


భారతదేశ పటం
1957 నవంబరునుంచి
జమ్మూ కాశ్మీరు
శ్రీనగర్
హిమాచలప్రదేశము
పంజాబు
ఢిల్లీ
ఉత్తర ప్రదేశ్
లక్నో
నేపాళ్
అస్సాం
రాజస్థాన్
అజ్మీరు
జయపూర్
పాట్నా
బీహారు
భోపాల్
మధ్య ప్రదేశ్
రాజకోట
నాగపూర్
ఒరిస్సా
కటక్
బర్మా
బొంబాయి
అరేబియా సముద్రం
హైదరాబాద్
ఆంధ్ర ప్రదేశ్
మైసూరు
చెన్నపట్టణం
బంగాళా ఖాతం
మద్రాసు
సింహళం
కొలంబో
హిందూ మహా సముద్రం
నికోబార్ దీవులు

# ఇండియా రాష్ట్రాలు

1956 నవంబర్ 1 తేదిన రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ చట్టం అమలు లోకి రావడంతో, ఇండియాలోని రాష్ట్రాల సంఖ్య, రూపము మారినవి. అంతవరకూ రాజప్రముఖుల పరిపాలనలో వున్న రాష్ట్రాలు కూడా గవర్నరుల పరిపాలనలోకి వచ్చినవి.

1956 నవంబర్ 1 తేదికి పూర్వం దేశంలోవున్న 10 గవర్నరుల రాష్ట్రాలు, 8 రాజప్రముఖుల రాష్ట్రాలు, 11 కమిషనరు రాష్ట్రాలు పునర్వ్యవస్థీకరణలో 14 గవర్నరుల రాష్ట్రాలుగాను 7 కమిషనర్ రాష్ట్రాలుగాను ఏర్పాటు చేయబడినవి :

## గవర్నరుల రాష్ట్రాలు

1. ఆంధ్రప్రదేశ్; 2. అసాం; 3. ఉత్తరప్రదేశ్; 4. ఒరిస్సా; 5. కాశ్మీర్; 6. కేరళ; 7. పంజాబ్; 8. పశ్చిమ బెంగాల్; 9. బీహార్; 10. బొంబాయి; 11. మదరాసు; 12. మధ్యప్రదేశ్; 13. మైసూర్; 14. రాజస్తాన్.

## కమిషనర్ రాష్ట్రాలు

1. అండమాన్, నికోబార్ దీవులు; 2. ఢిల్లీ; 3. త్రిపుర; 4. పుదుచేరి; 5. మణిపూర్; 6. లక్షదీవులు, అమీన్ దీవులు; 7 హిమాచలప్రదేశ్.

# అసాం

బర్మాదేశాన్ని ఆనుకొని, మనదేశానికి ఈశాన్యదిక్కున ఉన్న రాష్ట్రం. దీని వైశాల్యం, 85,012 చ. మైళ్లు. జనాభా, 90,43,707 వీరిలో పురుషులు 48,12,166. స్త్రీలు 42,31,541. ఈ జనాభాకాక, అసాం కొండప్రాంతాలలో 56 లక్షలమంది ప్రజలు వుంటారని అంచనా.

1874 వరకు అసాం రాష్ట్రం అనే ప్రత్యేకరాష్ట్రం లేదు. ఈ ప్రదేశమంతాకూడా బెంగాలు లెఫ్టినెంటు గవర్నరు పరిపాలనలో

వుండడం జరిగింది. అప్పటినుంచి 1921 వరకు ఇదే ఏర్పాటు అములులో వుంది. 1921 లో ఈ రాష్ట్రానికి, మిగతా పెద్ద రాష్ట్రాలతో సమాన హోదా ఇవ్వబడింది. ప్రత్యేకం ఒక గవర్నరును నియమించడం జరిగింది.

రాష్ట్రంలో ప్రధానమైన ఆహారపుపంట బియ్యం. వ్యాపారపు పంటలలో ముఖ్యమైనవి: టీ, జనపనార, చెరకు.

రాష్ట్రంలోని కొండప్రాంతాలలో, పొట్టి పింజప్రత్తి పైరుకూడా విరివిగా చేయబడుతున్నది. ఆసాం రాష్ట్రంలో వానలు యెక్కువ. ఈ రాష్ట్రంలో కురిసినంత వాన, ఇండియాలోని మరొక రాష్ట్రంలో యెక్కడా కురవదు. చిరపంజి అనే ప్రదేశంలో, సంవత్సరానికి దాదాపు 500 అంగుళాలపైగా వాన కురుస్తుంది. ప్రపంచంలో, నేల తడి యెప్పుడూ ఆరకుండావుండే ప్రదేశాలలో చిరపంజి ఒకటి.

ఈ రాష్ట్రంలో ప్రవహించే ప్రధానమైన నదులు బ్రహ్మపుత్ర, సుర్మ.

ఇక్కడ దొరికే ఖనిజాలలో వ్యాపారానికి ప్రస్తుతం త్రవ్వబడుతున్నవి, బొగ్గు, పెట్రోలు. నాగపర్వతాలలోను, లక్షింపూర్ జిల్లాలోను వున్నగనులలో ఎక్కువ బొగ్గు త్రవ్వబడుతున్నది. గారో కొండల ప్రాంతాలలో కూడా చాలా బొగ్గు వున్నట్టు పరిశోధనలవల్ల తేలింది. పెట్రోలు లక్షింపూరు, కచారు జిల్లాలలో తీస్తున్నారు.

ఆసాంలో సిల్కు, నూలు వస్త్రాల నేత పరిశ్రమ పెద్ద గృహ పరిశ్రమలలో ఒకటి. నేత అంతా, యెక్కువగా స్త్రీలే చేస్తారు. ఇటీవల, మిల్లుబట్టల దిగుమతివల్ల, చేనేతపరిశ్రమ చాలావరకు దెబ్బతిన్నప్పటికీ, ఈ పరిశ్రమకు తగిన ప్రోత్సాహం ఇవ్వడానికి ప్రభుత్వం తీవ్రకృషి చేస్తున్నది.

పడవలు కట్టడం, ఇత్తడి, మట్టి పాత్రలను తయారు చెయ్యడం కూడా, ఈ రాష్ట్రంలోని ప్రధాన పరిశ్రమలలో చెప్పదగినవే. అయితే రాష్ట్రప్రజలలో నూటికి 30 వంతులు, కేవలం వ్యవసాయంమీద ఆధారపడినవాళ్ళే.

రాజధాని: షిల్లాంగ్.

గవర్నరు : సయ్యద్ ఫజల్ అలి. జీతం, రు. 5,500.

శాసన సభ :

ఈ రాష్ట్రానికి అసెంబ్లీ మాత్రమే వుంది. అసెంబ్లీ మొత్తం సభ్యత్వం 108. వీటిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకింపబడిన స్థానాలు 5. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకింపబడిన స్థానాలు 26

స్పీకర్ : దేవకాంత్ బారువా.

డిప్యూటి స్పీకరు : రాజేంద్ర బారువా.

అసెంబ్లీలో పార్టీల బలాలు : కాంగ్రెసు, 71; ప్రజాసోషలిస్టు, 8; కమ్యూనిస్టు, 4; ఇతర పార్టీలు 11; స్వతంత్రులు, 13.

మంత్రిమండలి : పదవీ స్వీకారం : 1957 డిసెంబరు 28

విమలాప్రసాద్ చలీహా: ముఖ్యమంత్రి, స్థానిక పరిపాలన, ప్రచారము, రవాణా, ప్రాజెక్టులు

రూప్ నాథ్ బ్రహ్మ: ఆరోగ్యమంత్రి, రిజిస్ట్రేషన్

కె. పి. త్రిపాఠి: ప్లానింగ్ మంత్రి, విద్య, పరిశ్రమలు

హరేశ్వర్ దాస్: రెవిన్యూ మంత్రి, అడవులు, న్యాయశాఖ

మహేంద్రనాథ్ హజారికా: గ్రామాభ్యుదయమంత్రి, కుటీర పరిశ్రమలు

మొయినుల్ హక్ చౌధురి: వ్యవసాయ మంత్రి, నీటిపారుదల

కెప్టెన్ విలియంసన్ సంగ్మా: గిరిజన సంక్షేమం

ఫక్రుదీన్ అలి అహమద్: ఆర్థిక మంత్రి

ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శి, ఎ. థంగ్లూరా; పార్లమెంటరీ కార్యదర్శి, పులాల్కలియా

## బడ్జెట్

ఆసాం రాష్ట్రానికి 1959-60 బడ్జెట్‌ను ఆర్థికమంత్రి ఫక్రుద్దీన్ అలి అహమ్మద్ 1959 మార్చి 10 న శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

ఆదాయం అంచనా : రు. 33,95,00,000

వ్యయం అంచనా : రు. 30,54,00,000
మిగులు అంచనా రు. 3,41,00,000

# ఉత్తరప్రదేశ్

ఉత్తర హిందూదేశపు కొనభాగంలోవున్న పెద్ద రాష్ట్రం ఇది. 1950 జనవరి 26 పూర్వం ఈ రాష్ట్రం యునైటెడ్ ప్రావిన్సెసు అని పిలువబడేది. దేశంలోని రాష్ట్రాలన్నిటిలోనూ ఎక్కువ జనాభాగల రాష్ట్రం ఇదే. వైశాల్యం, 1,13,433 చదరపు మైళ్లు. జనాభా, 6,52,15,742. పురుషులు, 3,30,98,866. స్త్రీలు, 3,01,16,876. రాష్ట్రంలో మాట్లాడే భాషలు హిందీ, ఉర్దూలు.

గంగా, యమునా, గోగ్రా నదులు ఈ రాష్ట్రంలో నుంచి ప్రవహించడంవల్ల, ఈ నదులు ప్రవహించే భాగం చాలా సారవంతమైనది. రాష్ట్రంలోని ప్రజలలో నూటికి 71 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. మరొక ఎనిమిది వంతులు, వ్యవసాయంవల్ల ఆదాయం కలవారు. ఇక్కడ పండే పంటలలో ప్రధానమైనవి, బియ్యం, రాగులు, మొక్కజొన్న, అవిసె, ఆకులు, ప్రత్తి, గోధుమ, బార్లీ, చెరకు, పప్పుదినుసులు, బంగాళాదుంపలు.

ఈ రాష్ట్రంలో ప్రధానమైన పరిశ్రమ కేంద్రం, కాన్పూరు. ఇక్కడ తోళ్లను పూసే ఫాక్టరీలు, నూనె మిల్లులు, వూలు మిల్లులు వున్నాయి. యంత్రపరిశ్రమలలో ఈ రాష్ట్రం, పెద్ద అభివృద్ధికి ఏమీ రాలేదుగాని, గృహపరిశ్రమలవిషయంలోమాత్రం చెప్పదగిన ప్రాధాన్యతను వహించింది. గాజు పరిశ్రమలో ఈ రాష్ట్రం, ఇండియాలో ప్రధాన స్థానాన్ని పొందుతుంది.

గవర్నరు : వి. వి. గిరి. జీతం : రు. 5,500

## రాష్ట్ర శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిలు, వున్నాయి.

అసెంబ్లీ సభ్యత్వపు సంఖ్య మొత్తం: 430. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 80.

స్పీకరు : ఎ. జి. ఖేర్
డిప్యూటీ స్పీకరు: రామనారాయణ త్రిపాఠి
కౌన్సిల్ చైర్మన్ : చంద్రభాల్

శాసన సభ్యుల జీతము: నెలకు రు. 200; సభకు హాజరైనరోజుకి రు. 10 అలవెన్సు

శాసనసభలో పార్టీల బలాలు :

కాంగ్రెసు, 286; ప్రజా సోషలిస్టు, 44; కమ్యూనిస్టు, 9; జన సంఘు, 17; స్వతంత్రులు, 74.

మంత్రిమండలి : పదవి స్వీకారం : 1957 ఏప్రిల్ 10

డాక్టరు సంపూర్ణానంద్ : ముఖ్యమంత్రి, పరిపాలన, ప్రణాళికలు
హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం: పరిశ్రమలమంత్రి. విద్యుచ్ఛక్తి
హుకుంసింగ్ : వ్యవసాయమంత్రి, అడవులు, ఆరోగ్యం
గిరిధారిలాల్ : నిర్మాణశాఖమంత్రి
చరణ్ సింగ్ : రెవిన్యూమంత్రి
ఆలి జహీర్ : ఆర్థికమంత్రి, న్యాయశాఖ, ఆహారం
కమలాపతి త్రిపాఠి : హోం మంత్రి, విద్య, సమాచారం
విచిత్ర నారాయణ్ శర్మ : స్థానిక పరిపాలన మంత్రి
ఆచార్య జుగల్ కిశోర్ : కార్మికమంత్రి, సాంఘిక సంక్షేమం

కాబినెట్ హోదాలేని మంత్రులు :

జాఫర్ హుసన్ : సాంఘిక సంక్షేమం
శ్రీరాంమూర్తి : నీటిపారుదల
డాక్టర్ సీతారాం : రిజిస్ట్రేషన్, అబ్కారి, రవాణా

డిప్యూటీ మంత్రులు : జగన్మోహన్ సింగ్ నేగి, లక్ష్మీరమణ ఆచార్య, రావ్ జఫ్రీ, కైలాస్ ప్రకాశ్, పరమానందసింగ్, డాక్టరు జవహర్‌లాల్ రోహత్గి, శ్రీమతి ప్రకాశ్ వతి సుద్.

మంత్రులజీతాలు : నెలకు రు. 1,200 (ఇన్ కంటాక్సులేకుండా), ఉచిత గృహవసతి, కారు.

డిప్యూటీ మంత్రులకు : నెలకు రు. 750, ఇంటిఅద్దె, రు. 100 కారు అలవెన్సు, రు. 150.

బడ్జెటు

ఉత్తర ప్రదేశ్ 1959-60 బడ్జెటును 1959 ఫిబ్రవరి 13 తేదీన ఆర్థికమంత్రి సయ్యద్ అలి జహీర్ శాసనసభలో ప్రతిపాదించారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 119,61,00,000 |
| వ్యయం అంచనా : | రు. 121,47,00,000 |
| లోటు అంచనా : | రు. 1,86,00,000 |

# ఒరిస్సా

ఒరిస్సా రాష్ట్రం వైశాల్యం 60,146 చదరపుమైళ్లు, జనాభా 1,4045,946. పురుషులు 72,42,892; స్త్రీలు 74,03,045. రాష్ట్ర జనాభాలో మూడవవంతుకు పైగా షెడ్యూల్డ్ జాతులు, కొండజాతులకు చెందినవారని 1951 జనాభా లెక్కల ప్రకారం తేలింది. వీరిలో షెడ్యూల్డ్ కులాలవారు 28,30,763 మంది. షెడ్యూల్డ్ కొండజాతులకు చెందినవారు 19,67,334 మంది. రాజధాని భువనేశ్వర్. వేసవిలో గవర్నరు వుండే నగరం: పూరి (జగన్నాథం)

వ్యవసాయకంగానూ, పారిశ్రామికంగానూ ఒరిస్సా చాలా వెనుకబడ్డరాష్ట్రం. ఒరిస్సాలో ప్రధానమైన వ్యాపార పంటలు: చెరకు, జనపనార. చేపలు పట్టడం ఒరిస్సాలో ఒక పెద్దపరిశ్రమ, చిలకసరస్సు నుంచీ, పూరివద్ద సముద్రంలోనూ, ఏడాదికి 53,000 మణుగుల చేపల్ని పట్టి కలకత్తాకు పంపుతారు. గృహపరిశ్రమలలో, చేనేత, కంచుపాత్రలు చెయ్యడము, ఇత్తడి పాత్రలు చెయ్యడం ముఖ్యమైనవి. రాష్ట్రంలో 12,695 చ. మైళ్ళ అడవివుంది.

ఒరిస్సాలో దొరికే ముఖ్యమైన ఖనిజములు: ఇనుము, బొగ్గు, సున్నపురాయి, మెంగనీసు, అభ్రకము.

ప్రజలలో 68,42,706 మంది హిందువులు: 1,46,301 మంది ముస్లిములు,

గవర్నరు : వై. ఎన్. సుఖ్తాంకర్.

జీతం: రు. 5,500; పదవీస్వీకారం, 1957 జులై 31.

శాసనసభ :

ఈ రాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది: అసెంబ్లి మొత్తం సభ్యత్వం : 140. వీరిలో షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకించ బడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 25. షెడ్యూల్ట్ కొండ జాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 29,

స్పీకరు : పండిత నీలకంఠదాస్ : రు. 1000.

డిప్యూటి స్పీకరు: మహమ్మద్ హనీఫ్. రు. 750.

శాసన సభ్యుల జీతాలు నెలకు రు. 150.

అసెంబ్లిలో పార్టీల బలాలు: కాంగ్రెసు, 56, గణతంత్ర పరిషత్. 15; కమ్యూనిస్టులు 9; ప్రజాసోషలిస్టులు 11; ఝార్ ఖండ్, 5; సోషలిస్టు, 1; స్వతంత్రులు, 7.

మంత్రిమండలి: పదవీ స్వీకారం: 1957 ఏప్రిల్ 6.

డాక్టర్ హరకృష్ణ మహతబ్: ముఖ్యమంత్రి, ఆర్థికశాఖ

లింగరాజ పాణిగ్రాహి: హోం మంత్రి. న్యాయశాఖ, విద్య

దీనబంధు సాహు: పరిశ్రమల మంత్రి, గనులు

సత్యప్రియ మహంతి : రెవిన్యూ మంత్రి, స్థానిక స్వపరిపాలన

శైలేంద్ర నారాయణ భంజ్ దేవ్: పబ్లిక్ వర్కుస్ మంత్రి

శ్రీమతి వసంత మంజరిదేవి : ఆరోగ్యమంత్రి, కాందిశీకుల పునరావాసము

నీలమణి రౌత్ రాయ్: రవాణా మంత్రి, కార్మికులు

పవిత్ర మోహన్ ప్రధాన్ : సంక్షేమ మంత్రి, వాణిజ్యం

రాధానాథ్ రథ్ : వ్యవసాయమంత్రి, అడవులు

డిప్యూటి మంత్రులు :

శంతను కుమార్ దాస్, విక్రమాదిత్యసింగ్ బరీహా, కుముదచంద్ర సింగ్.

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,000

డిప్యూటి మంత్రులు : నెలకు రు. 750

## బడ్జెట్

ఒరిస్సా రాష్ట్రానికి 1959-60 బడ్జెట్‌ను ముఖ్యమంత్రి డాక్టర్ హరకృష్ణ మెహతబ్ 1959 ఫిబ్రవరి 24 న రాష్ట్రశాసనసభలో ప్రవేశ పెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి.

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 30,65,00,000 |
| వ్యయం అంచనా : | రు. 30,58,00,000 |
| మిగులు అంచనా : | రు. 7,00,000 |

# కాశ్మీరు

వైశాల్యం: 92,780 చ. మైళ్లు. జనాభా, సుమారు, 1,41,000.

కాశ్మీర్ అతి సుందరమైన ప్రకృతి దృశ్యాలు గలది. సింధు, చినాబ్, జీలం నదులు ఈ రాష్ట్రంగుండా ప్రవహిస్తున్నాయి.

భరతఖండం విభజనానంతరం కాశ్మీరును పాకిస్తానుతో కలుపు కోడానికి ఆ ప్రభుత్వం చాలా ప్రయత్నించింది. కాని అది సాగలేదు. అందుచేత పశ్చిమోత్తరసరిహద్దులోవున్న కొండజాతులకు, ఆయుధసామ గ్రిని యిచ్చి కాశ్మీర్‌మీద దండయాత్ర చేయించింది. ఈ కొండదండు కాశ్మీరులో ప్రవేశించి, నానా బీభత్సం చేస్తూవుండగా 1947 అక్టోబరు 26 న కాశ్మీర్ మహారాజు, తన సంస్థానాన్ని ఇండియాలో కలుపుకొని తనకూ తన సంస్థానానికీ రక్షణ యివ్వవలసిందని ఇండియా ప్రభుత్వాన్ని కోరాడు. ఆ కోరికను గవర్నరు జనరల్ అంగీకరిస్తూ, కాశ్మీరు భారత దేశంలో చేరడం తాత్కాలికమేననీ, కొండదండులను వెళ్ళగొట్టి సంస్థానంలో శాంతి నెలకొల్పిన తరువాత, ప్రజల యిష్టప్రకారం ఆ సంస్థానాన్ని ఇండియాలో చేర్చుకోవడమో, మాని వెయ్యడమో జరుగుతుందనీ తెలియపరిచాడు. తాత్కాలికంగా యీ సంస్థానం ఇండియాతో కలియడం, 1947 అక్టోబరు 27 న జరిగింది. అనాడే ఇండియానుంచి సైన్యాలు కాశ్మీరుకు పంపబడినవి.

అప్పటినుంచీ, 1949 జనవరి 1 తేదీదాకా, భారతసేనలు కాశ్మీరుపై దండయాత్ర జరిపిన సరిహద్దు మూకలతోను, వారికి సహాయం

చేస్తున్న పాకిస్తాన్ సైన్యాలతోనూ, పోరాటం సాగించుతూ వారి ఆక్రమణలో వున్న సంస్థాన దేశాన్ని చాలవరకు విడిపించినవి.

కాశ్మీరు సమస్యవల్ల ఇండియా పాకిస్తానుల మధ్య ఏర్పడిన తగాదా మిత్రరాజ్యసమితి సెక్యూరిటీ కౌన్సిలువద్దకు విచారణకు వచ్చింది. ఇంకా (1959) ఫిబ్రవరి ఆంతానికి సెక్యూరిటీ కౌన్సిలు పరిశీలనలోనే వుంది.

కాశ్మీరు మహారాజు హిజ్ హైనెస్ సర్ హరిసింగ్ బహదూరు రాజ్యపరిపాలననుంచి తాత్కాలికంగా విరమించి, పరిపాలనాధికారాన్ని తన కుమారుడు యువరాజు కర్ణసింగుకు అప్పగించాడు. 1951 జనవరి 26 నుంచి 1952 నవంబరు 19 వరకు కాశ్మీరుకు రాజప్రముఖ్‌గా కర్ణసింగు వున్నారు. 1952 నవంబరు 19 నుంచి సాదార్-ఇ-రియాసత్ అనే బిరుదుతో ఎన్నుకోబడిన రాజ్యపాలకుడుగా వ్యవహరిస్తున్నాడు.

1947 అక్టోబరు 31 న షేక్ అబ్దుల్లా నాయకత్వాన కాశ్మీరుకు బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చెయ్యబడింది. షేక్ అబ్దుల్లా 1948 మార్చి 18 తేదిన తన మంత్రి మండలిని ఏర్పాటు చేశారు.

కాశ్మీరు భవిష్యత్తును నిర్ణయించటానికి కాశ్మీరు ప్రజలు ఎన్నుకున్న ప్రజాపరిషత్తు ప్రథమ సమావేశం 1951 నవంబరు 1 న జరిగింది. ఈ సభకు అధ్యక్షుడుగా గులాం మహమ్మదు సాదిక్ ఎన్నుకోబడినారు.

1951 నవంబరు 20 నుంచి, ఈ ప్రజాపరిషత్తే రాష్ట్రశాసనసభగాకూడా వ్యవహరిస్తుందనీ, మంత్రిమండలి శాసనసభకు బాధ్యులై వుంటారనీ, రాజరికం నిమిత్తమాత్రుడుగా, మంత్రుల సలహామీద యువరాజు కర్ణసింగు సాగిస్తారని ప్రకటన జరిగింది. కాశ్మీరులో రాజరికానికీ, వంశపారంపర్య రాజ్యపాలనాధికారానికీ స్వస్తి చెప్పి, శాసనసభచే ఎన్నుకోబడిన రాజపాలకుడు సాదార్-ఇ-రియాసత్ అనే హోదాతో అయిదేళ్ళపాటు, ఇండియా ప్రెసిడెంటు అనుమతితో రాజ్యపాలన చెయ్యాలని ప్రజాపరిషత్తు తీర్మానించింది. ఈ తీర్మాన ప్రకారం, మొట్టమొదటి సాదార్-ఇ-రియాసత్‌గా కర్ణసింగు 1952 నవంబరు

15 న ఎన్నుకోబడినాడు. 1952 నవంబరు 17 న పదవి స్వీకారం చేశాడు. రాష్ట్రంలో న్యాయపరిపాలన, శాసన నిర్మాణము మొదలైన విషయాలలో ఇండియా ప్రెసిడెంటుకు అధికారం యిచ్చే ఉత్తరువు కాశ్మీరుకు వర్తించేటట్లు 1954 మే 13 న జారీచేయబడింది.

మంత్రిమండలిలో కలతలు ఏర్పడినందుననూ, మంత్రులలో అధిక సంఖ్యాకులకు షేక్ అబ్దుల్లామీద విశ్వాసం లేనందుననూ, షేక్ అబ్దుల్లా పరిపాలనలో చాలా అవకతవకలు ఉన్నందుననూ, సాదార్-ఇ-రియాసత్ 1953 అగస్టు 9 తేదిన షేక్ అబ్దుల్లాను ముఖ్యమంత్రి పదవి నుంచి భర్తరఫ్ చేసి, ముఖ్యమంత్రిగా ఘులాం మహమ్మద్‌ను నియమించారు. కాశ్మీర్ రాష్ట్రానికి కొత్త రాజ్యాంగ చట్టాన్ని రాష్ట్ర శాసన సభ 1956 నవంబరు 17 న ఆమోదించింది. ఆ చట్టం ప్రకారం, కాశ్మీర్ ఇండియాలో ఒక భాగంగానే వుంటుంది.

మంత్రిమండలి :

ముఖ్యమంత్రి: బక్షి ఘులాం మహమ్మద్.
కొత్వాల్ చునిలాల్ మీర్ షంసుదీన్
శ్యామలాల్ షరాఫ్, దీన్‌నాథ్ మహాజన్, మీర్ గులాం మహమద్.
స్పీకరు: అసాదుల్లామీర్.
డిప్యూటి స్పీకరు: మహమ్మద్ అయూబ్ ఖాన్.

మంత్రుల జీతాలు: నెలకు రు. 1,000. కాని దేశంలోని ఆర్థికపరిస్థితులనుబట్టి 1950 ఏప్రిలునుంచి నూటికి 20 వంతులు తగ్గించుకొని, నెలకు రు. 800 మాత్రమే తీసుకొనడానికి మంత్రులు నిశ్చయించుకున్నారు.

సాదర్-ఇ-రియాసత్‌కు నెలకు రు. 5,500 జీతం. ఏడాదికి రు. 1,00,000 అలవెన్సు, ఉచితగృహవసతి, రెండు కార్లు ఇవ్వబడుతవి.

బడ్జెటు

కాశ్మీరు 1959-60 బడ్జెటును 1958 ఫిబ్రవరి 25 తేదిన ముఖ్యమంత్రి బక్షి గులాంమహమ్మద్ శాసన సభలో ప్రతిపాదించారు. ఆ బడ్జెటు వివరాలివి:

పది. ఈ రాష్ట్రం విస్తీర్ణం 47,427 చ. మైళ్ళు. జనాభా, 1,61,35,890. ఈ రాష్ట్రం హిందీ, పంజాబీ భాషలు మాట్లాడే ద్విభాషారాష్ట్రం. ఈ రెండు భాషలు వాడుకలో వున్న ప్రాంతాలకూ రెండుప్రాంతీయ మండలులు వుంటాయి.

రాష్ట్రంలోని ప్రజలలో నూటికి 65 వంతులు తమ జీవితానికి వ్యవసాయంమీద ఆధారపడుతున్నారు. ఈ రాష్ట్రంలో పండేపంటలలో ప్రధానమైనది గోధుమ. తరువాత చెప్పదగినవి బార్లి, బియ్యం, రాగులు, మొక్కజొన్న, ప్రత్తి, చెఱకు.

పంజాబులోని ప్రధాన పరిశ్రమ, చేనేత. దుప్పట్లు, పూలురగ్గులు, ఇక్కడ విస్తారంగా తయారుచేయ బడుతవి. పట్టు పరిశ్రమకూడా చాలా ఎక్కువగా అభివృద్ధి పొందుతోంది. దూది ఏకే మిల్లులు రాష్ట్రంలో చాలా వున్నాయి.

రాష్ట్రానికి రాజధాని చండీఘర్.
గవర్నర్: ఎన్. వి. గాడ్గిల్
పదవిస్వీకారం: 15 సెప్టెంబర్ 1958. జీతం: రు. 5,500.

శాసనసభ:

ఈ రాష్ట్రానికి లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి. అసెంబ్లీ సభ్యుల సంఖ్య 154. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకో బడినవారు 32.

స్పీకరు: సర్దార్ గురుదయాళ్ సింగ్ ధిల్లాన్
డిప్యూటి స్పీకరు: చౌధురి సరూప్‌సింగ్
కౌన్సిల్ చైర్మన్. మిస్. వి. జి. ఖాన్
శాసన సభలో పార్టీల బలాలు

కాంగ్రెసు, 120; ప్రజాసోషలిస్టు, 1; కమ్యూనిస్టు, 6; జనసంఘు, 9; షెడ్యూల్డు కులాల ఫెడరేషన్, 5; స్వతంత్రులు 13.

మంత్రి మండలి: పదవిస్వీకారం: 1957 ఏప్రిల్ 9.
సర్దార్ ప్రతాప్ సింగ్ కైరాన్: ముఖ్య మంత్రి, పరిపాలన, రవాణా, లా, ఆర్డర్, ప్లానింగ్.

డాక్టర్ గోపీచంద్ భార్గవ: ఆర్థిక మంత్రి, పరిశ్రమలు, ఆహారం, న్యాయశాఖ, ఎక్సైజు.
జ్ఞాని కర్తార్ సింగ్: రెవిన్యూ మంత్రి, స్థానిక, స్వపరిపాలన.
సర్దార్ జ్ఞానసింగ్ రారెవాలా: నీటిపారుదలమంత్రి, విద్యుచ్ఛక్తి
అమర్‌నాథ్ విద్యాలంకార్: కార్మికమంత్రి, విద్య.
మాస్టర్ గుర్బంత్ సింగ్: అడవుల మంత్రి, వ్యవసాయం.
రావ్ వీరేందర్‌సింగ్: పబ్లిక్ వర్క్సు మంత్రి
చౌధురి సూరజ్‌మల్: ఆరోగ్యమంత్రి, పంచాయితీలు.

డిప్యూటి మంత్రులు: ఆచార్యయశ్వంతరాయ్; డాక్టర్ శ్రీమతి ప్రకాస్ కౌర్; హారవంశలాల్: దల్బీర్ సింగ్: బనారసిదాస్: బక్షి ప్రతాప్ సింగ్.

మంత్రుల జీతాలు. ప్రధానికి నెలకు రు. 1,500. ఇతరులకు నెలకు 1,250. అదనంగా అందరికీ నెలకు రు. 300 అలవెన్సు. ఉచిత గృహ వసతి.

### బడ్జెటు

పంజాబ్ రాష్ట్రానికి 1959-60 బడ్జెట్‌ను ఆర్థిక మంత్రి డాక్టర్ గోపీచంద్ భార్గవ 1959 ఫిబ్రవరి 28 న రాష్ట్రశాసన సభలో ప్రవేశ పెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి:

| | |
|---|---|
| ఆదాయం అంచనా | రు. 52,88,00,000 |
| వ్యయం అంచనా: | రు. 53,20,00,000 |
| లోటు అంచనా: | రు. 92,00,000 |

# పశ్చిమ బెంగాల్

రాష్ట్ర పునర్నిర్మాణ సందర్భంలో, బీహారు రాష్ట్రానికి చెందిన పూర్ణియా జిల్లాలోని కొన్ని భాగాలూ, మనభూమ్ జిల్లాలోని పూరూలియా ప్రాంతం పశ్చిమ బెంగాలులో కలిపివేయబడినవి. ఈ ఏర్పాటు వల్ల పశ్చిమ బెంగాల్ వి స్తీర్ణం, 34,944 చ. మైళ్లు అయింది. జనాభా, 2,16,60,217.

జనాభాలో నూటికి 81 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారు. ఉత్తర దేశంలో బియ్యం అధికంగా పండే రాష్ట్రం బెంగాలే. ఈ రాష్ట్రంలో వ్యవసాయంక్రిందవున్న భూమిలో నూటికి 75 వంతులు బియ్యపుపంటలో వుంటుంది. మిగతా ముఖ్య పంటలు బార్లీ, గోధుమ, పప్పుదినుసులు, తిలధాన్యములు, జనపనార. రాష్ట్రంలో 90 జనపనార మిల్లులు వున్నాయి.

పరిశ్రమలలో జనపనార, టీ, బొగ్గు, పంచదారల ఉత్పత్తి ప్రధానంగా చెప్పదగినవి.

రాష్ట్రంలో అడవులు చాలా తక్కువ. జనపనార మిల్లులు ఈ రాష్ట్రంలో చాలా ఎక్కువ. ఇండియాలో ఉత్పత్తిఅయే కాగితములో నూటికి 59 వంతులు, పింగాణి సరకులలో నూటికి 60 వంతులు యీ రాష్ట్రంలోనే తయారవుతున్నవి.

రాజధాని కలకత్తా.

గవర్నర్ : కుమారి ముత్యాల పద్మజ నాయుడు
పదవీ స్వీకారం : 1956 నవంబర్ 3.
జీతం. రు. 5,500.

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి.

**శాసనసభ :**

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య, 252, వీరిలో షెడ్యూల్డుకులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 45.

స్పీకరు : శైలకుమార్ ముఖర్జి
డిప్యూటి స్పీకరు: అశుతోష్ మల్లిక్
కౌన్సిల్ చైర్మన్ : డాక్టర్ సునీతికుమార్ ఛటర్జీ
డిప్యూటి చైర్మన్ : డాక్టర్ ప్రతాపచంద్ర గుహరాయ్

అసెంబ్లీలో పార్టీల బలాలు :

కాంగ్రెసు, 151; కమ్యూనిస్టు 46; ప్రజాసోషలిస్టు, 21; ఫార్వర్డ్ బ్లాక్, 8; లోక్ సేవక్ సంఘు, 7; రివల్యూషనరీ సోషలిస్టుపార్టి, 3;

మార్క్సిస్టు ఫార్వర్డ్ బ్లాకు, 2; సోషలిస్టు యూనిటి సెంటర్, 2; స్వతంత్రులు. 11.

మంత్రిమండలి : పదవీ స్వీకారం : 1957 ఏప్రిల్

డాక్టర్ బిధాన్ చంద్రరాయ్: ముఖ్యమంత్రి, ఆర్థికశాఖ, విద్య, సహకారము; చిన్నపరిశ్రమలు

ప్రఫుల్లచంద్రసేన్ : ఆహారమంత్రి

కాళీపాద ముఖర్జి : పోలీసు మంత్రి

ఖగేంద్రదాస్ గుప్త : వర్క్సుమంత్రి

అజయ్ ముఖర్జి : నీటిపారుదల మంత్రి

హేంచంద్ర నాస్కర్: అటవీ మంత్రి

ఎస్. పి. బర్మన్ : అబ్కారి మంత్రి

డాక్టర్ ఆర్, అహమద్ : వ్యవసాయమంత్రి

ఈశ్వరదాస్ జలాన్ : స్థానిక పరిపాలనమంత్రి

భూపతి మంజుదార్ : పరిశ్రమలమంత్రి

అబ్దుల్ సత్తార్: కార్మికమంత్రి

స్టేట్ మంత్రులు: శ్రీమతి పూరవి ముఖర్జి; తరుణకాంతి ఘోష్; అనాధ బంధురాయ్.

డిప్యూటి మంత్రులు: సతీష్‌చంద్రరాయ్ సింఘు, సౌరేన్ మిశ్ర, తెంజింగ్ వాగ్మి, స్మరజిత్ బెనర్జి, రజనిప్రమాణిక్, చిత్తరంజన్ రాయ్ సయ్యద్ కాజెం అలిమిర్జా, జియాఉల్ హక్, శ్రీమతి మాయాబెనర్జి, చారు చంద్రమహంతి, జగన్నాథ్ కోలే, నర్ బహదు గురుంగ్.

మంత్రుల జీతాలు. ప్రధానమంత్రికి నెలకు 1,250, అలవెన్సు రు. 600 ఇతర మంత్రులకు ఒక్కొక్కరికి నెలను రు. 1,250. అలవెన్సులతోసహా. డిప్యూటి మంత్రులకు రు. 850, అలవెన్సు రు. 150,

అసెంబ్లీ సభ్యులకు నెలకు రు. 200. సమావేశానికి హాజరైన ప్రతిరోజుకు, కలకత్తా వాసులకు రు. 2-8-0. బయట పూళ్ళనుంచి వచ్చినవారికి రైలు ఖర్చులు కాక, రోజుకి రు. 15.

## బడ్జెటు

పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి 1959-60 బడ్జెటు ముఖ్య మంత్రి డాక్టర్ బి. సి. రాయ్ 1959 ఫిబ్రవరి 11 తేదీన శాసనసభలో ప్రతిపాదించారు. ఆ బడ్జెట్ వివరాలివి:

| | | |
|---|---|---|
| ఆదాయం | అంచనా : | రు. 79,05,00,000 |
| వ్యయం | అంచనా : | రు. 82,67,00,000 |
| లోటు | అంచనా : | రు. 3,62, 00,000 |

# బీహార్

రాష్ట్రపునర్నిర్మాణ సందర్భంలో బీహారురాష్ట్రంలోని పూర్నియా జిల్లాలోని కొన్ని భాగాలనూ, మన్‌భూం జిల్లాలోని పురూలియా ప్రాంతాన్నీ పశ్చిమబెంగాల్‌లో కలిపివేయడం జరిగింది. అందువల్ల బీహారు విస్తీర్ణం, జనాభా కొద్దిగా తగ్గినవి. 1956 నవంబరు 1 నుంచి బీహార్ విస్తీర్ణం, 66,161 చ. మైళ్లు. జనాభా, 3,82,25,947.

బీహారు రాష్ట్రం, ఒరిస్సా, బెంగాల్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల మధ్యవుంది.

జనాభాలో నూటికి 80 వంతులు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారే. నూటికి ఎనిమిదివంతులుమాత్రమే పరిశ్రమలమీద ఆధారపడినవారు. ఈరాష్ట్రంలో పండే పంటలలో ప్రధానమైనది బియ్యం. బియ్యం తరువాత చెప్పదగిన ముఖ్య పంటలు : మొక్కజొన్న, బార్లీ, ఆముదపుగింజలు, అవాలు. తెల్లచక్కెర ఉత్పత్తిలో, మనదేశంలో, ఉత్తరప్రదేశ్ తరువాత చెప్పవలసింది బీహార్. దేశం మొత్తంలో, తయారయే తెల్లచక్కెరలో నూటికి 26 వంతులు బీహార్‌లోనే తయారవుతుంది. జనపనార పంటకూడా ఈ రాష్ట్రంలోని ముఖ్యపంటలలో ఒకటి. ఇటీవల పొగాకుపంటకూడా ఎక్కువ అవుతున్నది.

ప్రపంచంలోని గొప్ప ఉక్కు పరిశ్రమలో ఒకటైన, టాటా ఉక్కుకంపెనీ బీహారు రాష్ట్రంలోనే వుంది. ప్రపంచంలో గొప్ప ఇనుప గనులలో ఒకటి, ఈ రాష్ట్రంలో వుంది. అందుచేత, పారిశ్రామికంగా

ఈ రాష్ట్రం పేరు పొందింది. ఖనిజసంపత్తి ఈ రాష్ట్రంలో విశేషంగా వుంది. వాటిలో ముఖ్యమైనవి: ఇనుము, బొగ్గు, అభ్రకము.

లక్క పరిశ్రమకూడా ఈ రాష్ట్రంలో ఎక్కువ. ఇక్కడనుంచి ఏడాదికి పదికోట్లరూపాయల పైబడిన విలువగల లక్క ప్రతి సంవత్సరమూ విదేశాలకు ఎగుమతి అవుతుంది. సిమెంటుకూడా ఎక్కువగా తయారవుతున్నది.

రాజధాని పాట్నా. వేసవిలో గవర్నరు రాంచిలో వుంటారు.

గవర్నరు: డాక్టరు జకిర్ హుసేన్. జీతం: రు. 5,500.

శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి. అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య 318.

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు, 40. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు, 32.

స్పీకరు: వింధ్యేశ్వరి ప్రసాద్ వర్మ.
డిప్యూటీ స్పీకరు: జగత్ నారాయణ్ లాల్
కౌన్సిలు చైర్మను: రాజ బ్రజ రాజకృష్ణ.

శాసనసభలో పార్టీల బలాలు:

కాంగ్రెసు, 210; ప్రజాసోషలిస్టు, 31; కమ్యూనిస్టులు, 7; ఝార్ ఖండ్, 32; జనత, 23; స్వతంత్రులు, 15.

మంత్రిమండలి: పదవీ స్వీకారం: 1957 మే 6.
డాక్టర్ శ్రీ కృష్ణసింహ: ముఖ్యమంత్రి, పరిశ్రమలు, నీటిపారుదల
డాక్టర్ అనుగ్రహ నారాయణసింహ: ఆర్థికమంత్రి, వ్యవసాయము, కార్మికులు
షా మహమ్మద్ ఒజేర్ మునేమి: రవాణామంత్రి, జెయిళ్ళు
భోలాపశ్వాన్: ఆబ్కారి మంత్రి, అడవులు
వినోదానంద ఝా: రెవిన్యూమంత్రి, పంచాయితీలు

వీర్ చంద్: ఆరోగ్యమంత్రి, ఆహారము
జగత్ నారాయణ్ లాల్: సహకారమంత్రి, న్యాయశాఖ, పశు సంరక్షణ
కుమార్ గంగానంద్‌సింగ్: విద్యామంత్రి
మక్బూల్ అహమద్: పబ్లిక్ వర్క్సుమంత్రి, స్థానికపరిపాలన

డిప్యూటీ మంత్రులు: అహమద్ మహమ్మద్‌నూర్, కేదార్ పాండే, లలితేశ్వర్ సాహు, హృదయ నారాయణ్ చౌదరి, అంబికా చరణ్ సింగ్, సహదేవ్ మహతో, రాధాగోవింద ప్రసాద్, ఎస్. ఎం. అకిల్, చంద్రికారాం, కృష్ణకాంతసింగ్, రాణి జ్యోతిర్మయిదేవి, శ్రీమతి సైమా ఖాటూన్.

### బడ్జెట్

బీహారు రాష్ట్రానికి 1959-60 బడ్జెటును ముఖ్య మంత్రి డాక్టర్ శ్రీకృష్ణసింహ 1959 ఫిబ్రవరి 9 న రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి:

| | | |
|---|---|---|
| ఆదాయం | అంచనా: | రు. 122,65,00,000 |
| వ్యయం | అంచనా: | రు. 124,69,00,000 |
| లోటు | అంచనా: | రు. 2,04,00,000 |

## బొంబాయి

1956 నవంబర్ 1 తేదికి పూర్వం సౌరాష్ట్రం, కచ్ అని పిలువబడే రాష్ట్రాలూ, హైదరాబాదులోని మరాట్వాడాప్రాంతమూ, మధ్యప్రదేశ్‌లోని విదర్భ ప్రాంతమూ, పాత బొంబాయిరాష్ట్రంతో (బెల్గాం, బీజపూర్, కనరా, ధార్వార్, జిల్లాలూ, అబూరోడ్ తాలూకాలు తప్ప) కలపడంతో నూతన బొంబాయి రాష్ట్రం ఏర్పడింది.

భారతదేశంలో రాష్ట్రాలన్నిటిలోకి ఎక్కువ విస్తీర్ణంగల రాష్ట్రం ఇదే. దీని విస్తీర్ణం, 1,91,367 చ. మైళ్ళు. జనాభా 4,82,65,221. వారిలో రెండున్నరకోట్లు మహారాష్ట్రులు. ఒకటిన్నరకోట్లు గుజరాతీలు.

ఇది ద్విభాషా రాష్ట్రం.

ఈ రాష్ట్రప్రజలలో నూటికి 69 వంతులమంది వ్యవసాయం మీద ఆధారపడి జీవించేవారే. ఇక్కడ పండేపంటలలో ముఖ్యమైనవి ప్రత్తి, చెరకు, బియ్యం, గోధుమ, పప్పుదినుసులు.

పారిశ్రామికంగా చాలా ముందుకువచ్చిన రాష్ట్రం ఇది. మనదేశం లోని వస్త్రపరిశ్రమకు ప్రధాన కేంద్రం ఈ రాష్ట్రమే. దీనికి ముఖ్య ప్రదేశాలు బొంబాయి నగరం, అహమ్మదాబాదు నగరం. విదేశాలతో మనదేశపు వ్యాపారమంతా కూడా ఎక్కువగా బొంబాయినగరంనుంచే జరుగుతున్నది. అందుచేత, మనదేశపు వ్యాపారానికి బొంబాయి ఆయువుపట్టు అయింది.

ఈ రాష్ట్రానికి ప్రధాన నగరం బొంబాయి: వేసవికాలంలో ప్రభుత్వం పూనాలో వుంటుంది. బొంబాయి నగరం, అసలు దేశపు భూభాగంకాదు అసలు భూమికి కొంచెందూరంగా సముద్రంలో వున్న చిన్న ద్వీపాల సమూహం. ఇప్పుడు వంతెనలు కట్టి, రోడ్లువేసి, ఈ ద్వీపాలను అసలు భూభాగంతో కలిపివేశారు. అయినప్పటికీ ఇది చిన్న ద్వీపాల సమూహం కనుక, ఓడలకు రేవు వసతి బాగా వుంటుంది.

గవర్నరు: శ్రీ ప్రకాశ
పదవీ స్వీకారం: డిసెంబర్ 1956; జీతం రు. 5,500

శాసనసభ :

రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి.

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య, 396. వీరిలో షెడ్యూల్డుకులాలకు ప్రత్యేకింపబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు:౪౦. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు:29 ఆంగ్లోఇండియనుల తరఫున గవర్నరుచే నామినేట్ చేయబడిన సభ్యుడు1.

| | |
|---|---|
| అసెంబ్లీ స్పీకరు : ఎస్. ఎల్. శీలం | రు. 1,100 |
| డిప్యూటీ స్పీకరు : దీనదయాళ్ గుప్త | రు. 300 |
| కౌన్సిల్ చైర్మన్ : ఆర్. ఎస్. హుక్కెరికార్ | రు. 1,100 |
| డిప్యూటీ చైర్మన్ : వామనరావ్ లిమాయి | రు. 300 |

శాసనసభ్యుల జీతం, నెలకు రు. 150.

అసెంబ్లిలో పార్టీలబలం. కాంగ్రెసు. 232; ప్రజాసోషలిస్టులు 36; పెంజెంట్స్ అండ్ వర్కర్స్‌పార్టి 31, కమ్యూనిస్టుపార్టి, 18; జనసంఘు, 4; హిందూమహాసభ 1; షెడ్యూల్డుకాస్ట్ ఫెడరేషన్, 15; స్వతంత్రులు, 55.

మంత్రిమండలి : పదవీస్వీకారం : 1957 ఏప్రిల్ 21

యశ్వంతరావ్ బి. చవన్ : ముఖ్యమంత్రి, హోంశాఖ
డాక్టర్ జీవరాజ్ మెహాత : అర్థికమంత్రి
రశిక్‌లాల్ పరీఖ్ : రెవిన్యూమంత్రి
శాంతిలాల్ షా : కార్మికమంత్రి, న్యాయశాఖ
ఎం. ఎం. కన్నమ్వార్ : ఆరోగ్యమంత్రి
వసంతరావ్ నాయక్ : వ్యవసాయమంత్రి
రతుభాయ్ అదాని : మద్యనిషేధమంత్రి
భగవంతరావ్ ఘడె : అడవులమంత్రి
ఎం. సి. షా: స్థానిక స్వపరిపాలనమంత్రి
శేషరావ్ వాంఖాడె పరిశ్రమలమంత్రి
డి. ఎస్. దేశాయ్: పబ్లిక్ వర్క్సుమంత్రి
హితేంద్ర దేశాయ్ : విద్యామంత్రి
సయ్యద్ నజీరుద్దీన్ కాజి: సివిల్ సప్లయిస్ మంత్రి
టి. ఎస్. భర్దె: సహకార మంత్రి
ఎల్, కె. తివ్రుడె : సాంఘిక సంక్షేమ మంత్రి
డిప్యూటి మంత్రులు :

డాక్టర్ భాస్కర్ పటేల్, ఫ్రెంజీ భావన్‌జీ థక్కర్, శంకరరావ్ చవన్, శ్రీమతి నిర్మలరాజె భాన్‌స్లే, దేవిసింగ్ చౌహాన్, జస్వంతలాల్ షా, శ్యామరావ్ పాటిల్; ఛోటాభాయ్ పాటిల్, డాక్టర్ ఎన్. ఎన్. కైలాల్, మధుకర్ చౌధురి, బహదూర్ భాయ్ పటేల్.

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,100; ఇంటి అద్దె అలవెన్సు రు. 250. కారు అలవెన్సు రు, 200.

## బడ్జెట్

బొంబాయి రాష్ట్రానికి 1959-60 బడ్జెట్‌ను అర్థికమంత్రి డాక్టర్

జీవరాజ్ ఎన్. మెహతా 1959 ఫిబ్రవరి 19 న రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి:

ఆదాయం అంచనా : రు. 136,74,00,000

వ్యయం అంచనా : రు. 137,72,00,000

లోటు అంచనా : రు. 98,00,000

# మదరాసు

రాష్ట్ర పునర్నిర్మాణమువల్ల చాలా భూభాగాన్ని కోల్పోయిన రాష్ట్రం మదరాసు. 1956 నవంబరు 1 నాటికి ఈ రాష్ట్రంలో వున్న మలబారు జిల్లా కేరళలోను, దక్షిణ కన్నడ జిల్లా, కోయంబత్తూరులోని కొంత బాగం మైసూరు రాష్ట్రంలో కలిపివేయబడినవి. అయితే, తిరువాన్కూరు కొచ్చిన్‌లోని తమిళ ప్రాంతం, కన్యాకుమారి జిల్లా అనే పేరుతో మదరాసు రాష్ట్రంలో కలపబడింది. ఈ ప్రాంతంలో తోరియం ఖనిజం దొరుకుతుంది.

1956 నవంబరు 1 తేది తరువాత మదరాసు రాష్ట్ర విస్తీర్ణం 50,171 చ. మైళ్లు. జనాభా, 2,99,74,936.

మదరాసురాష్ట్రంలోని ముఖ్యనది కావేరి. ఇది కూర్గు రాష్ట్రంలో పుట్టి, మైసూరుగుండా మదరాసురాష్ట్రంలోకి వచ్చి, తంజావూరుజిల్లాను సస్యశ్యామలం చేసి, అనేక పాయలుగా చీలి, బంగాళాఖాతంలో పడుతున్నది. ఈ నది పొడవు దాదాపు 500 మైళ్లు. కావేరి నీటి తీరువల్ల దాదాపు 8,70,000 ఎకరాల భూమి మొదటి పంటకు సాగు అవుతుంది.

మదరాసు రాష్ట్రంలో మొత్తం 12 జిల్లాలు వున్నాయి. అవి: ఉత్తరార్కాడు, కన్యాకుమారి, కోయంబత్తూరు, చెంగల్పట్టు, తంజావూరు, తిరుచిరాపల్లి, తిరునల్వేలి, దక్షిణార్కాడు, మదరాసు, మధుర, రామనాథం, సేలం.

రాష్ట్రంలో అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తమిళం. తరువాత తెలుగు.

రాష్ట్రపు ముఖ్యపంటలు బియ్యం, జొన్నలు, రాగులు. రాష్ట్రంలో

పండే ఆహార ధాన్యాలు ప్రజల అవసరాలకు చాలవు. అందువల్ల ఆంధ్ర, ఒరిస్సా రాష్ట్రాలనుంచి దిగుమతి చేసుకోవాలి.

గవర్నరు: విష్ణురాం మేధి.
పదవీ స్వీకారం: 24 జనవరి 1958. జీతం: రు. 5, 500,

## శాసన సభలు

అసెంబ్లి సభ్యుల సంఖ్య : 205, వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు, 37. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానంనుంచి ఎన్నుకోబడిన సభ్యుడు ఒకరు, ఆంగ్లోఇండియనుల ప్రతినిధిగా గవర్నరుచే నామినేట్ చేయ బడిన సభ్యుడు, ఒకరు.

స్పీకర్ : డాక్టరు యు. కృష్ణారావు
డిప్యూటీ స్పీకరు : వి. భక్తవత్సలు నాయుడు
కౌన్సిలు చైర్మన్ : డాక్టరు పి. వి. చెరియన్
వైస్ చైర్మన్ : అల్లాపిచ్చై
కౌన్సిలు సభ్యుల సంఖ్య : 50

శాసనసభ్యుల జీతాలు :

నెలకు రు. 150. శాసనసభా సమావేశానికి హాజరైన ప్రతి రోజుకూ, రు. 12½ అలవెన్సు.

మదరాసు అసెంబ్లీ మొత్తం సభ్యుల సంఖ్య, 205. 1957 లో జరిగిన ఎన్నికలలో శాసనసభకు ఎన్నిక అయిన పార్టిల బలాలు ఇవి. కాంగ్రెసు, 151; ద్రవిడ మున్నేట్ర కళగం, 15; కమ్యూనిస్టులు, 4; ప్రజాసోషలిస్టులు, 2; స్వతంత్రులు, 15; కాంగ్రెసు సంస్కరణకమిటీ, 14; సోషలిస్టులు, 2; ఫార్వర్డ్ బ్లాక్, 2.

మంత్రిమండలి : పదవీ స్వీకారం : 1957 ఏప్రిల్ 13.
కె. కామరాజ్ : ముఖ్యమంత్రి, ప్లానింగ్
ఎం. భక్తవత్సలం : హోంమంత్రి, జెయిళ్ళు, మద్యనిషేధం ఆహారం, వ్యవసాయం

వి. సుబ్రమణ్యం : ఆర్థికమంత్రి, విద్య, ప్రచురణ, న్యాయశాఖ
ఎం. ఎ. మాణిక్యవేలు : రెవిన్యూమంత్రి, ఆరోగ్యం
ఆర్. వెంకట్రామన్ : పరిశ్రమలమంత్రి, కార్మికులు, సహకారము, ప్రభుత్వ వశంలో వున్న రవాణా
పి. కక్కన్ : పబ్లిక్ వర్క్సుమంత్రి. హరిజన సంక్షేమం
వి. రామయ్య : విద్యుచ్ఛక్తిమంత్రి, రవాణా
శ్రీమతి లూర్డుఅమ్మాళ్ సైమన్ : స్థానిక స్వపరిపాలనమంత్రి

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,000; కారు అలవెన్సు, ఇంటి అద్దె, నెలకు రు. 500.

## బడ్జెట్

మదరాసు రాష్ట్ర 1959-60 బడ్జెటును ఆర్థికమంత్రి సి. సుబ్రమణ్యం 1958 మార్చి 2 న శాసనసభలో ప్రతిపాదించారు. ఆ బడ్జెటు వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా ! | రు. 73,08,00,000 |
| వ్యయం అంచనా : | రు. 71,69,00,000 |
| మిగులు అంచనా : | రు. 1,09,00,000 |

# మధ్యప్రదేశ్

1956 నవంబర్ 1 పూర్వం మధ్యప్రదేశ్ అనే పేరుతో వున్న రాష్ట్రంలో బుల్డాన్, అకోలా, అమరావతి, యవత్‌మల్, వర్ధా, నాగపూరు. భండారా, చాందా జిల్లాలు మినహా తక్కిన ప్రాంతమూ, మధ్యభారత్ రాష్ట్రమూ, భోపాలు రాష్ట్రమూ, వింధ్యప్రదేశ్ రాష్ట్రమూ, సిరోంచ్ ప్రాంతమూ కలిసి, కొత్తమధ్యప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. బొంబాయి తరువాత ఎక్కువ విస్తీర్ణంగల రాష్ట్రం ఇదే.

మధ్యప్రదేశ్ విస్తీర్ణం, 1,70,909 చ. మైళ్లు. జనాభా, 2,60,71,637. వీరిలో దాదాపు 40 లక్షలమంది ఆదిమ నివాసులు.

ఈ రాష్ట్రంలో ఇనుము, మెంగనీస్ ఖనిజాలు పుష్కలంగా లభిస్తాయి.

రాష్ట్రంలోని భూమిలో అడవులక్రిందవున్న భాగమూ, బంజరు భూమి, పోగా మిగతాదానిలో నూటికి 67 వంతులు వ్యవసాయంలో వుంది. ప్రజల ప్రధాన వృత్తి కూడా ఇదే. వ్యవసాయంలో వున్న భూమిలో నూటికి 53 వంతులు వరిపంటక్రింద వుంది. తరువాత గోధుమ, పప్పుదినుసులు, నూనె, ధాన్యాలు లెఖ్ఖకు వస్తాయి.

ఈ రాష్ట్రంనుంచి కలప కూడా విశేషంగా ఇతర రాష్ట్రాలకు, ముఖ్యంగా మదరాసు రాష్ట్రానికి, ఎగుమతి అవుతుంది.

రాజధాని: భోపాల్.

గవర్నర్ : హెచ్. వి. పటాస్కార్: జీతం. రు. 5,500.

శాసనసభ

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది.

అసెంబ్లీ సభ్యుల మొత్తం సంఖ్య: 288.

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు. 43. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకింపబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు, 54. ఆంగ్లోఇండియనుల తరఫున గవర్నరుచే నామినేట్ చేయబడిన సభ్యుడు. 1.

స్పీకరు : పండిట్ కుంజిలాల్ దుబే

అసెంబ్లీలో పార్టీల బలాలు: కాంగ్రెసు, 232; ప్రజాసోషలిస్టు, 12, జనసంఘ, 10; కమ్యూనిస్టు, 2; సోషలిస్టు 6; హిందూ మహాసభ 7; రామరాజ్య పరిషత్, 5; స్వతంత్రులు, 14.

మంత్రిమండలి: పదవీ స్వీకారం : 1957 ఏప్రిల్ 15.

డాక్టర్ కైలాస్‌నాథ్ కాట్జూ: ముఖ్య మంత్రి, హోంశాఖ, ప్రచురణ, ప్లానింగ్, అభివృద్ధిశాఖ

బి. ఎ. మండలాయ్: రెవిన్యూమంత్రి. భూసంస్కరణలు, స్థానిక స్వపరిపాలన

తఖత్‌మల్ జైయిన్: పరిశ్రమమంత్రి, వాణిజ్యం, రవాణా, వ్యవసాయం

శంభునాథ్ శుక్ల : అడవులమంత్రి, సహజసంపదలు

డాక్టర్ ఎస్. డి. శర్మ : విద్యామంత్రి, న్యాయశాఖ
మిశ్రిలాల్ గంగ్వాల్ : ఆర్థికమంత్రి, రిజిస్ట్రేషన్
శంకర్‌లాల్ తివారి : పబ్లిక్‌వర్క్సుమంత్రి, విద్యుచ్ఛక్తి
వి. వి. ద్రావిడ్ : కార్మికమంత్రి, గృహావసతులు
రాజానరేశ్ చంద్ర : కొండజాతుల సంక్షేమం
అబ్దుల్ కయూం సిద్దికి : ఆహారమంత్రి, జెయిళ్లు
గణేశ్‌రాం అనంత్ : సాంఘిక సంక్షేమమంత్రి, సహకారం
రాణి పద్మావతిదేవి : ఆరోగ్యమంత్రి
మంత్రుల జీతాలు : నెలకు రు. 1000.

## బడ్జెట్

మధ్యప్రదేశ్ 1959-60 బడ్జెట్ రాష్ట్ర శాసనసభలో 1959 ఫిబ్రవరి 26 తేదిన ఆర్థికమంత్రి మిశ్రిలాల్ గంగ్వాల్ ప్రవేశపెట్టారు. బడ్జెట్ వివరాలివి :

| | | |
|---|---|---|
| ఆదాయం | అంచనా : | రు. 59,37,00,000 |
| వ్యయం | అంచనా : | రు. 58,44,00,000 |
| మిగులు | అంచనా : | రు. 93,00,000 |

# మైసూర్

1956 నవంబర్ 1 తేదికి పూర్వం మైసూర్ అనే పేరుతోవున్న రాష్ట్రానికి, కూర్గు రాష్ట్రాన్ని, బొంబాయి రాష్ట్రంలోని బీజపూర్, కెనరా, ధార్వార్ జిల్లాలనూ, బెల్గాంజిల్లాలలోని చాలా భాగాన్ని, హైదరాబాద్ రాష్ట్రంలోని రాయచూర్' బీదర్, గుల్బర్గాజిల్లాలలో చాలా భాగాలనూ, మదరాసు రాష్ట్రంలోని దక్షిణ కన్నడజిల్లా (కాసర గోడ్ మినహా) కోయంబత్తూరు జిల్లాలోని కొల్లెగల్ తాలూకాలను కలపడంతో కొత్త మైసూరురాష్ట్రం ఏర్పడింది. ఈ రాష్ట్రపు విస్తీర్ణం 74,093 చ. మైళ్లు. జనాభా, 1,94,01,193.

ఈ రాష్ట్రంలో కాఫీ, తేయాకు, వక్కలు బాగా పండుతవి.

ఇండియాలో ఈ నాడు ఒక్క మైసూర్ రాష్ట్రంలోనే బంగారం త్రవ్వి తీయబడుతున్నది. ఈ రాష్ట్రంలో కోలార్‌లోనూ, హట్టిలోనూ బంగారం దొరుకుతున్నది. కోలార్‌లోని బంగారు గనులను ప్రభుత్వం స్వాధీన పరచుకుని, కంపెనీ యజమానులకు 164 లక్షల రూపాయల నష్టపరిహారం ఇచ్చారు.

పారిశ్రామికంగానూ, నీటిసప్లయి, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి మొదలగు విషయాలలోనూ మైసూరు రాజ్యం చాలా అభివృద్ధిలోకి వచ్చింది.

భారతదేశంలో సిల్కును ఎక్కువగా తయారుచేసే ప్రాంతాలలో ప్రథమస్థానం మైసూరుది. భద్రావతి దగ్గరవున్న ఉక్కు ఫాక్టరీ ఇనుము, ఉక్కు తయారుచేసే ఫాక్టరీలలో చాలా ప్రసిద్ధిచెందింది. మైసూరు పరిశ్రమలలో ముఖ్యంగా చెప్పవలసిన మిగతావి, చందన తైలము, చందన చెక్కడము. సబ్బులు.

గవర్నర్ : శ్రీ జయచామ రాజేంద్ర వడయర్ బహదర్.

పదవీ స్వీకారం : 1956 నవంబరు 1; జీతం, రు. 5,500.

శాసనసభలు :

రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిలు వున్నాయి. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం, 208.

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారి సంఖ్య, 48. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానంనుంచి ఎన్నుకోబడిన సభ్యుడు, ఒకరు.

స్పీకర్ : ఎస్. ఆర్. కాంతి.

కౌన్సిల్ చైర్మన్ : వి. వెంకటప్ప

డిప్యూటీ చైర్మన్ : పి. గోపాలకృష్ణచెట్టి

అసెంబ్లీలో పార్టీల బలాలు: కాంగ్రెసు, 150; ప్రజాసోషలిస్టులు, 18; కమ్యూనిస్టు, 1; షెడ్యూల్డు కాస్టు ఫెడరేషన్, 2; పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ, 2; స్వతంత్రులు, 35.

మంత్రుల జీతాలు: ఒక్కొక్కరికి నెలకు రు. 1,000. కారు అలవెన్సు రు. 250; ఇంటి అలవెన్సు రు. 250.

శాసనసభ్యులకు, నెలకు రు. 100 జీతం. అదికాక, సమావేశానికి హాజరైన ప్రతిరోజుకి అలవెన్సు, రు. 15. ప్రయాణానికి ఫస్టుక్లాసు టికెట్ కు రెట్టింపు.

బి. డి. జట్టి: ముఖ్యమంత్రి, ప్లానింగ్, హోం, పరిశ్రమలు
కడిదల్ మంజప్ప: రెవిన్యూ మంత్రి
టి. సుబ్రమణ్య: న్యాయమంత్రి, స్థానికపరిపాలన
టి. మరియప్ప: ఆర్థిక మంత్రి
హెచ్. ఎం. చన్నబసప్ప: పబ్లిక్ వర్క్సు మంత్రి
కె. ఎఫ్. పాటిల్: అడవులు, రవాణా
మారి మరియప్ప: సహకార మంత్రి
డాక్టర్ కె. కె. హెగ్డె: ఆరోగ్య మంత్రి
అన్నారావు గణముఖి: విద్యా మంత్రి
ఎన్. రాచయ్య: వ్యవసాయ మంత్రి

డిప్యూటి మంత్రులు: ఎం. ఎన్. నాఘనూర్, హెచ్. సి. లింగారెడ్డి, శ్రీమతి గ్రేస్ టక్కర్, శ్రీమతి లీలావతి వెంకటేశ్ మాగడి, బి. బసవలింగప్ప, జె. హెచ్. సంసుద్దిన్.

## బడ్జెట్

మైసూరు 1959-60 బడ్జెట్ ను 1959 మార్చి 3 తేదిన ఆర్థిక మంత్రి టి. మరియప్ప శాసనసభలో ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి:

| | |
|---|---|
| ఆదాయం అంచనా: | రు. 55,68,98,000 |
| వ్యయం అంచనా: | రు. 55,20,58,000 |
| మిగులు అంచనా: | రు. 48,40,000 |

# రాజస్థాన్

రాష్ట్రపునర్నిర్మాణ సందర్భంలో పాత రాజస్థాన్ రాష్ట్రంలోని సిరోంజ్ ప్రాంతం మధ్య ప్రదేశ్ కు చేర్చబడింది. అజ్మీరు రాష్ట్రమూ

మధ్య ప్రదేశ్‌లోని సునేల్ తప్పా ప్రాంతమూ, బొంబాయిరాష్ట్రంలోని అబూరోడ్ ప్రాంతం చేర్చడంతో, కొత్త రాజస్థాన్ రాష్ట్రం ఏర్పడింది.

ఈ రాష్ట్రపు విస్తీర్ణం 1,32,459 చ. మైళ్లు. జనాభా 1,59,70,774.

ఇచ్చట పండే పంటలలో ముఖ్యమైనవి సజ్జలు, జొన్నలు. ఈ రాష్ట్రంలో కొండలు, ఎడారి ఎక్కువ. వర్షము తక్కువ. చెప్పదగిన నదు లేమీ లేవు. చంబల్, వనస్ అనేవి రెండే నదులనే పేరుకు తగినవి. చంద్రకాంత శిలలు, కలప, వెదురు, ఉన్ని, తేనె, లక్క మొదలైనవి యిచ్చటనుంచి ఎగుమతి అవుతవి.

తాత్కాలిక రాజధాని, జయపూరు.

గవర్నర్: గురుముఖ్ నీహాల్ సింగ్.

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లి మాత్రం వుంది. అసెంబ్లి సభ్యుల సంఖ్య మొత్తం 176 వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 28. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 20.

స్పీకరు: రాం నివాస్ మిర్ధా

డిప్యూటీ స్పీకరు: నిరంజన్‌నాథ్ ఆచార్య

శాసనసభలో పార్టీల బలాలు:

కాంగ్రెసు 114; ప్రజాసోషలిస్టు 1; కమ్యూనిస్టు 1; జనసంఘ 6; రామరాజ్యపరిషత్, 17; స్వతంత్రులు, 37.

మంత్రిమండలి: పదవీస్వీకారం: 1957 ఏప్రిల్ 11.

మోహన్‌లాల్ సుఖాడియా: ముఖ్యమంత్రి, ప్లానింగ్, విద్య

హరిభావ్ ఉపాధ్యాయ: ఆర్థికమంత్రి, అబ్కారి, సాంఘిక సంక్షేమం.

రాంకిశోర్ వ్యాస్ : హోం మంత్రి. న్యాయశాఖ, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి.

బదరిప్రసాద్‌గుప్త: స్థానిక స్వపరిపాలన, ఎన్నికలు, వైద్యశాఖ

దామోదర్‌లాల్ వ్యాస్: రెవిన్యూమంత్రి, కాందిశీకుల పునరావాసం

నాథురాం మిర్ధా: వ్యవసాయమంత్రి, సహకారం, అడవులు, పబ్లిక్ వర్క్స్, రవాణా.

డిప్యూటీ మంత్రులు: సంపత్ రాం, టిఖాబ్ చంద్, ధారివాల్, భీకా భాయ్, దౌలత్ రాం.

### బడ్జెట్

రాజస్థాన్ రాష్ట్రానికి 1959-60 బడ్జెటును శాసనసభలో 1959 మార్చి 2 న ఆర్థికమంత్రి హరిభావ్ ఉపాధ్యాయ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 39,27,28,000 |
| వ్యయం అంచనా: | రు. 39,14,22,000 |
| మిగులు అంచనా : | రు. 13,06,000 |

# కమిషనర్ రాష్ట్రాలు

స్వపరిపాలనలేకుండా, ప్రెసిడెంటు పరిపాలనలోవున్న కొన్ని ప్రదేశాలను ఛీఫ్ కమిషనర్ల రాష్ట్రాలు అంటారు. వీటి పరిపాలనను ప్రెసిడెంటు అధికారానికి లోబడిన ఛీఫ్ కమిషనరు సాగిస్తాడు. ఇలాటి రాష్ట్రాలు ఇండియాలో 7 వున్నాయి. అవి : అండమాన్ నికొబార్, ఢిల్లి, త్రిపుర, పుదుచేరి, లక్షదీవులు అమిన్ దీవులు. హిమాచలప్రదేశ్.

# అండమాన్, నికొబార్ దీవులు

బంగాళాఖాతంలో, మదరాసుకు తూర్పుగా 740 మైళ్లు, కలకత్తాకు దక్షిణంగా 780 మైళ్ల దూరంలోవున్న అండమాను దీవులున్నూ ఈ దీవులకు దక్షిణంగా 85 మైళ్ల దూరాన, బంగాళాఖాతంలోవున్న నికొబార్ దీవులున్నూ, ఇండియాప్రభుత్వపరిపాలనలో, ఒక ఛీఫ్ కమిషనర్ పాలనలో వున్నాయి.

అండమాను దీవులలో పెద్దవి ఆరున్నూ, చిన్న దీవులు సుమారు రెండువందలున్నూ వున్నాయి. వీటి వైశాల్యం మొత్తం, 3,215 చ.

మైళ్లు. మొత్తం జనాభా, 39,971; పురుషులు, 19,055; స్త్రీలు, 11,916. అండమాను దీవుల ప్రధాన నగరం పోర్టుబ్లేర్.

పశ్చిమ పంజాబ్, తూర్పు బెంగాల్ రాష్ట్రాలనుంచి ఇండియాకు వచ్చిన కాందిశీకులలో కొంతమందిని యీ దీవులకుపంపి, వీటిని నివాస యోగ్యముగాచేసి, వీటిని ఉపయోగించాలని ఇండియా ప్రభుత్వంవారి ఉద్దేశం. 1954 డిసెంబరు 2 నాటికి తూర్పు బెంగాలునుంచి ఇండియాకు వచ్చివేసిన కాందిశీకులలో 185 కుటుంబములు యీ దీవులకు పంపబడినారు.

చీఫ్ కమిషనర్: ఎం. వి. రాజవాడె

# ఢిల్లీ

ఇండియాకు రాజధాని ఢిల్లీ. 1912 కు పూర్వం కలకత్తా మన దేశానికి రాజధానిగావుండేది. 1911 డిసెంబరు 12 వ తేదీనుంచి ఇండియాకు ఢిల్లీ రాజధాని అయింది.

పాతఢిల్లి, కొత్తఢిల్లి, పరిసరాలు మొత్తం 578 చదరపు మైళ్ల ప్రదేశం, ఒక ప్రత్యేక రాష్ట్రంగా, ఛీఫ్ కమిషనరు పరిపాలన క్రింద ఏర్పాటుచేయబడింది. రాజప్రతినిధికీ, శాసనసభలకూ కొత్త భవనాలను నిర్మించడానికి, అంటే కొత్తఢిల్లి నిర్మాణానికి 14 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. 1951 లో ఢిల్లి జనాభా, 17,44,072. పురుషులు, 9,86,538, స్త్రీలు 7,57,534.

ఛీఫ్ కమిషనర్: ఎ. డి. పండిట్

రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్య 48. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 6.

శాసనసభ్యుల జీతాలు: నెలకు రు. 200; అదనంగా శాసనసభకు హాజరైన ప్రతిరోజుకు రు. 10 బత్తా.

మంత్రిమండలి: పదవీ స్వీకారం: 1955 ఫిబ్రవరి 12.

ముఖ్యమంత్రి: చౌధురి బ్రహ్మప్రకాశ్

రెండవమంత్రి: డాక్టర్ యుద్ధవీర్‌సింగ్

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,000. ప్రధానమంత్రికి అదనంగా రు. 250; అదికాక, ప్రతిమంత్రికీ నెలకు రు. 250 కారు అలవెన్సు, ఉచితవసతి.

# త్రిపుర

ఇది స్వతంత్ర సంస్థానంగా వుండేది. దీనిని 1949 లో ఇండియా ప్రభుత్వం తమ పరిపాలనలోకి తీసుకున్నారు. ఇది పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి తూర్పునవున్నది. ఒక్క అసాంవైపుతప్ప తక్కిన మూడు వైపులా ఈ రాష్ట్రానికి సరిహద్దు పాకిస్తాన్‌తో. దీని వైశాల్యం 4,032 చ. మైళ్లు. జనాభా 6,39,029, పురుషులు, 3,35,589. స్త్రీలు, 3,03,404. ప్రభుత్వాదాయం ఏడాదికి 27 లక్షల రూపాయలు. మహారాజు : హిస్ హైనెస్ మహారాజా మాణిక్య వీరవిక్రమ కిశోర్ దేవ వర్మన్ బహదూర్.

ఛీఫ్ కమిషనర్ : కె. పి. భార్గవ

పార్లమెంటుకి సభ్యులను ఎన్నుకోడానికి, ప్రజలచే ఎన్నుకోబడిన సభ్యుల సభ (ఎలెక్టరల్ కాలేజీ) ఒకటి యీ రాష్ట్రంలో వుంది. దాని సభ్యుల సంఖ్య 30. గత ఎన్నికలలో యీ సభకు తొమ్మిదిమంది కాంగ్రెసువారూ, 12 మంది కమ్యూనిస్టులూ, 6 మంది స్వతంత్రులు, ముగ్గురు ఇతర పార్టీలవారూ ఎన్నుకోబడినారు.

త్రిపుర రాష్ట్ర పరిపాలనలో, ఛీఫ్ కమిషనర్‌కు సలహా ఇవ్వడానికి ముగ్గురు సభ్యులుగల కౌన్సిలు 1953 ఏప్రిల్ 14 తేదీన నియమింప బడింది.

# పుదుచేరి

ఫ్రెంచివారి పరిపాలనలోవున్న సెటిల్మెంట్లు 1954 నవంబరు 1 తేదినుంచి, భారతదేశంలో ఒక కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటు చేయబడినవి. వీటి వైశాల్యం మొత్తం 203 చదరపు మైళ్ళు. ఈ సెటిల్మెంట్లు మొత్తంఅయిదు. ఇవి పుదుచ్చేరి, కరికాల్, మాహి, యానాం అనే వూళ్ళూ, వాటి పరిసర ప్రదేశాలు.

పుదుచేరి నగరం భారతదేశపు తూర్పుతీరంలో మదరాసుకు దక్షిణంగా 105 మైళ్ళదూరంలోవుంది. ఈ నగరమూ, దీని పరిసర ప్రదేశాలూ మొత్తం ఫ్రెంచివారి అధీనంలోవున్న భూమి, 115 చ. మైళ్ళు.

కరికాల్ కూడా మదరాసుకు దక్షిణంగా, సముద్రతీరాన తంజావూరు జిల్లాలోవుంది. ఈ సెటిల్మెంటులో మొత్తం 100 గ్రామాలు వున్నాయి. మాహి భారతదేశపు పశ్చిమతీరాన, మలబారులో వుంది.

యానాం తూర్పు గోదావరి జిల్లాలో, గోదావరి బంగాళాఖాతంలో పడే చోటికి సమీపంలో, కాకినాడకు సుమారు 18 మైళ్ళ దూరంలో వున్నది.

ఇండియాలో ఫ్రెంచి ప్రభుత్వ పాలనలోవున్న ప్రాంతాలను, ఇండియా ప్రభుత్వ పాలనలో తీసుకొని రావాలనీ అచ్చటి ఫ్రెంచి ప్రభుత్వం అంతరించిపోవాలనీ ఉద్యమం 1954 మార్చిలో తీవ్రరూపం దాల్చింది. ఫ్రెంచి ఇండియాలోని మునిసిపల్ కౌన్సిళ్లుకూడా ఇదే విధంగా తీర్మానించాయి. ప్రశాంతంగా యీ ఫ్రెంచి సెటిల్మెంట్లను ఇండియాకు అప్పగించడం మంచిదనికూడా, ఇండియాప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వానికి వ్రాసింది. ఫ్రెంచి ఇండియాలోని ప్రజలుకూడా మార్చి 27 తేదిన, స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రారంభించారు.

తరువాత, ఇండియాప్రభుత్వం, ఫ్రెంచిప్రభుత్వంతో రాయబారాలు జరిపింది. ఉభయులూ ఒక ఒడంబడికకు వచ్చారు. దాని ప్రకారం, 1945 అక్టోబరు 18 తేదిన, ఫ్రెంచి ఇండియా శాసనసభ్యులూ మునిసిపల్ సభ్యులూ తమ అభిప్రాయాన్ని తెలియజేశారు. 180 మంది, ఫ్రెంచి ప్రాంతాలు ఇండియాలో కలిసిపోవాలన్నారు. ఎనిమిది మంది అక్కర్లేదన్నారు. అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం ఫ్రెంచి ప్రాంతాలను ఇండియాకు అప్పగించడానికి ఫ్రాన్సు అంగీకరించింది. ఈ అప్పగింత, 1954 నవంబరు 1 తేదిన జరిగింది.

ఆనాటినుంచీ, యీ సెటిల్మెంట్లు ఒక 'సి' తరగతి రాష్ట్రంగా ఏర్పాటు చేయబడినవి. దానికి చీఫ్ కమిషనరుగా శ్రీ కేవల్‌సింగ్‌ను ఇండియాప్రభుత్వం నియమించింది.

పుదుచేరి రాష్ట్రశాసనసభకు ఎన్నికలు 1955 జులైలో జరిగాయి. శాసనసభ ప్రథమ సమావేశం ఆగస్టు 12 న జరిగింది. అధ్యక్షులుగా ఆర్. ఎల్. పురుషోత్తమరెడ్డి ఎన్నుకోబడినారు.

ప్రథమ మంత్రిమండలి 1955 ఆగస్టు 17 తేదిన ఏర్పాటు చేయబడినది,

ఆ మంత్రులపేర్లు ఇవి : ఎడ్వర్డ్ గూబర్, చంద్రశేఖరచెట్టియార్, మహమ్మద్ యూసుఫ్, దక్షిణామూర్తి, త్యాగరాజన్, పి. షణ్ముగం.

పుదుచేరి శాసనసభ్యులకు జీతం నెలకు, రు. 120. ఇదికాక, సభకు హాజరైన ప్రతిరోజుకు అలవెన్సు రు. 10.

చీఫ్ కమిషనర్ : ఎల్. రామేశ్వరన్ సింగ్.

# మణిపూర్

మణిపూర్ సంస్థానాన్ని కేంద్రప్రభుత్వం 1949 అక్టోబరు 15 తేదిన స్వాధీనపరచుకొని, చీఫ్‌కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేశారు. ఇది ఆసాం, బర్మాల సరిహద్దులోవున్న సంస్థానం. వైశాల్యం, 8,622 చ. మైళ్లు. జనాభా, 5,77,635. పురుషులు. 2,83,685, స్త్రీలు. 2,93,950. ప్రభుత్వాదాయం రు. 29 లక్షలు.

చీఫ్ కమిషనర్ : పి. సి. మధుర్.

పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోడానికి 30 మంది సభ్యులుగల ఎలెక్టరల్ కాలేజీ యీ రాష్ట్రంలోవుంది.

# లక్షదీవులు, అమీన్ దీవులు

ఈ దీవులు కేరళ రాష్ట్రానికి పశ్చిమంగా అరేబియన్ సముద్రంలో వున్నాయి.

1956 నవంబర్ 1 తేదికిపూర్వం, మదరాసు రాష్ట్ర ప్రభుత్వ పరిపాలనలోవున్న, యీ దీవులు, 1956 నవంబరు 1 నుంచి కేంద్ర ప్రభుత్వపాలనలోకి వచ్చాయి. ఈ దీవులన్నిటి వైశాల్యం, సుమారు

384 చ. మైళ్లు. జనాభా, 21,035 ఈ దీవులలోని ప్రజలకు జీవనో పాధి, కొబ్బరితోట పెంపకం, చేపలను పట్టడం.

ఈ దీవుల పరిపాలన కేంద్రప్రభుత్వం నియమించే అడ్మినిస్ట్రేటరు అనే వుద్యోగి అధ్వర్యంలో జరుగుతూవుంది. ఈ వుద్యోగి ప్రధాన కార్యాలయం, కేరళ రాష్ట్రంలోని కోళికోడు పట్టణంలో వుంటుంది :

అడ్మినిస్ట్రేటరు : టి. మోసె.

# హిమాచల ప్రదేశ్

తూర్పుపంజాబ్ రాష్ట్రంలో వున్న బాఘర్, బాఘడ్,బల్సాన్, బషార్, భజ్జి, బిజ, వార్కో, ధామ, జుబ్బల్, కెవన్ థాల్, కుమార్ సెయిన్, కునిహారి, కుథార్, మహలోగ్, ప్రాంగి, తుంగళ్, సిర్మూర్, థరోచ్, చంబ, మండి, సుకేత్, బిలాస్‌పూర్ అనే 31 సంస్థానాల అధి పతులు, తమ సంస్థానాలను కేంద్రప్రభుత్వ పరిపాలనకు అప్పగించి వేశారు. దీని వైశాల్యం, 16,909 చ. మైళ్లు. యీ రాష్ట్రంలో విస్తార భాగం అడవి. రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయంకూడా విస్తార భాగం అడవులనుంచే. జనాభా, 11,08,466. ఈ ప్రాంతం అంతా హిమాచలప్రదేశ్ అనే పేరుతో చీఫ్ కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటు చేయబడింది.

రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్య 41.

లెఫ్టినెంట్ గవర్నరు : రాజాభజ్రాంగ బహదుర్

* * *

భారతదేశంలో వున్నన్ని రకాల జాతులప్రజలు ఒక్క రష్యాలో తప్ప ప్రపంచంలో మరే దేశంలోనూ లేరు.

1941 నుంచి 1951 నాటికి, ఇండియా జనాభా నూటికి 13.4 వంతులు పెరిగింది. లక్షకుపైగా జనాభావున్న పట్టణాలు ఇండియాలో 74 వున్నాయి.

ప్రతి సంవత్సరమూ, ఇండియాలో జన్మించే శిశువులలో ప్రతి వెయ్యిమందికీ 160 మంది ఏడాదిలోపుననే చనిపోతున్నారు.

# ఆంధ్ర ప్రదేశ్
## రాష్ట్రోద్యమ చరిత్ర

మదరాసు రాష్ట్రంలోని దాదాపు 71 వేల చదరపుమైళ్లు వైశాల్యమూ, దాదాపు 11 కోట్ల రూపాయల ప్రభుత్వాదాయమూ, విస్తారమైన ఖనిజసంపదా దాదాపు మూడుకోట్ల జనాభాగల తెలుగు జిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందనే ఆందోళన ఆంధ్రదేశంలో దాదాపు 49 సంవత్సరాలనుంచీ జరుగుతున్నది. ఇండియాలోని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పాటుచేసి ఆంధ్ర జిల్లాలను ఒక ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పాటు చేయవలసిందనే సూచన మొట్టమొదట 1910 లో గుంటూరులో యువజన సారస్వత సంఘము (యంగ్మెన్స లిటరరీ అసోసియేషన్) వారు చేశారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమానికి యిదే పునాది. తరువాత 1913 లో ఆంధ్రమహాసభ స్థాపింపబడినది. తరువాత అనేక సంఘములు, ఉద్యమములు దీనికి అనుబంధములుగా బయలుదేరాయి. 1916 లో కలకత్తా సమావేశములో అఖిలభారత కాంగ్రెసు మహాసభలో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సిద్ధాంతము అంగీకరింపబడింది. కాంగ్రెసు రాష్ట్రాలలో ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక స్థానాన్ని పొందింది.

ఇది యిలా వుంటుండంగా మాంటేంగు-ఛెమ్సుఫర్డు కమిటీవారు ఇండియాకు రాజ్యాంగ సంస్కరణలను ప్రతిపాదించడానికి పరిస్థితుల పరిశీలన నిమిత్తము ఇండియాకు వచ్చారు. అప్పుడు ఆంధ్రమహాసభవారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ ఆ కమిటీకి ఒక నివేదికను సమర్పించారు. తరువాత 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుపై కామన్సు సభలో చర్చలు జరుగుతూన్నప్పుడు ఆంధ్రమహాసభ

వారు ఒక రాయబార వర్గాన్ని కూడా ఇంగ్లండు పంపించారు. అదేసమయములో ఇండియాలోని కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానము చేసింది. అయినప్పటికీ 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరగలేదు.

1922 లో కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ మళ్ళీ తీర్మానముచేసింది. 1927-28 లో భారతదేశపు రాజ్యాంగ విధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నాలు జరుగుతూన్నప్పుడు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణముకోసము పెద్ద కృషి జరిగింది. సైమను కమిషన్ వారు ఇండియాకు వచ్చినపుడు వారికి ఒక నివేదిక సమర్పించబడింది. 1931లో మదరాసు శాసనసభ, కేంద్ర శాసనసభ ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. పండిత మోతీలాల్ నెహ్రూ నివేదికకూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదించింది, ఐతే ఆంధ్ర దేశములో కాంగ్రెసు ఉద్యమము బలంగా వుండటంవల్ల, ప్రత్యేకఆంధ్ర రాష్ట్రము మరొక కాంగ్రెసురాష్ట్రంగా పరిణమిస్తుందని ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సైమను కమిషనువారు అంగీకరింపలేదు. అయితే ఒరిస్సా, సింధు అనే రెండు ప్రత్యేక రాష్ట్రాలను ఏర్పాటు చేయడానికి అంగీకరించారు, 1935 లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు చేయబడినప్పుడు గంజాంజిల్లాలో ఆంధ్రులు అత్యధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాలు, బరంపురం పట్టణం, ఒరిస్సా రాష్ట్రములో కలిపి వేయబడినవి.

1937 లో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలోఆంధ్రులకు కొంత ఆశాభావంకలిగిన. 1938 లో మదరాసు అసెంబ్లీ కౌన్సిలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూతీర్మానాలుచేశాయి. కాని అప్పుడూ రాష్ట్రనిర్మాణము జరగలేదు. 1946 లో కౌన్సిల్ ఆఫ్ స్టేట్ లో ఇదేవిధంగా తీర్మానం జరిగింది. కాని అప్పుడు కేంద్రప్రభుత్వము తరపున, ఈ విషయము కన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీలో నిర్ణయింప బడుతుందనే హామీ ఇవ్వబడింది. 1947 లో మదరాసు శాసనసభలు భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. నూతన రాజ్యాంగ విధానము అమలు జరిపేటప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగుతుందని ఇండియా ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ హామీ కూడా ఇచ్చారు. అయి

నప్పటికి నూతన రాజ్యాంగ విధానపు ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రము పేర్కొన బడలేదు.

1947 నవంబరులో రాజ్యాంగసభలో జరిగిన చర్చల ఫలితంగా ఎస్. కె. ధార్ (అధ్యక్షుడు), డాక్టర్ పన్నాలాల్, జగత్ నారాయణ లాల్ గార్లు సభ్యులుగాగల ఒక కమిషనును రాజ్యాంగసభ అధ్యక్షుడు నియమించారు. కొత్త రాష్ట్రాలను వేటినైనా ఏర్పాటుచెయ్యవచ్చునా. చేస్తే వాటి సరిహద్దులు ఎలా ఉండాలి. వాటి ఆర్థిక, పరిపాలనా స్థితులు ఎలా వుంటాయి అనే విషయాలను సూచింపవలసిందని యీ కమిషనుకు తాఖీదు ఇవ్వబడింది.

ఈ కమిషను 1948 జూలై 19 తేదిన ప్రథమంగా సమావేశమై నవంబరు 21 న ఆఖరు సమావేశం జరిపింది. ఆంధ్రదేశంలో విశాఖ పట్టణం, మదరాసు, దక్షిణాన కాలికట్, మెంగళూరు, కోయంబత్తూరు బెంగుళూరు నగరాలలో సాక్షులను విచారించారు. మొత్తం ఆంధ్ర, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, కొంకణ, సి. పి. బీరారు ప్రాంతాలలో 6,700 మంది సాక్షులను విచారించి, దాదాపు 1,000 మహజర్లు అందు కొని, యీ కమిషను తమ నిర్ణయాన్ని డిసెంబరు 10 న రాజ్యాంగ సభ అధ్యక్షునికి సమర్పించారు. ఆ నివేదికలో వారు చెప్పిందేమంటే ఇండి యాలో భాషా ప్రాంతాలుగా రాష్ట్రాలను ఎప్పుడూ ఏర్పరచరాదని.

1948 డిసెంబరు 18 తేదిన అఖిలభారత కాంగ్రెసు మహాసభ, భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఏ. ఐ. సి సి. కి నివేది కను తయారు చెయ్యవలసిందిగా కోరుతూ, డాక్టర్ పట్టాభి సీతా రామయ్య, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్ గార్లను ఒక కమిటీగా నియమించింది.

నెహ్రూ-పటేల్ - పట్టాభి కమిటి తమ నివేదికను కాంగ్రెసు వర్కింగుకమిటికి 1949 ఏప్రిల్ 6 న సమర్పించారు, వర్కింగుకమిటి దానిని ఆమోదించింది. ఆ నివేదిక ప్రకారం, మదరాసు నగరం తమకు కావాలని ఆంధ్రులు కోరకుండా వున్నట్లయితే, ఆంధ్రరాష్ట్ర సరి హద్దుల విషయంలో పొరుగువారితో (అంటే,కర్నాటకులతోను తమిళుల

తోను) ఆంధ్రులు ఒక ఒడంబడికకు వచ్చినట్లయితే ఆంధ్ర రాష్ట్రం వీలైనంత త్వరలో ఏర్పాటు చెయ్యబడుతుంది.

నెహ్రూ - పటేల్ - పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ 1949 నవంబరు 7 తేదీన తమిళనాడు కాంగ్రెసుకమిటీ తీర్మానం చేసింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ 1949 నవంబరు 11 తేదీన విజయవాడలో సమావేశమై, పై సూత్ర ప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానంచేసింది. అయితే యీ కమిటీ మదరాసు నగరాన్ని కేంద్రప్రభుత్వాధీనంలో చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందని కోరింది.

మదరాసు రాష్ట్రప్రభుత్వంవారు, నవంబరు 12 తేదీన నెహ్రూ-పటేలు - పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆ ప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేశారు.

నవంబరు 16 తేదీన అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు సమావేశమై పై సూత్ర ప్రకారం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలను, బళ్లారి జిల్లాలలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ తాలూకాలను కలిపి ప్రత్యేక రాష్ట్రంగా వెంటనే ఏర్పాటు చేయవలసిందనీ, యీ రాష్ట్రానికి సరిహద్దులు నిర్ణయించడానికి ఒక కమిషనరును ఏర్పాటు చెయ్యవలసిందనీ కోరుతూ తీర్మానం చేశారు.

కేంద్రప్రభుత్వంవారు, యీ తీర్మానాన్ని అంగీకరించి, 1950 జనవరి 26 తేదీలోపల ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యడానికి వీలు అవుతుందా అనీ; రాష్ట్ర విభజన ఏర్పాట్లను చెయ్యడానికి ఒక సలహా సంఘాన్ని (విభజన కౌన్సిలును) ఏర్పాటు చేయవలసిందనీ సరిహద్దులను నిర్ణయించడానికి కమిటీని నియమించడంలో సూచనలను చెయ్యవలసిందనీ మదరాసు ప్రభుత్వాన్ని అడిగారు.

మదరాసు మంత్రిమండలి 1949 డిసెంబరు 6 తేదీన సమావేశమై కేంద్రప్రభుత్వం చేసిన సూచనలను పరిశీలించి యీ క్రింది నిర్ణయాలను తెలియపరచారు.

ఆంధ్రరాష్ట్రాన్ని 1950 జనవరి 26 తేదిలోపల ఏర్పాటు చెయ్యడం సాధ్యం కాదు. 1950 ఏప్రిల్ 1 తేదిలోపల మాత్రం సాధ్యం అవుతుంది.

"ఆంధ్రరాష్ట్ర సరిహద్దులను నిర్ణయించడానికి ముగ్గురు సభ్యులు గల కమిటీని నియమించవచ్చును. వీరిలో ఒక సభ్యుడు హైకోర్టు జడ్జిగాని రిటైరయిన హైకోర్టు జడ్జిగాని అయివుండాలి. ముగ్గురు సభ్యులు కూడా, మదరాసు ఒరిస్సా రాష్ట్రాలకు చెందనివారై వుండాలి."

తరువాత, డిసెంబరు 7 తేదిని మదరాసు మంత్రిమండలి మళ్ళీ సమావేశమై రాష్ట్రవిభజన ఏర్పాట్లను నిర్ణయించడానికి యీ క్రింది సభ్యులతో ఒక కౌన్సిలును నియమించారు.

ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజా (అధ్యక్షులు) పబ్లిక్ వర్క్సుమంత్రి ఎం. భక్తవత్సలం; విద్యామంత్రి కె. మాధవమీనన్, టి. టి. కృష్ణమాచారి, ఆరికమంత్రి బి. గోపాలరెడ్డి, మద్యనిషేధమంత్రి నీలం సంజీవరెడ్డి, టంగుటూరి ప్రకాశం, కళా వెంకటరావు.

ఈ కమిటీ తమ నివేదికను 1950 జనవరి 3 తేదిన మంత్రిమండలికి సమర్పించారు. కమిటీ నివేదికపట్ల, కమిటీ సభ్యులంతా, ఒక్క టంగుటూరి ప్రకాశంగారు తప్ప, ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ప్రకాశంగారు ప్రత్యేకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

మళ్లీ 1951 ఆగస్టు, సెప్టెంబరు మాసాలలో ఆంధ్రరాష్ట్రోద్యమం విజృంభణ పొందింది. ఆంధ్రరాష్ట్ర సంపాదనకు, ప్రభుత్వ దృష్టిని పూర్తిగా యీ వుద్యమంపై త్రిప్పడానికి శ్రీ స్వామి సీతారాంగారు (పూర్వాశ్రమంలో వీరిపేరు గొల్లపూడి సీతారామశాస్త్రి) 1951 ఆగస్టు 15 న ఉపవాసదీక్ష ప్రారంభించారు. వీరితోపాటు మరి ఆరుగురు 21 తేదిన నిరశనదీక్ష ప్రారంభించారు. వారిపేర్లు: శ్రీ సంపత్కుమార్, ఆర్. కె. రామలింగారెడ్డి, జరుగుల మద్దులేటి, నేతి చలపతి, తుమ్మల బసవయ్య, శ్రీమతి తుమ్మల దుర్గాంబగార్లు.

ఈ దీక్షతో ఆంధ్రదేశం అంతా నిద్రనుంచి మేల్కొని తన గతిని గురించి ఆలోచించింది. దేశమంతా అలజడి జరిగింది.

ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రదేశ కాంగ్రెసులూ, మదరాసు ప్రభుత్వమూ, జె. వి. పి. నివేదికను ఆమోదిస్తూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అంగీకరిస్తే భారత ప్రభుత్వం తదనుకూల చర్య జరుపుతుందని ప్రధాన మంత్రి ప్రకటించారు. ఆంధ్రదేశ కాంగ్రెసు సెప్టెంబరు 14 తేదిన నెల్లూరులో సమావేశమై, జె. వి. పి. నివేదిక ప్రకారం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి వెంటనే చర్యతీసుకోవలసిందిగా భారతప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి నెహ్రూగార్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖులుగా వున్నారనీ, తదనుకూల చర్య వీలైనంత శీఘ్రకాలంలో ప్రారంభింపబడుతుందనీ ఆచార్య వినోబా భావే తెలియపరచగా, సెప్టెంబరు 20 తేదీన స్వామి సీతారాం, తక్కిన దీక్షాపరులు తమ నిరశన దీక్షను విరమించారు.

కాని, తరువాత మళ్ళీ ప్రభుత్వం, యీ విషయంలో ఏమీ చర్య తీసుకోలేదు. ఇంతలో దేశమంతటా ఎన్నికలు జరగడం, కొత్త మంత్రివర్గాలు ఏర్పడటం జరిగింది. ఎంతకాలం అయినా, యీ విషయంలో ప్రభుత్వం ఏమీ చర్యతీసుకోనందున, స్వామి సీతారాం 1952 జూన్ నెలలో భీమవరంలో సత్యాగ్రహం ప్రారంభించారు. తరువాత ఈ సత్యాగ్రహం విరమింపబడింది.

1952 అక్టోబరు 19 న, గాంధీజీ ఆప్త అనుయాయులలో ఒకరూ, నెల్లూరుజిల్లా వాస్తవ్యులూ అయిన శ్రీ పొట్టి శ్రీరాములు గారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ, మదరాసులో, ఆ మరణ ప్రాయోపవేశం ప్రారంభించి, 58 రోజుల దీక్ష ఫలితంగా డిసెంబరు 15 తేది రాత్రి 11-27 నిముషములకు పరమపదం చెందారు. మరునాడు మొదలు నాలుగు రోజులు, ఆంధ్రదేశమంతటా బ్రహ్మాండమైన ఉద్రేకంతో ప్రజలు రైళ్లను ఆపుట, కొల్లగొట్టుట మొదలైన చర్యలు జరిపారు. నెల్లూరు, తాడేపల్లిగూడెం, అనకాపల్లి, వాల్తేరులలో పోలీసు కాల్పులు జరగడం, కొంతమంది చనిపోవడంకూడా సంభవించింది.

1952 డిసెంబరు 19 వ తేదీన పార్లమెంటు ఉభయ సభలలో ప్రధాన మంత్రి ఒక ప్రకటనచేస్తూ, మదరాసు రాష్ట్రంలోని నిర్వివాద

తెలుగు ప్రాంతాలతో, చెన్నపట్టణం మినహాగా, వీలైనంత త్వరలో ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చేయబడుతుందనీ, ఈ ఏర్పాటుకు అవసరమైన చర్యలనుసూచించడానికిగాను రాజస్తాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కె. ఎన్. వాంచూ నియమించబడినారని తెలియజేశారు.

రాష్ట్ర నిర్మాణ సందర్భంలో పరిష్కరించవలసిన ఆర్థికాది విషయములను గురించి పరిశీలనజరపడానికి, జస్టిస్ వాంచూ 1953 జనవరి 7 తేదీన మదరాసు వచ్చారు. జనవరి 20 నుంచి 26 వరకు ఆంధ్ర జిల్లాలలో పర్యటన చేశారు. దాదాపు 2,000 మహాజర్లను స్వీకరించారు. ఇండియా ప్రభుత్వానికి పంపవలసిన రిపోర్టును పూర్తి చేసుకొని, ఫిబ్రవరి 5 తేదీన మదరాసునుంచి బయలుదేరి, 7 తేదీన ఢిల్లీ చేరి, అనాడే ప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించారు.

1953మార్చి 19 తేదీన, మదరాసు అసెంబ్లీలోని ఆంధ్ర కాంగ్రెసు సభ్యులు తమ నాయకుడుగా శ్రీ నీలం సంజీవరెడ్డిని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

ఆంధ్రరాష్ట్రనిర్మాణాన్ని గురించి, 1653 మార్చి 26 తేదీన పార్లమెంటులో ప్రధానమంత్రి యీ క్రింది ప్రకటన చేశారు.

ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1 తేదీన ఏర్పాటుచేయబడుతుంది.

రాష్ట్రరాజధాని రాష్ట్ర సరిహద్దులలో నేవుంటుంది. రాజధానిని ఒక్కడ పెట్టునేదీ, ఆంధ్రశాసన సభ్యులే నిర్ణయించుకుంటారు. రాష్ట్రశాసనసభ, హైకోర్టును ఎక్కడపెట్టేదీ నిర్ణయించేవరకూ, మదరాసు హైకోర్టే, ఆంధ్రరాష్ట్రానికికూడా హైకోర్టుగా పని చేస్తుంది.

ఆంధ్రరాష్ట్రానికి లెజిస్లేటివు కౌన్సిలు ఉండదు. ప్రస్తుతం మదరాసు అసెంబ్లీలోని ఆంధ్రజిల్లా సభ్యులతో ఆంధ్రరాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ ఏర్పడుతుంది.

ఆంధ్రరాష్ట్రం యీ క్రింది ప్రాంతాలలో ఏర్పడుతుంది: శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, అనంతపురం, కడప, కర్నూలు. చిత్తూరు జిల్లాలు, బళ్ళారి జిల్లాలోని, ఆదోని, ఆలూరు, రాయదుర్గ తాలూకాలు.

బళ్లారి జిల్లాలోని సిరుగుప్ప, హోసపేట, సొండూరు, హర్పన హళ్ళి, హడగళి, కడ్లిగి తాలూకాలు మైసూరు రాష్ట్రంతో కలిపివేయ బడుతవి. బళ్లారి తాలూకాల విషయం తరువాత నిర్ణయింపబడుతుంది.

ఆంధ్రరాష్ట్ర రాజధానిని ఎక్కడ పెట్టుకొనేది, జూలై 1 తేది లోపల ఆంధ్రశాసన సభ్యులు నిర్ణయించి, కేంద్రప్రభుత్వానికి తెలియ పరచాలి.

బళ్లారి తాలూకా భవిష్యత్తును గురించి ప్రభుత్వానికి సలహా ఇవ్వడానికి హైదరాబాదు ప్రధాన న్యాయమూర్తి శ్రీ లక్ష్మీశంకర్ మిశ్రాను కేంద్రప్రభుత్వం నియమించింది. ఆయన బళ్ళారిలో విచా రణ జరిపి ఆ తాలూకాను మైసూరు రాష్ట్రంలో కలిపివెయ్యాలని సలహా యిచ్చారు. ఆ సలహాను, 1953 మే 20 తేదిన కేంద్ర ప్రభుత్వం ఆమో దించింది.

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధానిని ఎక్కడ పెట్టాలనే విష యాన్ని నిర్ణయించడానికి, మదరాసు శాసనసభలోని ఆంధ్ర సభ్యుల సమావేశం 1953 జూన్ 1 నుంచి 5 వరకు జరిగింది. ఈ సభకు శ్రీ టంగుటూరి ప్రకాశం అధ్యక్షత వహించారు. రాజధానిని కర్నూ లులో పెట్టాలనే తీర్మానం, యీ సమావేశంలో నెగ్గింది. గుంటూరు- విజయవాడలో పెట్టాలనే తీర్మానం, విజయవాడలో పెట్టాలనే తీర్మానం ఓడిపోయినవి.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణచట్టపు ముసాయిదాపై మదరాసు రాష్ట్ర అసెంబ్లీ చర్చ 1953 జూలై 14 న ప్రారంభమైంది, జులై 27 న పూర్తి అయింది. లెజిస్లేటివ్ కౌన్సిలులో చర్చ జులై 29 తేదిన పూర్తి అయింది.

ఈ బిల్లు పార్లమెంటు లోక్ సభలో 1953 ఆగష్టు 10 తేదిన ప్రవేశ పెట్టబడింది. ఆగష్టు 26 తేదిన ప్యాసయింది.

రాజ్య సభలో ఆగష్టు 31 తేదిన ప్రవేశ పెట్టబడింది. సెప్టెంబరు 12 న ప్యాసయింది.

బిల్లుకు రాష్ట్రపతి అంగీకారం, సెప్టెంబరు 14 న ఇవ్వబడింది.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణపు ఏర్పాటులలో, ఆంధ్రరాష్ట్రం తరఫున మదరాసు రాష్ట్రంనుంచి ఉద్యోగుల పంపిణీ మొదలైన కార్యాలను నెరవేర్చడానికి స్పెషల్ ఆఫీసరుగా శ్రీ చందులాల్ మాధవలాల్ త్రివేది నియమించబడినారు. వీరు 1953 ఆగస్టు 6 తేదీన మదరాసుకు వచ్చారు. వీరికి సలహాదారులుగా పనిచెయ్యడానికి శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ గౌతు లచ్చన్నగార్లు నియమింపబడినారు. వీరి సలహాలతో, రాష్ట్ర విభజనలో ఆంధ్రరాష్ట్రపు వంతు పంపకములను జరిపించుటలో 1953 సెప్టెంబరు 30 వరకు శ్రీ త్రివేది నిమగ్నులై వున్నారు. అక్టోబరు 1 నుంచి, ఆంధ్రరాష్ట్ర గవర్నరుగా వీరే నియమింపబడినారు.

1953 అక్టోబరు 1 తేదిన ఆంధ్రరాష్ట్రం అవతరించింది. రాష్ట్ర స్థాపనను, తాత్కాలిక రాజధాని కర్నూలులో, భారత ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ జరిపారు.

ఆంధ్రరాష్ట్ర హైకోర్టును తాత్కాలికంగా గుంటూరులో స్థాపించాలనే ప్రతిపాదన, రాష్ట్ర శాసనసభలో 1954 మార్చి 1 తేదీన ఆమోదింపబడింది. ఆ తీర్మానానికి అనుకూలంగా 67 మంది, ప్రతికూలంగా 66 మంది ఓటు చేశారు.

1953 అక్టోబరు 1 తేదీన, రాష్ట్రస్థాపనతోపాటు, శ్రీ టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రిగా, నీలం సంజీవరెడ్డి, కోటిరెడ్డిగారి కోటిరెడ్డి, తెన్నేటి విశ్వనాథం, దామోదరం సంజీవయ్యగార్లు, తక్కిన మంత్రులుగా, మంత్రిమండలి పదవీస్వీకారం చేసింది. అక్టోబరు 5 న పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, బలుసు ప్రభాకర పట్టాభి రామారావుగార్లు మంత్రులుగా నియమింపబడినారు.

1953 నవంబరు 7 తేదీన శ్రీ గౌతు లచ్చన్నగారు మరొక మంత్రిగా నియమింపబడినారు. వీరికి వ్యవసాయము, అడవులు, హరిజనోద్ధరణ, మాజీ సైనికుల పునరావాసము శాఖలు ఇవ్వబడినవి. కాని, రాజధాని స్థాపన విషయమై వీరిపార్టీ (కృషికార్ లోక్ పార్టీ) కిని, మంత్రి మండలికిని అంగీకారం కుదరనందున, శ్రీ గౌతు లచ్చన్నగారు తమ మంత్రిపదవికి 1954 జనవరి 4 వ తేదీన రాజీనామా ఇచ్చారు. వీరి

అధికారంలో వున్న శాఖలు మళ్ళీ, శ్రీ పి. తిమ్మారెడ్డిగారికి ఇవ్వ బడినవి.

ఆంధ్రరాష్ట్రానికి శాసనసభ, ఒక అసెంబ్లీమాత్రమే. కౌన్సిలు లేదు. రాష్ట్రం 1953 అక్టోబరు 1 తేదిన ఏర్పడినప్పుడు, రాష్ట్ర అసెంబ్లీకి కొత్తగా ఎన్నికలు జరగలేదు. రాష్ట్ర విభజన జరగక పూర్వం, మదరాసు అసెంబ్లిలో, తెలుగు జిల్లాల తరఫున ఏ సభ్యులు వున్నారో, ఆ సభ్యులతోనే ఆంధ్రరాష్ట్ర అసెంబ్లి ఏర్పడాలని నిర్ణయింపబడింది. అప్పటి మదరాసు అసెంబ్లిలో తెలుగు జిల్లాలనుంచి 140 మంది సభ్యులు వున్నారు. ఆ సభ్యులతోనే ఆంధ్రరాష్ట్ర అసెంబ్లి ఏర్పడింది.

ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ ప్రథమ సమావేశం, కర్నూలులో 1953 నవంబరు 23 తేదిన జరిగింది.

మద్యనిషేధం విషయంలో కొంత రామమూర్తి కమిటీ చేసిన సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించాలని, రాష్ట్ర శాసనసభ 1954 మే నెలలో చేసిన తీర్మానాన్ని ప్రభుత్వం అమలుజరుపనందున, ప్రభుత్వంపై విశ్వాసరాహిత్య తీర్మానాన్ని 1954 నవంబరు 4 తేదిన శాసన సభలో శ్రీ గౌతు లచ్చన్న ప్రతిపాదించారు. నవంబరు 6 తేదిన యీ తీర్మానం నెగ్గింది. తీర్మానానికి అనుకూలంగా 69 మంది, ప్రతి కూలంగా 68 మంది ఓటుచేశారు. విశ్వాసరాహిత్య తీర్మానం నెగ్గినందున, అనాడే ప్రకాశం మంత్రివర్గం రాజీనామా ఇచ్చింది. వీరి రాజీనామాను 1954 నవంబరు 15 తేదిన గవర్నరు ఆమోదించారు. రాష్ట్ర పరిపాలనను, ప్రెసిడెంట్ తమ చేతిలోకి తీసుకొని, తమ తరఫున గవర్నరును పరిపాలన సాగించవలసినదిగా నియమిస్తూ నవంబరు 15 తేదిన ప్రకటన చేశారు.

రాష్ట్ర శాసనసభ అనాడే రద్దుచేయబడింది. మళ్ళీ శాసనసభకు ఎన్నికలు 1955 ఫిబ్రవరి 11 తేదిన ఆరంభమై 27 వ తేదీతో ముగిసినవి. కాంగ్రెసువారు అధికసంఖ్యలో గెలిచారు. కాంగ్రెసు పార్టీ నాయకుడుగా 1955 మార్చి 28 తేదిన బెజవాడ గోపాలరెడ్డిగారు ఎన్నుకోబడినారు. 1955 మార్చి 28 తేదిన, గోపాలరెడ్డిగారు ముఖ్య

మంత్రిగా మొత్తం ఎనిమిదిమంది మంత్రులతో, మంత్రిమండలి ఏర్పాటు చేయబడినది. ఆ ఎనిమిది మంత్రులలో, నీరుకొండ రామారావు పదవి స్వీకరించిన రెండు నెలల లోపునసే మరణించారు. ఆ స్థానంలో వ్యవసాయ మంత్రిగా, కందుల ఓబులరెడ్డిగారు 1956 మార్చి 15 తేదిన నియమించ బడినారు.

తరువాత 1956 నవంబరు 1 తేదిన భారతదేశంలోని రాష్ట్రాల పునర్నిర్మాణంతో పాటు, ఆంధ్ర రాష్ట్రం కూడా, అంతవపూర్వం హైదరాబాద్ రాష్ట్రంలోవున్న తెలుగుప్రాంతాల కలయికతో విశాలమైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పడింది.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలోని కాంగ్రెసుపార్టి సభ్యులు శ్రీ నీలం సంజీవరెడ్డిని నాయకుడుగా ఎన్నుకొన్నందున, రాష్ట్ర ముఖ్యమంత్రిగా శ్రీ సంజీవరెడ్డి నియమించ బడినారు.

## తెలంగాణాకు రక్షణలు

ఆంధ్రప్రదేశ్‌లో చేరడానికి తెలంగాణా నాయకులు తమప్రాంత పరిపాలన విషయంలో తమకు కొన్ని రక్షణలను కోరారు. ఈ రక్షణలను ఇవ్వడంలో ఆంధ్ర, తెలంగాణా నాయకులకు జరిగిన ఒప్పందం ఇది.

ఆంధ్రప్రదేశ్ అంతా ఒకే రాష్ట్రం అయినా, పరిపాలనలో కొన్ని ప్రత్యేక విషయాలకు సంబంధించినంత వరకు, తెలంగాణా ప్రాంతం ఒక ప్రత్యేక ప్రాంతంగా పరిగణింపబడుతుంది.

తెలంగాణా ప్రాంతానికి, రాష్ట్రశాసనసభలో ఒక ప్రాంతీయ స్థాయీ సంఘం వుంటుంది. తెలంగాణా ప్రాంతం నుంచి శాసనసభకు ఎన్నుకోబడిన సభ్యులంతా, దీనిలో సభ్యులుగావుంటారు. ఈ ప్రాంతీయ సంఘానికి అధ్యక్షులుగా కె. అచ్యుతరెడ్డి 1958 మార్చి 31 న ఎన్నుకో బడినారు.

ఈ సంఘ పర్యవేక్షణలో వుండే పరిపాలనా విషయాలు ఇవి : 1. అభివృద్ధి కార్యక్రమాలు; 2. స్థానిక పరిపాలన, అంటే మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు మొదలైన వాటి అధికారాలు, వాటి నిర్మాణం;

3. ప్రజారోగ్యం, గ్రామ పారిశుధ్యం, స్థానిక వైద్యశాలలు; 4. ప్రాథమిక, సెకండరీ విద్య; 5. తెలంగాణాలోని విద్యాసంస్థలలో విద్యార్థులను చేర్చుకోవడంలో చేసే ఏర్పాట్లు; 6 మద్య నిషేధము; 7. వ్యవసాయభూమి అమ్మకము, 8. గృహపరిశ్రమలు, చిన్నపరిశ్రమలు; 9. వ్యవసాయము, సహకారసంఘాలు, మార్కెట్లు, సంతలు.

ఈపై విషయాలను గురించి, ఏవైనా శాసనాలను చెయ్యాలంటే వాటిని రాష్ట్రప్రభుత్వం, తెలంగాణా స్థాయీసంఘానికి తెలియపరచి, ఆ సంఘం సమ్మతించినమీదటనే, శాసనం చెయ్యాలి. స్థాయీసంఘ సలహాలను, రాష్ట్రశాసనసభ, రాష్ట్రప్రభుత్వం, సాధారణంగా ఆమో దిస్తాయి. తగాదా వచ్చినట్లయితే, ఆ విషయమై రాష్ట్ర గవర్నరు ఎంత చెపితే అంత.

ఈ ఒప్పందం పది సంవత్సరాలు అమలులో వుంటుంది. ఈలోగా ఉభయుల సమ్మతిమీద ఏమైనా మార్పులు చేసుకోవచ్చును.

రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాలలో నియామకాలు జరిగేటప్పుడు, తెలంగాణా ప్రాంతంలోని ఉద్యోగాలు, ఆ ప్రాంతంవారికే ఇవ్వబడు తాయి. ఈ ఒప్పందం అయిదేళ్లు అమలులో వుంటుంది.

తెలంగాణా ప్రాంతంలో పరిపాలనా విషయంలో ఉర్దూభాష 1956 నవంబరు 1 కి పూర్వం ఎలా వాడుకలో వున్నదో, అలాగే 1956 నవంబర్ 1 నుంచి అయిదేళ్ళ దాకా వాడుకలో వుండడానికి సౌకర్యాలు వుంటవి.

పాత ఆంధ్రరాష్ట్రంతో, హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణా ప్రాంతం (అంటే, హైదరాబాద్, మెదక్, నిజామాబాద్, కరీంనగిర్, వరంగల్, ఖమ్మం, నల్లగొండ, మహబూబ్ నగర్ జిల్లాలూ, అదిలాబాద్ జిల్లాలోని కొన్ని రెవిన్యూ విభాగాలూ కలవడంతో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంఏర్పడింది. ఈ రాష్ట్రపు విస్తీర్ణం 1,06,041; చ. మైళ్లు. జనాభా, 3, 12,60, 133.

# ఆంధ్ర చరిత్రలో కొన్ని ఘట్టాలు

నైజాం నవాబుల పరిపాలన 1724.

గుంటూరు మినహా కోస్తా జిల్లాలను ఇంగ్లీషువారికి శాశ్వతంగా నిజాము నవాబు కౌలుకు యిచ్చింది-1766.

గుంటూరు జిల్లాను కూడా ఇంగ్లీషువారికి యిచ్చింది-1788.

కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలను ఇంగ్లీషువారికి నైజాము నవాబు దత్తం చేసినది-1800.

ఆర్కాటు నవాబు నెల్లూరు జిల్లాను ఇంగ్లీషువారికి దానం చేసింది. 1801.

నిజాము నవాబుకు రు. 116⅔ ఇక్షులుయిచ్చి ఉత్తర సర్కారులపై హక్కులను ఇంగ్లీషువారు కొన్నది-1823.

తొలి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు ప్రకటన-1835

గోదావరి ఆనకట్ట నిర్మాణం-1851.

కృష్ణ ఆనకట్ట నిర్మాణం-1855.

బందరులో ఆంధ్ర మహాసభ-1908.

ఉస్మానియా యూనివర్సిటీ స్థాపన-1918.

ఆంధ్ర యూనివర్సిటీ స్థాపన 1926.

జోగిపేటలో తెలంగాణా ఆంధ్ర మహాసభ-1930.

హైదరాబాదులో పోలీసు చర్య-1948.

హైదరాబాదులో తొలి ప్రజామంత్రివర్గం-1952.

అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి నిర్యాణం-1952.

ఆంధ్ర రాష్ట్రావతరణం-1953.

శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ స్థాపన-1954.

విశాలాంధ్రావతరణ 1956, నవంబరు 1.

# ఆంధ్రప్రదేశ్ వివరాలు

ఆంధ్రప్రదేశ్ ఉత్తరాన ఒరిస్సా, మధ్యప్రదేశ్ బొంబాయి రాష్ట్రాలతోను, పశ్చిమాన బొంబాయి రాష్ట్రంతోను, దక్షిణాన మద

రాను, మైసూరు రాష్ట్రంతోను ఎల్లలు కలిగివున్నది. తూర్పు సముద్రమే యీ రాష్ట్రానికి ఎల్ల. ఆంధ్రప్రదేశ్ సముద్రతీరం 540 మైళ్ళ పొడవు.

రాష్ట్రం వైశాల్యం 1,06,041; చదరపు మైళ్ళు. జనాభా, 3,12,60,133.

రాష్ట్రంలోని పర్వతశ్రేణిలో ఎత్తయినది, శ్రీకాకుళం జిల్లాలోని మహేంద్రగిరి. ఈ పర్వతపు ఎత్తు 4,920 అడుగులు; పాలకొండలు 4000 అడుగుల ఎత్తు.

మార్చినుంచి మే అంతంవరకు ఎండకాలము, జూన్‌నుంచి అక్టోబరు వరకు వానకాలము, నవంబరునుంచి ఫిబ్రవరి వరకు చలికాలము, ఈ రాష్ట్రంలోని శీతోష్ణ పరిస్థితులు. ఎండకాలంలో కృష్ణా, గుంటూరు, ఖమ్మమెట్టు జిల్లాలలోని వేడిమి చాలా అధికం. మే నెలలో ఇక్కడ వేడిమి 120 డిగ్రీలవరకు వుంటుంది.

## పర్వతశ్రేణి, అడవులు

ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తర భాగాన మహేంద్రగిరి పర్వతం, పాలకొండలు, సింహాచల పర్వతాలు వున్నాయి, గోదావరి తీరాన భద్రాచలం, పాపికొండలు, కృష్ణానది తీరాన నందికొండ, శ్రీశైలపర్వతం వున్నాయి. రాష్ట్రం దక్షిణప్రాంతంలో తిరుపతి కొండలు, పశ్చిమాన సహ్యాద్రి పర్వతాలు వున్నాయి.

ఈ పర్వత శ్రేణులలోను, నదీతీర ప్రాంతాలలోను, ఉత్తరాన శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలోను, గోదావరి జిల్లా, చిత్తూరు, కర్నూలు, వరంగల్, ఆదిలాబాద్, కరీంనగర్, మహబూబ్‌నగర్, నిజామాబాద్, ఖమ్మమ్మెట్ జిల్లాలలోను దట్టమైన అడవులు వున్నాయి.

## న దు లు

గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్న నదులుకాక, ప్రాణహిత, మంజీర, మున్నేరు, దిండి, మత్కుల్, మూసీ, పాలేరు, బాహుద, వంశధార, చంపావతి, గోస్తని, శారద, ఏలేరు, తాండవ, సువర్ణముఖి నదులు ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా చెప్పదగినవి.

## జిల్లాల విస్తీర్ణం : చ. మైళ్ళలో

అనంతపురం : 7,387
ఆదిలాబాద్ : 6,242
కడప : 5,923
కరీంనగర్ : 4;504
కర్నూలు : 9,215
కృష్ణా : 3,496
ఖమ్మమెట్ : 4,232
గుంటూరు : 5 795
చిత్తూరు: 5,931
తూర్పుగోదావరి : 5,768
నల్లగొండ : 5,385
నిజామాబాద్ : 3,203
నెల్లూరు : 7,942
పడమటి గోదావరి : 2, 988
మహబూబ్ నగర్ : 6,833
మెదక్ : 3,804
వరంగల్ : 5,326
విశాఖపట్టణం : 5,201
శ్రీకాకుళం : 3,902
హైదరాబాద్ : 2,904

జిల్లాలన్నిటిలోను ఎక్కువ వైశాల్యంగలది, కర్నూలు; తక్కువ వైశాల్యం గలది, హైదరాబాద్.

## జిల్లాల జనాభా

అనంతపురం : 14,83,591
ఆదిలాబాద్ : 9,02,522
కడప : 11,16,731
కరీంనగర్ : 14,28,168
కర్నూలు: : 16,18,621
కృష్ణా : 17,79,484
ఖమ్మమెట్ : 7,00,006
గుంటూరు ; 25,49,996
చిత్తూరు : 18,10,577
తూర్పుగోదావరి : 24,14,808
నల్లగొండ : 12,54,810
నిజామాబాద్ : 7,43,158
నెల్లూరు : 17,95, 632
పడమటి గోదావరి : 16,97,727
మహబూబ్‌నగర్ : 11,86.496
మెదక్ : 10,27.293
వరంగల్ : 13,25.984
విశాఖపట్టణం : 26,74,698
శ్రీకాకుళం : 21,43,136
హైదరాబాద్ : 15,11,360

జిల్లాలన్నిటిలోకి ఎక్కువ జనాభాగలది గుంటూరు, తక్కువ జనాభాగలది, ఖమ్మమెట్.

## రాష్ట్రంలో ముఖ్య నగరముల జనాభా

హైదరాబాద్ : 10,85,722
కర్నూలు : 60,110

విజయవాడ : 1,61,198
వరంగల్ 1,33,130
గుంటూరు : 1,28,255
విశాఖపట్టణం : 1,08,402
నెల్లూరు : 1,06,603
రాజమండ్రి : 1,05,276
కాకినాడ : 1,00,054
ఏలూరు : 87,060
మచిలీపట్టణం : 72,061
విజయనగరం : 67,156
తెనాలి : 57,980
నిజామాబాద్ : 55,195
ఆదోని : 52,508
కొత్తగూడెం : 50,195
కడప : 37,446
ఖమ్మమ్మెట్ : 28,251
మహబూబ్‌నగర్ : 23,829
కరీంనగర్ : 23:826
నల్లగొండ : 22,183

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 26,450 గ్రామాలున్నాయి. నగరాలు పట్టణాలు మొత్తం, 293. పట్టణాలలో నివసిస్తున్న జనాభా, 54,38,454; గ్రామాలలో నివసిస్తున్న జనాభా, 2,58,21,679.

రాష్ట్ర జనాభాలో సుమారు 211 లక్షల మంది వ్యవసాయ వృత్తిపై ఆధారపడి వున్నారు. వీరిలో దాదాపు 122 లక్షల మందికి స్వంతభూములు వున్నాయి. 34 లక్షల మందికి భూములులేవు. వీరు ఇతరుల భూములను తీసుకొని సేద్యం చేస్తున్నారు. 57 లక్షల మంది పొలాలలో కూలిపనిచేసి జీవిస్తున్నారు. 6 లక్షల మంది వ్యవసాయ కౌలుపై జీవిస్తున్నారు.

రాష్ట్రంలోని ప్రజలలో గ్రామాలలోనూ, పట్టణాలలోను ఎంత మంది నివసిస్తూవున్నది, జిల్లాలవారీగా యీ క్రింది పట్టీవలన తెలుస్తుంది.

| జిల్లా | గ్రామాలలో | పట్టణాలలో |
|---|---|---|
| అనంతపురం | 12,42,295 | 2,41,296 |
| ఆదిలాబాద్ | 7,08,829 | 1,22,771 |
| కడప | 10,27,502 | 1,34,229 |
| కరీంనగర్ | 13,00,018 | 1,28,150 |
| కర్నూలు | 13,87,915 | 2,80 706 |
| కృష్ణ | 14,09,392 | 3,70,092 |

| | | |
|---|---|---|
| ఖమ్మం | 5,79,760 | 1,20,246 |
| గుంటూరు | 20,48,048 | 5,10,921 |
| చిత్తూరు | 16,41,043 | 1,69,334 |
| తూర్పు గోదావరి | 19,54,664 | 4,60,146 |
| నల్లగొండ | 11,49,575 | 1,03,232 |
| నిజామాబాద్ | 6,96,206 | 1,37,405 |
| నెల్లూరు | 15,91,993 | 2,03,639 |
| పడమటి గోదావరి | 13,66,458 | 3,31,269 |
| మహబూబ్ నగర్ | 12,81,719 | 1,56,160 |
| మెదక్ | 89,18,184 | 1,06,056 |
| వరంగల్ | 11,35,028 | 1,90,956 |
| విశాఖపట్టణం | 17,67,840 | 3,04,858 |
| శ్రీకాకుళం | 19,32,351 | 1,09,785 |
| హైదరాబాద్ | 6,32,831 | 11,85,203 |

## పశు సంపద

ఆంధ్ర ప్రదేశ్‌లో గల పశుసంపద వివరాలు :

| | |
|---|---|
| ఆవులు : | 1,09,58,000 |
| గేదెలు : | 57,43,000 |
| గొర్రెలు : | 74,28,000 |
| మేకలు : | 36,01,000 |
| కోళ్లు | 11,40,58,000 |

# వ్యవసాయపు భూమి

1959

| వివరం | ఎకరాలు |
|---|---|
| రాష్ట్రంలో మొత్తం భూమి : | 6,73,29,000 |
| దీనిలో అడవి : | 1,40,26,000 |
| సాగుకు వీలులేనిభూమి : | 79,24,000 |

| | |
|---|---|
| సాగుకు వీలయే బంజరు : | 42,04,000 |
| పంట వేసినభూమి | 2,93,81,000 |
| నీటిసాగు వున్నభూమి | 66,80,000 |

## పంటలు

ఆంధ్రప్రదేశ్‌లో 3,04,00,000 ఎకరాలలో ఆహార పదార్థాలు పండించబడుతున్నవి. దీనిలో 2,68,92,100 ఎకరాలలో ఆహార ధాన్యాలు, 35,07,900 ఎకరాలలో పప్పుదినుసులు పండించబడుతున్నవి.

వరి :

| సంవత్సరం: | పంట వేసినభూమి, ఎకరాలు: | బియ్యం పంట టన్నులు |
|---|---|---|
| 1955-56 : | 67,28,000 : | 30,46,000 |
| 1956-57 : | 71,73,000 : | 33,01,000 |
| 1957-58 : | 69,12,300 : | 32,93,800 |
| 1958-59 : | 72,37,300 : | 36,16,000 |

### బియ్యపు ఫాక్టరీలు

1958 అక్టోబర్ 1 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో లైసెన్సులు పొందిన బియ్యపు ఫాక్టరీలు 4095 వున్నాయి. వీటిలో 1217 ఫాక్టరీలు 1957 ఏప్రిల్ 1 తేది తర్వాత ప్రారంభించబడినవి.

గోధుమ :

ఆంధ్రప్రదేశ్‌లో గోధుమపంట ముఖ్యంగా హైదరాబాద్, నిజామాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లాలలోనే.

| సంవత్సరం : | ఎకరాలు | | పంట టన్నులు |
|---|---|---|---|
| 1956-57 : | 58,100 | : | 3,500 |
| 1957-58 : | 53,700 | : | 4,500 |
| 1958-59 : | 48,700 | : | 3,600 |

జొన్న :

| | | | |
|---|---|---|---|
| 1956-57 : | 63,87,700 | : | 11,03,500 |
| 1957-58 : | 61,79,600 | : | 11,77,900 |
| 1958-59 : | 54,62,000 | : | 11,09,300 |

సజ్జ :

| సంవత్సరం | పంట వేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 15,95,000 : | 3,08,000 |
| 1957-58 : | 16,13,200 : | 4,24,800 |
| 1958-59 : | 15,71,700 : | 3,38,300 |

వరిగ :

| సంవత్సరం | పంట వేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 25,35,100 : | 3,96,700 |
| 1957-58 : | 26,43,100 : | 3,64,400 |
| 1958-59 : | 20,64,600 : | 2,96,300 |

రాగులు :

ఆంధ్రప్రదేశ్‌లో రాగులు ఎక్కువగా పండేది, శ్రీకాకుళం, విశాఖపట్టణం, నెల్లూరు, అనంతపురం, కడప, చిత్తూరు, మహబూబ్ నగర్ జిల్లాలలోనే. రాష్ట్రం మొత్తం పంటలో నూటికి 84 వంతులు, యీ ఏడు జిల్లాలలోనే పండుతున్నది.

| సంవత్సరం : | పంట వేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 7 59 000 : | 2,86,100 |
| 1957-58 : | 7,98,900 : | 2.69,800 |
| 1958-59 : | 7,63,500 : | 2,69,500 |

మొక్కజొన్న :

ఆంధ్రప్రదేశ్‌లో మొక్కజొన్న ఎక్కువగా పండేది, నిజామాబాద్, మెదక్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలోనే. రాష్ట్రం మొత్తం పంటలో నూటికి 89 వంతుల పంట, యీ నాలుగు జిల్లాలలోనే పండుతున్నది.

| సంవత్సరం : | పంట వేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 4,05,300 : | 93,000 |
| 1957-58 : | 4,71,200 : | 1,53,700 |
| 1958-59 : | 4,73,400 : | 1,09,000 |

బార్లీ :

ఆంధ్రప్రదేశ్‌లో బార్లీపంట ముఖ్యంగా హైదరాబాద్, మెదక్, మహబూబ్ నగర్ జిల్లాలలోనే.

| సంవత్సరం : | పంటవేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 8,400 : | 1,300 |
| 1957-58 : | 9,500 : | 1,400 |
| 1958-59 : | 9,100 : | 1,300 |

కందులు :

| సంవత్సరం : | పంటవేసినభూమి, ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 4,09,500 : | 43,600 |
| 1957-58 : | 3,66,100 : | 37,400 |
| 1958-59 : | 5,32,200 : | 36,900 |

శనగలు :

శనగపంట ముఖ్యంగా శ్రీకాకుళం, విశాఖపట్టణం, నెల్లూరు, చిత్తూరు, హైదరాబాద్, ఖమ్మం, వరంగల్, పశ్చిమగోదావరి, కర్నూలు, మెదక్, గుంటూరు, నిజామాబాద్ జిల్లాలలో వేయబడుతున్నది.

| సంవత్సరం : | పంటవేసినభూమి ఎకరాలు : | పంట (టన్నులలో) |
|---|---|---|
| 1956-57 : | 2,92,500 : | 33,900 |
| 1957-58 : | 2,63,400 : | 31,600 |
| 1958-59 : | 2,60,500 : | 29,900 |

బంగాళాదుంపలు :

ఆంధ్రప్రదేశ్‌లో బంగాళాదుంపలు ఎక్కువగా పండేది, హైదరాబాద్, మెదక్ జిల్లాలలో. పంట వివరాలివి:

| సంవత్సరం : | పంటవేసినభూమి ఎకరాలు : | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 1518 : | 2,547 |
| 1957-58 : | 991 : | 1,536 |
| 1958-59 : | 600 : | |

ప్రత్తి :

ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్తి పంట ఎక్కువగా పండేది, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం, కడప, ఆదిలాబాద్ జిల్లాలలోనే.

రాష్ట్రపు మొత్తపు పంటలో నూటికి 93 వంతులు, యీ ఆరు జిల్లాలలోనే పండుతుంది.

| సంవత్సరం : | పంట వేసినభూమి ఎకరాలు : | పంట, బేళ్ళు |
|---|---|---|
| 1956-57 : | 10,13,900 : | 1,35,400 |
| 1957-58 : | 9,39,000 : | 1,26,600 |
| 1958-59 : | 9,31,600 : | 1,21,400 |

(ఒక బేలు 392 పౌనులు.)

జనుము :

ఆంధ్రరాష్ట్రంలో జనుము ఎక్కువగా పండే జిల్లాలు విశాఖపట్టణం, శ్రీకాకుళం.

| సంవత్సరం : | పంట వేసినభూమి, ఎకరాలు | పంట, బేళ్లు |
|---|---|---|
| 1956-57 : | 1,25,000 : | 2 60,900 |
| 1957-58 : | 1,21,200 : | 2,48,400 |
| 1958-59 : | 93,000 : | 1,89,200 |

(ఒక బేలు 400 పౌనులు)

ఆముదము :

ఆంధ్రప్రదేశ్‌లో ఆముదపుపంట ఎక్కువగా పండేది, హైదరాబాద్, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలలోనే. రాష్ట్రం మొత్తం పంటలో నూటికి 71 వంతులు యీ మూడుజిల్లాలలోనే పండుతున్నది,

| సంవత్సరం : | పంట వేసినభూమి ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 8,48,200 : | 62,500 |
| 1957-58 : | 8,06.800 : | 47,400 |
| 1958-59 : | 6,65,300 : | 46,900 |

నువ్వులు :

ఆంధ్రప్రదేశ్‌లో నువ్వులు ఎక్కువగా పండేది, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కర్నూలు, హైదరాబాద్, మహబూబ్‌నగర్, కరీంనగర్, అదిలాబాద్, జిల్లాలలో.

| సంవత్సరం : | పంటవేసిన భూమి ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 581,600 : | 55,700 |
| 1957-58: | 5,94,000 : | 45,300 |
| 1958-59 : | 5,86,200 : | 48,700 |

నీరుల్లి :

ఆంధ్రప్రదేశ్‌లో నీరుల్లి ఎక్కువగా పండేది, శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, గుంటూరు, అనంతపురం, కడప, హైదరాబాద్, మెదక్, మహబూబ్‌నగర్ జిల్లాలలోనే. రాష్ట్రపు మొత్తపు పంటలో నూటికి 85 వంతులు, యీ పది జిల్లాలలోనే పండుతున్నది,

| సంవత్సరం : | పంటవేసిన భూమి ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 43,400 : | 1,57;400 |
| 1957-58 : | 37,300 : | 1,40,300 |
| 1958-59 : | 36,400 : | 1,31,400 |

చెరకు :

| సంవత్సరం : | ఎకరాలు : | (టన్నులు బెల్లంలెక్కలో) |
|---|---|---|
| 1956-57 : | 1,42,000 | 3,03,700 |
| 1957-58 : | 1,35,800 | 3,62,800 |
| 1958-59 : | 1,37.500 | 3,72,200 |

వేరుశనగ :

| సంవత్సరం : | ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 25,35,800 | 9,03,000 |
| 1957-58 : | 32,11,500 | 10,89,500 |
| 1958-39 : | 26,48,500 | 10,02,600 |

మిరపకాయలు :

| సంవత్సరం : | ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 , | 4,39,600 : | 1.06.900 |
| 1957-58 : | 4,26,800 : | 1,00,300 |

పొగాకు :

ఆంధ్రప్రదేశ్‌లో పండే పొగాకులో నూటికి 85 వంతులు, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే పండుతున్నది.

| సంవత్సరం : | ఎకరాలు | పంట టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 3,90,400 : | 1,06,200 |
| 1957-58 : | 3,61,500 : | 1,09 400 |
| 1958-59 : | 3,35,700 | 1,18,300 |

ఆవాలు :

| సంవత్సరం : | ఎకరాలు: | పంట, టన్నులు |
|---|---|---|
| 1956-57 : | 2,917 : | 179 |
| 1957-58 : | 2,532 : | 170 |
| 1958-59 : | 1,626 : | 112 |

# నీటి సదుపాయాలు

ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయం జరిగిన భూమి 2,93,81,000 ఎకరాలు. అయితే దీనిలో మాగాణి 66,80,000 ఎకరాలు.

ఆంధ్రరాష్ట్రంలో పంటభూములకు అత్యధికంగా కాలువ నీరు దొరికే ప్రాంతాలు కృష్ణా, గోదావరి జిల్లాలలోనే.

రాష్ట్రంలో ప్రజలకూ, పంటలకూ కూడా ప్రధాన జీవ నదులు, గోదావరి; కృష్ణ; పెన్న. ఈ నదులవల్ల ఎంత భూమికి నీటి సరఫరా అయేదీ వాటి పుట్టుక ప్రవాహం, వివరాలు క్రిందే యివ్వబడినవి :

గోదావరి :

అరేబియన్ సముద్రానికి 50 మైళ్ళ దూరాన పశ్చిమ కనుమలలో పుట్టి తూర్పుకు ప్రవహించి, బంగాళా ఖాతంలో పడుతున్నది. ఈ మహానది పొడవు 900 మైళ్ళు. మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, అనేవి యీనదికి ఉపనదులు. ఈ మహానదిలోనికి సుమారు 1,12,500 చదరపు మైళ్ళ ప్రాంతంలోనుంచీ, వాగులలోనుంచీ నీరు కలుస్తుంది. ఈ మహా

నది కాలువలవల్ల, 8,20,000 ఎకరాలపైగా భూమికి మొదటిపంట వ్యవసాయానికి నీరు లభిస్తుంది. రెండవ పంటకు మొత్తం మూడు లక్షల ఎకరాలకు నీరు లభిస్తున్నది. ఈ నది నీటి తీరువపొందే ప్రాంతంలో పండేపంట విలువ ఏడాదికి 1,177 లక్షల రూపాయలు వుంటుంది. ఈ నది నీటిని వ్యవసాయానికి అందజెయ్యడానికి కాలువలూ, ఆనకట్టలూ, కట్టడానికి మొత్తం రు. ౭,20,00,000 అయింది. ఈ పెట్టుబడిమీద, ఏడాదికి 18.22 వంతుల చొప్పున, పన్నులరూపంగా తిరిగివస్తున్నది. ఈ నదికి ఆనకట్ట, రాజమండ్రికి దిగువ ధవళేశ్వరంవద్ద కట్టారు. అయితే గోదావరిలో ప్రతిసంవత్సరం ప్రవహించేనీటిలో నూటికి 6.5 వంతులుమాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

కృష్ణ :

ఆంధ్రదేశాన్ని సస్యశ్యామలం చేస్తున్న మహానదులలో రెండవది కృష్ణ. ఈ నదికూడా పశ్చిమ కనుమలలో మహాబలేశ్వరం వద్ద పుట్టి 775 మైళ్ళు ప్రవహించి బంగాళాఖాతంలో పడుతున్నది. భీమనది, తుంగభద్ర, మూసినదులు దీనికి ఉపనదులు. సుమారు 97,000 చదరపు మైళ్ల ప్రాంతంనుంచి వాన నీరు వాగులు దీనిలో కలుస్తాయి. గోదావరికి ఆనకట్ట కట్టిన సర్ ఆర్థర్ కాటన్ కృష్ణకుకూడా విజయవాడవద్ద ఆనకట్ట కట్టించారు. ఈనది కాలువవల్ల సుమారు 9,30,000 ఎకరాలభూమికి నీటి సరఫరా అవుతున్నది. ఈ భూమిలో పండేపంటల విలువ ఏడాదికి దాదాపు 12 కోట్ల రూపాయలు. ఈ నదికి కాలువలు, ఆనకట్ట కట్టడానికి రు. 2,20,00,000 ఖర్చయింది. ఈ పెట్టుబడిమీద ప్రస్తుతం ఏడాదికి నూటికి 16.20 వంతుల చొప్పున, పన్నుల రూపంగా ఆదాయం వస్తుంది. కృష్ణలో ప్రతిసంవత్సరం ప్రవహించే నీటిలో, నూటికి ఏడు వంతులు మాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

పెన్న :

దీనికి పినాకిని అని పేరు. దీని మొత్తం పొడవు 370 మైళ్లు. ఇది మైసూరు రాష్ట్రంలో పుట్టి, అనంతపురం జిల్లాగుండా నెల్లూరు జిల్లాలో ప్రవేశించి, నెల్లూరు జిల్లానుంచి బంగాళాఖాతంలో పడుతున్నది. దీనికి

సుంకంవద్ద ఒక ఆనకట్ట, నెల్లూరువద్ద మరొక ఆనకట్ట వున్నాయి. ఈనది వల్ల 1,67,500 ఎకరాల భూమికి నీటితీరువ లభిస్తున్నది. దీనికి కాలువలు కట్టడానికి రు. 71,00,000 ఖర్చయింది. దీనిమీద ఏడాదికి నూటికి 5.88 వంతుల చొప్పున పన్నుల రూపంగా ఆదాయం వస్తున్నది.

తుంగభద్ర :

తుంగ, భద్ర, అనే రెండు చిన్ననదులు కలిసి మైసూరురాష్ట్రంలో తుంగభద్రగా ఏర్పడి, యీ నది మైసూరు రాష్ట్రంగుండా ఆంధ్రలో ప్రవహించి, కర్నూలుజిల్లాలోని అలంపురంవద్ద కృష్ణానదిలో కలుస్తున్నది. మైసూరు రాష్ట్రంలోను, ఆంధ్రలోని రాయలసీమ ప్రాంతంలోను వ్యవసాయానికి నీటి వసతులు కల్పించడానికి, యీ నదిమీద హాస్పేటవద్ద ఒక పెద్ద ప్రాజెక్టు నిర్మించబడింది.

మూసి :

అనంతగిరి పర్వతాలలోపుట్టి, మూసీనది హైదరాబాద్, నల్లగొండ జిల్లాలగుండా 157 మైళ్లు ప్రవహించి, వాడపల్లివద్ద కృష్ణానదిలో కలుస్తున్నది. ఈ నదీ జలాలను హైదరాబాద్ నగరవాసుల నిత్యవాడకానికి సరఫరా చెయ్యడానికి, ఉస్మాన్ సాగర్ వద్ద డాం కట్టబడినది. హైదరాబాద్ నగరం, యీ నదీ తీరం మీదనే ఉన్నది.

విశాఖపట్టణంజిల్లాలో బాహుద, పద్మపురంగడ్డ నదులు సుమారు 4,000 ఎకరాలకూ, వంశధార, లాంగుల్యనదులు సుమారు 67,000 ఎకరాలకూ నాగావళినది సుమారు 28,000 ఎకరాలకూ వరాహానది 18,000 ఎకరాలకూ, శారదానది 9,000 ఎకరాలకూ నీటివసతిని కల్గిస్తున్నవి.

బావులు :

రాష్ట్రంలోవున్న పంటబావుల సంఖ్య, ఎనిమిది లక్షలు.

చెరువులు :

రాష్ట్రంలో మొత్తం 58,527 చెరువులు వున్నవి. వీనిలో 25,547 ఆంధ్రప్రాంతంలోనూ, 33,907 తెలంగాణా ప్రాంతంలోనూ వున్నవి.

# తుంగభద్ర ప్రాజెక్టు

బళ్ళారిజిల్లాలో హాస్పేట సమీపంలో మల్లాపురంవద్ద తుంగభద్రకు ఆనకట్టకట్టి, నీటిని నిలువచేయడానికి తటాక నిర్మాణం జరిగింది. ఈ రిజర్వాయరునుంచి కాలువలలో సుమారు ఏడు లక్షల ఎకరాలకు, (ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలలో 2½ లక్షలు, హైదరాబాదులో 4½ లక్షలు ఎకరాలు) నీటి వసతి కల్పించవచ్చును. కాలువకు రెండు ప్రక్కలా, రెండుచోట్ల విద్యుచ్ఛక్తినికూడా ఉత్పత్తి చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఈ ప్రాజెక్టుకు 50 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది.

ఆంధ్రరాష్ట్రంలో యీ ప్రాజెక్టు కాలువపొడవు 226 మైళ్ళు వుంటుంది. దీనినుంచి నీరు తీసికొనిపోయే చిన్నకాలువ లన్నింటి పొడవూ కలిపి మొత్తం 1,700 మైళ్లు.

ఈ ప్రాజెక్టు నిర్మాణం 1945 ఫిబ్రవరిలో ప్రారంభమైంది. 1953 జూలై 1 న యీ ప్రాజెక్టు కాలువనుంచి నీటిని వదలడంజరిగింది.

తుంగభద్రా రిజర్వాయరు విస్తీర్ణం 133 చ. మైళ్ళు. దీనిలో 1,13,12,60 లక్షల ఘనపు అడుగుల నీటిని నిలవ చేయవచ్చును. సుమారు 10,880 చ. మైళ్ల ప్రాంతంనుంచి ప్రవాహంగావచ్చే నీరు, తుంగభద్రానదిలోపడి, దానినుంచి, యీ రిజర్వాయరులోనికి తీసుకు రాబడుతుంది.

ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని మదరాసు, హైదరాబాదు ప్రభుత్వాలు ఉమ్మడిగా ప్రారంభించారు. 1953 అక్టోబరులో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడంతో, ప్రాజెక్టు నిర్మింపబడిన హాస్పేట మైసూరు రాష్ట్రంలో కలిపివేయబడింది. కాని, యీ ప్రాజెక్టు నీటి వసరు ముఖ్యంగా రాయలసీమ జిల్లాల అభివృద్ధి కొరకు ఉద్దేశింపబడి నందునను, ప్రాజెక్టు నిర్మాణానికి మదరాసుప్రభుత్వం ఖర్చుపెట్టిన డబ్బు అంతా ఆంధ్రరాష్ట్రపువంతు డబ్బు అయినందుననూ, యీ ప్రాజెక్టు ప్రయోజనాలను ఆంధ్రరాష్ట్రం అనుభవించడంలో ఏ విధమైన ఆటంకాలకు మైసూరు ప్రభుత్వం కల్పించకుండా వుండడానికీ,

ప్రాజెక్టు పరిపాలన సక్రమంగా జరిగేటట్లు చూడడానికీ, కేంద్ర ప్రభుత్వపు ఆధ్వర్యాన తుంగభద్ర ప్రాజెక్టు బోర్డు నియమింపబడింది. ఈ ప్రాజెక్టు నీటిని వదలడం విషయంలోనూ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పంపకము మొదలైన ఏర్పాట్లను సాగించడం విషయంలోనూ సమస్త అధికారమూ, బాధ్యతాకూడా, ఈ బోర్డుదే.

తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ పథకానికి ప్రారంభోత్సవం 1955 అక్టోబరు 2 తేదీన జరిగింది. ఈ కాలువ నిర్మాణం వ్యయం. 19 కోట్లు అని అంచనా.

తుంగభద్ర ఎగువ కాలువ జలాలను ఆంధ్ర మైసూరు రాష్ట్రాల మధ్య 65:35 నిష్పత్తిలో పంచుకోడానికి ఒడంబడిక 1956 జూన్ 18 తేదీన జరిగింది. ఈ కాలువ క్రింద మొత్తం రెండు లక్షల టన్నుల ధాన్యాలు పండుతవని అంచనా.

## నాగార్జున సాగర్

గుంటూరు జిల్లాలోని మాచర్లకు 14 మైళ్ళ దూరంలో, నాగార్జున కొండవద్ద, కృష్ణానదికి ఆనకట్ట కట్టి, నాగార్జున సాగర్ అనే పేరుతో ఒక పెద్ద రిజర్వాయరును నిర్మించడానికి నిర్ణయం 1955 ఫిబ్రవరి 24 న జరిగింది.

దక్షిణ భారత దేశంలోని నదీలోయ ప్రాజెక్టులలో కెల్లా పెద్దదైన, నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు శంఖు స్థాపనను 1955 డిసెంబరు 19 న భారత ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ చేశారు.

ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని ఆంధ్ర ప్రభుత్వం నిర్వహిస్తున్నది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి మొత్తం రు. 131 కోట్లు అవుతుంది.

నాగార్జున సాగర్ పరిమితి 110చ. మైళ్ళు. దీనిలో 94 లక్షల ఎకరా అడుగుల నీరు నిల్వచేయబడుతుంది. ఈ సాగర్ లోని నీటివల్ల ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో మొత్తం, 31,83,000 ఎకరాల భూమి సాగు అవుతుంది. దీనివల్ల 12 లక్షల టన్నుల ఆహారధాన్యాలు అదనంగా పండుతవి.

ఈ ప్రాజెక్టులలో భాగంగా కట్టే విద్యుదుత్పాదక కేంద్రంలో 75,000 కిలోవాట్ల విద్యుత్ శక్తి ఉత్పత్తి అవుతుంది.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం అంతా, మొత్తం మూడు దశలలో పూర్తిచేయబడుతుంది. నిర్మాణం పూర్తిచేయడానికి ఏడు సంవత్సరాలు పడుతుంది.

నాగార్జునసాగర్ ఆనకట్ట గోడల యెత్తు మొత్తం 590 అడుగులు వుంటుంది. నిర్మాణం ప్రథమ దశలో 545 అడుగుల ఎత్తు గోడలు నిర్మింపబడుతవి.

ఈ సాగర్‌నుంచి ఆంధ్ర ప్రాంతంలో 140 మైళ్ళ పొడవునా తెలంగాణా ప్రాంతంలో 108 మైళ్ళ పొడవునా, కాలువలు ప్రథమ దశలోనే నిర్మింపబడుతవి. ప్రథమదశ నిర్మాణం పూర్తి అయినప్పుడు గుంటూరు, కర్నూలు, నెల్లూరు, ఖమ్మం, నల్లగొండ జిల్లాలలో మొత్తం 23,60,060 ఎకరాల భూమి సాగవుతుంది.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్వహణాధికారి, ఎస్. చక్రవర్తి.

ఈ ప్రాజెక్టుకు డాం నిర్మాణానికి, సిమెంటు కట్టడానికి పునాదిని 1957 జులై 12 తేదీన ఇండియా ప్రభుత్వ నీటిపారుదల శాఖమంత్రి ఎస్. కె. పాటిల్ వేశారు.

## వంశధార ప్రాజెక్టు

శ్రీకాకుళం జిల్లాలోని వంశధార నదిపై ప్రాజెక్టును రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో నిర్మించడానికి పథకం తయారు చేయబడింది.

ఈ పథకం ప్రకారం, వంశధారపై గొట్టవద్ద ఆనకట్టను నిర్మించి, ఇదరిన అదరిన రెండు కాల్వలు త్రవ్వబడతాయి. వీటి క్రింద 2,06,000 ఎకరాలలో వరి మొదటి పంట, 50,000 వరి రెండవ పంట, 36,000 ఎకరాలలో జనుము పండుతుందని అంచనా. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి రు 12,56,00,000 ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది.

## ప్రకాశం బ్యారేజి

కృష్ణానదిపై రోడ్డువంతెన, రెగ్యులేటర్ నిర్మాణానికి శంఖుస్థాపనను 1954 ఫిబ్రవరి 13 న ఆంధ్ర ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం గారు చేశారు. ఈ రెగ్యులేటర్ నిర్మాణం 1957 డిసెంబర్ 24 నాటికి పూర్తి అయింది. దీనికి ప్రారంభోత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు చేశారు. ఈ రెగ్యులేటర్‌వల్ల ప్రస్తుతం కృష్ణానది ఆయకట్టులోవున్న 11 లక్షల ఎకరాల భూమికి నీటిసాగు ఏ అంతరాయం లేకుండా వుండటమే కాక, మరొక లక్ష ఎకరాలకు అదనంగా నీటిసాగు లభిస్తుంది. ఈ రెగ్యులేటర్ పొడవు 3,400 అడుగులు. అంతే కాక, బ్రిడ్జినిర్మాణంవల్ల, కృష్ణానది మీదుగా రోడ్డు ప్రయాణం సంవత్సరం పొడుగునా ఏ అంతరాయం లేకుండా చెయ్యడానికి వీలు ఏర్పడింది.

# విద్యుచ్ఛక్తి

ఆంధ్ర ప్రదేశ్ లో ప్రస్తుతం 1,92,876 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతున్నది.

విద్యుచ్ఛక్తి అభివృద్ధి విషయంలో ఆంధ్రరాష్ట్రం ప్రారంభ దశలో ఉన్నది.

ఆంధ్రప్రదేశ్ లో విద్యుచ్ఛక్తి సప్లయిని పొందుతున్న పట్టణాలు, గ్రామాల సంఖ్య, 1958 అక్టోబర్ 31 నాటికి 1440.

## మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి

మాచ్‌ఖండ్ ప్రాజెక్టునుంచి ఆంధ్రరాష్ట్రంలోని జిల్లాలకు విద్యుచ్ఛక్తిని సప్లయి చేయడానికి, విద్యుదుత్పాదక యంత్రం 1955 ఆగస్టు 19 న పని ప్రారంభించింది. ఈ ప్రారంభోత్సవాన్ని, రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ జరిపారు.

ఇక్కడనుంచి ఉత్పత్తిఅయే విద్యుచ్ఛక్తి నూటికి 70 వంతులు ఆంధ్రరాష్ట్రానికీ, 30 వంతులు ఒరిస్సారాష్ట్రానికీ సప్లయి అవుతుంది. ఆంధ్రరాష్ట్రంలో శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పడ

మటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలవరకు ఇక్కడి విద్యుచ్ఛక్తిని సప్లయి చేయవచ్చును.

# అటవీ సంపద

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 24,700 చదరపు మైళ్ళ వైశాల్యం గల అడవులు వున్నాయి. ఈ అడవులలో, 14,600 చ. మైళ్ల అడవులు అటవీశాఖ అధ్వర్యం క్రిందనున్న రిజర్వు అడవులు.

అడవులవల్ల రాష్ట్రప్రభుత్వానికి ఏడాదికి ఒకటిన్నర కోట్లరూపాయల ఆదాయం వస్తుందని అంచనా.

# విద్య

ఆంధ్రప్రదేశ్‌లో వున్న విద్యా సంస్థల వివరాలు ఇవి :

విశ్వకళాపరిషత్తులు 3. ఆంధ్రవిశ్వకళా పరిషత్, వాల్తేరు: ఉస్మానియా విశ్వకళా పరిషత్, హైదరాబాద్; శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్, తిరుపతి.

కాలేజీలు : 47. వీనిలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు అనుబంధముగా వున్నవి 25; ఉస్మానియా, 15; శ్రీ వేంకటేశ్వర, 7.

సెకండరీ స్కూళ్ళు: 727, వీనిలో తెలంగాణా ప్రాంతంలో 274; మిగతా ఆంధ్ర ప్రాంతంలో 453 వున్నాయి.

ప్రైమరీస్కూళ్లు: 27,976 వీనిలో తెలంగాణా ప్రాంతంలో 7,038 వున్నాయి,

బేసిక్ స్కూళ్లు : 1045. వీనిలో 257 తెలంగాణా ప్రాంతంలో వున్నాయి.

జాతి, మత, కుల, ఆదాయ వివక్షత లేకుండా ప్రతి బాల బాలికకూ మూడవ ఫారంవరకూ ఉచితంగా విద్యాబోధన చేయించడానికి ఆంధ్రరాష్ట్ర మంత్రిమండలి 1956 మార్చి 24 న నిర్ణయించింది.

## మెడికలు కాలేజిలు

రాష్ట్రంలో ప్రస్తుతం ఆరు మెడికల్ కాలేజిలు వున్నాయి. అవి: ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖపట్టణం), గుంటూరు మెడికల్ కాలేజి, కర్నూలు మెడికల్ కాలేజి, కాకినాడ మెడికల్ కాలేజి, హైదరాబాద్ మెడికల్ కాలేజిలు, 2.

## ఇంజనీరింగు కాలేజిలు

రాష్ట్రంలోవున్న ఇంజనీరింగు కాలేజిలు: 4. వానిలో అనంతపూర్, కాకినాడలలోవున్న కాలేజిలు ప్రభుత్వ యాజమాన్యంలో వున్నాయి. వాల్తేరులో ఒకటి, హైదరాబాద్‌లో ఒకటి, యూనివర్శిటీల యాజమాన్యంలో వున్నాయి.

## వ్యవసాయశాఖ కాలేజిలు

మన రాష్ట్రంలో రెండు వ్యవసాయ కళాశాలలు వున్నాయి. ఒకటి బాపట్లలోనూ, మరొకటి హైదరాబాద్‌లోను.

## ప్రాచ్యభాషా పాఠశాలలు

ఆంధ్రప్రదేశ్‌లో 51 ప్రాచ్యభాషా పాఠశాలలు వున్నాయి. వీనిలో 9 తెలంగాణా ప్రాంతంలో వున్నాయి.

## ఆస్థాన కవులు

తెలుగులో ఆస్థాన కవిగా మొదట కళాప్రపూర్ణ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి నియమించబడినారు. వీరు 1950 ఫిబ్రవరి 15 న చనిపోగా, 1950 ఆగస్టు 6 న శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ఎన్నుకోబడినారు. వీరికి ఏడాదికి వెయ్యి రూపాయలు గౌరవ వేతనం.

## లైబ్రరీలు

1956-57 లో ఆంధ్రప్రదేశ్‌లో 1418 లైబ్రరీలు వున్నాయి. వీనిలో 56 తెలంగాణా ప్రాంతంలో వున్నాయి.

## విజ్ఞానవ్యాప్తికి ప్రభుత్వ తోడ్పాటు

ప్రాంతీయ భాషలలో వివిధ సమస్యలను గూర్చిన వాఙ్మయాన్ని అభివృద్ధి చేయడానికి ఒక విధానాన్ని ప్రభుత్వం తయారు చేసింది. వివిధ విషయాలమీద వ్రాయబడ్డ, ప్రకటింపబడిన గ్రంథాలకు, యేటేట రు. 500 బహుమానాలిస్తారు. ప్రస్తుతం దిగువ విషయాలను గూర్చిన గ్రంథములకు బహుమతు లివ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

(1) పాటలు, పద్యాలు (2) గద్యరచన (కళ) జీవితచరిత్ర, యాత్ర, (3) చిన్న కథ (4) నవల, నాటకము (5) పరిశోధన (భాష, చరిత్ర, పురాణవాఙ్మయం) (6) భౌతిక, రసాయన శాస్త్రాలు (7) ప్రకృతి శాస్త్రం, వ్యవసాయం (8) చరిత్ర, ఆర్థిక, రాజకీయ, సాంఘిక శాస్త్రాలు (9) గణిత, భూగోళశాస్త్రాలు, జ్యోతిశ్శాస్త్రం, ఇంజనీరింగు (10) బాల వాఙ్మయం (11) విద్యాపద్ధతులు; వేదాంతమానసిక తత్వశాస్త్రాలు (12) ఔషధ, పారిశుద్ధ్యశాస్త్రాలు.

### ఆంధ్ర విశ్వకళాపరిషత్

స్థాపితము : 1926 ఏప్రిల్ 26

| | |
|---|---|
| ఛాన్సెలర్ : | భీమసేన్ సచార్ |
| ప్రోఛాన్సెలర్ : | ఎస్. బి. పి. పట్టాభిరామారావు |
| వైస్-ఛాన్సెలర్ : | డాక్టర్ వి. ఎస్. కృష |
| రిజిష్ట్రార్ : | కూర్మా వేణుగోపాలస్వామి |

### ఉస్మానియా విశ్వకళాపరిషత్

స్థాపితం : 1918

ఛాన్సెలర్ : భీమసేన్ సచార్

ప్రో-ఛాన్సెలర్ : నవాబ్ ముకర్రం జా బహదుర్

వైస్ ఛాన్సెలర్ : డి. సదాశివరెడ్డి

రిజిస్ట్రార్ : ఎస్. వి. సుబ్బారావు

### శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్

ఛాన్సెలర్ : భీమసేన్ సచార్

ప్రొ-ఛాన్సెలర్ : ఎస్. బి. పి. పట్టాభిరామరావు
వైస్ ఛాన్సెలర్ : ఎస్. గోవిందరాజులునాయుడు
రిజిస్ట్రార్ : ఎం. రామానుజరావునాయుడు

1954 జులై నుంచి, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వకళా పరిషత్ అను పేరుతో, రాయలసీమకు ఒక విశ్వకళాపరిషత్తును స్థాపించడానికి ఆంధ్రప్రభుత్వం 1954 జనవరి 15 తేదిన నిశ్చయించింది.

ఈ నిర్ణయాన్ని అనుసరించి, రాష్ట్రశాసనసభలో 1954 మే నెలలో చట్టం ప్రతిపాదించబడినది. శాసనసభ ఆమోదించిన చట్టానికి, రాష్ట్రపతి ఆమోదం 1954 జులై 26 న లభించింది.

శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటి చట్టం ప్రకారం, 1956 జులై వరకు, యీ యూనివర్శిటీకి రాష్ట్రంలోని కాలేజీలు ఏవీ అనుబంధములు కావు. ఈ యూనివర్శిటీ కాలేజిలలో బోధన మాత్రం, యీ యూనివర్శిటీ అధ్వర్యాన జరుగుతుంది. 1956 జులై నుంచి, అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు, నెల్లూరుజిల్లాలోని కాలేజిలు, శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీకి అనుబంధములు అయినవి. ఆ కాలేజీలలో బోధన, యీ యూనివర్శిటీ అధ్వర్యాన జరుగుతుంది.

## సాహిత్య అకాడమీ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని 1957 అగస్టు 6 తేదీన రాష్ట్రప్రభుత్వం స్థాపించింది. దీనికి ప్రారంభోత్సవాన్ని రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ జరిపారు. ఈఅకాడమీ జనరల్ కౌన్సిలులో 60 మంది సభ్యులు వుంటారు. ఎగ్జిక్యూటివ్ కమిటీలో 15 మంది సభ్యులు వుంటారు.

అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి. ఉపాధ్యక్షులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, కోశాధికారి, రాష్ట్రప్రభుత్వ ఆర్థికశాఖ డిప్యూటి సెక్రటరి, ప్రధాన కార్యదర్శి, శ్రీ దేవులపల్లి రామానుజరావు; సంయుక్త కార్యదర్శి, శ్రీ చదలవాడ పిచ్చయ్య: ఎగ్జిక్యూటివ్ కమిటీసభ్యులు, విద్యాశాఖ కార్యదర్శి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ నాయని సుబ్బారావు, శ్రీ అబ్బూరి రామకృష్ణ

రావు, శ్రీ సార్ల వెంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, డాక్టర్ బి. హెచ్. కృష్ణమూర్తి, డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ ఫజ్లుల్ రహమన్.

## సంగీత నాటక అకాడమీ

ఆంధ్రప్రదేశ్‌లో సంగీత, నాటక, సినిమాకళలను ప్రోత్సహించడానికి సంగీత, నాటక అకాడమీని రాష్ట్రప్రభుత్వం 1957 డిసెంబర్ 25 న స్థాపించింది. ఈ అకాడమీకి అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు; ఉపాధ్యక్షులు ద్వారం వెంకటస్వామినాయుడు; కార్యదర్శి, ఎల్. ఎన్. గుప్త; జాయింట్ కార్యదర్శి, స్థానం నరసింహారావు; కోశాధిపతి, టి. శేషాచారి; కార్యవర్గసభ్యులు, బి. ఎన్. రెడ్డి, కె.వి. గోపాలస్వామి, ఎస్. నారాయణదాస్, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, డాక్టర్ ఎన్. రాంలాల్, జి. ఎన్. దామ్లె, ఎ. ఆర్. కృష్ణ, ఎం. ఆర్. అప్పారావు, అక్కినేని నాగేశ్వరరావు, శ్రీమతి పసుపులేటి కన్నాంబ.

# జాతీయ వికాస కార్యక్రమం

గ్రామాభ్యుదయానికి దేశమంతటా కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయవికాస కేంద్రాలు ఏర్పాటుచేయబడినవి. గ్రామాలలోని ప్రజల సహకారంతో గ్రామజీవితంలో ఆర్థికంగా, సాంఘికంగా క్రమానుగతమైన మార్పు తీసుకురావడమే యీ కార్యక్రమాల ఉద్దేశం. వ్యవసాయాభివృద్ధి, రవాణా సౌకర్యాలు, విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం, గ్రామీణ పరిశ్రమలు, సహకారోద్యమం, వీటిని పెంపొందించడానికే యీ కార్యక్రమాలు ప్రారంభించబడినవి. వ్యవసాయాభివృద్ధి కార్యక్రమంలో బంజరుభూముల సాగు, మైనర్ ఇరిగేషన్ స్కీములు, కొత్తపద్ధతులలో సేద్యం, మేలురకపు విత్తనాల ఉపయోగం, రసాయనపు ఎరువులు పచ్చి ఎరువుల వాడకము, పశుసంపదను ఎక్కువ చేయడం మొదలైన కృషి చేర్చబడింది.

ఒక్కొక్క కమ్యూనిటీ ప్రాజెక్ట మూడు బ్లాకులక్రింద విభజించబడుతుంది. ఒక్కొక్క బ్లాకులో 100 గ్రామాలు వుంటాయి.

అయిదేసి గ్రామాలు ఒక గ్రూపుగా ఏర్పాటు చేయబడి, 20 గ్రూపులు ఒక బ్లాకుగా వుంటాయి. ఒక్కొక్క గ్రూపు ఒక కార్యకర్త అధీనంలో వుంటుంది. ఒక్కొక్క బ్లాకు, ఒక బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు అధీనంలో వుంటుంది.

## జాతీయ వికాస కేంద్రాలు

కమ్యూనిటీ ప్రాజెక్టులలో జరిగే పనికంటె కొంచెం తక్కువ ఉధృతిలో, చిన్న చిన్న, ప్రాంతాలలో ప్రజాసహకారంతో, గ్రామీణాభ్యుదయాన్ని పెంపొందించడానికి, జాతీయవికాసకేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. ఈ కేంద్రాలలో కొంతకాలం పని జరిగిన తరువాత, వీటిని ప్రాజెక్టులక్రింద మార్చడానికి సులువుగా వుంటుంది.

ఇలా పనిజరిగే ఒక్కొక్క బ్లాకులో దాదాపు 100 గ్రామాలు (రెండు ఫిర్కాలు) వుంటాయి. ఇచ్చట అమలు జరుపబడే అభివృద్ధి కార్యక్రమాలకు అయే ఖర్చులో సగాన్ని ధనరూపంలోగాని, కాయకష్టరూపంలోగాని ఆప్రాంతంలోని ప్రజలు భరించాలి.

1958 అక్టోబర్ 2 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో 34 కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాకులు, 188 జాతీయ వికాస కేంద్రాలు పనిచేస్తున్నాయి.

# పంచాయితి సమితులు

జిల్లాకు ఒకటిచొప్పున, ఆంధ్రప్రదేశ్‌లోని 20 జిల్లాలలోను 20 పంచాయితి సమితులు, 1958 జులై 1 తేదిన ఏర్పాటుచేయబడినవి.

ప్రతి పంచాయితిసమితి, సమాజ వికాస కార్యక్రమం అమలు జరుగుతూవున్న డెవలప్‌మెంట్‌బ్లాకు ప్రాంతంలో ఏర్పాటుచేయబడినది. ఆ బ్లాకుప్రాంతంలో జరుగవలసిన అభివృద్ధి కార్యక్రమం అంతా, వీలైనంతవరకు, పంచాయితి సమితికి అప్పగించబడుతుంది. వ్యవసాయాభివృద్ధి, చిన్నపరిశ్రమల అభివృద్ధి, విద్య, సాంఘిక సంక్షేమం మొదలైన కార్యక్రమాల నిర్వహణ, యీ సమితికి అప్పగించబడుతుంది. మద్యనిషేధ కార్యక్రమాన్ని అమలుజరపడం, చిన్న నీటివసతులను

ఏర్పాటుచెయ్యడం, ఆకస్మిక ప్రమాదాలు సంభవించినప్పుడు ప్రజలకు సహాయం చెయ్యడంకూడా పంచాయితీసమితి బాధ్యతలుగా వుంటాయి.

అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించబడిన డబ్బు, గవర్నమెంటు ఇచ్చే గ్రాంటులు, అఖిల భారత సంస్థలు యిచ్చే విరాళాలు, ప్రజలు యిచ్చే విరాళాలు, పంచాయితి సమితి కార్యక్రమాలకు వినియోగింపబడుతవి.

పంచాయితి సమితి ఏర్పాటుచేయబడిన బ్లాకులోవున్న గ్రామాలలోని పంచాయితి ప్రెసిడెంట్లు, పంచాయితిలులేని గ్రామాలలో ఒకొక గ్రామానికి ఒకొకరుచొప్పున కలెక్టరుచే నామినేట్ చేయబడినవారు, ప్రత్యేక వర్గాలతరఫున ప్రతినిధులుగా సమితిచే ఎన్నుకొనబడినవారు అయిదుగురు, పంచాయితి సమితిలో సభ్యులుగా వుంటారు. బ్లాకు ప్రాంతంలోని శాసనసభ్యులు పంచాయితి సమితి సమావేశాలకు హాజరయి, చర్చలలో పాల్గొనవచ్చును. కాని, వీరికి ఓటుచేసే హక్కు వుండదు.

ప్రతి బ్లాకులోని బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు, ఆ పంచాయితి సమితికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వుంటాడు. పంచాయితి సమితి నిర్ణయాలను అమలుజరపడానికి ఆయనకు సంపూర్ణాధికారాలు వుంటాయి.

## రోడ్లు

రాష్ట్రంలోని రోడ్లు మూడు తరగతులుగా భాగించబడినవి. 1. జాతీయ రహదార్లు. వీటిపై అధికారం రాష్ట్రప్రభుత్వానిది 2. రాష్ట్రీయరహదార్లు, వీటిపై అధికారం రాష్ట్రప్రభుత్వానిది. జిల్లాలలోని రోడ్లు చాలవరకు యీ తరగతిలోకే వస్తాయి. 3. జిల్లాబోర్డు రోడ్లు: జిల్లాలోని చిన్నరోడ్లు, గ్రామాలరోడ్లు.

జాతీయ రహదార్లను బాగుచేసి, మంచి స్థితిలో వుంచినందుకు ఏటా రాష్ట్రప్రభుత్వానికి కేంద్రప్రభుత్వం కొంతడబ్బును ఇస్తుంది.

1958 అక్టోబర్ నాటికి రాష్ట్రంలోని మొత్తం రోడ్లు, 19,236 మైళ్లు. ఈ రోడ్లలో జాతీయ రహదారి 1,409 మైళ్ళు; రాష్ట్రీయ రహ-

దారి, 2,072 మైళ్ళు. జిల్లాలోని పెద్దరోడ్లు మొత్తం,12,880 మైళ్ళు; జిల్లాలోని చిన్న రోడ్లు, 3,595 మైళ్లు.

రాష్ట్రంలోని మొత్తం రోడ్లలో 7,073 మైళ్ళు. ప్రభుత్వాల ఆధీనంలోను, 12,163 మైళ్ళు జిల్లా బోర్డుల ఆధీనంలోను వున్నవి.

ఆంధ్రరాష్ట్రంలో వున్న రైలుదారుల మొత్తం నిడివి, 2,902 మైళ్లు.

## వైద్యసహాయం

ఆంధ్రప్రదేశ్ పట్టణాలలో 183 ఆస్పత్రులు, పల్లెలలో 598 వైద్యశాలలు వున్నాయి. వీనిలో మొత్తం 16,128 మంది రోగులకు పడక ఏర్పాట్లు వున్నాయి. పట్టణాలలో వున్న ఆస్పత్రులలో 13,741 మంది రోగులకు పడక ఏర్పాటు వున్నవి.

ఆస్పత్రులలోను, వైద్యశాలలలోను పనిచేస్తున్న డాక్టర్లు మొత్తం 923 నర్సులు, 1,224.

## పోలీసు

ఆంధ్రప్రదేశ్‌లో ఒక పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఒక అడిషనల్ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్, అయిదుగురు డిప్యూటి ఇన్‌స్పెక్టర్స్ జనరల్, 35 మంది జిల్లా సూపరింటెండెంట్లు. 10౪ మంది డిప్యూటీ సూపరింటెండెంట్లు, 312 మంది ఇన్‌స్పెక్టర్లు, 124 మంది సార్జెంటు మేజర్లు, 1,32౮ మంది సబ్ ఇన్‌స్పెక్టర్లు, 4,89౪ మంది హెడ్ కానిస్టేబిల్సు, 29,722 మంది కానిస్టేబిల్సు వున్నారు.

## రేవులు

ఆంధ్ర ప్రదేశ్‌లో 7 రేవులు వున్నాయి. వీటిలో ఒకటి విశాఖపట్టణం. పెద్దరేవు ఇదే. కేంద్రప్రభుత్వంవారి నిర్వహణలో వుంది. తక్కిన ఆరు రేవులూ, చిన్న రేవుల క్రింద పరిగణింపబడుతున్నాయి. అవేమిటంటే: విశాఖపట్టణం జిల్లాలో: బారువ, కళింగపట్నం, భీముని

పట్నం, తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడ, కృష్ణాజిల్లాలో మచిలీపట్టణం, గుంటూరుజిల్లాలో వాడరేవు.

ఇవన్నీ కూడా తీరవ్యాపారానికి అనుకూలంగా వున్నవే.

1956-57 లో, రాష్ట్రంలోని రేవులకు వచ్చిన స్టీమర్లు, 146; పడవలు 30. వీటి రాకపోకలవల్ల యీ రేవులలో రు. 6,24,09,938 విలువగల సరకుల వ్యాపారం జరిగింది, రేవులలో వసూలయిన పన్ను రు. 75,675. ఈ వ్యాపారమంతాకూడా విశాఖపట్టణం, కాకినాడ, బందరు, భీమునిపట్టణం రేవులగుండానే జరిగింది.

విశాఖపట్టణం :

విశాఖపట్టణం హార్బరు నిర్మాణానికి స్కీము ఈస్టిండియా కంపెనీ రోజులలోనే వేయబడినా, 1925 దాకా దానిని కార్యరూపంలోకి తెచ్చే ప్రయత్నం జరగలేదు, 1933 లో హార్బరు ఓడలు నిలవడానికి తెరువబడింది. ఈరేవు పరిపాలన కేంద్రప్రభుత్వంవారిచే నియమింపబడిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు సాగిస్తాడు.

కాకినాడ :

రాష్ట్రంలో చిన్నరేవులలో ప్రథమస్థానం కాకినాడ రేవుది. పెద్ద పెద్ద ఓడలు రేవుకు ఆరు, ఏడు మైళ్ల దూరంలో సముద్రంలోనే నిలబడతాయి. ఒడ్డునుంచి చిన్న లాంచీలు ఓడలవద్దకువచ్చి సరుకును ఎత్తడం, ఒడ్డుకు తీసుకురావడం మొదలైనపనిచేస్తాయి. ఇక్కడనుంచి విస్తారంగా ఎగుమతి అయే సరకులు, వేరుశెనగ, ఆముదపు గింజలు. ఇవన్నీ యూరపుకే వెడతాయి. అమెరికానుంచి కిరసనాయిలూ, ఇంగ్లండునుంచి లోహాలూ ఇక్కడ దిగుమతి అవుతాయి. ఈ రేవును పెద్దరేవుగా అభివృద్ధి చెయ్యాలని ఇటీవల జరిగిన సూచనపై కేంద్రప్రభుత్వంవారు నియమించిన కమిటీవారు విచారణ జరిపారు. కాని, దీనికి 85 మైళ్లలో ఉత్తరాన విశాఖపట్టణమూ, 270 మైళ్లలో దక్షిణాన మదరాసు వున్నందున, ఈ రేవును అభివృద్ధి పరచడం మంచిది కాదని, ఆ కమిటీవారు శిఫార్సు చేశారు. దానిని ప్రభుత్వంవారు ఆమోదించారు.

ఆంధ్రరాష్ట్రానికి మొత్తం 500 మైళ్ళ తీరం వుంది. తీరప్రాంతం అంతటా కోస్తావ్యాపారం బాగా జరగాలంటే సాలుగైదు రేవులను అభివృద్ధి పరచడం అవసరం.

# ఖనిజ సంపద

ఆంధ్ర రాష్ట్రంలో విస్తారమైన ఖనిజ సంపదవుంది. రాష్ట్రం లోని లక్ష చదరపు మైళ్ళలోనూ దాదాపు 30 వేల చదరపుమైళ్ల భూమిలో మాత్రమే ఏఏ ఖనిజ సంపత్తి వున్నదో పరిశోధన జరిగింది. ఇప్పటికి తెలిసినంతవరకు ఆంధ్రరాష్ట్రంలో దొరికే ముఖ్యమైన ఖనిజ ములు ఏమిటంటే: బొగ్గు, ఇనుము, మెంగనీస్, సున్నపురాయి, వజ్ర ములు, అభ్రకము, బారైట్స్, గ్రాఫైట్.

1954 లో రాష్ట్రంలో 15,28,000 టన్నుల రాక్షసి బొగ్గు, 1,16,000 టన్నుల ఇనుము, 2,19,000 టన్నుల మెంగనీసు, 14,000 టన్నులఅభ్రకము త్రవ్వబడినవి.

ఆంధ్రప్రదేశ్‌లోని ఇనుపగనులలో 43 కోట్ల టన్నుల ముడి ఇనుము లభిస్తుందని అంచనా వేయబడింది. రాష్ట్రంలోని ఇనుపగనులలో మేలిరకం గనులు కర్నూలుజిల్లాలో వున్నాయి. తరువాత హైదరా బాద్, గుంటూరు జిల్లాలలోని గనులు చెప్పదగినవి. నెల్లూరు జిల్లాలో లభించే ఇనుము ఎక్కువ నాణ్యమైనది కాదు.

రాక్షసి బొగ్గు :

ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మమెట్ జిల్లాలోని సింగరేణివద్ద బొగ్గు గనులు వున్నాయి. ఈ గనులలో 1955 లో 15 లక్షల టన్నులు, 1956 లో 16.80,000 టన్నులు, 1957 లో 19,20,000 టన్నులు బొగ్గు త్రవ్వబడింది.

# పరిశ్రమలు

## బట్టల మిల్లులు

ఆంధ్రప్రదేశ్‌లో 14 బట్టల మిల్లులు వున్నాయి. వానిలో తూర్పు గోదావరిలో 5, అనంతపురంలో ఒకటి, పశ్చిమ గోదావరిలో 1, గుంటూరులో 1, చిత్తూరులో 1, కర్నూలులో 2, వరంగల్‌లో 1, హైదరాబాద్‌లో రెండు వున్నాయి.

ఆంధ్ర రాష్ట్రావతరణతో పాటు ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రచేనేత పారిశ్రామికుల సహకార సంఘము 1953 సెప్టెంబరు 14 న విజయవాడలో నెలకొల్పబడింది. దీనిలో మొత్తం 627 ప్రాథమిక చేనేత సంఘాలు పనిచేస్తున్నాయి, 5 పీవింగు ఫ్యాక్టరీలు, 3 డైయింగ్ ఫ్యాక్టరీలు, ఒక కలెక్టివ్ వీవింగు సెంటరు ఆంధ్రరాష్ట్రచేనేత సహకార సంఘం నిర్వహిస్తున్నది. మూలధనం రు. 2,71,186.

ఆంధ్ర ప్రదేశ్‌లో 1958 అక్టోబర్ 31 నాటికి రిజిస్టరు చేయబడిన చేనేత మగ్గముల సంఖ్య, 3,98,483.

## గోగునార మిల్లులు :

ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు గోగునార మిల్లులు వున్నాయి. అవి విశాఖపట్టణం జిల్లాలోని నెల్లిమర్ల, చిట్టివలసలోను, పశ్చిమ గోదావరి జిల్లాలోని ఏలూరులోను, గుంటూరులోను వున్నాయి.

## పంచదార ఫ్యాక్టరీలు:

ఆంధ్ర రాష్ట్రంలో 11 పంచదార ఫ్యాక్టరీలు వున్నాయి. అవి వున్నస్థలం : పిఠాపురం, ఏటికొప్పాక, తుమ్మపాల, నగరం, సామర్లకోట, బొబ్బిలి, సీతానగరం, తణుకు, ఉయ్యూరు, బోధన్, చల్లపల్లి. ఈ ఫాక్టరీలలో 1955-56 లో 1,38,000 టన్నులు, 1956-57లో 1,42,000 టన్నులు, 1957-58 లో 1,53,000 టన్నుల పంచదార తయారు చేయబడింది.

సిమెంటు :

ఆంధ్ర ప్రదేశ్‌లో మూడు సిమెంటు ఫ్యాక్టరీలు వున్నాయి. అవి తాడేపల్లి : విజయవాడ, మాచర్ల. వీనిలో ఏటా మొత్తం 12,400 టన్నుల సిమెంటు తయారు చెయ్యవచ్చును.

ఉప్పు :

ఆంధ్రరాష్ట్రంలో సముద్రతీరాన, ఉత్తరపు కొసనవున్న నౌపడా నుంచి, దక్షిణపు కొసనువున్న తడవరకు ఉప్పు మళ్లు, అక్కడక్కడ వున్నాయి. వీటి మొత్తం, వైశాల్యం, 8,000 ఎకరాలు. వీనిలో మొత్తం, 2,48,000 టన్నుల ఉప్పు తయారవుతున్నది.

గాజు పరిశ్రమ :

కృష్ణ జిల్లాలో, చిలకలపూడిలో స్థాపించబడిన ఫ్యాక్టరీ కంటి జోళ్ళకు కావలసిన అద్దములు తయారు చేస్తున్నది. ఇలాటి ఫ్యాక్టరీ దక్షిణ ఇండియాలో మరొకటి లేదు.

పింగాణీ పరిశ్రమ :

1948 అక్టోబరు 15 న గూడూరులో ప్రభుత్వం పింగాణి ఫ్యాక్టరీని స్థాపించింది. దీని నిర్మాణానికి రు. 4,54,000 అయింది. ప్రస్తుతం ఇక్కడ, భోజనం చెయ్యడానికి పనికివచ్చే పింగాణీ పాత్రలు తయారు చెయ్యబడుతున్నవి. ఈ ఫ్యాక్టరీమీద మొత్తం పెట్టుబడి యిప్పటికి దాదాపు రు. 10 లక్షలు వుంటుంది.

కాగితము :

ఆంధ్రరాష్ట్రంలో రెండు కాగితాల మిల్లులు వున్నాయి. ఒకటి రాజమండ్రిలో, రెండవది సిరిపూర్‌లో. వీనిలో సిరిపూర్‌లోని మిల్లు పెద్దది. దీనిమీద పెట్టుబడి రు. 2½ కోట్లు. రాజమండ్రిలో పెట్టుబడి రు. 40 లక్షలు. సిరిపూర్ పేపరు మిల్లులో తెల్ల కాగితము, అట్ట పేపరు కూడా తయారు చేయబడుతున్నది.

వనస్పతి నూనె:

వనస్పతి నూనె తయారుచేసే ఫాక్టరీలు ఆంధ్రరాష్ట్రంలో మూడు వున్నాయి. ఈ మూడిటిలోను రోజుకు మొత్తం 70 టన్నుల నూనె తయారుచేయబడుతున్నది. అవి వున్నస్థానాలు: తాడేపల్లి, చిత్తూరు, కర్నూలు.

# సహకారోద్యమం

1957 సెప్టెంబర్ మాసాంతానికి ఆంధ్రప్రదేశ్‌లో 18,535 సహకార సంస్థలు వున్నాయి. వాటి వివరాలు యివి: సహకార బ్యాంకీలు, 21. అమలులోవున్న మూల ధనం, రు. 12,73,41,000. వ్యవసాయదారుల సహకార సంఘాలు, 15,875. అమలులోవున్న మూల ధనం, రు. 16,63,18,000. ఇతర సహకార సంఘాలు 2,699. అమలులోవున్న మూల ధనం. రు. 11,26,92,000.

రాష్ట్రంలోని సహకార సంఘాలు మొత్తం, 260. వీనిలో 32 స్త్రీల యాజమాన్యంలో వున్నాయి.

# భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్

స్కౌట్ ఉద్యమం ప్రారంభమైన రోజులలో ఇండియాలో యీ వుద్యమంలో యూరపియను బాలురు, ఆంగ్లో - ఇండియన్ బాలురు మాత్రమే చేర్చుకొనబడేవారు. 1919 లో డాక్టరు ఆనిబిసెంట్ భారతీయ యువకులకొరకు ప్రత్యేకం ఒక స్కౌటు సంస్థను స్థాపించింది. దీనికి పోటీగా, అప్పుడు మదరాసు గవర్నరుగావున్న పెంట్లండ్ ప్రభువు మరొక స్కౌటు సంస్థను స్థాపించారు. 1921 లో యీ రెండు సంస్థలు కలిసిపోయాయి.

1918 లో పండిత మదనమోహన మాలవీయ, పండిత హృదయనాథ్ కుంజ్రూ, పండిత శ్రీరాం వాజపేయిగార్లు సేవాసమితిబాయ్ స్కౌట్ అసోసియేషన్‌ను స్థాపించారు. 1937 లో, యీ సంస్థ

హిందూస్థాన్ స్కౌట్ అసోసియేషన్‌గా మారింది. 1950 డిసెంబరు 23 న యిది ఇండియన్ స్కౌట్ అసోసియేషన్‌తో కలిసిపోయింది. ఇప్పుడు దేశం అంతటికీ, భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ అనే పేరుతో ఒకే సంస్థ వుంది.

ఈ ఉద్యమం ఆశయం ఏమిటంటే బాలురకు సంఘసేవ, పౌరస్వ త్వము, క్రమశిక్షణ, విధినిర్వహణ, సత్ప్రవర్తన మొదలైన సుగుణాలను నేర్పడం. ఇది దేశమంతటా వున్న ఉద్యమం. మన రాష్ట్రంలోని అనేక నగరాలలో దీనికి బ్రాంచీలు వున్నాయి. సాధారణంగా హైస్కూళ్ళన్నింటిలోనూ బాలురు యీ సంస్థలో సభ్యులుగా వున్నారు. అనేక పట్టణాలలో సభలు, సమావేశాలు, ఉత్సవాలు జరుగుతున్నపుడు, సమ్మర్దం లేకుండా సరటంలోను, వారికి అనేక విధాల సహాయ పడటంలోను స్కౌటు బాలురు ఎంతో సహాయపడుతున్నారు.

# ఆంధ్ర ప్రదేశ్ ఆర్థికస్థితి

ఆంధ్ర ప్రదేశ్ 1959-60 బడ్జెట్‌ను ఆర్థికమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారు, 1959 ఫిబ్రవరి 20 తేదిన రాష్ట్ర శాసనసభలో ప్రవేశ పెట్టారు. ఆ బడ్జెట్ వివరాలివి :

| | |
|---|---|
| ఆదాయం అంచనా : | రు. 71,29,27,000 |
| వ్యయం అంచనా : | రు. 71,66,30,000 |
| లోటు అంచనా : | రు. 37,03,000 |

1958-59 లో ఆంధ్ర ప్రదేశ్ ఆదాయం మొత్తం, రు. 68,23,14,000 అని, ఖర్చు రు. 64,79,60,000 అని సవరించబడిన అంచనాలనుబట్టి తేలుతున్నది, అంటే, రు. 3,43,54,000 మిగులు అన్నమాట.

1958-59 అంతానికి ఆంధ్ర ప్రదేశ్‌కు గల అప్పు రు. 169,57,00,00. అయితే, 1959-60 అంతానికి అప్పు రు. 187,85,00,00. ఉంటుందని అంచనా.

1957-58 లో రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం రు. 62.33 కోట్లు వ్యయం, రు. 55.11 కోట్లు. మిగులు, రు. 7.22 కోట్లు.

## ప్రణాళికావ్యయం

1961 తో అంతమయే పంచవర్ష ప్రణాళికలో 1959-60 లో ఆంధ్రప్రదేశ్ లో అభివృద్ధి కార్యక్రమాలకు గాను రు. 37,[illegible]2,00,000 కేటాయింపబడినది.

ఈ మొత్తంలో, రు. 6,12,00,000, వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలకు, అంటే విత్తనాల ఫారములు, విత్తనాల గిడ్డంగులు, కీలక గ్రామ కేంద్ర స్థాపన, పశువైద్య కళాశాల స్థాపన, సహకార మార్కెటింగు సౌకర్యాలు, చిన్నసీటి వనరుల అభివృద్ధి కార్యక్రమాలకు ప్రత్యేకింపబడింది.

సమాజ వికాస అభివృద్ధికి రు. 310 లక్షలు, నీటి వనరులు విద్యుచ్ఛక్తి అభివృదికి రు. 15 కోట్ల 70 లక్షలు, పరిశ్రమలకి, గనుల అభివృదికి రు. 234 లక్షలు, రోడ్డు రవాణా సదుపాయాలకి రు. 175 లక్షలు: సాంఘిక సేవలకి రు. 784 లక్షలు, ప్రత్యేకించబడింది.

PRAPANCHADARSINI
SINGLE COPY — Rs. 4

Printed at
SRI RAMA & CO.,
(BHARATHAMATHA PRESS)
39, ANDERSON STREET, MADRAS-1.

Published by
KATHAMALA PRACHURANALU
5, VEERABADRAN STREET, MYLAPORE, MADRAS-4.
June 1959

# ఆంధ్ర ప్రదేశ్


బొంబాయి
మధ్య ప్రదేశ్
ఆదిలాబాద్
నిజామబాద్
కరీంనగర్
మెదక్
వరంగల్
హైదరాబాదు
నల్గొండ
ఖమ్మం
తూర్పు గోదావరి
పశ్చిమ గోదావరి
కృష్ణ
మహబూబ్ నగర్
గుంటూరు
కర్నూల్
నెల్లూరు
అనంతపూర్
కడప
చిత్తూరు
మద్రాసు
శ్రీకాకుళం
విశాఖపట్నం
బంగాళా
ఖాతము
మైసూరు

# జిల్లాలు

ఆంధ్రరాష్ట్రంలో మొత్త 20 జిల్లాలు వున్నాయి. జిల్లాలన్నిటిలోకి వైశాల్యంలో పెద్దది కర్నూలు: చిన్నది. హైదరాబాద్.

## అనంతపురం

వైశాల్యం : 7,387 చ: మైళ్ళు. జనాభా, 14,83,591. పురుషులు. 7,63,379, స్త్రీలు 7,20,212.

జిల్లాలో భూమి 42,92,129 ఎకరాలు. దీనిలో అడవి, 4,82,795 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 7,23,463 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 10,37,667 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 24,84,404 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం, రు. 21,95,529.

తాలూకాలు 11 : అనంతపురం, మడకశిర, కదిరి, గుత్తి, హిందూపురం, పెనుగొండ, కళ్యాణదుర్గం, ధర్మవరం, తాడిపత్రి, రాయదుర్గం, ఉరవకొండ.

జిల్లా కేంద్రనగరం : అనంతపురం.

## ఆదిలాబాద్

వైశాల్యం, 6,242 చ. మైళ్ళు. జనాభా, 8,31,600. పురుషులు, 4,14,187; స్త్రీలు, 4,17,413.

జిల్లాలో భూమి 45,39,777 ఎకరాలు. దీనిలో అడవి 23,42,166 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 6.58,266 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్నభూమి, 14,68,175 ఎకరాలు.

తాలూకాలు 9 : ఆదిలాబాద్, ఉట్నూర్, ఖానాపూర్, నిర్మల్, బోత్, చిన్నూరు, సిరిపూరు, లక్సెట్టిపేట, ఆసీఫాబాద్.

జిల్లా కేంద్రనగరం : ఆదిలాబాద్.

## కడప

వైశాల్యం : 5,923 చ. మైళ్ళు. జనాభా, 11,61,731; పురుషులు, 5,95.060; స్త్రీలు, 5,66,671:

జిల్లాలో భూమి 37,94,524 ఎకరాలు, దీనిలో అడవి 11,56,865 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 3,85,263 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్నబీడు 11,90,994 ఎకరాలు, వ్యవసాయం జరుగుతున్న భూమి, 10,65,400 ఎకరాలు. జిల్లామొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్ను ప్రభుత్వాదాయం. రు. 20,83,633.

తాలూకాలు 9: కడప, ప్రొద్దుటూరు, రాజంపేట, జమ్మలమడుగు, పులివెందల, బద్వేల్, రాయచోటి, సిద్ధవటం, కమలాపురం.

జిల్లా కేంద్రనగరం కడప,

## కరీంనగర్

వైశాల్యం, 4,504 చ. మైళ్ళు. జనాభా. 14,28,168. పురుషులు, 7,20.768; స్త్రీలు. 7,07,400.

జిల్లాలో భూమి 30,29,151 ఎకరాలు. దీనిలోఅడవి 7,12,882 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 2,15.542 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 4,15,738 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్నభూమి, 12,59.718 ఎకరాలు.

తాలూకాలు 7 : కరీంనగర్, సిరిసిళ్ళ, మెట్టుపలి, జగత్యాల; సుల్తానాబాద్, మహాదేవ్‌పూర్, హుజూరాబాద్.

జిల్లా కేంద్రనగరం : కరీంనగర్.

## కర్నూలు

వైశాల్యం : 9,215 చ. మైళ్ళు : జనాభా, 16,18,621 పురుషులు 8,18,708, స్త్రీలు, 7,99,913,

జిల్లాలోభూమి 58,94.616 ఎకరాలు. దీనిలో అడవి16,94,477 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 4,40,547 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు 8,42.542 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్నభూమి, 29,17,050 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం రు. 30.59,398.

తాలూకాలు 13 : ఆత్మకూరు, కర్నూలు, ద్రోణాచలం, నంద్యాల, పత్తికొండ, నందికోట్కూరు, సిరువెళ్ల, కంబం, మార్కాపురం, కోయిలకుంట్ల, బంగనపల్లి, ఆదోని, ఆలూరు.

జిల్లా కేంద్రనగరం : కర్నూలు

## కృష్ణ

వైశాల్యం: 3,496 చ. మైళ్ళు; జనాభా, 17,79,484; పురుషులు, 9,03,872; స్త్రీలు, 8,75,612.

జిల్లాలో భూమి 22,39,187 ఎకరాలు; దీనిలో అడవి 2,57,047 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 4,21,342 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 2,39,948 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 13,18,948 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమి పన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం. రు. 58,32,865.

తాలూకాలు 10: బందరు, విజయవాడ, నూజివీడు, నందిగామ, కైకలూరు, గుడివాడ, దివి, గన్నవరం, తిరువూరు, జగ్గయ్యపేట.

## ఖమ్మంమెట్

వైశాల్యం: 4.232 చ. మైళ్ళు. జనాభా, 7,00,006; పురుషులు, 3,59,089; స్త్రీలు, 3,40,917.

జిల్లాలోభూమి 27 15,796 ఎకరాలు. దీనిలో అడవి 10,17,311 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది 2.26,262 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న భూమి, 2,23,974 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్నభూమి, 7,93,215 ఎకరాలు.

తాలూకాలు 5 : ఖమ్మమ్మెట్ మధిర, ఎల్లెందు, బూరుగంపాడు. పాల్వంచ.

జిల్లా కేంద్ర నగరం : ఖమ్మమ్మెట్.

## గుంటూరు

వైశాల్యం: 5,795 చ. మైళ్లు; జనాభా, 25,49,996; పురుషులు, 12,91,745; స్త్రీలు, 12,58,251.

జిల్లాలో భూమి, 36,93,743 ఎకరాలు. దీనిలో అడవి 4,68,862 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, [illegible],36,873 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 5,70,950 ఎకరాలు వ్యవసాయం జరుగుతున్నభూమి, 21,17,052 ఎకరాలు. జిల్లా మొత్తము మీద భూమిపన్ను ప్రభుత్వాదాయం, రు. 84,75,968.

తాలూకాలు తొమ్మిది: గుంటూరు, ఒంగోలు, బాపట్ల, తెనాలి, రేపల్లె, నరసరావుపేట, పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లె.

జిల్లా కేంద్ర నగరం: గుంటూరు.

## చిత్తూరు

వైశాల్యం: 5,931 చ. మైళ్ళు; జనాభా, 18,10,377 పురుషులు 92,24,592; స్త్రీలు, 8,85,775.

జిల్లాలో భూమి 37,69,290 ఎకరాలు. దీనిలో అడవి 5,23,746 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది. 13,45,907. ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 9,45,274 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 9,54,383 ఎకరాలు. జిల్లా మొత్తం మీద భూమిపన్ను, నీటి తీరువపన్ను వల్ల ప్రభుత్వాదాయం రు. 14,22,118.

తాలుకాలు తొమ్మిది : చిత్తూరు, మదనపల్లి, వాయల్పాడు, కాళహస్తి, పుత్తూరు, పుంగనూరు. తిరుత్తణి, పలమనేరు, చంద్రగిరి.

జిల్లా కేంద్రనగరం : చిత్తూరు.

## తూర్పు గోదావరి జిల్లా

వైశాల్యం: 5,768 చ. మైళ్ళు. జనాభా, 24,14,808. వీరిలో పురుషులు, 12,06,483, స్త్రీలు 12,08,325.

జిల్లాలో 3,064 చ. మైళ్ళ ప్రదేశం ఏజెన్సీ. దీనిలో జనాభా 2,02,784 మందిలోనూ, 1,04,584 మంది పురుషులు. 1,03,200 మంది స్త్రీలు.

జిల్లాలో భూమి 36,36,578 ఎకరాలు. దీనిలో అడవి 13,35,134 ఎకరాలు పోగా, 5,25,791 ఎకరాలు వ్యవసాయానికి రానిది. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు 7,09,614 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 10,66,463 ఎకరాలు, జిల్లా మొత్తంమీద, భూమిపన్ను, నీటి తీరువపన్ను వల్ల ప్రభుత్వాదాయం, రు. 83,20,643.

తాలూకాలు 13: రామచంద్రపురం, రాజమండ్రి, కాకినాడ, తుని, రాజోలు, పెద్దాపురం, అమలాపురం, భద్రాచలం, నూగూరు, యల్లవరం, చోడవరం, పిఠాపురం, కొత్తపేట.

జిల్లా కేంద్రనగరం: కాకినాడ: జిల్లాకోర్టు మాత్రం, రాజమండ్రిలో వుంది.

## నల్లగొండ

వైశాల్యం 5,431 చ. మైళ్లు. జనాభా, 12.52,810. పురుషులు, 6,44,144. స్త్రీలు, 6,08,666.

జిల్లాలో భూమి 34,60,884 ఎకరాలు. దీనిలో అడవి 3,13.873 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది 2,56,847 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు 6.15,537 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 17,66,987 ఎకరాలు.

తాలూకాలు 7: నల్లగొండ. మిరియాలగూడ, దేవరకొండ, రామన్నపేట, భువనగిరి, సూర్యాపేట, హుజూర్ నగర్.

జిల్లా కేంద్రనగరం: నల్లగొండ.

## నిజామాబాద్

వైశాల్యం, 3,203 చ. మైళ్లు. జనాభా. 8,33,611 పురుషులు, 4,12,903; స్త్రీలు, 4,20,708.

జిల్లాలో భూమి 18,81,757 ఎకరాలు. దీనిలో అడవి 4,55,149 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 2.33,608 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 2,28,603 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 6,64,052 ఎకరాలు.

తాలూకాలు 7 : నిజామాబాద్, కామారెడ్డి, ఎల్లారెడ్డి, బన్స్వాడా, బోధన్, ఆర్మూర్, ముధనూర్.

జిల్లా కేంద్రనగరం : నిజామాబాద్.

## పడమటి గోదావరి

వైశాల్యం 2,988 చ. మైళ్లు. జనాభా, 16,97,727; పురుషులు, 8,48,990; స్త్రీలు, 8,48,737.

జిల్లాలో భూమి, 19,29,460 ఎకరాలు. దీనిలో అడవి 1,18,471 ఎకరాలుపోగా వ్యవసాయానికి రానిది, 3,92,112 ఎకరాలు. వ్యవసాయం చెయ్యని బీడు 4,06,372 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 9,54,875 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వాదాయం, రు. 71,34,071.

తాలూకాలు ఎనిమిది : ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, పోలవరం, నర్సాపురం, కొవ్వూరు, చింతలపూడి, తణుకు.

జిల్లా కేంద్రనగరం : ఏలూరు.

## మహబూబ్‌నగర్

వైశాల్యం, 6,833 చ. మైళ్లు. జనాభా, 14,37,879; పురుషులు, 7,20,170; స్త్రీలు, 7,17,709.

జిల్లాలో భూమి 38,46,774 ఎకరాలు. దీనిలో అడవి, 7,76,321 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 2,80,873 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 5,60,728 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 18,19,220 ఎకరాలు.

తాలూకాలు 10 : మహబూబ్‌నగర్, వనపర్తి, ఆత్మకూరు, మఖ్తాల్, పరిగి, షాద్‌నగర్, కల్వకుర్తి, అచ్చంపేట, నాగర్‌కర్నూలు, కొల్లాపూర్, గద్వాల, అలంపూర్, కొడంగల్.

జిల్లా కేంద్ర నగరం : మహబూబ్‌నగర్.

## మెదక్

వైశాల్యం, 3,804 చ. మైళ్లు. జనాభా, 11,24,240. పురుషులు, 5,64,751; స్త్రీలు, 5,59,439.

జిల్లాలో భూమి 22,73,206 ఎకరాలు. దీనిలో అడవి 2,91,217 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 2,20,548 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 7,94,458 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 10,32,095 ఎకరాలు.

తాలూకాలు 8: సంగారెడ్డి, ఆందోళ్, మెదక్, సిద్దిపేట, గజ్వేల్, నర్సాపూర్, జహీరాబాద్, నారాయణఖేడ్.

జిల్లా కేంద్ర నగరం: సంగారెడ్డి.

## వరంగల్

వైశాల్యం: 5,526 చ. మైళ్ళు. జనాభా, 13,25,984; పురుషులు, 6,78,801; స్త్రీలు, 6,47,183.

జిల్లాలో భూమి 25,91,493 ఎకరాలు. దీనిలో అడవి 8,77,468 ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 2,47,216 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 3,42,403 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 10,77,913 ఎకరాలు.

తాలూకాలు 6: వరంగల్, పాఖాల, ములుగు, మహబూబాబాద్, జనగామ.

జిల్లా కేంద్ర నగరం: వరంగల్.

## విశాఖపట్టణం

వైశాల్యం: 5,201 చ. మైళ్లు, జనాభా, 30,72,798. వీరిలో పురుషులు 10,23,192; స్త్రీలు 10,49,501.

జిల్లాలో భూమి, 33,14,434 ఎకరాలు. దీనిలో అడవి 14,46,164 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 7,86,636 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 3,01,844 ఎకరాలు, వ్యవసాయం

జరుగుతున్న భూమి, 7,77,690 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమి పన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం రు. 10,01,992. జిల్లాలో చింతపల్లి తాలూకా, నరసపట్నం, చోడవరం, శృంగవరపుకోట తాలూకాలలోని ప్రాంతాలు, మొత్తం 2,595, చ. మైళ్ళ ప్రాంతం ఏజన్సీ. ఈ ప్రాంతంలో నివసించే జనులసంఖ్య 1,80,105 మాత్రమే.

తాలూకాలు 9: చోడవరం, యలమంచిలి, నర్సీపట్నం, అనకాపల్లి, విశాఖపట్టణం, శృంగవరపుకోట, విజయనగరం, భీమునిపట్టణం, చింతపల్లి.

జిల్లా కేంద్రనగరం: విశాఖపట్టణం.

## శ్రీకాకుళం

వైశాల్యం, 3,902 చ. మైళ్లు. జనాభా 21,23,136. వీనిలో పురుషులు 10,34,910; స్త్రీలు 10,88,226.

జిల్లాలో భూమి 24,88,931 యెకరాలు. దీనిలో అడవి 4,35,968 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,38,188 యెకరాలు. వ్యవసాయానికి పనికిరాని భూమి, 5,45,898 యెకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 8,73,022 ఎకరాలు. జిల్లా మొత్తం మీద భూమిపన్ను, నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వానికివచ్చిన ఆదాయం రు. 21,33,164.

తాలూకాలు, 11: ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి, నరసన్నపేట, పాతపట్నం, శ్రీకాకుళం, పాలకొండ, పార్వతీపురం, బొబ్బిలి, సాలూరు, చీపురుపల్లి.

జిల్లా కేంద్ర నగరం: శ్రీకాకుళం.

## హైదరాబాద్

వైశాల్యం: 2,904 చ. మైళ్లు. జనాభా 18,18,034; పురుషులు, 9,14,374; స్త్రీలు; 9,03,660.

జిల్లాలో భూమి 10,23,177 ఎకరాలు. దీనిలో అడవి 77,157

ఎకరాలు పోగా వ్యవసాయానికి రానిది, 1,09,553 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు, 2,39,262 ఎకరాలు. వ్యవసాయం జరుగుతున్న భూమి, 3,74,862 ఎకరాలు.

తాలూకాలు 7 : తూర్పు హైదరాబాద్, పడమటి హైదరాబాద్, షహాబాద్, మేడ్చల్, ఇబ్రాహింపట్నం, వికారాబాద్, తాండూర్.

జిల్లా కేంద్ర నగరం : హైదరాబాద్.

## స్థానిక పరిపాలన సంస్థలు

ఆంధ్రప్రదేశ్‌లో 20 జిల్లా బోర్డులు వున్నాయి. అంటే ప్రతి జిల్లాకు ఒక బోర్డు వుందన్న మాట.

రెండు మునిసిపల్ కార్పొరేషనులు వున్నాయి. ఒకటి హైదరాబాద్ నగరానికి, మరొకటి సికందరాబాద్ నగరానికి.

నగర మునిసిపాలిటీలు 57 వున్నాయి. అవేమిటంటే :

అనకాపల్లి, అనంతపురం, అమలాపురం, ఆదిలాబాద్, ఆదోని, ఏలూరు, ఒంగోలు, కడప, కరీంనగర్, కర్నూలు, కాకినాడ, ఖమ్మం, గద్వాల, గుంటకల్, గుడివాడ, గూడూరు, చిత్తూరు, చీరాల, జగత్యాల, తాండూరు, తాడిపత్రి, తాడేపల్లిగూడెం, తిరుపతి, తెనాలి, తుని, ద్రాక్షారామం, నంద్యాల, నరసరావుపేట, నరసాపురం, నల్లగొండ, నారాయణపేట, నిజామాబాద్; నిర్మల్, నెల్లూరు, పాలకొల్లు, పిఠాపురం, పెద్దాపురం, ప్రొద్దుటూరు, బాపట్ల, బొబ్బిలి, బోధన్, భీమవరం, భీమునిపట్టణం, భువనగిరి, మచిలీపట్టణం, మహబూబ్‌నగర్, మెదక్, రాజమండ్రి, రేపల్లె, వరంగల్, విజయనగరం, విజయవాడ, విశాఖపట్టణం, శ్రీకాకుళం, సామర్లకోట; సాలూరు, సిద్దిపేట, హిందూపూర్.

వీనిలో తెలంగాణాలో వున్న వాటిని సిటీ మునిసిపాలిటీలు అంటారు.

పైన చెప్పిన మునిసిపాలిటీలు కాక; తెలంగాణా ప్రాంతంలో టౌను మునిసిపాలిటీలు 64 వున్నాయి. ఈ నగరాలలో జనాభా 15,000

లోపు వుంటుంది. వీటిని, మిగతా ఆంధ్రదేశంలోని మొదటి తరగతి పంచాయితీలతో సమానంగా పరిగణింపవచ్చును.

తెలంగాణాను మినహాయించితే, తక్కిన ఆంధ్రదేశంలో 242 మొదటి తరగతి పంచాయితీలు వున్నాయి.

ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద 6,933 గ్రామ పంచాయితీలు వున్నాయి. వీటిలో 1,133 గ్రామ పంచాయితీలు తెలంగాణా ప్రాంతంలో వున్నాయి. తక్కిన 5,800 పూర్వపు ఆంధ్రరాష్ట్ర ప్రాంతంలో వున్నాయి. తెలంగాణా ప్రాంతంలో వున్న వాటిని గ్రామ పంచాయితీలు అంటారు. మిగతా ఆంధ్రదేశంలోని వాటిని రెండవ తరగతి పంచాయితీలు అంటారు.

ఆంధ్రప్రదేశ్‌లోని స్థానిక పరిపాలన సంస్థల నిర్మాణంలోను; వాని అధికారాలలోను తెలంగాణాలో వున్న వానికి, తక్కిన ఆంధ్ర ప్రదేశ్‌లో వున్న వానికీ తేడాలు వున్నవి. ఈ తేడాలను తొలగించి, రాష్ట్రమంతటా ఒకే పద్ధతిలో స్థానిక సంస్థలను నెలకొల్పడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

## ఆంధ్రప్రదేశ్ రాజధాని

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరం. ఈ నగరం, సికందరాబాద్ నగరం రెండూ కలిసివున్నాయి. రెండింటి వైశాల్యము 96 చ. మైళ్లు. హైదరాబాద్ నగరం మాత్రం, 60 చ. మైళ్లు.

ఈ నగరం సముద్రమట్టానికి 2000 అడుగుల ఎత్తున వున్నది. అందువలన యిచ్చట, ఎండకాలంలో వేడిమి నూరు డిగ్రీలు ఫారన్ హీట్ (35 డిగ్రీలు సెంటి గ్రేడ్) కన్న ఎక్కువ వుండదు. చలికాలంలో 50 డిగ్రీలు ఫారన్ హీట్ (16 డిగ్రీలు సెంటి గ్రేడ్) వరకు వుంటుంది.

హైదరాబాద్ నగరము, క్రీస్తుశకము 1589 లో గోలగొండ నవాబు మహమ్మద్ కులికుతుబ్ షాచే నిర్మించబడినది. అప్పుడు, ఆ నగరమునకు భాగ్యనగర్ అని పేరు. క్రమంగా యీ నగరం పెరిగినది.

భారతదేశంలోని మహానగరములలో నాల్గవ స్థానం హైదరాబాద్ నగరానిది.

హైదరాబాద్ నగరం, రెండు నగరాల సమాఖ్య. ఒకటి హైదరాబాద్, రెండవది సికందరాబాద్. రెండు నగరాలకు విడివిడిగా రెండు మునిసిపల్ కార్పొరేషనులు వున్నాయి.

# అసెంబ్లీ; ఎన్నికలు

ఆంధ్రప్రదేశ్‌లోని పార్లమెంటు నియోజక వర్గాలన్నిటిలోనూ తెలంగాణా ప్రాంతంలోని అసెంబ్లీ నియోజక వర్గాలన్నిటిలోనూ ఎన్నికలు 1957 మార్చి నెలలో జరిగినవి.

పార్లమెంటు స్థానాలలో, నాల్గిటికీ, అసెంబ్లి స్థానాలలో నాల్గిటికీ సభ్యులు పోటీలేకుండా ఎన్నుకోబడినారు. ఇలా ఎన్నుకోబడినవారంతా కాంగ్రెస్ పార్టీవారే.

శాసనసభ :

రాష్ట్రంలో లెజిస్లేటివ్ కౌన్సిలు, అసెంబ్లి వున్నాయి. అసెంబ్లీ రాష్ట్రనిర్మాణం జరిగినప్పటినుంచీ వున్నది. కౌన్సిలు 1958 జులై 1 న ఏర్పాటు చేయబడినది.

## లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు :

ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిలు ఎన్నికలు 1958 జూన్ నెలలో జరిగినవి. ఆయా నియోజక వర్గాలనుంచి ఎన్నుకోబడిన సభ్యుల పేర్లు, యీ క్రింద ఇవ్వబడినవి. ఈ సభ్యులలో కొందరు 1960 జులై వరకు, కొందరు 1962 జులై వరకు, తక్కినవారు 1964 జులై వరకు సభ్యులుగా వుంటారు. ఈ సభ్యుల పదవీ పరిమితి ముగిసేలోపల, వారి స్థానాలకు మళ్ళీ ఎన్నికలు జరుగుతవి. అంటే, ప్రతి రెండేసి ఏండ్లకు, కౌన్సిలులోని మూడవ వంతు స్థానాలకు ఎన్నిక జరుగుతుందన్నమాట. అయితే 1960 నుంచి జరిగే ఎన్నికలలో సభ్యత్వం పొందినవారి పదవీ పరిమితి ఆరేసి సంవత్సరాలు వుంటుంది.

అసెంబ్లీచే ఎన్నుకోబడినవారు : 31. వీరిలో కాంగ్రెసు పార్టీవారు 19 మంది. వీరిలో 1960 జులైవరకు సభ్యులుగా వుండేవారు:

అబు యూసుఫ్; జె. సి. నాగిరెడ్డి; ఎన్. ఎం. విలియమ్స్; శ్రీమతి ద్రో ణంరాజు లక్ష్మీ బాయమ్మ: శ్రీమతి ఫైజున్నిసా; మంతెన వెంకట సూర్యసుబ్బరాజు; మాడపాటి హనుమంతరావు; ఐ. లింగయ్య; మద్దూరి సుబ్బారెడ్డి; షేక్ గాలిబ్; 1962 జూలై వరకు: గొట్టిపాటి బ్రహ్మయ్య; ఎన్. వి. జగన్నాథం; రావు అచ్యుతరావు; 1964 జూలై వరకు: చీకటి పరశురామనాయుడు; దామర్ల రమాకాంతరావు; శ్రీమతి గోగినేని భారతిదేవి; కె. వి. ప్రతాపరెడ్డి; భోజరెడ్డి; ఆర్. సీతారామయ్య.

కమ్యూనిస్టులు : 4: ఈదుకల్లు సదాశివన్ (1960); గుంటూరు బాపనయ్య (1962); మఖ్దూం మొహియుద్దిన్ (1964); ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి (1964)

సోషలిస్టులు: 2: గుట్టా రాజారావు, 1962; వై. సూర్యనారా యణరావు, 1962.

స్వతంత్రులు : 6: పైడా వెంకటనారాయణ, 1962; బెండి కూర్మన్న, 1962; బాచిన సుబ్బారావు, 196:; బెజవాడ పాపిరెడ్డి. 1962,గొర్రెపాటి బుచ్చి అప్పారావు, 1964! చిన్న శివారెడ్డి, 1964.

స్థానికసంస్థల నియోజక వర్గాలనుంచి ఎన్నుకోబడిన వారు, 31:

వీరిలో ఉత్తర సర్కారులనుంచి, 4: వీరిలో కాంగ్రెసు, 2: అప్పసాని అప్పన్నదొర, కొమ్మూరి అప్పడు దొర; వీరిద్దరూ 1962 జూలైవరకు. కమ్యూనిస్టు 1, పెంటకోట వెంకటరమణ, 1962; స్వతంత్ర 1, త్రిపురాన రాఘవదాస్, 1962.

మధ్య సర్కారుల నుంచి, 4. వీరిలో కాంగ్రెసు, 3: వెనిగళ్ళ సత్యనారాయణరావు, తుమ్మలపల్లి వీరభద్రరావు, రుద్రరాజు రామ లింగరాజు; కమ్యూనిస్టు, శంకు అప్పారావు. ఈ నలుగురూ 1960 వరకు సభ్యులుగా వుంటారు.

దక్షిణ సర్కారులనుంచి, 6. వీరిలో కాంగ్రెసు, 3: పొన్నలూరి వీరరాఘవరెడ్డి, బొజ్జా అదినారాయణరావు, వుండవల్లి సత్యనారాయణ మూర్తి; కమ్యూనిస్టులు, 2: కొల్లా వెంకయ్య, శ్రీమతి మానికొండ సూర్యావతి; స్వతంత్రులు, 1. పెల్లేటి వెంకటకృష్ణారెడ్డి. ఈ అరుగురూ 1964 వరకు సభ్యులుగా వుంటారు.

రాయలసీమనుంచి: 6: వీరిలో కాంగ్రెసు, 5: డి. నారాయణ రెడ్డి, రాజా వెంకటసుబ్బారెడ్డి, దప్పిలి పాండురంగరెడ్డి, కె. షరిఫుద్దీన్, కే. ఆదికేశవులు నాయుడు; కమ్యూనిస్టు, 1. ఎద్దుల ఈశ్వరరెడ్డి. ఈ ఆరుగురూ 1960 వరకు సభ్యులుగా వుంటారు.

దక్షిణ తెలంగాణానుంచి : 6: వీరిలో కాంగ్రెసువారు, 5: ఎర్రం సత్యనారాయణ, కె. రామచంద్రారెడ్డి, వి. నరసింహాచారి, ఎస్. సిద్దరెడ్డి. సుబ్రహ్మణ్యంనాయుడు; కమ్యూనిస్టు, ఎం. గురువారెడ్డి. ఈ ఆరుగురూ 1964 వరకు సభ్యులుగా వుంటారు.

ఉత్తర తెలంగాణానుంచి: 5: వీరిలో కాంగ్రెసువారు, 4. ఇ. లక్ష్మారెడ్డి, జె. రఘోత్తమరెడ్డి, మహమ్మద్ హనీఫ్ ఖాన్, హనుమంతరెడ్డి: కమ్యూనిస్టు, 1. బి. గంగారాం. ఈ అయిదుగురూ 1962 వరకు సభ్యులుగా వుంటారు.

పట్టభద్రుల నియోజకవర్గాలనుంచి ఎన్నుకోబడినవారు : 8.

సర్కారుజిల్లాలనుంచి ౩: ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు 1962; అవసరాల రామారావు 1962; ములుకుట్ల వెంకటశాస్త్రి 1962.

రాయలసీమనుంచి: 2: నివర్తి వెంకటసుబ్బయ్య, 1964; ఎం. వి. కృష్ణారెడ్డి, 1964.

తెలంగాణనుంచి: 3: ఆటావుర్ రహమన్, 1960; ఎం. ఆనందం, 1960; శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మి, 1960.

ఉపాధ్యాయుల నియోజకవర్గాలనుంచి ఎన్నుకోబడినవారు, 8.

సర్కారుజిల్లాలనుంచి: 4: పి. ఎల్. టి. శ్రీరామమూర్తి, 1962; దేశరాజు సత్యసుబ్రహ్మణ్యం, 1962; వెంపటి పురుషోత్తం, 1962; ఎ. ఎల్. నారాయణ, 1962.

రాయలసీమనుంచి: 2: సింగరాజు రామకృష్ణయ్య, 1964; డి. వి. సుబ్బాశాస్త్రి, 1964.

తెలంగాణనుంచి: 2: కొండపర్తి మనోహరరావు, 1960; కాళోజి నారాయణరావు, 1960.

గవర్నర్ చే నామినేట్ చేయబడినవారు : 12; 1964 జూలై వరకు: గోకరాజు సుబ్బరాజు; పెమ్మరాజు వెంకటరావు; బి. ఎస్. రెడ్డి; హరూన్ ఖాన్ షెర్వాని.

1962 జూలై వరకు : బిక్కని వెంకటరత్నం; విశ్వనాథ సత్య నారాయణ; శ్రీమతి కోటిరెడ్డిగారి రామసుబ్బమ్మ; ఎర్నెస్ట్ జిడియన్.

1960 జూలై వరకు : శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి; శివలెంక శంభుప్రసాద్; జెయిన్ యార్ జంగ్ బహదుర్; ఎస్. గోవిందరాజులు నాయుడు.

## అసెంబ్లి

అసెంబ్లి సభ్యుల సంఖ్య మొత్తం, 301. వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 43. షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించబడిన స్థానాలనుంచి ఎన్నుకోబడినవారు 11.

అసెంబ్లీకి సభ్యులను ఎన్నుకోవలసిన నియోజక వర్గాల సంఖ్య, 246. వీటిలో ద్విసభ్య నియోజక వర్గాలు, 52.

స్పీకరు : అయ్యదేవర కాళేశ్వరరావు

డిప్యూటీ స్పీకరు : కొండా లక్ష్మన్

స్పీకరు జీతం : నెలకు రు. 1,000. ఇంటి అద్దె రు. 250; కారు అలవెన్సు రు. 250.

శాసన సభ్యుల పేర్లు జిల్లాలవారీగా; మొదట నియోజకవర్గం పేరు; తరువాత సభ్యుని పేరు, సభ్యుని పార్టి వివరాలు యీ క్రింద యివ్వబడినవి.

### అనంతపురం జిల్లా : 14

1. కదిరి; కె. వి. వేమారెడ్డి; 2. నల్లమడ, బయ్యపరెడ్డి. 3. గోరంట్ల; పూల వెంకటరమణప్ప. 4, హిందూరం, జనరల్, కల్లూరు సుబ్బారావు, 5. హిందూపురం రిజర్వ్డ్; శ్రీమతి బి. రుక్మిణీదేవి. 6.

పెనుకొండ, ఎ. చిదంబరరెడ్డి, 7. ధర్మవరం జనరల్, పప్పూరి రామాచార్యులు; 8. ధర్మవరం; రిజర్వ్‌డ్, కె. శాంతప్ప. 9. అనంతపురం, సి. అంథోనిరెడ్డి, 10. పుట్లూరు, తరిమెల రామచంద్రారెడ్డి, 11. తాడిపత్రి, చల్లా సుబ్బారాయుడు, 12. గుత్తి; జనరల్; చందా నారాయణప్ప. 13. గుత్తి, రిజర్వ్‌డ్, ఎం. రాజారాం. 14. రాయదుర్గం; ఎన్. పి. శేషాద్రి. ఈ జిల్లానుంచి ఎన్నిక అయిన వారందరూ కాంగ్రెసు పార్టీ వారే.

## అదిలాబాద్ జిల్లా : 8

1. నిర్మల్, కె. ముత్యంరెడ్డి, సోషలిస్టు, 2. లక్సెట్టిపేట; జి. వి. పీతాంబరరావు, కాంగ్రెసు, 3. ఆదిలాబాద్, రంగనాథరావు, పీపుల్స్ డెమొక్రాటిక్ ఫ్రంట్, 4. చెన్నూర్, ఎస్. వి. కె. ప్రసాదరావు, పి. డి. ఎఫ్, 5. సిర్పూర్, జనరల్, జి. వెంకటస్వామి, కాంగ్రెసు, 6. సిర్పూర్, రిజర్వ్‌డ్, కె. రాజమల్లు, ప్రజాసోషలిస్టు 7. అసిఫాబాద్. జనరల్, జి. నారాయణరెడ్డి, కాంగ్రెసు, 8. అసిఫాబాద్, రిజర్వ్‌డ్, ఎం. కాశీరాం, కాంగ్రెసు.

## కడప జిల్లా : 11

1. రాజంపేట, జనరల్, పి. పార్థసారథి, కాంగ్రెసు, 2. రాజంపేట, రిజర్వ్‌డ్; పి. వెంకటసుబ్బయ్య, కాంగ్రెసు, 3. రాయచోటి, వై. ఆదినారాయణరెడ్డి, కాంగ్రెసు, 4. లక్కిరెడ్డిపల్లి, కడప కోటిరెడ్డి, కాంగ్రెసు, 5. కడప, షేక్‌మహమ్మద్ రహింతుల్లా, కాంగ్రెసు, 6. బద్వేల్, బండారు రత్నసభాపతి, ప్రజాసోషలిస్టు, 7. మైదుకూరు, బొమ్మురామిరెడ్డి, స్వతంత్ర, 8. ప్రొద్దుటూరు, ఆర్. చంద్రఓబులరెడ్డి, స్వతంత్ర, 9. జమ్మలమడుగు, కుందారామయ్య, కాంగ్రెసు, 10 కమలాపురం, నర్రెడ్డి శంభురెడ్డి, కాంగ్రెసు, 11. పులివెందల, పి. బసిరెడ్డి, కాంగ్రెసు.

## కరీంనగర్ జిల్లా : 14

1. జగత్యాల, డి. హనుమంతరావు, కాంగ్రెసు; 2. కరీంనగర్, జె. చొక్కారావు, కాంగ్రెసు, 3. మంథని, పి. వి. నరసింహారావు

కాంగ్రెసు, 4. మెట్టుపల్లి, కె. ఆనందరావు, పి. డి. ఎఫ్, 5. హుజూరాబాద్, జనరల్, పొలసాని నరసింగరావు, సోషలిస్టు, 6. హుజూరాబాద్ రిజర్వ్‌డ్, గడిపల్లి రాములు, సోషలిస్టు, 7. సిరిసిల్ల, జనరల్, అమృతలాల్ శుక్ల, పి. డి. ఎఫ్, 8. సిరిసిల్ల, రిజర్వ్‌డ్, కె. నరసయ్య, పి. డి. ఎఫ్. 9. చొప్పదండి, సి. హెచ్. రాజేశ్వరరావు, పి. డి. ఎఫ్. 10. ఇందుర్తి, సి. చొక్కారావు, పి. డి. ఎఫ్. 11. సుల్తానాబాద్, జనరల్, రామచంద్రరావు, కాంగ్రెసు, 12. సుల్తానాబాద్, రిజర్వ్‌డ్, బి. రాజారాం, కాంగ్రెసు, 13. మైదారం, జి. లక్ష్మారెడ్డి, పి. డి. ఎఫ్, 14. బుగ్గరం, బద్దం యెల్లారెడ్డి, కమ్యూనిస్టు.

## కర్నూలు జిల్లా : 16

1. ఆలూరు, హెచ్. రామలింగారెడ్డి, కాంగ్రెసు, 2. ఆదోని, జి. బుస్సన్న; ప్రజా సోషలిస్టు పార్టి; 3. కోసిగి. టి. జి. తిమ్మయ్య, కాంగ్రెసు, 4. ఎమ్మిగనూరు, జనరల్, కె. విజయభాస్కరరెడ్డి. కాంగ్రెసు. 5. ఎమ్మిగనూర్, రిజర్వ్‌డ్, డి. సంజీవయ్య, కాంగ్రెసు. 6. పత్తికొండ, లక్ష్మీనారాయణరెడ్డి, స్వతంత్ర. 7. ద్రోణాచలం, బి, పి. శేషారెడ్డి, స్వతంత్ర. 8. కర్నూలు, మహబూబ్ అలిఖాన్. కాంగ్రెసు, 9. నందికొట్కూరు, జనరల్, ఇ. అప్పయ్యరెడ్డి, కాంగ్రెసు. 10. నందికొట్కూరు, రిజర్వ్‌డ్, ఎన్. కె. లింగం, కాంగ్రెసు. 11. నంద్యాల, జి. వెంకటరెడ్డి, కాంగ్రెసు. 12. కోయిలకుంట్ల, బి. వి. సుబ్బారెడ్డి, స్వతంత్ర. 13. సిరివెళ్ల, సి. పి. తిమ్మారెడ్డి, కాంగ్రెసు, 14. గిద్దలూరు, పిడతల రంగారెడ్డి, 15. మార్కాపురం, కందుల ఓబులరెడ్డి, కాంగ్రెసు. 16. ఎర్రగొండపాలెం, నక్కా వెంకటయ్య, కాంగ్రెసు.

## కృష్ణా జిల్లా : 17

1. కైకలూరు, కమ్మిల అప్పారావు, కాంగ్రెసు. 2. గుడివాడ, జనరల్, అడుసుమల్లి వెంకటసుబ్రమణ్యం, కాంగ్రెసు. 3. గుడివాడ, రిజర్వ్‌డ్, వేముల కూర్మయ్య, కాంగ్రెసు. 4. గన్నవరం, పుచ్చలపల్లి, సుందరయ్య, కమ్యూనిస్టు. 5. కంకిపాడు, జాగర్లమూడి రామకోటయ్య,

కాంగ్రెసు. 6. విజయవాడ దక్షిణం, అయ్యదేవర కాళేశ్వరరావు, కాంగ్రెసు. 7. విజయవాడ ఉత్తరం, మరుపిళ్ల చిట్టి, కాంగ్రెసు. 8. మైలవరం, వేలంకి విశ్వేశ్వరరావు, కమ్యూనిస్టు. 9. నందిగామ. పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, కమ్యూనిస్టు, 10. కంచికచెర్ల, మాగంటి రామయ్య, కాంగ్రెసు. 11. తిరువూరు, పేట బాపయ్య, కాంగ్రెసు. 12. నూజివీడు మేకా రంగయ్యప్పారావు బహదూర్, కాంగ్రెసు. 13. ఉయ్యూరు, కాకాని వెంకటరత్నం, కాంగ్రెసు. 14. మల్లేశ్వరం, పిన్నెంటి పమిడేశ్వరరావు, కాంగ్రెసు. 15. బందరు, డాక్టర్ రాళ్లపల్లి అచ్యుతరామయ్య, కాంగ్రెసు. 16. దివి, జనరల్, శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్, కాంగ్రెసు. 17. దివి, రిజర్వ్‌డ్, మల్లిపూడి రాజేశ్వరరావు, కాంగ్రెసు.

## కమ్మం జిల్లా : 7

1. పాలవంచ, కె. సుదర్శనరావు, కాంగ్రెసు. 2. మధిర, బొమ్మకంటి సత్యనారాయణ, కాంగ్రెసు. 3. ఇల్లెందు, జనరల్, కె. ఎల్. నరసింహారావు, పి. డి. ఎఫ్. 4. ఇల్లెందు, రిజర్వ్‌డ్, దొడ్డ నరసయ్య, కాంగ్రెసు. 5. ఖమ్మం జనరల్, శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ, కాంగ్రెస్. 6. ఖమ్మం, రిజర్వ్‌డ్, ఎన్. పెద్దన్న, పి. డి. ఎఫ్. 7. వెంసూర్, జె. కొండలరావు, కాంగ్రెసు.

## గుంటూరు జిల్లా : 25

1. కూచినపూడి, అనగాని భగవంతరావు, కాంగ్రెసు. 2. రేపల్లె, యాదం చెన్నయ్య, కాంగ్రెసు, 3. వేమూరు, కల్లూరి చంద్రమౌళి, కాంగ్రెసు. 4. దుగ్గిరాల, పుతుంబాక శ్రీరాములు, కాంగ్రెసు, 5. తెనాలి, ఆలపాటి వెంకటరామయ్య, కాంగ్రెసు, 6. పొన్నూరు, గోవాడ పరంధామయ్య, కాంగ్రెసు. 7. బాపట్ల, మంతెన వెంకటరాజు, కాంగ్రెసు. 8, చీరాల, ప్రగడ కోటయ్య, కాంగ్రెసు. 9. పరుచూరు కొల్లా రాఘవయ్య, కాంగ్రెసు, 10. పెద్దకాకాని, గింజుపల్లి బాపయ్య, కాంగ్రెసు. 11. మంగళగిరి, మేకా కోటిరెడ్డి, కాంగ్రెసు. 12. గుంటూరు-1: తెల్లాకుల జాలయ్య, కాంగ్రెసు. 13. గుంటూరు-2:

మేదూరి నాగేశ్వరరావు, కాంగ్రెసు. 14. పెద్దకూరపాడు, గణపా రామస్వామి రెడ్డి, కాంగ్రెసు. 15. ఫిరంగిపురం, కాసు బ్రహ్మానందరెడ్డి, కాంగ్రెస్. 16. సత్తెనపల్లి, వావిలాల గోపాలకృష్ణయ్య, స్వతంత్ర. 17. గురజాల, మండవ బాపయ్య చౌదరి, కాంగ్రెస్. 18. మాచెర్ల, మందపాటి నాగిరెడ్డి. కమ్యూనిస్టు. 19. వినుకొండ, నలబోలు గోవింద రాజులు, కాంగ్రెస్. 20. మార్టూరు, బండ్లమూడి వెంకటశివయ్య, కాంగ్రెస్. 21. నరసరావుపేట, నల్లపాటి వెంకటరామయ్య, కాంగ్రెస్. 22. అద్దంకి, నాగినేని వెంకయ్య, కాంగ్రెస్. 23 అమ్మనబ్రోలు, జాగర్లమూడి చంద్రమౌళి. 24. ఒంగోలు, జనరల్, డాక్టర్ బి. లక్ష్మీనారాయణ, స్వతంత్ర. 25. ఒంగోలు, రిజర్వ్డ్, టి. జియ్యర్ దాసు, కాంగ్రెస్.

## తూర్పు గోదావరి జిల్లా : 23

1. భద్రాచలం, జనరల్, మహమ్మద్ తహశీల్, కమ్యూనిస్టు. 2. భద్రాచలం, రిజర్వ్డ్, శ్రీమతి వాణిరమణరావు, కాంగ్రెస్. 3. రాజమండ్రి, డాక్టర్ ఎ. బాలనాగేశ్వరరావు, ప్రజాపార్టి. 4. బూరుగుపూడి, జనరల్, శ్రీమతి నీరుకొండ వెంకటరత్నమ్మ కాంగ్రెసు. 5. బూరుగుపూడి, రిజర్వ్డ్, బత్తిన సుబ్బారావు, స్వతంత్ర. 6. జగ్గంపేట దూరిశెట్టి గోపాలరావు, స్వతంత్ర. 7. పెద్దాపురం, దూర్వాసుల వెంకటసుబ్బారావు, కమ్యూనిస్టు. 8. పత్తిపాడు, పర్వత గుర్రాజు, కాంగ్రెసు. 9. తుని, రాజా వత్సవాయ వెంకటకృష్ణరాజు. కాంగ్రెసు. 10. పిఠాపురం; వాడ్రేవు గోపాలకృష్ణ, కాంగ్రెసు. 11. సామర్లకోట, పుత్సల సత్యనారాయణ, కమ్యూనిస్టు. 12. కాకినాడ, మల్లిపూడి పళ్లంరాజు కాంగ్రెసు. 13. పల్లిపాలెం; జనరల్, రేమళ్ల తిరుపతిరావు, కాంగ్రెసు. 14. పల్లిపాలెం, రిజర్వ్డ్, రెడ్డి కామయ్య, కాంగ్రెసు, పోటీ లేకుండా ఎన్నిక. 15. రామచంద్రపురం, రాజా కాకర్లపూడి రామచంద్రరాజు, ప్రజాపార్టి. 16. అనపర్తి, తేతలి లక్ష్మీనారాయణరెడ్డి, ప్రజాపార్టి. 17. పామర్రు, బలుసు ప్రభాకర పట్టాభిరామారావు, కాంగ్రెసు. 18. చెయ్యేరు, నడింపల్లి రామభద్రరాజు, కాంగ్రెసు. 19. అమలాపురం జనరల్, గోలకొండ నరసింహామూర్తి, స్వతంత్ర. 20.

అమలాపురం రిజర్వ్‌డ్, బొజ్జా అప్పలస్వామి, స్వతంత్ర. 21. రాజోలు జనరల్, ఎ. వెంకటరామరాజు, కమ్యూనిస్టు. 22. రాజోలు రిజర్వ్‌డ్, జి. నాగేశ్వరరావు, కమ్యూనిస్టు. 23. కొత్తపేట, మంతెన వెంకటసూర్య సుబ్బరాజు, కాంగ్రెసు.

## చిత్తూరు జిల్లా: 17

1. కాళహస్తి, జనరల్, నీలం సంజీవరెడ్డి, కాంగ్రెస్. 2. కాళహస్తి, రిజర్వ్‌డ్, పి. శింగారయ్య, కాంగ్రెస్, 3. వడమలపేట, ఆర్. బి. రామకృష్ణరాజు, స్వతంత్ర. 4. తిరుత్తణి జనరల్, పసల గోపాలరెడ్డి, కాంగ్రెస్. 5. తిరుత్తణి, రిజర్వ్‌డ్, ఎం. దొరైకణ్ణు, కాంగ్రెస్. పోటీ లేకుండా ఎన్నిక. 6. రామకృష్ణరాజుపేట, ఎన్. రంగనాథ మొదలియార్, స్వతంత్ర. 7. వేపంజేరి, ఎన్. చెంగల్రాయ నాయుడు, కాంగ్రెస్. 8. చిత్తూరు, పి. చిన్నమ్మరెడ్డి, కాంగ్రెస్. 9. ఆవనంపల్లి పి. రాజగోపాల నాయుడు, కాంగ్రెస్. 10. కుప్పం, డి. రామబ్రహ్మం కాంగ్రెస్. 11. పుంగనూరు, జనరల్, రాజా వీరబసవచిక్కరాయులు. స్వతంత్ర. 12. పుంగనూరు రిజర్వ్‌డ్, ఎ. రత్నం, కాంగ్రెస్. 13, మదనపల్లి టంగుటూరు గోపాలకృష్ణగుప్త, కాంగ్రెస్. 14. తంబళ్లపల్లి. టి. ఎన్. వెంకటసుబ్బారెడ్డి, కాంగ్రెస్. పోటీ లేకుండా ఎన్నిక, 15. వాయల్పాడు, పి. తిమ్మారెడ్డి, కాంగ్రెస్. 16. పీలేరు, ఎస్. వెంకటరామా నాయుడు, కాంగ్రెస్. 17. తిరుపతి, ఆర్. నాదముని రెడ్డి, కాంగ్రెస్.

## నల్లగొండజిల్లా : 12

1. నల్లగొండ, సి, వెంకటరెడ్డి, పి. డి. ఎఫ్. 2. నకరికల్లు, బి. ధర్మభిక్షం, పి. డి. ఎఫ్. 3. మిరియాలగూడ, సి. వెంకటరెడ్డి, పి. డి. ఎఫ్. 4. భువనగిరి, రావి నారాయణరెడ్డి, పి. డి. ఎఫ్. 5. ఆలేర్, శ్రీమతి ఆరుట్ల కమలాదేవి, పి. డి. ఎఫ్. 6. రామన్నపేట, కె. రామచంద్రా రెడ్డి, పి. డి. ఎఫ్. 7. దేవరకొండ, జనరల్, జి. నారాయణరెడ్డి, కాంగ్రెసు. 8. దేవరకొండ, రిజర్వ్‌డ్. ఎం. లక్ష్మయ్య, కాంగ్రెసు. 9. సూర్యాపేట జనరల్, బి. నరసింహారెడ్డి, పి. డి. ఎఫ్. 10. సూర్యా

పేట రిజర్వ్‌డ్, ఉప్పల మల్సూర్, పి. డి. ఎఫ్. 11. హుజూర్‌నగర్, డి. నరసయ్య, పి. డి. ఎఫ్. 14. చిన్నకొండూర్, కొండా లక్ష్మన్, కాంగ్రెసు.

## నిజామాబాద్ జిల్లా : 9

1. బన్స్‌వాడా, శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి, కాంగ్రెసు, పోటీ లేకుండా ఎన్నిక. 2. నిజామాబాద్. దావర్ హుసేన్ మహమ్మద్, కాంగ్రెసు. 3. జుక్కల్, మాధవరావు, స్వతంత్ర. 4. కామారెడ్డి, జనరల్, వెంకటరామారెడ్డి, కాంగ్రెసు. 5. కామారెడ్డి, రిజర్వ్‌డ్, శ్రీమతి టి. ఎస్. సదాలక్ష్మి, కాంగ్రెసు. 6. బోధన్. ఎం. శ్రీనివాసరావు. 7. ఆర్మూర్, టి. అంజయ్య, కాంగ్రెసు. 8. బాలకొండ, రంగారెడ్డి, కాంగ్రెసు. 9. ముధోల్, గోపిడి రంగారెడ్డి, సోషలిస్టు.

## నెల్లూరు జిల్లా : 17

1. ధర్శి, దరిశెల వెంకటరమణారెడ్డి, కాంగ్రెస్. 2. పొదిలి, పానికొమ్ము కాశిరెడ్డి, కమ్యూనిస్టు. 3. కనిగిరి, గుజ్జుల ఎల్లమందారెడ్డి, కమ్యూనిస్టు, 4. ఉదయగిరి, షేక్ మౌలా సాహెబ్, కాంగ్రెస్. 5. నందిపాడు. కానిన వెంకటరెడ్డి, స్వతంత్ర. 6. కందుకూరు, దివి కొండయ్యచౌదరి, కాంగ్రెస్. 7 కొండవి. నలగొతు చెంచురామానాయుడు, కాంగ్రెస్. 8. కావలి, బత్తెన రామకృష్ణారెడ్డి. ప్రజాపార్టీ 9. బుచ్చిరెడ్డిపాలెం జనరల్, బి. శంకరయ్య కమ్యూనిస్టు. 10 బుచ్చిరెడ్డిపాలెం రిజర్వ్‌డ్, స్వర్ణ వేమయ్య, కమ్యూనిస్టు. 11. ఆత్మకూరు, ఆనం సంజీవరెడ్డి, కాంగ్రెస్. 12. వెంకటగిరి జనరల్. పదిలేటి వెంకటస్వామిరెడ్డి, కాంగ్రెస్. 13. వెంకటగిరి రిజర్వ్‌డ్, అల్లం కృష్ణయ్య, కాంగ్రెస్, 14. నెల్లూరు, ఆనెం చెంచు సుబ్బారెడ్డి, కాంగ్రెసు. 15. సర్వేపల్లి, వంగల్లు కోదండరామరెడ్డి, కాంగ్రెస్. 16. గూడూరు జనరల్, పి. గోపాలకృష్ణారెడ్డి, కాంగ్రెస్. 17. గూడూరు, రిజర్వ్‌డ్, ఎం. మునుస్వామి, కాంగ్రెస్.

## పడమటి గోదావరిజిల్లా : 16

1. కొవ్వూరు, జనరల్, అల్లూరి బాపినీడు, 2. కొవ్వూరు, రిజర్వ్డ్, బి. వీరరాఘవులు, 3. పోలవరం, పుసులూరి కోదండరామయ్య, 4. ఏలూరు, శీర్ల బ్రహ్మయ్య, 5. దెందులూరు, మల్పూరి రంగయ్య, 6. తాడేపల్లిగూడెం, జనరల్, కిలాంబి వేంకటకృష్ణావతారం, 7. తాడేపల్లిగూడెం, రిజర్వ్డ్, నంబూరి శ్రీనివాసరావు, 7. పెంటపాడు, చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాదమూర్తిరాజు, 9. తణుకు, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్, 10. అత్తిలి, శ్రీమతి చోడగం అమ్మన్నరాజా, 11. పెనుగొండ, జవ్వాది లక్ష్మయ్య, 12. నరసాపురం, గ్రంథి వెంకటరెడ్డినాయుడు, 13. పాలకొల్లు, రిజర్వ్డ్, డి. పెరుమాళ్లు. 15. భీమవరం, నాచు వెంకటరామయ్య, 16. ఉండి, గాదిరాజు జగన్నాథరాజు.

ఈ జిల్లానుంచి ఎన్నిక అయినవారందరూ కాంగ్రెస్ వారే.

## మహబూబ్ నగర్ జిల్లా : 13

1. వనపర్తి, పద్మనాభరెడ్డి, కాంగ్రెసు, పోటీలేకుండా ఎన్నిక 2. నగర్ కర్నూలు, రిజర్వ్డ్, పి. మహేంద్రనాథ్, కాంగ్రెసు, పోటీలేకుండా ఎన్నిక, 3. నగర్ కర్నూలు, జనరల్, కె. జనార్దనరెడ్డి, కాంగ్రెసు, 4. కల్వకుర్తి, జనరల్, శ్రీమతి శాంతాబాయి, కాంగ్రెసు, 5. మహబూబ్‌నగర్, చిన్నప్ప, స్వతంత్ర, 6. షాద్‌నగర్, బేగం షాజహాన్, కాంగ్రెసు, 7. గద్వాల, డి. కె. సత్యరెడ్డి, స్వతంత్ర, 8. ఆత్మకూర్, మురళీధర్‌రెడ్డి, కాంగ్రెసు, 9. కొల్లాపూర్, ముందుముల నరసింగరావు, కాంగ్రెసు, 10. కొడంగల్, కె. అచ్యుతరెడ్డి, కాం. 11. అలంపూర్, శ్రీమతి జె. లక్ష్మీదేవమ్మ, కాంగ్రెసు. 12. మక్తల్, జనరల్, బన్నప్ప, స్వతంత్ర, 13. మక్తల్, రిజర్వ్డ్, ఇ. బసప్ప, కాం.

## మెదక్ జిల్లా 10

1. జహీరాబాద్, ఎం. బాగరెడ్డి, కాంగ్రెసు, 2. సంగారెడ్డి, జనరల్, కృష్ణమాచారి, స్వతంత్ర; 3. సంగారెడ్డి, రిజర్వ్డ్; కె. అంతయ్య, షెడ్యూల్డ్ కాస్టు ఫెడరేషన్, 4. మెదక్, వెంకటేశ్వర

రావు. కాంగ్రెసు, 5. నారాయణఖేడ్, అప్పారావు షెట్కార్, కాంగ్రెసు, 6. నరసాపూర్, జి. వీరయ్య. కాంగ్రెసు, 7. గజ్వేల్, జనరల్ ఆర్. నరసింహారెడ్డి, కాంగ్రెసు, 8. గజ్వేల్, రిజర్వ్డ్, జె. బి. ముత్యాలరావు, కాంగ్రెసు, 9. సిద్దిపేట, పి. వి. రాజేశ్వరరావు, కాంగ్రెసు, 10, అందోల్: బస్వమణెయ్య, స్వతంత్ర.

## వరంగల్ జిల్లా: 13

1. చలంచర్ల, ఎం. ఎస్. రాజలింగం. కాంగ్రెస్. 2. ధర్మసాగర్, టి. హయగ్రీవాచారి, కాంగ్రెస్. 3. వరంగల్, మీర్జా షుకూర్ బేగ్, కాంగ్రెస్. 4. పరఖాల్, జనరల్, జె. కేశవరెడ్డి, కాంగ్రెస్. 5. పరఖాల్, రిజర్వ్డ్, మందశాయిలు, కాంగ్రెస్. 6. ములుగు, ఎస్. రాజేశ్వరరావు, పి. డి. ఎఫ్. 7. జనగామ, జనరల్, జి. గోపాలరెడ్డి, పి. డి. ఎఫ్. 8. జనగామ, రిజర్వ్డ్. బి. రామలింగం, కాంగ్రెస్. 9. ఘనపురం, బేతి కేశవరెడ్డి, కాంగ్రెస్. 10. దోర్నకల్, ఎన్. రామచంద్రారెడ్డి, కాంగ్రెస్. 11. వర్ధన్నపేట, ఇ. వెంకటరామనర్సయ్య. కాంగ్రెస్. 12, నరసంపేట, శ్రీమతి కె. కె. రత్నమ్మ, కాంగ్రెస్. 13. డోర్నకల్, అనంతరెడ్డి, పి. డి. ఎఫ్.

## విశాఖపట్టణం జిల్లా: 20

1. భోగాపురం, బోత్సా ఆదినారాయణ, ప్రజాసోషలిస్టు. 2. గజపతినగరం, జనరల్, టి. సన్యాసిరావు, స్వతంత్ర. 3. గజపతినగరం రిజర్వ్డ్, గంట్లాన సూర్యనారాయణ, ప్రజాసోషలిస్టు. 4. విజయనగరం, బి. శ్రీరామమూర్తి, ప్రజాసోషలిస్టు పోటీ లేకుండా ఎన్నిక. 5. చీపురుపల్లి, కే. వి. ఎస్. పద్మనాభరాజు, ప్రజాసోషలిస్టు. 6. భీమునిపట్టణం, గొట్టుముక్కల జగన్నాథరాజు, ప్రజాసోషలిస్టు పార్టి. 7. విశాఖపట్టణం, ఎ. వి. భానోజిరావు, కాంగ్రెసు. 8. కణితి, బి. జి. ఎం. నరసింహారావు, కాంగ్రెసు. 9. పరవాడ, ఈటి నాగయ్య, కాంగ్రెసు. 10. అనకాపల్లి, బీసెట్టి అప్పారావు, కాంగ్రెసు. 11. చోడవరం, రెడ్డి జగన్నాథం, స్వతంత్ర. 12. శృంగవరపుకోట, జనరల్, సి. వి. సోమయాజులు, ప్రజాసోషలిస్టుపార్టి. 13. శృంగవరపుకోట, రిజర్వ్డ్, జి. రామునాయుడు, ప్రజాసోషలిస్టుపార్టి. 14. మాడుగుల,

దొండా శ్రీరామమూర్తి, ప్రజాసోషలిస్టుపార్టీ. 15. కొండకర్ల, మజ్జి పైడయ్య నాయుడు, కాంగ్రెసు. 16. యలమంచిలి, సి. వి. సూర్య నారాయణరాజు, స్వతంత్ర. 17. నర్సిపట్టణం, జనరల్, రాజా సాగి సూర్యనారాయణరాజు, కాంగ్రెసు. 18. నర్సిపట్టణం, రిజర్వ్‌డ్, ఎం. పోతురాజు, కాంగ్రెసు. 19. గోలుకొండ, ఆర్. అచ్చాపాత్రుడు, స్వతంత్ర. 20. గూడెం, మత్సర మత్స్యరాజు, స్వతంత్ర.

## శ్రీకాకుళం జిల్లా: 20

1. ఇచ్ఛాపురం, ఉప్పాడ రంగబాబు, కాంగ్రెసు. 2. సోంపేట గౌతు అచ్చన్న, కాంగ్రెసు. 3. బ్రాహ్మణతర్ల, నిచ్చెర్ల రాములు. కాంగ్రెసు. 4. టెక్కలి, రొక్కం లక్ష్మీనరసింహందొర కాంగ్రెసు. 5. నరసన్నపేట, సిమ్మా జగన్నాథం, కాంగ్రెసు. 6. పాతపట్నం జనరల్ లుకలాపు లక్ష్మణదాసు, కాంగ్రెసు. 7. పాతపట్నం, రిజర్వ్‌డ్, పోతుల గున్నయ్య, కాంగ్రెసు. 8. నాగూరు, అడ్డాకుల లక్ష్మీనాయుడు, స్వతంత్ర. 9. పార్వతీపురం, వి. చంద్రచూడామణిదేవ్, స్వతంత్ర. 10. సాలూరు, జనరల్, ఎ. ఎరుకునాయుడు, ప్రజాసోషలిస్టు. 11. రిజర్వ్‌డ్, బోయిన రాజయ్య, కాంగ్రెసు. 12. బొబ్బిలి, కోటగిరి సీతా రామస్వామి, కాంగ్రెసు. 13. బలిజిపేట, పెద్దింటిరామస్వామినాయుడు; కాంగ్రెస్. 14. ఉణుకూరు, సి. శ్రీరంగనాయకులు, కాంగ్రెస్. 15. పాలకొండ, పైడి నరసింహఅప్పారావు, స్వతంత్ర. 16. నగరికటకం, తమ్మినేని పాపారావు; స్వతంత్ర. 17. శ్రీకాకుళం; పి. సూర్యనారా యణ; స్వతంత్ర. 18. షేర్ మహమ్మద్‌పురం; చౌదరి సత్యనారాయణ కాంగ్రెసు. 19. చీపురుపల్లి; జనరల్, మోదండి సత్యనారాయణరాజు, ప్రజాసోషలిస్టు, 20. చీపురుపల్లి; రిజర్వ్‌డ్, కొత్తపల్లి పున్నయ్య కాంగ్రెసు.

## హైదరాబాదుజిల్లా: 17

1. బేగం బజార్: జె. వి. నరశింగరావు, కాంగ్రెసు, పోటీ లేకుండా ఎన్నిక; 2. ఇబ్రహీం పట్నం: ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, కాంగ్రెసు; 3. వికారాబాద్: జనరల్, డాక్టర్ మర్రి చెన్నారెడ్డి,

కాంగ్రెసు; 4. వికారాబాద్; రిజర్వుడ్, అరిగె రామస్వామి, కాంగ్రెసు; 5. మహబాద్: జనరల్, కొండా వెంకటరంగారెడ్డి, కాంగ్రెసు; 6. మహబాద్: రిజర్వుడ్, వి. రామారావు, కాంగ్రెసు; 7. పరిగి, కె. జగన్మోహన రెడ్డి, స్వతంత్ర; 8 సుల్తాన్ బజార్. వి. కె. నాయక్, కాంగ్రెసు; 9. సికందరాబాద్ నగరం, కె. సత్యనారాయణ, కాంగ్రెసు; 10. హైకోర్టు: గోపాలరావు ఎక్బోటె, కాంగ్రెసు; 11. ఆసిఫ్ నగర్, వందేమాతరం రామచంద్రరావు, స్వతంత్ర; 12. మలకపేట: అహమ్మద్ ఆలిఖాన్, కాంగ్రెసు; 13. సికందరాబాద్ కంటోన్మెంట్, బి. వి. గురు మూర్తి, కాంగ్రెసు; 14. పాతర్ ఘట్టి, శ్రీమతి మసూమాబీగం, కాంగ్రెసు; 15. ముషీరాబాద్, కె. సీతయ్యగుప్త, కాంగ్రెసు; 16. యాకత్ పుర: మహబుద్దీన్, కాంగ్రెసు; 17. జూబిలిహిల్స్, నవాబ్ మెహ్దీనవాజ్ జంగ్, కాంగ్రెసు.

జీతాలు :

శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 150 జీతం; ఇదిగాక సభా సమావేశానికి హాజరైన ప్రతిరోజుకీ రు. 12½ అలవెన్సు. సభ్యులు తమ స్వస్థానంనుంచి హైదరాబాద్కు రానుపోను, రైలులో ఫస్టు క్లాసుకు అయ్యే ఖర్చులు, ఒకటిన్నర రెట్లు ప్రయాణపు బత్తా ఇవ్వబడుతుంది.

పార్టీల బలాలు :

అసెంబ్లీలోని మొత్తం 302 స్థానాలలోనూ, వివిధ పార్టీల సభ్యుల బలాలు ఇవి : కాంగ్రెసు, 202; డెమొక్రాటిక్ పార్టీ, 30; కమ్యూనిస్టులు, పీపుల్స్ డెమొక్రాటిక్ ఫ్రంట్, 37; ప్రజాసోషలిస్టులు, 1; ఆంధ్ర ప్రజా పార్టీ, 1; షెడ్యూల్డ్ కాస్టు ఫెడరేషన్, 1; సోషలిస్టులు, 18 స్వతంత్రులు, 10.

# రాష్ట్ర ప్రభుత్వం

గవర్నర్ : భీమసేన్ సచార్

పదవీ స్వీకారం : 1957 జూలై. జీతం : నెలకు రు. 5,500

సెక్రటరి : బి. ఎన్. జయసింహా
మిలిటరి కార్యదర్శి : కెప్టెన్ వీరేంద్రప్రతాప్
అంగరక్షకుడు : కెప్టెన్ వి. వి. కుమార్
మెడికల్ ఆఫీసర్ : డాక్టర్ జె. సోమసుందరం
రాజప్రాసాదాధికారి : ఎం. హెచ్. కె. ఘజ్నవి

## మంత్రిమండలి

పదవీ స్వీకారం : 1956 నవంబర్ 1

నీలం సంజీవరెడ్డి : ముఖ్యమంత్రి, సమగ్ర పరిపాలన, హైకోర్టు, పరిశ్రమలు, రవాణా, ఆల్ ఇండియా సర్వీసులు

కాసు బ్రహ్మానందరెడ్డి : ఆర్థికమంత్రి, వాణిజ్యపన్నులు, ప్లానింగ్

కొండా వెంకట రంగారెడ్డి : రెవిన్యూమంత్రి, రిజిస్ట్రేషన్, భూసంస్కరణలు

మెహ్దీ నవాజ్ జంగ్ : సహకారమంత్రి, గృహనిర్మాణం

దామోదరం సంజీవయ్య : స్థానిక పరిపాలన, కార్మికశాఖ, ఆరోగ్యశాఖ, ఆబ్కారి

జె. వి. నరసింగరావు : నీటిపారుదలమంత్రి, విద్యుచ్ఛక్తి, భవనములు, రోడ్లు

శ్రీ బలుసు ప్రభాకర పట్టాభి రామారావు : విద్యామంత్రి, సాంఘిక సంక్షేమం, సమాచారశాఖ

పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి : వ్యవసాయ మంత్రి, అడవులు, పశు సంక్షేమం

గ్రంధి వెంకటరెడ్డి నాయుడు : న్యాయమంత్రి, జెయిళ్లు, హిందూమత దాయములు

మందుముల నరసింగరావు : హోంమంత్రి, పోలీసు, మద్యనిషేధం

అనగాని భగవంతరావు : గృహపరిశ్రమలు, చిన్న పరిశ్రమలు

మంత్రుల జీతాలు: నెలకు రు. 1000; కారు అలవెన్సు రు. 200; ఉచిత గృహవసతి

## ప్రభుత్వశాఖల కార్యదర్శులు

ప్రధాన కార్యదర్శి, డెవలప్‌మెంట్ కమిషనర్: ఎం. పురుషోత్తం పాయ్

హోంశాఖ: వి. రాజేశ్వరరావు

ప్లానింగ్, డెవలప్‌మెంట్: చల్లగిరి నరసింహం

ఆర్థికశాఖ: దామోదరరెడ్డి

పబ్లిక్‌వర్క్సు: వి. కె. రావు

రెవిన్యూ: హెచ్. రాంలాల్

పరిశ్రమలు: పి. ఎం. నాయర్

విద్య: జె. పి. ఎల్. గ్విన్

కార్మికశాఖ: కె. అనంతరామన్

న్యాయశాఖ: డి. సూర్యనారాయణస్వామి

వ్యవసాయశాఖ: జగిజీవనచంద్

## రెవిన్యూ బోర్డు

మెంబర్లు: కె, ఎం. ఉన్నితన్; వి. వి. సుబ్రమణ్యం; కె. ఎన్. అనంతరామన్. ఎన్. యస్. కృష్ణస్వామి

సెక్రటరీ: వై. పిచ్చిరెడ్డి

రెవిన్యూబోర్డు మొదటి సభ్యునికి జీతం. రు. 3,250 తక్కిన సభ్యులకు వారి సర్వీసునుబట్టి.

## రాష్ట్రంలో ప్రధానోద్యోగులు

పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్: ఎ. కె. కె. నంబియార్

మెడికల్ సర్వీసెస్ డైరెక్టర్: మేజర్ కె. ఎన్. రావు

స్పెషల్ చీఫ్ ఇంజనీరు: ఎల్. వెంకటకృష్ణయ్యర్

చీఫ్ ఇంజనీరు, జనరల్ : కె. ఎల్. రావు
చీఫ్ ఇంజనీరు, రోడ్లు, బిల్డింగులు : బాలప్రసాద్
ప్రజారోగ్యశాఖ డైరెక్టర్ : మేజర్ సి. ఆర్. నాయుడు
అడవులు చీఫ్ కన్సర్వేటర్ : రాయ్ దౌలత్ రాయ్
విద్యాశాఖ డైరెక్టర్ : డాక్టర్ ఎన్. రామ్‌లాల్
స్థానికసంస్థల ఇన్‌స్పెక్టర్ జనరల్ : జి. సింహాద్రి
ఇన్‌ఫర్మేషన్‌శాఖ డైరెక్టర్ : ఎన్. నరసింగరావు
జైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ : ఎన్. ఎం. హాసన్
కార్మికశాఖ కమిషనర్ : ఎన్. భగవాన్‌దాస్
రవాణశాఖ కమిషనర్ : సయ్యద్ అలి
మహిళాభ్యుదయశాఖ డైరెక్టర్ : ఆర్. జమునాబాయి
రిజిస్ట్రేషన్ శాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ : జి. సత్యనారాయణ
ముద్రణశాఖ డైరెక్టర్ : గులాం రసూల్
ధర్మాదాయముల కమిషనర్ : పైడి లక్ష్మయ్య
ప్రధాన ఎన్నికల ఆఫీసర్ : కె. సుబ్బారావు
జనాభా సూపరింటెండెంట్ : ఎ. చంద్రశేఖర్

## పబ్లిక్ సర్వీస్ కమిషన్

చైర్మన్ : ఎం. ఎ. వెంకటరమణ నాయుడు (1960 జనవరి 14 వరకు) రు. 2,000

సభ్యులు: డాక్టర్ బకీర్ అలి మీర్జా, రు. 1500; ఎన్. నీలకంఠం, గులాం హైదరి

సెక్రటరి : పి. కృష్ణయ్యనాయుడు

## హైకోర్టు

ప్రధాన న్యాయమూర్తి : పి. చంద్రారెడ్డి; జస్టిస్ కొండగుంట ఉమామహేశం; జస్టిస్ కందా భీమశంకరం; జస్టిస్ పెన్మెత్స సత్యనారాయణరాజు; జస్టిస్ ఎన్. డి. కృష్ణారావు; జస్టిస్ సయ్యద్ కమర్ హాస్సన్; జస్టిస్ మనోహరప్రసాద్; జస్టిస్ ఎం. ఎ. అన్సారి; జస్టిస్ ఎ. శ్రీనివాసాచారి; జస్టిస్ పింగళి జగన్మోహనరెడ్డి; జస్టిస్ సాంపలి

కుమారయ్య; జస్టిస్ పి. బసిరెడ్డి; జస్టిస్ ఎ. రంగనాథం చెట్టి; జస్టిస్ మెదవోలు శేషాచలపతి; జస్టిస్ కనకపల్లి సంజీవరావు నాయుడు; జస్టిస్ దావుగూరి మునికన్నయ్య.

రిజిస్ట్రార్ : కె. వి. ఎల్. నరసింహం

అడ్వొకేట్ జనరల్ : దుప్పూరి నరసరాజు

ప్రధాన న్యాయమూర్తి జీతం : రు. 4000. తక్కిన జడ్జిలకు రు. 3,500. అడ్వొకేట్ జనరల్ రు. 1,500.

## తిరుమల తిరుపతి ధర్మకర్తల బోర్డు

చైర్మన్ : ఆసెం చెంచుసుబ్బారెడ్డి; సభ్యులు : ఆర్. నాథముని రెడ్డి; ఆలపాటి వెంకట్రామయ్య; శ్రీ కృష్ణరాం భూపాల్; ఆర్. అనంతరావు; బి. జి. ఎం. నరసింగరావు; పంచాగ్నుల సూర్యనారాయణ; సి. ఎన్. అప్పారావు; డి. పెరుమాళ్ళు; బి. సి.హెచ్. నారాయణమూర్తి; పి. వి. చౌదరి. ఈ బోరు పదవి పరిమితి 1957 అక్టోబరు 24 నుంచి మూడేళ్లు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ : శ్రీ సి. అన్నారావు.

హిందువులు కానివారిని తిరుపతి కొండమీదకు రానివ్వవచ్చునని ఆంధ్రప్రభుత్వం, 1956 ఆగస్టులో ఉత్తరువు చేసింది. అయితే, హిందువులు కానివారు తిరుపతి కొండమీద మూడురోజులకంటె ఎక్కువ వుండకూడదు. దేవాలయంలోనికి వెళ్ళకూడదు. కొండమీద అనుసరింపబడే సాంప్రదాయాలకు విరుద్ధంగా ప్రవర్తించకూడదు.

# ప్రముఖ వ్యక్తులు

**అనంతశయనం అయ్యంగార్ మాడభూషి**; జననం, 1891 ఫిబ్రవరి 4; బి. ఎ, బి. ఎల్. ఇండియా కన్స్టిట్యూయెంట్ అసెంబ్లీ సభ్యులు 1946-49; సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్లారు. ఇండియా పార్లమెంటు ప్రజాసభ సభ్యులు 1952 నుంచి, ప్రజాసభ డిప్యూటీస్పీకరు 1952-56; స్పీకరు 1956 మార్చి నుంచి, అడ్రసు : న్యూఢిల్లీ.

అన్నారావు, చెలికాని; జననం 1909 జనవరి, బి. ఏ., ప్రెసిడెన్సీ కాలేజి, 1930; 'న్యూటైమ్స్' పత్రిక సంపాదకులు, 1930-33; తిరుమల తిరుపతి దేవస్థానం సర్వీసులో పేష్కార్‌గా 1933 లో చేరారు, 1949 లో దేవస్థానం కమిషనర్. 1953 నుంచి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్. ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వకళాపరిషత్తుల సెనెట్ మెంబరు; నేషనల్ కేడెట్ కోర్ సలహా సంఘ సభ్యులు; దక్షిణరైల్వే ప్రాంతీయ సలహా సంఘ సభ్యులు. అడ్రసు : తిరుపతి.

అప్పారావు, విస్సా: జననం, మే 1, 1884; ఎం. ఎ. ఎల్. టి. (1907); ఫిజిక్సు ప్రొఫెసర్‌గా రాజమండ్రి ఆర్ట్సుకాలేజి, మదరాసు ప్రెసిడెన్సీ కాలేజి, అనంతపురం కాలేజీలలో పనిచేశారు. రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాల్, 1925; గవర్నమెంటు ట్రెయినింగ్ కాలేజి ప్రిన్సిపాల్ 1936-38; ఆంధ్ర యూనివర్శిటీ కాలేజి ప్రిన్సిపాల్, 1933-41; ఆంధ్ర యూనివర్సిటీ అకడమిక్ కౌన్సిల్, సెనేట్ లలో సభ్యులు, రాజమండ్రిలో గానకళా పరిషత్తును స్థాపించి, సంగీత సాహిత్య గ్రంథాలను అపూర్వమైన వాటిని సేకరించి ప్రకటించారు. అడ్రసు : డాబాగార్డెన్సు, విశాఖపట్టణం.

ఉపేంద్రశర్మ, మండలపర్తి, జననం, 1912 జూలై 1; ఎం. ఏ. (ఆంధ్ర యూనివర్శిటి); గుంటూరు హిందూకాలేజీలో ప్రాచ్యభాషా శాఖ ప్రధానాధ్యాపకులు. భారత భాషా సమితి కార్యనిర్వాహక సభ్యులు; అఖిలభారత గ్రంథాలయ మహా సంఘసభ్యులు; ఆంధ్ర రాష్ట్ర ప్రాచ్యసారస్వత విజ్ఞాన పరిషత్తు అధ్యక్షులు. రచనలు:

తిక్కన, ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర; వయోజన విద్య, నాటిక; అడ్రసు: హిందూకాలేజి గుంటూరు.

ఉమామహేశ్వరం, కొండ గుంటు; జ. 1903 ఆగస్టు 4. కావలి: న్యాయవాదవృత్తి ప్రారంభం, 1924. మదరాసు బార్ కౌన్సిల్ సభ్యులు, 1947-53; మదరాసు హైకోర్టుజడ్జి, 1953-54; ఆంధ్ర హైకోర్టుజడ్జి, 1954 జూలైనుంచి, అడ్రసు; హైదరాబాదు.

ఓబులరెడ్డి, కందుల; జననం. 1913; మదనపల్లి థియొసాఫికల్ కాలేజినుంచి బి. ఏ. ప్యాసయ్యారు. 1934 లో రాజకీయాలలో ప్రవేశించారు. రెండుసార్లు జెయిలుకు వెళ్ళారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1949-50; ఆంధ్ర రాష్ట్రశాసనసభకు మార్కాపూర్ నియోజకవర్గంనుంచి 1955 లో ఎన్నుకోబడినారు. ఆంధ్ర ప్రభుత్వ వ్యవసాయ మంత్రి 1956 మార్చినుంచినవంబరువరకు. అడ్రసు: మార్కాపురం.

కనకమ్మ, పొణకా; జననం. 1892; కాంగ్రెసు ఉద్యమంలోనూ, జమీన్ రైతు ఉద్యమంలోనూ పాల్గొన్న వీర నారి. అఖిలభారత కాంగ్రెసు కమిటీకి ఎన్నిక అయిన ప్రథమ ఆంధ్ర మహిళ. కొన్నాళ్లు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షురాలు. పల్లెపాడు సత్యాగ్రహాశ్రమ స్థాపకురాలు. 1923 లో కస్తూరిదేవి విద్యాలయం స్థాపించారు. అడ్రసు: కస్తూరిదేవి విద్యాలయం నెల్లూరు.

కమలాదేవి, జననం 1903 ఏప్రిల్ 3; 1922 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. చాలాసార్లు జైలుకు వెళ్ళారు. అఖిల భారత కాంగ్రెసు వర్కింగు కమిటి సభ్యురాలు; అఖిల భారత మహిళా సమావేశం అధ్యక్షురాలు; అఖిల భారత చేతి పరిశ్రమల బోర్డు అధ్యక్షురాలు; అడ్రసు: శాంటాక్రూజ్, బొంబాయి సబర్బన్ డిస్ట్రిక్టు.

కమలాదేవి, ఆరుట్ల; జననం, 1922, హైదరాబాద్ మహిళా సంఘ ప్రధాన కార్యదర్శి, 1942-44; రజాకార్ల రోజుల్లో సాయుధ గెరిల్లా మహిళా దళాలను స్థాపించారు. 1949 నుంచి 1951 వరకు జెయిలు; ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యులు 1957 మార్చి నుంచి; అడ్రసు: కలంపాక, భువనగిరి తాలూకా, నల్లగొండజిల్లా.

కాశీపతి, కపిల; జననం 14 సెప్టెంబర్ 1908; బి. ఏ., ఎల్.

ఎల్. బి. 1931 లో కాశీలో జరిగిన ఇంటర్ - యూనివర్సిటీ వక్తృత్వపు పోటీలో సర్ రాస్ మసూద్ బంగారు పతకాన్ని గెలిచారు. సర్వాంధ్ర విద్యార్థి మహాసభ (గుంటూరు, 1927) కు కార్యదర్శి. స్వరాజ్య, మదరాసు మెయిలు పత్రికలలో పనిచేశారు. 1939 లో ఆలిండియా రేడియోలో న్యూస్ ఎడిటర్ అయారు. 1947 లో, మదరాసు రాష్ట్రీయ బ్రాడ్ కాస్టింగ్ ఆఫీసర్‌గా ఉన్నారు. తెలుగులో చాలా కథలు, పద్యములు, నాటికలు వ్రాశారు. హైదరాబాదు ప్రభుత్వ ప్రచురణ శాఖ స్పెషల్ ఆఫీసరు 1954-56. ఆంధ్రప్రదేశ్ ప్రచురణశాఖ డైరెక్టర్ 1956-57; ఆలిండియా రేడియో న్యూస్ ఎడిటర్ 1957 నవంబరునుంచి; అడ్రసు: ఢిల్లీ.

కాశీశ్వరరావు, అయ్యదేవర, జననం 1881; బి. ఎల్. 1906 నుంచి కాంగ్రెసు సభ్యులు; వందేమాతరం, హోంరూల్ ఉద్యమములలో పని చేశారు. అనేకసార్లు బెజవాడ మునిసిపల్ కౌన్సిలు చైర్మను. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు 1929-30; అసెంబ్లి సభ్యులు 1937-39; మదరాసు ప్రభుత్వ ఛీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ. 1937-1939; మద్రాసుశాసనసభ్యులు 1946-52; అఖిలభారత కాంగ్రెసు సభ్యులు 1947-51; ఆంధ్ర శాసనసభ్యులు, 1955 మార్చినుంచి. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ స్పీకరు 1956 నవంబరు నుంచి రచనలు: 'ఫ్రెంచి స్వాతంత్ర్య విజయం, అమెరికా రాష్ట్రములు, చైనా జాతీయోద్యమం, తురుష్క ప్రజాస్వామికం. ఉపనిషత్సారములు, అడ్రసు: హైదిరాబాద్.

కుటుంబరావు, కొడవగంటి; జననం 1909 అక్టోబరు 28; బి. ఏ. 1929, యువ ఎడిటర్, 1935; ఆంధ్ర వారపత్రిక, 1940-42. ఆంధ్ర పత్రిక సబ్-ఎడిటర్. 1948-51; రచనలు, నీకేంకావాలి; కులంలేనిమనిషి, మారుపేర్లు. అరుణోదయం (నవలలు), చిన్న కథల సంపుటిలు ఏడు; వీరాభిమన్యు; బాలనాగమ్మ చిత్రాలకు సంభాషణలు వ్రాశారు. అడ్రసు : చందమామ ఆఫీస్, కోడంబాకం, మదరాసు.

కూర్మయ్య. వేముల, జననం, 1907; బి. ఏ. ఎల్. ఎల్. బి., బందరు హరిజన నియోజకవర్గం తరఫున మదరాసు అసెంబ్లీసభ్యులు 1936-52; ప్రచురణశాఖా మంత్రి

1946-47; గ్రామోద్ధరణ శాఖా మంత్రి 1947 మార్చి నుంచి 1949 మార్చి; ఆంధ్రశాసనసభ సభ్యులు; 1955 మార్చి నుంచి; అడ్రసు : విజయవాడ.

కృష్ణమూర్తిశాస్త్రి. శ్రీపాద; జననం, 1866. కళాప్రపూర్ణ; మహామహోపాధ్యాయ, కవి సార్వభౌమ బిరుదాంకితులు, కృష్ణ భారతం, కృష్ణరామాయణం మొదలైన మహాకావ్యములతో దాదాపు 150 పెద్ద గ్రంథములను రచించారు. 1940 లో పాలకొల్లులో స్వర్ణాభిషేకమును, 1933లో రాజమండ్రిలో కవి గండపెండేర బహుకృతిని, 1936 లో సాలూరులో గజారోహణ మహోత్సవమును, 1945 లో విజయవాడలో మణికిరీట బహూకృతిని పొందారు. ఆంధ్ర ప్రభుత్వ ఆస్థానకవి. అడ్రసు : రాజమండ్రి.

కృష్ణశాస్త్రి; దేవులపల్లి; జననం, 1897; బి. ఏ., కాకినాడ మిషన్ స్కూలులోనూ పెద్దాపురం మిషన్ స్కూలులోనూ ఉద్యోగం, 1918-20; 1932 నుంచి 1944 వరకూ కాకినాడ పిఠాపురం రాజా కాలేజిలో లెక్చరర్; నవ్యసాహిత్యపరిషత్తు అధ్యక్షులు, 1942-43, ఆంధ్ర అభ్యుదయ రచయితల తృతీయ మహాసభ అధ్యక్షులు. 1946; రచనలు; కన్నీరు, కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి, ఋగ్వేధి; అడ్రసు; కేరాఫ్, ఆలిండియా రేడియో, హైదరాబాద్.

కేస్కార్ డాక్టరు బాలకృష్ణ విశ్వనాథ : జననం, 1908. కాశీ విద్యాపీఠంలో పట్టభద్రులై, అచ్చటనే ప్రొఫెసరుగా మూడేళ్ళు పనిచేశారు. 1933 లో పారిస్ వెళ్ళి ఆర్థిక శాస్త్రంలో డాక్టరేట్ పొందారు; 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు. 1930, 1937, 1941 లలో జైలుకి వెళ్ళారు. 1946 లో కొద్దికాలం కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా వున్నారు. కన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీకి సభ్యులు 1948-50, ఇండియా ప్రభుత్వ విదేశ శాఖ డిప్యూటీ మంత్రి, 1948-52; ఇన్ఫర్మేషన్ శాఖమంత్రి, 1952 మే 13 నుంచి: అడ్రసు; న్యూఢిల్లీ.

కోదండరామయ్య, పుసులూరి; జననం, 1896; చిన్నతనం నుంచీ జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం, సంఘ సంస్కరణ, నిమ్నజాతి. ఉద్ధరణ కార్యక్రమాలలో దీక్షతో పనిచేశారు. 1920 నుంచీ

ఏజన్సీలలో కొండజాతులవారి ఉద్ధరణకు చాలా కృషి చేశారు. కాంగ్రెసు ఉద్యమాలన్నిటిలోనూ జెయిలుకు వెళ్ళారు. ఇండియా పార్లమెంటు సభ్యులు 1949-52. ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు, 1955 మార్చినుంచి; అడ్రసు, పోలవరం.

కోదండ రామారావు, నాగుల పల్లి; జననం, 20 ఆగస్టు, 1950. బి. ఎస్. సి, (ఆనర్స్) ఎల్.ఎల్. బి. 1934 లో హైదరాబాద్‌లో న్యాయవాది వృత్తి ప్రారంభం. సంస్థాన సత్యాగ్రహంలో జెయిలుకు వెళ్లారు. సంస్థాన ఆంధ్ర మహాసభ కార్యదర్శి, 1940. అడ్రస్ : హైదరాబాదు.

కోటయ్య, ప్రగడ; జననం 26 జూలై 1912, మదరాసు రాష్ట్ర చేనేతపనివారల కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, నాలుగు సంవత్సరములు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యులు, చేనేతవారి పరిస్థితులను బాగుపరచడానికి కృషి చేస్తున్న ప్రముఖులలో ఒకరు. చీరాలనుంచి రాష్ట్ర అసెంబ్లీ సభ్యులు, 1952 నుంచి. రాష్ట్ర కాంగ్రెసు జాయింటు కార్యదర్శి, 1957 సెప్టెంబర్ 1958. జనవరి అడ్రసు : చీరాల,

కోటిరెడ్డి, కె. జననం, 1887 అక్టోబరు. బి. ఏ. బి. సి. ఎల్. ఎల్. ఎల్. బి. కడపలో బారిష్టరుగా ప్రాక్టీసు ప్రారంభం 1919. 1923 నుంచి 1935 వరకు మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. మదరాసు అసెంబ్లీ సభ్యులు 1937-39, 1946-51; 1952 నుంచి హిందూ దేవాదాయ శాఖ మంత్రి 1946-47; ఆంధ్ర ప్రభుత్వ రెవిన్యూమంత్రి, 1953 అక్టోబరునుంచి 1945 నవంబర్ వరకు; ఆంధ్రశాసనసభ సభ్యులు 1955మార్చినుంచి, అడ్రసు: కడప.

గిరి, వరహాగిరి వెంకట; జననం, 1894 ఆగస్టు 10. బారిష్టర్. 1922 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జెయిలుకి వెళ్లారు. ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు 1926; ఆల్ ఇండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్ అధ్యక్షులు, 1927; ఈ ఫెడరేషన్‌కు ప్రధాన కార్యదర్శి 1926-36. కార్మికుల ప్రతినిధిగా రెండవ రౌండు టేబిల్ కాన్ఫరెన్సులో పాల్గొన్నారు. కేంద్ర శాసనసభ సభ్యులు, 1934. మదరాసు కార్మిక, పరిశ్రమశాఖా మంత్రి, 1937-39. కార్మిక పరిశ్రమ శాఖామంత్రి, 1946-1947. సిలోన్ లో ఇండియా

ప్రభుత్వ హైకమిషనర్ 1947-50. పార్లమెంటుకు పాతపట్నం నుంచి 1952 లో ఎన్నుకోబడినారు. ఇండియా ప్రభుత్వ కార్మిక శాఖా మంత్రి 1952 మే 13 నుంచి 1954 సెప్టెంబర్ 10 వరకు; ఉత్తరప్రదేశ్ గవర్నర్ 1957 జూన్ 10 నుంచి. అడ్రసు: లక్నో.

గోపాలకృష్ణయ్య వావిలాల: జననం. 1906; ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షులు, (1942-46) ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులు, తెలంగాణా సహాయక సభ కార్యదర్శి 1947-48) ఆంధ్రదేశ కో-ఆపరేటివ్ యూనియన్ కార్యవర్గసభ్యులు. 19451-48; జాతీయోద్యమంలో జెయిలుకు వెళ్ళారు, ఆంధ్రదేశ గ్రంధాలయ సంఘ సహాయకార్యదర్శి; ఎడిటర్: విద్యార్థి (1926) జ్యోతి (1937) సహకారం 1945-49; గుంటూరు జిల్లా పత్రికా రచయితల సంఘాధ్యక్షులు, 1950-51, ఉత్తర విశాఖ కరవువిచారణసంఘసభ్యులు 1944, రచనలు; ఆంధ్రరాష్ట్రం, సంస్థానాలు, తుంగభద్ర ప్రాజెక్టు, మదరాసు మంత్రులు, ప్రభాతం. మన్యం, గ్రంధాలయబిల్లు. సత్తెంపల్లినుంచి ఆంధ్రశాసన సభకు సభ్యులు. 1952 నుంచి; అడ్రసు: సత్తెనపల్లి.

గోపాలరెడ్డి, బెజవాడ; జననం, 1907 ఆగస్టు 5. శాంతినికేతనంలో శిక్షాభవన పట్టాన్ని పొందారు. 1930 నుంచి 1942 లోగా నాలుగుసార్లు జెయిలుకు వెళ్లారు. 1937 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. స్థానిక స్వపరిపాలనశాఖా మంత్రి 1937-39. ఆంధ్ర యూనివర్శిటీ సిండికేట్ సభ్యులు 1944 నుంచి; 1946 లో శాసనసభకు మళ్ళీ ఎన్నుకోబడినారు. ఆర్థిక శాఖామంత్రి 1947-52; ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రో-ఛాన్సెలర్ 1951-57. ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు, 1954 జనవరి-1955 మార్చి. ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి. 1955 మార్చి 28 నుంచి 1956 నవంబరు 1 వరకు. ఆంధ్రప్రదేశ్ హోం మంత్రి, 1956 నవంబర్ 1957 మార్చి; ఆర్థిక మంత్రి 1957-58; కేంద్రప్రభుత్వ రెవిన్యూ, వ్యయశాఖమంత్రి 1958 మే నుంచి; అడ్రసు, న్యూఢిల్లీ.

గోపాలరెడ్డి; వరకాంతం; జననం 1907 డిసెం. 19. హైదరాబాద్ జిల్లా ఆంధ్ర మహాసభ కార్యదర్శి

గాను, అధ్యక్షులుగాను, జిల్లా కాంగ్రెసు కోశాధికారిగాను వున్నారు. హైదరాబాద్ నగరంలో సత్యాగ్రహాన్ని నడిపించారు. హైదరాబాద్ శాసనసభ సభ్యులు 1952-57. అడ్రసు: లింగంపల్లి, హైదరాబాద్.

గోపాలస్వామి, కూర్మా వేణు; జననం: 1903 డిసెంబర్ 19; బి. ఎ. మదరాసు; ఎం. ఎ. ఆక్స్‌ఫర్డ్, బారెట్లా; మదరాస్ హైకోర్టు అడ్వకేట్ 1933-42; ఆంధ్ర విశ్వకళాపరిషత్తు రిజిస్ట్రారు 1942 నుంచి. అడ్రసు: ఆంధ్ర యూనివర్శిటీ కాంపస్, వాల్తేర్.

గోపీచంద్, త్రిపురనేని, బి. ఏ. బి. ఎల్. సాహిత్యకృషిలోను, నవలా రచనలోను పేరుపొందారు. ఆంధ్ర ప్రభుత్వ ప్రచురణశాఖా డైరెక్టరు 1954 జనవరి నుంచి 1956 నవంబరు వరకు; హైదరాబాద్ రేడియోస్టేషనులో గ్రామీణ కార్యక్రమాలకు సలహాదారు 1957 నుంచి. అడ్రసు, హైదరాబాద్.

గోవిందరావు, బారు, జననం 1901 జులై 12; ఎం. ఏ., బి. ఎల్. వాణిజ్య విషయాలలో నిపుణులు. గుంటూరుజిల్లాలో రైతుల అప్పు లను సమాధాన పరచడానికి ప్రభుత్వం నియమించిన బోర్డులో సభ్యులు, 1941-43; ధరల సలహా కమిటీ, గుంటూరు, 1942-43; ఆంధ్రమహాసభ స్థాయి సంఘ సభ్యులు, ఆంధ్రయూనివర్శిటీ అకడమిక్ కౌన్సిలులోనూ, సెనెట్ లోనూ, పాఠనిర్ణయ సమితిలోనూ సభ్యులు; ఆర్థిక వాణిజ్య విషయాలను గురించి పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ వుంటారు; 1945 నుంచి గుంటూరు హిందూ కాలేజి వైస్-ప్రిన్సిపాల్. అడ్రసు: హిందూ కాలేజి, గుంటూరు.

చక్రపాణి (ఆలూరి వెంకట సుబ్బారావు), జననం 1908 ఆగస్టు 5. చందమామ ఎడిటర్: రచనలు, త్రిలోచన కవిరాజు, బడదీదీ, దేవదాస్, మొదలైన అనువాదాలు, తోకచుక్క, పాతమంగలి, భేతాళ కథలు; 'ధర్మపత్ని' ఫిలింకు సంభాషణలు, స్వర్గసీమకు కథ వ్రాశారు. విజయ ప్రొడక్షన్స్ వారి షావుకారు, పాతాళభైరవి, పెళ్ళి చేసి చూడు, చంద్రహారం, మిస్సమ్మ, మాయాబజార్, అప్పు చేసి పప్పు కూడు, చిత్రాల్ని బి. నాగిరెడ్డిగారితో కలిసి తయారు చేశారు. అడ్రసు: వాహిని స్టూడియోస్-కోడంబాకం.

చంద్రమౌళి, కల్లూరి; స్కాట్లండు వెళ్లి, అక్కడ యూనివర్సిటీలో 1924 లో పట్టం పొందారు. 1926 లో కాంగ్రెసులో చేరారు. 1937 లో ఎం. ఎల్. ఏ; గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులు. 1928-30; 1930, 1940, 1942 లలో కాంగ్రెసు ఉద్యమంలో జెయిలుకు వెళ్ళారు. 1946 లో మళ్ళీ ఎం. ఎల్. ఏ. స్థానిక పరిపాలనాశాఖామంత్రి, 1947-52; ఆంధ్రప్రదేశ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి, 1954 జనవరి నుంచి 1955 మార్చి; ఆంధ్ర ప్రభుత్వ రెవిన్యూమంత్రి 1955 మార్చి 28 నుంచి, 1954 నవంబరు 1 వరకు. అడ్రసు: హైదరాబాద్.

చంద్రారెడ్డి, పి. జనన, 1904 జులై; దామరమడుగు, మద్రాస్‌లో న్యాయవాది వృత్తి ప్రారంభం 1928; మదరాసు బార్ కౌన్సిల్ సభ్యులు, 1943-49; మదరాస్ హైకోర్టు జడ్జి. 1948-54; ఆంధ్ర హైకోర్టు జడ్జి, 1954 జులైనుంచి; అడ్రసు : హైదరాబాద్.

చామకూర్, ఎస్. ఎన్. (సత్యనారాయణ); జననం, 1904 ఏప్రిల్ 8; రాజమండ్రి. 1923 లో కే. శే. దామెర్ల రామారావుగారి వద్ద చిత్రకళను అభ్యసించారు. 1923 లో వెంబ్లీలో జరిగిన బ్రిటిష్ ఎంపైర్ ఎగ్జిబిషన్‌కు ఇండియానుంచి ఎన్నబడిన 16 చిత్రాలలో, 'ధ్యానబుద్ధ' అనే వీరి చిత్రం ఒకటి. 1928 లో బొంబాయిలోని సర్ జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో చేరి, 1930 లో డిప్లొమా పొందారు. మదరాసులో ఆర్టు ఎకడమీని స్థాపించారు. దక్షిణ భారత చిత్రకారుల సంఘమునకు 1948 నుంచి గౌరవ కార్యదర్శి. అడ్రసు : 10 అప్పర్ స్వామి కోయిల్ వీధి, మైలాపూర్.

చెన్నారెడ్డి, డాక్టర్ మర్రి, జన 1919 జనవరి; హైదరాబాద్‌లోని సిరిపురంలో. 1941 లో వైద్యపట్టం పొందారు.1935లో ఖద్దరుప్రచారం సాగించారు. 1940 లో హైదరాబాదులో ఆంధ్ర విద్యార్థి మహాసభను స్థాపించారు. జెయిలుకు వెళ్ళారు. హైదరాబాద్ ప్రభుత్వ ఆహార మంత్రి 1952-56; అడ్రసు : హైదరాబాద్.

చెన్నారెడ్డి, ఎస్. జన. 1919. గుల్బర్గా జిల్లా తాండూరు. బి. ఎ. ఆంధ్ర మహాసభ జిల్లా కార్యదర్శి, 1946. హైదరాబాద్ జిల్లా కాంగ్రెసు కార్యదర్శి, 1947-49; హైదరాబాద్ ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి

1950-51; హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్య వర్గ సభ్యులు. 1947-49, రాజ్యసభ సభ్యులు 1952నుంచి. అడ్రసు:565, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

జయప్రకాశ్ నారాయణ్; జన. 1901 అక్టో 10; కాంగ్రెసు సోష లిస్టుపార్టి స్థాపకులు; 1922-30 లలో అమెరికాకు వెళ్ళి 5 యూని వర్సిటీలలో చదివివచ్చారు. 1931 లో కాంగ్రెసు కార్మిక శాఖను నిర్వహించారు. 1942 లో జెయి లుకు వెళ్లారు. 1946 లో కాం గ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు. ప్రస్తుతం భూదాన ఉద్యమంలో కృషి చేస్తున్నారు.

జానకిరామ్, ఆచంట; జననం 16 జూన్ 1903; మదనపల్లి, ఆడ యారులోని థియొసాఫికల్ స్కూళ్లలోను, విజయనగరంలోని మహారాజా రిసర్చి లేబరేటరీస్ లోను బెంగుళూరు ఇండియన్ సైన్సు ఇన్స్టిట్యూట్ లోను విద్యా భ్యాసం; 'వాణి' పత్రిక సహాయ సంపాదకులు, 1948-59; కృష్ణా పత్రిక, భారతి, కిన్నెర పత్రికలకు తరచు వ్రాస్తూ వుంటారు, అడ్రసు: 3, బెసెంట్ రోడ్, గోపాలపురం, మదరాసు-6.

జోషి, వెంకట రాజేశ్వర; జన. 1913 ఫిబ్రవరి 10 మెదక జిల్లా శంకరం పేటలో. పత్రికా విలేఖరి; 1935 లో శ్రీ రామచంద్ర గ్రంథాలయం స్థాపించారు. 1938 సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆంధ్రమహాసభ స్థాయీ సంఘ సభ్యులు, 1939; మెదక జిల్లా ఆంధ్రమహాసభ కార్యదర్శి. 1942; ఆంధ్ర సారస్వత పరిషత్ కేంద్ర సంఘ సభ్యులు, 1943. జిల్లా కాంగ్రెసు కార్యదర్శి, 1946. 1947 కాంగ్రెసు ఉద్య మంలో 14 నెలలు జెయిలుకు వెళ్ళారు. హైదరాబాద్ శాసన సభ సభ్యులు, 1952-57. అడ్రసు: శంకరంపేట.

తిరుమలరావు, మొసలికంటి; (కాకినాడ) జనం. 1910 జనవరి 29. కాంగ్రెసు ఉద్యమంలోచేరి 1921 లో చదువు మానేశారు. కేంద్ర శాసనసభ్యులు, 1937-41. కౌన్సిల్ ఆఫ్ స్టేట్ సభ్యులు, 1945-47; చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. పార్లమెంటు సభ్యులు 1949-52. 1948 అక్టోబరులో కామన్వెల్తు పార్లమెంటరీ డెలి గేషన్లో ప్రతినిధిగా ఇంగ్లండు, హాలెండు, బెల్జియం, ఐర్లెండు, పర్యటనము చేశారు. 1950 లో ఆహారధాన్య సేకరణ సంఘాధ్య

క్షులుగా పని చేశారు. కేంద్ర ప్రభుత్వ ఆహార శాఖ డిప్యూటి మంత్రి, 1956 ఆగస్టు 10 నుంచి, 1952 మే 13 వరకు; వింధ్య ప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్, 1956 జన. 16 నుంచి 1956 నవం. 1 వరకు. 1957 మార్చిలో లోక్ సభ సభ్యులుగా కాకినాడనుంచి ఎన్నిక అయారు. అడ్రసు : కాకినాడ.

దుర్గాబాయి శ్రీమతి; జననం. 1909. తమ పదమూడవ ఏటనే కాకినాడలో బాలికా హిందీ పాఠశాలను స్థాపించి, జయప్రదంగా నిర్వహించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో జెయిలుకు వెళ్ళి, అక్కడ ఇంగ్లీషు నేర్చుకోవడం ప్రారంభించారు. తరువాత 1932 లో కూడా జైలుకు వెళ్లారు. స్వయంగా ఇంగ్లీషు చదువుకొని, 30 వ ఏట ఎం. ఏ డిగ్రీని పొంది, తరువాత 'లా' చదివి పాస్యయి, లాయరుగా ప్రాక్టీసు చేశారు. పార్లమెంటు మెంబరు, 1947 - 54. కేంద్ర ప్రభుత్వ సాంఘిక సంక్షేమ సంఘ అధ్యక్షురాలు, 1954 ఫిబ్రవరి 26 నుంచి; 1952 జనవరిలో శ్రీ సి. డి. దేశముఖ్ తో వివాహం. అడ్రసు : న్యూఢిల్లీ.

దేశముఖ్, చింతామణ్ ద్వారకనాథ్; జననం. 1896 జనవరి 14. 1919 లో ఐ. సి. ఎస్. లో చేరారు. ఆర్థికశాస్త్ర నిపుణులు. రిజర్వుబ్యాంకి డిప్యూటీ గవర్నర్ 1941-43; రిజర్వుబ్యాంక్ గవర్నరు 1943-49 ఇండియాప్రభుత్వ ఆర్థికమంత్రి 1950 నుంచి 1956 వరకు. యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ చైర్మన్ 1956 నుంచి, అడ్రసు, న్యూఢిల్లీ.

ధర్మారావునాయుడు, తాపీ; జననం. 1888 సెప్టెంబరు 19 బి. ఏ. (మదరాసు); బరంపురంలో కల్లికోట కాలేజిలో లెక్చరర్, 1909; 1911 లో వేగుచుక్క గ్రంథమాల స్థాపించారు; జనవాణి సంపాదకులు, 1936-39, కాగడా సంపాదకులు. 1939-42 నేషనల్ సర్వీస్ లేబర్ ట్రిబ్యునల్ పబ్లిసిటీ ఆఫీసరు, 1934; మదరాసు సాహితీ సమితి మొదటి అధ్యక్షులు, అనేక గ్రంధాలు రచించారు. అనేక ఫిలిములకు కథలు వ్రాశారు. వీరికి 'ఆంధ్రవిశారద' బిరుదాన్ని శృంగేరి మఠాధిపతులిచ్చారు.

నరసింగరావు, జె, వి. జననం, 1914; కాశీ విశ్వవిద్యాలయం పట్టభద్రులు; న్యాయవాదవృత్తిలో 1. ఏళ్ళ క్రితం ప్రవేశించారు, హైద

రాబాద్ ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులు; ఎ. ఐ. సి. సి. సభ్యులు హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు; ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తిశాఖామంత్రి, 1956 నవంబరు 1 నుంచి, అడ్రసు, హైదరాబాద్.

నరసింగరావు, ఎం. జననం. 1896 మార్చి 12; 1926 వరకు న్యాయవాదిగా వున్నారు. 1927 లో రయ్యత్ అనే ఉర్దూ పత్రికను స్థాపించారు. ఆంధ్ర సమావేశ అధ్యక్షులు, 1936; హైదరాబాద్ శాసనసభ సభ్యులు, 1938-42; హైదరాబాద్ పత్రికా రచయితల సంఘ అధ్యక్షులు, 1941; హైదరాబాద్ శాసనసభ సభ్యులు 1952 నుంచి. రాష్ట్ర పబ్లిక్ వర్క్స మంత్రి 1956 నవంబరు నుంచి, అడ్రసు : హైదరాబాద్.

నరసింహామూర్తి, వేదుల: జననం. 9 ఏప్రిల్ 1916: ఆంధ్రవిశ్వకళాపరిషిత్ బి. ఏ. ఆనర్సు (గణితశాస్త్రం) 1938 లో ప్రథమ తరగతిలో ఉత్తీర్ణులై, చేపూరి సన్యాసిరాజు స్వర్ణపతకము పొందినారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో 1938-41 అలో పరిశోధనచేశారు. ఆంధ్ర యూనివర్సిటీ కాలేజిలో గణిత శాస్త్రబోధకులు 1943-45; రిజర్వు బ్యాంకు (బొంబాయి)లో 1945 నుంచి 1947 ఆగస్టు వరకు స్టాటిస్టిక్స రిసెర్చి సూపరిండెంటు, 1947 ఆగస్టునుంచి రిసెర్చి ఆఫీసరుగా పనిచేస్తున్నారు. అడ్రసు : స్టాటిస్టికల్ ఆఫీసర్, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

నాగభూషణం, పాతూరి, జననం. 1907 ఆగస్టు 11. 1938 నుంచి ఆంధ్రదేశ గ్రంథాలయ సర్వస్వము సంపాదకులు, రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యులు: రచనలు : గ్రంథాలయములు - రిజిస్ట్రేషన్ ; గ్రంథాలయశాస్త్ర ప్రథమ పాఠములు; గ్రంథాలయ పట్టికలు. సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్ళారు. అడ్రసు : పటమటలంక (వయా) బెజవాడ.

నాగిరెడ్డి, బొమ్మిరెడ్డి, జననం. 1912 డిసెంబరు 1; వాహిని ప్రొడక్షన్స మేనేజింగ్ డైరెక్టర్ 1948 నుంచి; విజయ ప్రొడక్షన్స మేనేజింగ్ డైరెక్టర్, 1949 నుంచి; బి. ఎన్. కె. ప్రెస్ ప్రొప్రయిటర్; చందమామ పత్రిక ప్రచురణకర్త - ప్రస్తుతం వాహిని స్టూడియోస్‌ను కౌలుకు తీసుకుని నిర్వహిస్తున్నారు. వీరు,

చక్రపాణి కలసి షావుకార్, పాతాళభైరవి, పెళ్ళిచేసిచూడు, చంద్రహారం, మిస్సమ్మ, మాయాబజార్, అప్పు చేసి పప్పు కూడు, చిత్రాల్ని తయారు చేశారు. అడ్రసు: మదరాసు-26.

నాగేశ్వరరావు, అక్కినేని; జననం 1924 సెప్టెంబరు 20; కృష్ణజిల్లా వెంకటరాఘవపురంలో; విద్యార్థిగా వుండగానే నాటక, సినిమా కళపట్ల అభిమానం చూపారు. నాటకాలలో స్త్రీ పాత్రలను ధరించారు. 1940 లో మొట్టమొదటిగా సినిమాలో నటించారు. 1958 జూన్ 1 నాటికి మొత్తం 63 చిత్రాలలో నటించారు. వానిలో 49 తెలుగు చిత్రాలు; 14 తమిళ చిత్రాలు. 60 చిత్రాలలో నటించడం పూర్తికాగానే, 1957 జూలై 28 న వజ్రోత్సవం జరుపుకొని, ఆ సందర్భంలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు రు. 25,000 విరాళ మిచ్చిన దాత. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సెనెట్‌లో యావజ్జీవ సభ్యులు. విద్యాసంస్థలకు భూరి విరాళాలను ఇచ్చారు. అడ్రసు: 38, సారంగపాణివీధి, త్యాగరాయనగర్, మదరాసు.

నిర్వికల్పానందస్వామి, జననం. 20 డిసెంబరు 1915: తమ పద్దెనిమిదవ ఏటనే (1931) భువనేశ్వరంలోని శ్రీ రామకృష్ణ మఠంలో తురియాశ్రమ స్వీకారం చేశారు, 1939 వరకు అక్కడనే వున్నారు. 1942 వరకు వంగదేశంలోని రామకృష్ణమఠ కేంద్రాలలో పనిచేశారు. 1942 నుంచి 1946 వరకు మదరాసు. 1944 లో శ్రీరామకృష్ణమఠం తరఫున శ్రీరామకృష్ణ ప్రభ అనే మాస పత్రికను స్థాపించి, దానికి ప్రథమ సంపాదకులుగా పనిచేశారు. 1946 నుంచి 1948 వరకు విశాఖ పట్టణంలో వున్నారు. వీరు సంస్కృత, ఇంగ్లీషు, తెలుగు, వంగభాషలలో పండితులు. రచనలు: యోగవాసిష్ఠం, భగవద్గీత, తత్వశాస్త్ర చరిత్ర, అష్టాదశశ్లోకగీత, భక్తి తత్వము, ప్రపంచ మతములు. మొదలైనవి; శ్రీ పూర్ణానంద శ్రీ వనమాలి అనే పేర్లతో తెలుగు పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ వుంటారు. అడ్రసు: శ్రీరామకృష్ణ మఠం: రాజమండ్రి.

నిరీక్షణరావు, గోవాడ; జననం. నవంబరు 1915. మైనరుగా వుండగానే రాజకీయాలలోనూ, విద్యార్థి ఉద్యమాలలోనూ పాల్గొన్నారు. 1930 నుంచీ పత్రికలకు వ్యాసాలూ, కథలూ, వ్రాస్తున్నారు.

హైదరాబాదులో, సంఘమాన్య. ఆది హిందుపత్రికలలోనూ, వాహిని పత్రికలలోనూ పని చేశారు. జెయిలుకు వెళ్లారు. రచనలు: ఉక్కు మనిషి, కథాలోకం, పెళ్ళి అంటే ఏమిటి? అడ్రసు: మలకాపట్నం, మచిలీపట్నం.

నెహ్రూ, పండిత జవహర్ లాల్; జననం. 1889 నవంబరు 14, ఎం. ఏ; బారెట్లా; అలహాబాదు హైకోర్టులో అడ్వకేటుగా ప్రాక్టీసు చేశారు. హోం రూల్ లీగ్ సెక్రటరీ, 1916. ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటి మెంబరు; 1921 లో జైలు; 1922 లో విడుదల చేయబడి మళ్ళి జెయిలుకు పంపబడినారు. అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి, 1929; కాంగ్రెసు అధ్యక్షుడు, 1929-30; ఉప్పు సత్యాగ్రహంలో 1930 ఏప్రిల్ లో అరెస్టు చేయబడి, 1931 జనవరిలో విడుదల; కాంగ్రెసు అధ్యక్షుడు 1936-37; 1940 లో మళ్ళీ అరెస్టు. తొమ్మిదవసారి మళ్ళీ 1942 ఆగస్టులో అరెస్టు, 1945 జూన్ 15 న విడుదల. వైస్రాయి కౌన్సిలు మెంబరు; స్వతంత్రభారత దేశ ప్రధాన మంత్రి 1947 ఆగస్టు నుంచి. అడ్రసు: న్యూ ఢిల్లీ.

పట్టాభిరామారావు, ఎస్. బి. పి. జననం, 30 డిసెంబరు 1911. బి. ఏ. ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనెట్ సభ్యులుగను సిండికేట్ సభ్యులుగను వున్నారు. 1952 లో తూర్పు గోదావరి జిల్లా పామర్రు నియోజకవర్గంనుంచి రాష్ట్ర శాసన సభకు ఎన్నుకోబడినారు. మదరాస్ రాష్ట్ర ప్రభుత్వ వాణిజ్య పన్నుల శాఖామంత్రి 1952 ఏప్రిల్ 1953 అక్టోబర్. ఆంధ్రరాష్ట్ర విద్యా మంత్రి 1953 అక్టోబరు 1954 నవంబర్. ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు 1955 మార్చినుంచి, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రి, 1956 నవంబర్ 1 నుంచి; అడ్రసు: హైదరాబాద్.

పట్టాభి సీతారామయ్య, డాక్టర్ భోగరాజు; జననం, 1880. నవంబర్ 24; 1906 నుంచి 1916 వరకు డాక్టర్ గా ప్రాక్టీసు. 1917 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నిర్మాణం విషయంలో ఎక్కువ కృషి చేసినారు. 1938 లో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. కొంతకాలం అఖిల భారత సంస్థాన ప్రజల కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్నారు. అఖిల భారత మోటారు యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షులు, చాలా కాలం కాంగ్రెస్

వర్కింగు కమిటీ సభ్యులుగా వున్నారు. చాలాసార్లు జెయిలుకు వెళ్లారు. పార్లమెంటు సభ్యులు 1946-52, భారత కాంగ్రెస్ అధ్యక్షులు. 1949; మధ్యప్రదేశ్ గవర్నర్; 1952-1957; అడ్రసు: హైదరాబాద్.

పళ్ళంరాజు, మల్లిపూడి, జననం, 1899 ఏప్రిల్ 25. కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పట్టం పొందారు. 1923 లో గ్రామ మునసబు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, రాజకీయాలలో ప్రవేశించారు. 1929 లో కాంగ్రెస్ అధ్యక్షగా, తూర్పు గోదావరి జిల్లాబోర్డు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. స్వరాజ్యోద్యమంలో చాలాసార్లు జెయిలుకు వెళ్లారు. రాష్ట్ర అసెంబ్లీ సభ్యులు, 1937-39; 1946-52, 1955 మార్చినుంచి అడ్రసు: కాకినాడ.

పుల్లారెడ్డి, పి. జననం, 1919 ఏప్రిల్ 14 గద్వాలలో; బి. ఏ. ఎల్. ఎల్. బి; స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్నారు. మహబూబ్ నగర్ జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు; హైదరాబాద్ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శి, 1948-50; హైదరాబాద్ శాసనసభ సభ్యులు 1952-57. అడ్రసు: 315 - బి. సి, ఐ. బి, బ్లాకు, ఆగాపురా, హైదరాబాద్.

ప్రసాద్, కానూరి లక్ష్మీనారాయణ: జననం. 1 జనవరి 1028. విజయవాడలో వ్యాపారస్తులు. కవృతరంలో వీరి తండ్రిగారు స్థాపించిన శ్రీ కానూరి దామోదరయ్యా బోర్డు హైస్కూలుకు వేలకొలది రూపాయల విరాళం ఇచ్చి, ఆ స్కూలు సర్వతోముఖాభివృద్ధికి నిరంతరం కృషిచేస్తున్న విద్యాదాత. ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామెర్స్ ఎగ్జిక్యూటివ్ మెంబరు. అడ్రసు: సూర్యారావుపేట, విజయవాడ-2.

ప్రసాద్, పాండె సుందర నారాయణ, జననం, 24 సెప్టెంబర్ 1910 (యలమంచిలి), బి. ఏ. (కాకినాడ); ఎం. ఏ. (బెనారస్); ఆంధ్ర యూనివర్శిటీలో ఎకనమిక్స్ లెక్చరర్ గాను, నాగపూర్ హిస్లాప్ కాలేజీ, పూనా వాడియా కాలేజిలలో ఎకనమిక్స్ ప్రొఫెసర్ గాను పని చేశారు. ప్రస్తుతం, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో బాలెన్స్ ఆఫ్ పేమెంట్సు రిసెర్చి డైరెక్టరుగా పనిచేస్తున్నారు. స్టెర్లింగ్ నిల్వ విషయమై బ్రిటిషు ప్రభుత్వంతో సంప్రతింపులకు ఇంగ్లండు వెళ్ళిన (1948) ప్రతినిధి వర్గంలో సభ్యు

లు; అడ్రసు : డైరెక్టర్, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

ప్రసాద్, వెలమాటి గోపాల సత్యనారాయణ వర: జననం. 9 డిసెంబరు 1919, మదనపల్లి థియొసాఫికల్ కాలేజిలోను, మదరాసు లాయొలా కాలేజిలోను చదివారు. బి. ఏ. 1941. 1946 నుంచీ మదరాసులో వ్యాపారం చేస్తున్నారు; నేషనల్ ఇంజనీరింగ్ కంపెనీ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్; అడ్రసు : 9, తిరుమలైపిళ్లై వీధి, త్యాగరాయనగర్.

బలరామ కృష్ణయ్య దుగ్గిరాల : జననం. 1905 జులై 10; పంజాబు దురంతాలను వర్ణించే నాటకాలను ప్రదర్శించినందుకు 14 వ యేటనే అరెస్టు చేయబడినారు : బుద్ధపురాణం అనే వీరి గ్రంథరచనకు హర్షించి, ఆంధ్రమహాసభవారు 1928 లో 'బౌద్ధవాఙ్మయబ్రహ్మ' అనే బిరుదు నిచ్చారు; ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభ అధ్యక్షులు. 1930 లో ఏడాది, 1931 లో ఏడాది, 1933 లో 9 నెలలు, 1942 నుంచి 1944 వరకు జెయిలులోవున్నారు. ఆంధ్ర రాష్ట్ర రాజకీయ మహాసభ అధ్యక్షులు, 1946-47; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి, 1947-50; అఖిలభారత కాంగ్రెసు సంఘ సభ్యులు. లోక్‌సభ సభ్యులు 1957 మార్చి నుంచి. అడ్రసు : సూర్యారావుపేట, విజయవాడ.

బలరామరెడ్డి, అన్నారెడ్డి; జ. 1898 ఆగస్టు 18; ఇనమడుగు గ్రామ పంచాయితి ప్రెసిడెంటుగా 20 ఏళ్ళు, కోవూరు తాలూకా యూనియన్ ప్రెసిడెంటుగా రెండేళ్లు పనిచేశారు; ఇనమడుగులో లైబ్రరీని కట్టించారు. 1890 నుంచి 1955 వరకు ఏ తేదీన ఏ వారమో అడిగిన తక్షణమే చెప్పగలరు. 1945 రెడ్డి మహాజన సభలో వీరికి జ్ఞాపకబ్రహ్మ అనుబిరుదును డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారు ఇచ్చినారు. అడ్రసు : ఇనమడుగు, కోవూరు తాలూకా, నెల్లూరుజిల్లా.

బసవరాజు వల్లూరి; జననం. 5 మే 1914, గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో. 1934 లో హైదరాబాదులో ఇంజనీరుగా ప్రైవేటు ప్రాక్టీసు పెట్టి అనేక భవనాలను నిర్మించారు. 1944 వరకూ హైదరాబాద్ ఆంధ్ర మహాసభ సభ్యులు. 1946 లో సంస్థాన కాంగ్రెసులో చేరారు. 1950 జూనులో హైదరాబాద్ మంత్రిగా నియమింపబడినారు; హైదరాబాదు ప్రభుత్వ నిర్మాణ శాఖామంత్రి 1951 మార్చి నుంచి

1953 ఫిబ్రవరి; ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలశాఖమంత్రి 1956 నవంబరు 1 నుంచి. 1959 మార్చి వరకు; ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి 1959 మార్చి నుంచి. అడ్రసు : హైదరాబాదు.

బాపినీడు, మాగంటి, జననం : 14 ఆగస్టు 1895; బి.ఎ., కలకత్తా, కార్నెల్ యూనివర్సిటీ. ఎం.ఎస్. సి., కాలిఫోర్నియా; కాంగ్రెసు ఉద్యమాలలో జెయిలుకు వెళ్లారు. రచనలు : తెలుగుతల్లి, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, బాపుజీ చిత్ర జీవితము, ఆంధ్ర వీరాంగనలు. పిల్లల బొమ్మల భారతము; మదరాసు ఇండస్ట్రీస్ అసోసియేషన్ సాపకులు; ఆంధ్రదేశ హరిజన సేవక సంఘ కార్యదర్శి 1932-42. మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1937-39, 1945-52. ప్రచురణ శాఖ మంత్రికి పార్లమెంటరి కార్యదర్శి 1937-39. పెద్దాపురం కమ్యూనిటీ ప్రాజెక్టు ఆఫీసరు. 1953-55; భారత సేవక్ సమాజ్ దక్షిణ ప్రాంతానికి ఆర్గనైజింగ్ సెక్రటరి, 1958 నుంచి. అడ్రసు: మదరాసు.

బ్రహ్మయ్య, గొట్టిపాటి;జననం, 1898 డిసెంబరు 3; 1918 నుంచి రాజకీయాలలో పాల్గొంటున్నారు; 1922, 1930, 1938 లలో తూర్పు కృష్ణా జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షులు. హరిజనోద్యమాభివృద్ధి, రైతు జనక్షేమంకోసం కృషిచేశారు. మొత్తం మూడు సార్లు జెయిలుకు వెళ్లారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి. 1937-40, రాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షులు, 1936-37; ఎం. ఎల్. సి. ఆంధ్రప్రదేశ్, 1958 జులై నుంచి; అడ్రసు : ఘంటసాల; కృష్ణా జిల్లా.

బసిరెడ్డి, పెదినేనికల్వ; జననం: 20 ఆగస్టు 1906; బి. ఏ. ఆనర్స్, బారెట్లా, న్యాయవాది వృత్తి ప్రారంభం 1931 ఆంధ్రప్రదేశ్ హైకోర్టు బడ్జిగా నియామకం, 1957 అక్టోబర్ 10; అడ్రసు, హైదరాబాద్.

బ్రహ్మానందరెడ్డి, కాసు; జననం, జులై 28,1909. బి. ఎ; బి.ఎల్, ఎ. ఐ. సి, సి. సభ్యుడు. ఆంధ్ర యూనివర్సిటి సెనేట్ మెంబర్, జెయిలుకు వెళ్ళారు. గుంటూరు జిల్లా బోర్డు ప్రెసిడెంటు, 1946-మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946-52; ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుప్రధాన కార్యదర్శి,1955 - 56; ఆంధ్రప్రదేశ్ స్థానిక పరిపాలనశాఖ మంత్రి 1956 నవం

బరు 1 నుంచి 1958 మేవరకు; ఆరిక శాఖమంత్రి, 1958 మేనుంచి; అడ్రెసు: హైదరాబాద్.

భగవంతం, సూరి; జననం 1909; బి. ఎస్. సి., హైదరాబాద్ 1928; ఎం. ఎస్. సి. మదరాస్, 1932, వీరు 1933 లో అంధ్ర యూనివర్శిటీలో ఫిజిక్స్ రీడర్ గా చేరారు. 1938 లో ప్రొఫెసర్. 1941 నుంచీ యూనివర్శిటి కాలేజి ప్రిన్సిపాల్. 1941 లో ఆంధ్ర యూనివర్సిటి, వీరికి ఆనరరీ డాక్టర్ ఆఫ్ సైన్సుడిగ్రీని ఇచ్చినది. 1946 లో ఇండియన్ సైన్సు కాంగ్రెసులో ఫిజిక్స్ శాఖకు అధ్యక్షులు. 1948 లో ఇండియా గవర్నమెంటు తరఫున సైంటిఫిక్ లయిజెన్ ఆఫీసరుగా లండనులో వున్నారు. 1949 డిసెంబరునుంచి ఉస్మానియా యూనివర్శిటి ఫిజిక్స్ రీసెర్చి శాఖకు డైరెక్టరుగా పని చేశారు. ఉస్మానియా యూనివర్శిటి వైస్ ఛాన్సలర్; 1952-57; ఇండియన్ ఇన్స్టిట్యూట్ డైరెక్టర్, 1957 ఏప్రిల్ నుంచి; అడ్రసు, బెంగుళూరు.

భగవంతరావు, అవగాని; జననం. 1923; ఎం. ఎ, ఎల్. ఎల్. బి. 1951 లో లాయరుగా రేపల్లె లో ప్రాక్టీసు ప్రారంభించారు. 1955 లో కూచిపూడి నియోజక వర్గంనుంచి ఆంధ్ర అసెంబ్లీకి ఎన్నికయారు. ఆంధ్ర రాష్ట్రంలోని వెనుకబడిన జాతుల సంఘానికి అధ్యక్షులుగాను, గీత పనివారల సంఘానికి సంయుక్త కార్యదర్శిగాను వున్నారు. 1957 డిసెంబరు 26 నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో కుటీర పరిశ్రమల మంత్రి. అడ్రసు, హైదరాబాద్.

మూర్తి బి. ఎస్. (బయ్యా సూర్యనారాయణమూర్తి) జననం. 1909 అక్టోబర్ 29; బి. ఏ. బి. ఇ. డి. రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజి; తొమ్మిదవ ఆంధ్ర విద్యార్థి సమావేశం ప్రధాన కార్యదర్శి, 1930; పరిశ్రమశాఖా పార్లమెంటరీ సెక్రటరీ 1937-39, ఆంధ్రప్రభ అసిస్టెంటు ఎడిటర్, 1944-46; రెండుసార్లు కాంగ్రెస్ ఉద్యమంలో జెయిలుకు వెళ్లారు. మదరాస్ అసెంబ్లీ సభ్యులు 1946-52; పరిశ్రమశాఖ పార్లమెంటరీ సెక్రటరీ 1946-47. (నవజీవన) సంపాదకులు; ఆంధ్రరాష్ట్ర హరిజనసేవా సంఘ అధ్యక్షులు, 1949 ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ కాంగ్రెస్ అధ్యక్షులు. పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి. కేంద్ర ప్రభుత్వ సమాజాభివృద్ధిశాఖ పార్లమెంటరీ

కార్యదర్శి, 1958-59; డిప్యూటి మంత్రి, 1959 మార్చి నుంచి; అడ్రసు: ఢిల్లి.

మెహత, అశోక్; జననం, 1911 అక్టోబరు 24; బి. ఎ. 1930 నుంచి రాజకీయాలలో ప్రవేశం. సోషలిస్టు పార్టీ నాయకులు; ఆ పార్టీ స్థాపకులలో ఒకరు. నాలుగుసార్లు జయిలుకు వెళ్ళారు. సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గంలో గత 15 ఏండ్లనుంచీ సభ్యులు. అడ్రస్; 5, డాడీసెట్ రోడ్, బాబుల్‌నాథ్, బొంబాయి.

మెహిదినవాజ్ జంగ్ బహదూర్ జననం, 1894 మే 23; హైదరాబాద్ ప్రభుత్వంలో రెవిన్యూ ఆఫీసర్, సహకారశాఖ అసిస్టెంట్ డైరెక్టర్, వాణిజ్య పరిశ్రమలశాఖ కార్యదర్శి, బీరార్‌లో ఏజంట్ జనరల్‌గా పనిచేశారు. హైదరాబాద్ ప్రభుత్వ ఆరోగ్యశాఖమంత్రి 1952-56; ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య శాఖమంత్రి 1956 నవంబర్ 1957 మార్చి; సహకారశాఖమంత్రి 1957 మార్చినుంచి; 1 అడ్రస్ హైదరాబాద్.

రంగ, ఎన్. జి. (గోగినేని రంగనాయకులు,) జననం, 1900 నవంబరు 7; ఆక్స్‌ఫర్డులో పట్టభద్రులై వచ్చారు. మదరాస్ పచ్చయప్ప కాలేజీలో ఆర్థిక శాస్త్ర ప్రధానాచార్యులు 1931 - 36. కాంగ్రెస్ వర్కింగు కమిటి మెంబరు 1947-51, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు 1947-50 అఖిలభారత కిసాన్ కాంగ్రెస్, గ్రామీణ ప్రజల సమితిలకు కూడా అధ్యక్షులుగా వున్నారు. నిడుబ్రోలులో రైతాంగ విద్యాలయాన్ని స్థాపించారు. రాజ్యసభ సభ్యులు 1952-57; లోకసభ సభ్యులు 1957 మార్చి నుంచి; అడ్రస్: నిడుబ్రోలు.

రంగయ్యప్పారావు, మేకా ఉయ్యూరు కుమారరాజా; వయస్సు, 45 ఏళ్లు. ఎం. ఏ., ఆంధ్రమహాసభకు 6 సంవత్సరాలు, ఆంధ్రనాటక కళాపరిషత్తుకు 8 సంవత్సరాలు అధ్యక్షులు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనెట్‌లో 14 సంవత్సరాలుగాను, సిండికేట్‌లో 12 సంవత్సరాలుగాను సభ్యులు. ఆంధ్ర అసెంబ్లి సభ్యులు, 1953 నుంచి; అడ్రసు: నూజవీడు.

రంగారెడ్డి, పిడతల; జననం, 1917 సెప్టెంబర్ 10; 1958 నుంచి ప్రదేశ్ కాంగ్రెసు, అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు; 1937, 1940, 1942 లలో జాతీయోద్యమంలో జెయిలుకు

వెళ్లారు. రాష్ట్రశాసన సభ్యులు 1946-50; పార్లమెంటు సభ్యులు; 1950-52; 1952 నుంచి మళ్ళీ రాష్ట్రశాసనసభ సభ్యులు; శాసన సభ కాంగ్రెసుపార్టీ విప్; ప్రదేశ్ కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి, 1957-58; ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు 1958 ఏప్రిల్ 24 నుంచి; అడ్రసు: గాంధిభవన్, హైదరాబాద్-1

రఘురామయ్య, కొత్త; జననం. 1952 బి. ఏ. గుంటూరు; ఎం. ఏ., ఎల్. ఎల్. బి., లక్నో; బారిష్టర్ 1937. నాలుగేళ్ళపాటు ప్రాక్టిసు చేసి, 1941 లో మదరాసు లా డిపార్టుమెంటు అసిస్టెంట్ సెక్రట రీగా చేరారు. 1947 లో ప్రభుత్వ న్యాయశాఖకు డిప్యూటీ సెక్రటరీ అయి, 1949 లో సెక్రటరీ అయి, 1951 లో రాజీనామా యిచ్చి, కాంగ్రెసు అభ్యర్థిగా తెనాలి నియోజక వర్గనుంచి, 1957 లో గుంటూరునుంచి లోక్ సభకు ఎన్నిక అయారు. కేంద్రప్రభుత్వ రక్షణ శాఖ డిప్యూటి మంత్రి, 1957 నుంచి. అడ్రసు: న్యూఢిల్లీ.

రమాకాంతరావు దామర్ల; జననం. 1913 జూన్; ఎం. ఏ. (ఆంధ్ర యూనివర్సిటీ, 1935); జనవాణిలో సబ్-ఎడిటర్ 1936-37; ఆంధ్రదేశంలో చేనేత పనివారి సంఘాన్ని చాలా ముందుకు తీసుకు వచ్చారు. మదరాసురాష్ట్ర చేనేత పనివారి కాంగ్రెసు అధ్యక్షులు, 1942-48; మదరాసు రాష్ట్ర చేనేత సహకారసంఘ డైరెక్టర్ 1939-53; రాష్ట్రప్రభుత్వ నూలు సలహాసంఘంలో సభ్యులు, 1942; రాష్ట్రప్రభుత్వ చేనేత పనివారి జీత నిర్ణయ సంఘంలో సభ్యులు. 1947. ఆలిండియా హాండ్ లూమ్ బోర్డు మెంబరు 1949 నుంచి, ఆంధ్రరాష్ట్ర చేనేత పనివారి కోఆపరేటివ్ సొసైటీ ప్రెసిడెంట్, 1953-56. ఎం. ఎల్. సి., ఆంధ్రప్రదేశ్, 1958 జులై నుంచి: అడ్రసు: మంగళగిరి, గుంటూరుజిల్లా.

రాఘవరావు, న్యాయపతి జననం 1905 ఏప్రిల్. 13 బి. ఏ (విజయనగరం.) 1921 లో అసహాయోద్యమంలో చేరి చదువు వదిలేశారు. 1931 వరకూ కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. హిందూ పత్రిక సంపాదక వర్గంలో పనిచేస్తూ 1945 లో పిల్లలకోరకు మొట్టమొదటగా 'బాల' పత్రికను స్థాపించి ప్రస్తుతం ఆ పత్రికను నడుపుతున్నారు, పిల్లల కొరకు నాటికలు, పాటలు వ్రాసి

రేడియో పిల్లలప్రోగ్రాము 1957 వరకూ నిర్వహించారు. 1957నుంచి హైదరాబాద్ రేడియో స్టేషన్‌లో ప్రోగ్రాముల సలహాదారు. అడ్రసు హైదరాబాద్.

రాఘవయ్య, వెన్నెలకంటి, జననం, 1896. ప్లీడరు. 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరి చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. ఏనాదుల ఉద్ధరణ విషయంలో చాలా కృషిచేశారు. ఆదిమవాసులైన ఎరుకల, లంబాడి, కొరవ, యానాది జాతులకు ఉచితభోజన వసతి గృహములను స్థాపించారు. రాష్ట్రవ్యవసాయ కూలీ సంఘమును స్థాపించారు. దక్షిణభారత ఆదివాసి సేవక సంఘ అధ్యక్షులు. ముఖ్యమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1946-47. అడ్రస్: నెల్లూరు.

రాజగోపాలాచారి, చక్రవర్తి, జనం 1879. 1900 లో సేలంలో అడ్వొకేటుగా ప్రాక్టీస్ ఆరంభించి, సహాయ నిరాకరణోద్యమంలోచేరి, ప్రాక్టీస్ వదలివేశారు. 1921-25 లో కాంగ్రెస్ కార్యదర్శి, చిరకాలం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో సభ్యులు, 1930-33 తమిళనాడు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు. 1929 నుంచి అనేకసార్లు జెయిలుకు వెళ్ళారు. మదరాసు రాష్ట్రప్రధాని, 1937-39. కేంద్ర ప్రభుత్వ పరిశ్రమశాఖా సభ్యులు, 1946 సెప్టెంబరు 2 నుంచి 1947 ఆగస్టు 15 వరకు. పశ్చిమ బెంగాల్ గవర్నర్ 1947 ఆగస్టు 15 నుంచి, 1948 జూన్ 21 వరకు; ఇండియా గవర్నర్ జనరల్, 1948 జూన్ 21 నుంచి 1950 జనవరి 26 వరకు; ఇండియా హోం మంత్రి 1950-51. మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి. 1952 ఏప్రిల్ 10 నుంచి 1953 ఏప్రిల్ 13 వరకు. అడ్రసు : బజులుల్లారోడ్, త్యాగరాయనగర్.

రాజమన్నార్, పాకల వెంకట. జననం. 1901 మే 10. బి. ఏ. (1921) రాష్ట్రమంతటికి ప్రథాన స్థానంతో పాసయ్యారు. బి. ఎల్. మదరాసు యూనివర్సిటీ. తెలుగులో అనేక నాటికలు వ్రాశారు. 1922 లో 'కళ' పత్రిక సంపాదకులు. మదరాసు అడ్వొకేటు జనరల్. 1944-45. హైకోర్టు జడ్జి, 1946 నుంచి. ప్రధాన న్యాయమూర్తి, 1948 జనవరి నుంచి. అడ్రసు : విక్టోరియా క్రిసెంట్, ఎగ్మూరు, మదరాసు.

రాజలింగం, ఎం. ఎస్., జన. 1919, వరంగల్ లో; బి. ఎస్. సి.

సేవాగ్రామ ఆశ్రమంలో పని చేశారు. ఆంధ్రమహాసభ, కాంగ్రెసు ఉద్యమాలలో పాల్గొన్నారు. చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. హైదరాబాదు రాష్ట్ర కార్మిక శాఖ డిప్యూటి మంత్రి 1952-56; అడ్రసు: 12-625; రామన్నపేట, వరంగల్.

రాజు, ఎం. టి. (మంతెన తిమ్మరాజు) జననం. 1911 అక్టోబరు 5; పి. ఏ., ఆనర్సు (లండన్); బారెట్లా. 1936 లో ఐ. సి. ఎస్. లో చేరారు. మదరాసు రాష్ట్రంలో కొంతకాలం సబ్ కలెక్టరుగా వుండి, 1945-46 లో కేంద్ర ప్రభుత్వ లేబరు శాఖలో డిప్యూటీ సెక్రటరీగా వున్నారు. 1947 లో మదరాసు ప్రభుత్వ వ్యవసాయ శాఖ జాయింటు డైరెక్టరుగాను, తరువాత పరిశ్రమలశాఖ డైరెక్టరుగారు పనిచేశారు. హైదరాబాద్ లో ఇండియా ప్రభుత్వ ఏజెంటు జనరల్ కు సెక్రటరి 1947-48. మదరాసు ప్రభుత్వ అభివృద్ధి శాఖ డిప్యూటి సెక్రటరీ, 1949; మదరాసు ప్రభుత్వ పరిశ్రమశాఖ డైరెక్టరు, 1949 అగస్టునుంచి 1953 అక్టోబరు వరకు. ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ రెవిన్యూబోర్డు మెంబరుగా వున్నారు. అడ్రసు: హైదరాబాద్.

రాజేంద్రప్రసాద్, డాక్టర్, జననం. 1884 డిసెంబరు 3. ఎం. ఏ., ఎం. ఎల్. ఎల్. ఎల్. డి. 1920 దాకా ప్లీడరీ ప్రాక్టీసు చేశారు. చాలా సంవత్సరాలు బీహారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, గాంధీజీతో కలసి చంపారణ్య జిల్లాలో రైతుల స్వాతంత్ర్యానికి పనిచేశారు. కాంగ్రెసు మహాసభ అధ్యక్షులు. 1932, 1934, 1939, 1947. 1942 అగస్టు 9 తేదీన అరెస్టు చేయబడి 1945 జూన్ 15 న విడుదల పొందారు. కేంద్రప్రభుత్వ ఆహార శాఖా సభ్యులు 1946 సెప్టెంబరు 2 నుంచి, ఆహారమంత్రి. 1947 అగస్టు 15 నుంచి 1949 నవంబరు వరకు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులు 1946 నుంచి 1950 వరకు; భారత రాష్ట్రపతి (ప్రెసిడెంట్), 1950 జనవరి 26 నుంచి. అడ్రసు: రాష్ట్రపతి భవన్, న్యూఢిల్లీ.

రాధాకృష్ణ, డాక్టర్ సర్వేపల్లి; జన. 1886 సెప్టెంబరు 5. కొంతకాలం మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో వేదాంతాచార్యులు. కాశీ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలెర్, ఆక్స్ఫర్డు యూని

వర్సిటీలో స్పాల్డింగు ప్రొఫెసర్ ఆఫ్ ఈస్టరన్ రెలిజియెన్సు, 1936. బ్రిటిషు అకాడెమిలో సభ్యత్వాన్ని పొందిన ప్రథమభారతీయులు. వేదాంత శాస్త్రంమీద అనేక గ్రంథాలు వ్రాశారు. ఆంధ్ర మహాసభ అధ్యక్షులు, 1938. ప్రజాపరిషత్తు సభ్యులు 1946-49. రష్యాలో ఇండియా రాయబారి 1949-52. ఇండియా వైస్ ప్రెసిడెంటుగా 1952 ఏప్రిల్‌లో ఎన్నుకోబడినారు. అడ్రసు : 2, కింగ్ ఎడ్వర్డు రోడ్, న్యూఢిల్లీ.

రామకృష్ణ, వెలగపూడి; జన. 4 మార్చి 1896; ఎం. ఏ., బి. ఎస్. సి. ఎడింబరో, లండన్, ఆక్స్‌ఫరు యూనివర్సిటీలలో; 1922 లో ఐ. సి. ఎస్. లో చేరి సబ్‌కలెక్టర్, కలెక్టర్, పరిశ్రమల శాఖ డైరెక్టర్, లేబర్‌కమీషనర్, నేషనల్ సర్వీస్ లేబర్ ట్రిబ్యునల్ చైర్మన్, రీసెటిల్‌మెంట్ అండ్ ఎంప్లాయిమెంట్ శాఖ డైరెక్టర్‌గాను ఉద్యోగాలను నిర్వహించి, మదరాసు ప్రభుత్వ డెవలప్‌మెంట్ కమిషనర్‌గా వుండగా 1947 లో పదవినుంచి రిటైరయారు. కేంద్రశాసనసభలో సభ్యులుగా నామినేట్ చేయబడినారు. మదరాసు కౌన్సిలు సభ్యులు, 1952-54. ఆంధ్ర సిమెంట్ కంపెనీ, జయపూర్ మైనింగ్ సిండికేట్, కావేరి షుగర్స్ అండ్ కెమికల్స్ కంపెనీలకు చైర్మన్ కె. సి. పి. లిమిటెడ్‌కు మేనేజింగ్ డైరెక్టర్. చైర్మన్, రేడియో అండ్ ఎలెక్ట్రికల్స్ లిమిటెడ్, అడ్రసు : 55, పీటర్స్ రోడ్, రాయపేట, మదరాసు-6.

రామకృష్ణ ప్రసాద్, శ్రీ రాజా యార్లగడ్డ; జననం 1919 డిసెంబర్ 11; బి. ఏ. ఆనర్స్, బి. ఎల్. సారథి ఫిలిమ్స్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్; సావరిన్ స్వీట్స్ కంపెనీ మేనేజింగ్ పార్టనర్; ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ డైరెక్టర్; అడ్రసు : మదరాస్.

రామకృష్ణరాజు, ఆర్. బి. జననం. 1891 ఫిబ్రవరి 10; 1911 లో బి. ఎల్. పట్టాన్ని పొంది చిత్తూరులో ప్రాక్టీసు ఆరంభించారు. మదరాసు అసెంబ్లి సభ్యులు 1937-39. జెయిలుకు వెళ్ళారు. మదరాసు కౌన్సిలు సభ్యులు 1946-52. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులు 1946-52. ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు. 1953 మార్చినుంచి;ఆంధ్రప్రదేశ్ సంగీత, నాటక అకడెమీ అధ్యక్షులు; అడ్రసు : చిత్తూరు.

రామకృష్ణరావు, బూర్గుల; జననం. 15 మార్చి 1899. బొంబాయి విశ్వవిద్యాలయంలో న్యాయవాది పట్టాన్ని పొంది, 1922 లో హైదరాబాదుకు వచ్చి ప్రాక్టీసు పెట్టబోగా ఖద్దరు కట్టుకున్నారనే కారణంచేత రెసిడెన్సి కోర్టులో వీరికి అనుమతి లభించలేదు. ఏడాదిన్నర అనంతరం ప్రాక్టీసు ప్రారంభించారు. కాంగ్రెసు ఉద్యమంలో మూడుసార్లు అరెస్టయారు. రెండుసార్లు శిక్ష లేకుండా విడుదల. మూడోసారి మూడుమాసాలఖైదు. సంస్థాన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. హైదరాబాదు ప్రభుత్వ రెవిన్యూ, విద్యాశాఖల మంత్రి 1949-52; ముఖ్యమంత్రి 1952-56; కేరళ రాష్ట్ర గవర్నరు, 1956 డిసెంబరు నుంచి; అడ్రసు, త్రివేంద్రం.

రామచంద్రమూర్తి, ఏలేశ్వరపు, జననం. 1914 జనవరి. ఎం. ఏ. (మదరాసు) 1935; ఇండియన్ బాంకర్స్ ఇన్‌స్టిట్యూటులో సర్టిఫికెటు మెంబరు (1939); ఆంధ్ర బ్యాంకి జనరల్ మేనేజర్ 1950-57; ఆంధ్రప్రదేశ్ ఫైనాన్స్ కార్పొరేషన్ మేనేజింగ్ డైరెక్టర్ 1957 నుంచి; అడ్రసు: హైదరాబాద్.

రామచంద్రరావు, తేకుమళ్ళ, జననం, 1905 అక్టోబర్ 16; ఎం. ఏ., బి. ఎల్. ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక మహాసంఘ ప్రధాన కార్యదర్శి. అకాడెమీ ఆఫ్ కల్చర్ అధ్యక్షులు (1934-49) రచనలు: క్షమార్పణము, ప్రణయచాంచల్యము, వీరయువకులు, (నవలలు) కనకదాసు, (నాటకం) బ్రిటిష్ దేశ గ్రంథాలయోద్యమ చరిత్రము, గ్రంథవరణము, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర (ఇంగ్లీషు) మొదలైనవి. బందరులో వయోజన పాఠశాలను, జానపద కళాశాలను 1947 ఆగస్టు 22 నుంచి నడుపుతున్నారు. అడ్రస్: మచిలీపట్టణం.

రామచంద్రారెడ్డి, బెజవాడ జననం, 1894 నవంబర్ 24. బి. ఏ. పచ్చయప్పకాలేజి. 1919. నెల్లూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు, 1929-30, నెల్లూరుజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిల్ ప్రెసిడెంటు 1929-30, మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబరు 1927 నుంచి 19.7 వరకు. ఈ కౌన్సిలు ప్రెసిడెంట్ 1930-37. ఆంధ్ర యూనివర్శిటీ సిండికేటు మెంబర్, 1942-46. మదరాసురాష్ట్ర భూస్వాముల సంఘ అధ్యక్షుడు; ఆంధ్ర నాటక

కళాపరిషత్తు అధ్యక్షుడు. 1945. పార్లమెంటు సభ్యులు 1952-57; అడ్రసు : బుచ్చిరెడ్డిపాలెం నెల్లూరు జిల్లా.

రామమూర్తి, శ్రీంతి వెంకట; జననం, 1888 ఆగస్టు 1. 1912 లో ఐ. సి. యస్. లో చేరి, మదరాసు రాష్ట్రంలో చాలాజిల్లాలకు కలెక్టరుగానూ, వ్యవసాయ శాఖా డైరెక్టరుగాను పనిచేశారు. గవర్నర్‌కు అడ్వైజర్, 1942-46. చీఫ్ సెక్రటరీ, 1947-46. బొంబాయి అక్టింగ్ గవర్నర్. 1947 ఉదయపూర్ దివాన్. 1947-48 ప్లానింగ్ కమిషనర్ పలహాదారు 1954 నుంచి; అడ్రస్: గ్రీమ్స్ రోడ్; కెతిడ్రల్, మదరాసు,

రామస్వామి, అరిగె, జననం. 1895, సికిందరాబాద్‌లో; హరిజనాభివృద్ధికి చాలా కృషిచేశారు. అనేక సంస్థలను స్థాపించారు. సికందరాబాద్ పురపాలక సంఘంలోనూ, హైదరాబాద్ జిల్లాబోర్డులోనూ సభ్యులు; 1950-52 లో పార్లమెంటుసభ్యులు; 1957 నుంచి. అడ్రస్: కమ్మరగూడా, సికిందరాబాద్.

రామస్వామి, పులి; జననం. 12 డిసెంబర్ 1902; హైదరాబాద్ హరిజన కాంగ్రెసు వ్యవస్థాపకులు; కార్మిక సంఘాలను పెక్కింటిని స్థాపించారు. దళితజాతుల సంఘ కార్యవర్గ సభ్యులు; 1946 లో సికిందరాబాదులో జరిగిన అఖిల హైదరాబాద్ దళిత జాతుల తెలంగాణా మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు; లోక్‌సభ సభ్యులు 1952 నుంచి. అడ్రస్: 29-బి. బస్తి లాల్‌పేట, సికందరాబాద్.

రామస్వామి చౌదరి, శరణు; జననం; 1901 ఫిబ్రవరి 4. 1920 నుంచి గ్రంథాలయోద్యమంలో పని చేస్తున్నారు. చాల సంవత్సరములు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఉపాధ్యక్షులుగను గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగను, కార్యదర్శిగను వున్నారు. 1921 నుంచి 1942 వరకు, కాంగ్రెసు ఉద్యమములన్నిటిలోను పాల్గొని, మొత్తం 5½ ఏండ్లు జెయిలులో గడిపారు. గుంటూరు జిల్లాబోర్డు సభ్యులు, 1950 నుంచి 1953 వరకు. అడ్రస్: అమృతలూరు, తెనాలి తాలూకా.

రామారావు, అవసరాల; జననం. 15 అక్టోబర్ 1890, బి. ఏ. 1910; బి. ఎల్., 1912; 1916 నుంచి రాజమండ్రిలో అడ్వొకేటుగా ప్రాక్టిస్ చేస్తున్నారు. తూర్పు గోదావరి పబ్లిక్ ప్రాసెక్యూటర్

1926-35; రాజమండ్రి బార్ అసోసియేషన్ ప్రెసిడెంట్ 1923-1946, జిల్లా స్కౌట్ కమిషనర్ 1929 నుంచి. రాజమండ్రి థియొసాఫికల్ సొసైటీ ప్రెసిడెంటు, 1925 నుంచి. అడ్రస్: రాజమండ్రి.

రామారావు, కోటంరాజు; జననం 1896 నవంబరు 9; బి. ఎ. (మదరాస్.) అనేక పత్రికలలో సబ్ - ఎడిటర్‌గా పని చేశారు. వాటిలో ముఖ్యమైనవి. టైమ్స్ ఆఫ్ ఇండియా, పయొనిర్, లీడర్. న్యూస్ ఎడిటర్‌గా ఇండియన్ డెయిలీ మెయిల్, పీపుల్, హిందూస్తాన్ టైమ్సు, పత్రికలలో. ఎడిటర్, ఫ్రీ ప్రెస్ జర్నలు, స్వరాజ్య; ఫ్రీ ఇండియా, డాన్, నేషనల్ హెరాల్డ్, సెర్చిలైట్; 1945 లో గాంధీజీతో వుండి, అనేక ప్రధాన పత్రికలకు విలేఖరి; చాలా పత్రికలకు స్వతంత్ర రచనలు పంపుదురు. పండిట్ నెహ్రూతో అమెరికా, కెనడాలలో సంచారం చేశారు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభ్యులు, 1952-54; ప్లానింగు కమిషన్‌కు ప్రచురణశాఖ సలహాదారు, 1956 అడ్రసు: న్యూఢిల్లీ.

రామారావు, వి. జననం. 1918 సెప్టెంబరు. సికిందరాబాదులో; కొన్నాళ్ళు సైన్యంలో పని చేసి, తరువాత సంఘ సంస్కరణ కార్యక్రమంలో ప్రవేశించారు. వారి జనాభివృద్ధి, వయోజనవిద్య, పశువధ నివారణ, మద్యనిషేధం ఉద్యమాలలో పాల్గొన్నారు. అఖిలభారత దళితజాతిసంఘ హైదరాబాదుశాఖ కార్యనిర్వాహక సభ్యులు; ఆంధ్రరాష్ట్ర శాసన సభ్యులు, 1957 మార్చి నుంచి; అడ్రసు: లక్ష్మీనగర్, సికిందరాబాద్.

రామారెడ్డి, జె. జననం, 1914 మెదకుజిల్లా తిరినాలలో, వకీలు; జిల్లా ఆంధ్రమహాసభ కార్యదర్శి; సంగారెడ్డి నగరకమిటీ, జిల్లా ఆహారసంఘం, తాలూకా సహకార సంఘాల సభ్యులు, కాంగ్రెసు ఉద్యమంలో 12 నెలలు నిర్బంధంలో వుంచబడినారు. హైదరాబాద్ శాసనసభసభ్యులు 1952-57; అడ్రసు: సంగారెడ్డి.

రామిరెడ్డి, గంగసాని, జననం, 1899 లో చిత్తూరుజిల్లా ఓబుళంపల్లెలో; విద్యాభ్యాసం, మదనపల్లి, అనంతపురములలో. 1928 లో రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగా ఉద్యోగములో చేరి 1950 లో కలెక్టరు పదవికి వచ్చారు. 1953 డిసెంబరు నుంచి, ఆంధ్రరాష్ట్ర పబ్లిక్ సర్వీ

సెస్ కమిషన్ మెంబరు: అడ్రసు: హైదరాబాద్.

రామిరెడ్డి, ఎం. జననం, 1921, వనపర్తి తాలూకా, కందూరులో; బి. ఎస్. సి., ఎల్. ఎల్. బి. కొంతకాలం ఉపాధ్యాయుడుగా పనిచేసి, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. 1950 లో సోషలిస్టు పార్టీలో చేరినారు. హైదరాబాద్ రాష్ట్ర ప్రజాసోషలిస్టుపార్టి కార్యవర్గ సభ్యుడు. హైదరాబాద్ శాసనసభ్యుడు, 1954-57; అడ్రసు: వనపర్తి.

రెడ్డి కె. చంగల్రాయ : జననం 1902 మే; బి. ఏ. బి. ఎల్. చిన్నతనంలోనే రాజకీయాలలో ప్రవేశించారు. 1938 వరకు మైసూరు సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు. నాలుగుసార్లు జెయిలుకు వెళ్ళారు. 1946 లో మైసూరు కాంగ్రెసు అధ్యక్షులుగా మళ్ళీ ఎన్నుకోబడి, సంస్థానంలో సత్యాగ్రహాన్ని జయప్రదంగా సాగించారు. మైసూరు ప్రధానమంత్రి 1947-52. ఇండియా ప్రభుత్వ ఉత్పత్తి శాఖమంత్రి, 1952 మే 10 నుంచి; అడ్రసు న్యూఢిల్లీ.

రెడ్డి, బి. ఎన్. (బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి) జననం. 1908 నవంబరు 16. కడప జిల్లా పులివెందల తాలూకా కొత్తపల్లిలో; జి. డి. ఎ. 1935; 1937 లో ఫిలింపరిశ్రమలో ప్రవేశించారు. 1938 లో వాహిని పిక్చర్సును స్థాపించారు. డైరెక్టు చేసిన చిత్రాలు : వందేమాతరం, సుమంగళి, దేవత, స్వర్గసీమ, మల్లీశ్వరి, బంగారుపాప, భాగ్యరేఖ. అడ్రసు : 16, విజయరాఘవాచారి రోడ్, త్యాగరాయ నగర్, మదరాసు.

అచ్చన్న, గౌతు; జననం. 16 ఆగస్టు 1909 (బారువలో) : 1930 ఉప్పు సత్యాగ్రహంనుంచీ కాంగ్రెసుఉద్యమాలలో పాల్గొని, అనేకసార్లు జెయిలుకు వెళ్ళారు. 1937 లో ఇచ్ఛాపురంలో రైతాంగ విద్యాలయాన్ని నిర్వహించారు. అఖిలభారత కిసాన్ కాంగ్రెసు ఆహ్వాన సంఘానికి కార్యదర్శి, ఇండియన్ నేషనల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ఆంధ్ర శాఖకు అధ్యక్షులు. మదరాసు శాసనసభ సభ్యులు, 1948-53; ఆంధ్రప్రభుత్వ వ్యవసాయ శాఖామంత్రి 1953 నవంబరు 7 నుంచి 1954 జనవరి 6; కార్మిక, సంఘసేవ, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి, 1955 మార్చి 28 నుంచి 1956 నవంబరు వరకు; అడ్రసు : హైదరాబాద్.

లక్ష్మీకాంతం, పింగళి; జననం. 10 జన 1884 ఎం. ఏ. మదరాసు యూనివర్శిటి, 1926; ఆంధ్ర విశ్వకళా పరిషత్‌లో తెలుగు శాఖాధ్యక్షులు, 1949 వరకు, ఆలిండియా రేడియో, తెలుగు ప్రోగ్రాముల సలహాదారు, 1953 నుంచి. నేషనల్ ఎకాడమీ ఆఫ్ లెటర్స్ కార్యవర్గ సభ్యులు; అడ్రసు: ఆలిండియా రేడియో, విజయవాడ.

లక్ష్మీపతి, డాక్టర్ ఆచంట; జననం. మార్చి 3,1880. బి. ఏ., 1904 (రాజమండ్రి); ఎం. బి. సి. ఎం. (1909) మదరాసు; మదరాసులో వైద్యవృత్తి ప్రారంభం. 1910; విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి మేనేజరుగాను, తెలుగు అకడెమీ కార్యదర్శిగాను, తెలుగులో అనేక గ్రంథాలను ప్రకటించారు. మదరాసు ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపల్ 1920-28; భిషగ్రత్న బిరుదును 1924 లో పొందారు. అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెసుఅధ్యక్షులు, 1933,1947 రచనలు: వ్యాయామశాస్త్రం; సంపాదకులు, ఆయుర్వేదం (తెలుగు) అడ్రస్: 42,హారిస్ రోడ్, మౌంట్ రోడ్, మదరాస్.

లక్ష్మీబాయి, సంగం; జననం. 1911 ఘట్కేశ్వరంలో; కార్వే విశ్వవిద్యాలయం గ్రాడ్యుయేటు పట్టం పొందారు. 1930 ఉప్పు సత్యాగ్రహం మొదలు కాంగ్రెసు ఉద్యమాలలో పాల్గొని రెండు సార్లు జెయిలుకు వెళ్లారు. హైదరాబాద్ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులుగా వున్నారు. హైదరాబాద్ విద్యాశాఖ డిప్యూటీ మంత్రి 1952-56;అడ్రసు: అజంపురా, హైదరాబాద్.

లాల్ బహాదూర్;జననం, 1904 కాశీవిద్యా పీఠంలో శాస్త్రిపట్టం పొందారు, 17 వ ఏటనుంచి సార్లు జెయిలుకు వెళ్లారు. ఉత్తర ప్రదేశ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 19్5-38; ఉత్తర ప్రదేశ్ శాసనసభ సభ్యులు, 1937-38; 1947-52; ప్రధాన మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి. 1947-52; అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి; ఇండియా ప్రభుత్వ రైల్వేలమంత్రి, 195?-56; రవాణా మంత్రి. 1957 మే నుంచి. అడ్రసు : న్యూఢిల్లీ.

లింగరాజు. క్రొవ్విడి; జననం. నవంబర్ 4, 1904; విద్యార్థిగా వుండగానే, 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు; చాలాసార్లు జెయిలుకు వెళ్లారు, 'కాంగ్రెసు'

పత్రిక సంపాదకులుగా పనిచేశారు. మద్రాసు అసెంబ్లి సభ్యులు: 1946_52, రెవిన్యూ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1946 జూన్‌నుంచి 1947 మార్చివరకు; ప్రజాపత్రిక జాయింటు ఎడిటర్, 1953 ఫిబ్రవరి నుంచి 1953 జూన్ వరకు. రచన: అమ్మ; అడ్రస్ : రాజమండ్రి.

విజయ ఆనంద్, డాక్టర్; విజయనగరం మహారాజ కుమార్; జననం. 1905 డిశెంబరు 28. విజయనగర సంస్థాన రాజవంశీకులు; క్రికెట్ ఆటలో నేర్పరి; 1926 లో ఇంగ్లండుకు వెళ్ళిన భారతీయ క్రికెట్ జట్టు నాయకులు. యు. పి. శాసనసభ సభ్యులు, 19:4-36; 1937-46. కేంద్ర శాసనసభ సభ్యులు. 1945-47; ఆంధ్ర మహాసభాధ్యక్షులు, 1940-4ం, సర్ బిరుదును 1947 లో త్యజించారు, అఖిల భారత క్షత్రియమహాసభ అధ్యక్షులు, ఉత్తరప్రదేశ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు 1952 నుంచి, అడ్రస్: బెనారస్.

విజయలక్ష్మి పండిట్ శ్రీమతి, జననం. 1900 అగస్టు 18. రంజిత్ సీతారాం పండిట్‌తో వివాహం 1921. యు. పి. అసెంబ్లీ సభ్యురాలు 1937. యు. పి. ఆరోగ్య శాఖమంత్రి 1937-39. అఖిల భారత మహిళాసభ అధ్యక్షురాలు 1940-42. కాంగ్రెసు ఉద్యమంలో మూడుసార్లు జెయిలుకు వెళ్లారు. రష్యాలో భారతదేశపు రాయబారి, 1947-49 అమెరికాలో ఇండియా రాయబారి. 1949-1951 నవంబరు; పార్లమెంటు సభ్యురాలు. యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ ప్రెసిడెంట్ 1953-54; ఇంగ్లండులో ఇండియా రాయబారి, 1955 నుంచి; అడ్రస్: లండన్.

విశ్వనాథం, తెన్నేటి, జననం, 1896. బి. ఎల్. త్రివేండ్రం. విశాఖపట్టణం జిల్లా కాంగ్రెసు కమిటికి చిరకాలం అధ్యక్షులు. 1937 లో మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు, ప్రభుత్వ పార్లమెంటరీ సెక్రటరి, 1937-39. 1946 లో మళ్లీ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ఛీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ 1946-47; మునిసిపల్ చైర్మన్, విశాఖపట్టణం. 1947-51; మదరాసు శాసనసభ సభ్యులు. 1946-51; 1952-53; అసెంబ్లీలో ప్రతికూలపక్షనాయకులు. 1952; ఆంధ్రప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి 1953 అక్టోబర్ 1954 నవంబర్; కంపెనీ లా సలహా సంఘ అధ్యక్షులు. 1956-59; కాఫీ బోర్డు

అధ్యక్షులు, 1959 మే నుంచి; అడ్రసు: బెంగుళూరు.

వీరరాఘవరావు, పింగళి; జననం, జూలై 1906. 1926 లో బి. ఎస్. సి. లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. 1927 నుంచి 1935 వరకు మదరాసు అకౌంటెంటు జనరల్ ఆఫీసులోను, 1935 నుంచి 1942 వరకు ఒరిస్సా కంట్రోలర్, ఒరిస్సా సెక్రటేరి యట్ లోను పనిచేసి, 1943 లో ఇండియన్ ఆడిట్ అకౌంట్సు సర్వీసుకు ప్రమోషన్ పొందారు. 1950 మార్చి నుంచి బొంబాయిలో సీనియర్ డిప్యూటి అకౌంటెంట్ జనరల్; కేంద్రప్రభుత్వ బ్రాడ్ కాస్టింగ్ శాఖ డిప్యూటి కార్య దర్శి, 1955 నుంచి. అడ్రసు: న్యూ ఢిల్లి.

వెంకటరంగారెడ్డి, కొండా; జననం. 1891 డిసెంబర్ 10; మహబూబ్ నగరంలో 1919 లో న్యాయవాదిగా వృత్తి ప్రారంభిం చారు. 1922 లో సంస్థానంలో ఆంధ్ర మహాసభను స్థాపించడానికి కృషి చేశారు. రెండుసార్లు ఆంధ్ర మహాసభ అధ్యక్షులుగా ఎన్నికో బడినారు. 1934 లో వేమన గ్రంథాలయాన్ని స్థాపించారు. సంస్థాన ఆంధ్రమహాసభ అధ్య క్షులు. 1947 లో సంస్థాన సత్యా గ్రహంలో మూడు నెలలు జైలుకు వెళ్లారు. హైదరాబాదు ఎక్సైజు మంత్రి 1952-56; హోం మంత్రి 1957 మార్చి 1959 మార్చి; రెవిన్యూమంత్రి 1959 మార్చి నుంచి, అడ్రసు: శ్రీ సదను, సలీ కాన, హైదరాబాద్.

వెంకట రమణనాయుడు, ఎం. ఏ., జననం. 1900, మదరాసులో, అడ్వొకేట్ గా ప్రాక్టీసు ప్రారం భించి, మదరాసు సిటీ సివిల్ కోర్టు జడ్జిగా పనిచేశారు. తరువాత మదరాసు చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రే టుగా నియమింపబడి, 1953 అక్టో బరు 1 నుంచి ఆంధ్ర ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శిగా నియ మింపబడినారు. ఆంధ్ర రాష్ట్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ సభ్యులు 1953-57; చైర్మన్ 1957 నుంచి, అడ్రసు : హైదరాబాద్.

వెంకటరాజు, మంతెన; జననం. 1904, 1919 నుంచీ కాంగ్రెసు వుద్యమములలో చేరి జెయిలుకు అనేకసార్లు వెళ్ళారు. గుంటూరు జిల్లాకాంగ్రెసుకార్యదర్శిగా పదేళ్లు అధ్యక్షులుగా పదేళ్లు పనిచేశారు. రాష్ట్ర కాంగ్రెసు సహాయ కార్య దర్శిగా ఆరేళ్లు, అధినేతగా ఒక సంవత్సరం పనిచేశారు. 1946

నుంచి 1953 వరకు మదరాసు రాష్ట్ర అసెంబ్లీలోను, 1953 నుంచి ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ లోను సభ్యులు, అడ్రసు : మంతెనవారి పాలెం, గుంటూరు జిల్లా.

వెంకటరావు, దామెర్ల. జననం. 30 ఏప్రిల్ 1894. ఎం. ఏ. ఎల్. టి. (మదరాసు); 1919 నుంచి ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగం; 1949 లో ప్రొఫెసర్ వుద్యోగం నుంచి విరమించారు. ఆంధ్ర సొసయిటీ ఆఫ్ ఇండియన్ ఆర్ట్సు సంస్థాపక కార్యదర్శి; ఆంధ్రేతిహాస పరిశోధక మండలి కార్య నిర్వాహక సభ్యులు; డిస్ట్రిక్టు ఇండస్ట్రియల్ అండ్ కమర్షియల్ మ్యూజియం కార్య నిర్వాహక సభ్యులు. దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్ట్ గ్యాలరీ అండ్ స్కూ_లుకు ఉపాధ్యక్షులు; రావుసాహెబ్ అదుర్తి రామారావు విద్యావర్ధక ధర్మ సంస్థ నిర్వాహక ధర్మకర్త; రాజమండ్రి గిల్డు ఆఫ్ సర్వీస్, రెడ్‌క్రాస్ సంస్థల ఉపాధ్యక్షులు; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు, 1952-53; ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనెట్ సభ్యులు 1952-53; అడ్రసు : దామెర్ల గృహము, రాజమండ్రి.

వెంకటరెడ్డి, గ్రంధి; నర్సాపురం తాలూకా బోర్డు ప్రెసిడెంటుగాను పశ్చిమగోదావరి జిల్లా బోర్డు ప్రెసిడెంట్ గాను పనిచేశారు. 1937 లో మదరాసు శాసనసభకు స్వతంత్ర సభ్యులుగా ఎన్నుకోబడినారు. 1955 లో కాంగ్రెసు సభ్యులుగా ఆంధ్ర శాసనసభకు ఎన్నుకోబడినారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మంత్రి 1956 నవంబర్ 1 నుంచి; అడ్రస్: హైదరాబాద్.

వెంకటరెడ్డి, ఆర్. జననం; ఫిబ్రవరి 10: 1889; 1929 లో బి. ఏ. ప్యాసయి, 1922 లో బి. ఎల్. ప్యాసయి చిత్తూరులో ప్రాక్టీసు పెట్టారు. జిల్లాకాంగ్రెసు సెక్రెటరి, 1930-37; చిత్తూరు పబ్లిక్ ప్రాసిక్యూటర్; 1938; సత్యాగ్రహోద్యమంలో చేరి జెయిలుకు వెళ్ళారు. కాంగ్రెసు శాసనసభ పార్టీకి కార్యదర్శి, 1947-48; మద్యనిషేధ శాఖమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి, 1947-48; మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1946_52. చిత్తూరుజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు, 1948. ఆంధ్ర ప్రభుత్వ దేవాదాయాల శాఖ కమిషనర్, 1954-57. అడ్రసు : చిత్తూరు.

వెంకట శేషయ్య, నీలంరాజు; జననం. 1905 డిసెంబరు 22. 1926 నుంచి ఆంధ్రపత్రికలో రిపోర్టరుగాను, సహాయ సంపాద కుడుగాను, 1945 వరకు పని చేశారు. 1933 మొదలు 1935 వరకు "నాట్యకళ" అనే పత్రి కకు సంపాదకులు, ఆంధ్రరాష్ట్ర పత్రికా రచయితల సంఘ కార్య దర్శి. 1946-50. మదరాస్ ఫిలిం సెన్సారు బోర్డు సభ్యులు 1947, ఆంధ్రప్రభ అసిస్టెంట్ ఎడిటర్ 1949 ఏప్రిల్ నుంచి. అడ్రస్: షెనాయ్ నగర్, మదరాసు.

వెంకట శేషాచలపతిరావు, డాక్టర్ తెన్నేటి; జ. 1911 అక్టో బరు 15. ఎల్. ఎం. పి., విజయ వాడ మునిసిపల్ కౌన్సిలర్ 1938 నుంచి; మునిసిపల్ చైర్మన్, 1946-55. మదరాసు రాష్ట్ర పురపాలక సంఘాధ్యక్షుల మండలికార్యదర్శి, 1950-53. ఆంధ్రవ్యాయామ కళా శాల మొదటి కార్యదర్శి. ఆంధ్ర మెడికల్ అసోసియేషన్ ఉపాధ్య క్షులు, 1953. అడ్రస్: హనుమాన్ల పేట, విజయవాడ.

వెంకటస్వామి నాయుడు, ద్వారం, జననం; 1893, ప్రసి ద్ధాంధ్ర ఫిడేలు గాయకులు. విజ యనగరం సంగీత కళాశాల ప్రిన్సి పాల్. 1924 లో 'గాంధర్వ విద్యాభూషణ' బిరుదాన్ని పొం దారు. 1935 లో జయపురం మహా రాజాగారి కనక కంకణాన్ని పొం దారు. తిరువాన్కూరు, మైసూరు మహారాజుల మన్ననలను పొందారు. 1949 మార్చి 26 న మదరాసులో పౌర ప్రముఖులచే సన్మానింపబడి నారు. 1953 మార్చి 15 న రాష్ట్ర పతి రాజేంద్రప్రసాద్ వీరికి సన్మా నంచేసి బహూకరణ యిచ్చారు. అడ్రసు: విజయనగరం.

వెంకటేశ్వరరావు, గొల్లపల్లి; జన. 1916 అక్టో. 10; పశ్చిమ గోదావరిజిల్లా మండపాకలో; చిత్ర లేఖనలో మదరాసు ప్రభుత్వ పరితోషలను పొందారు. హిందూ చిత్రలేఖనములో పరిశోధనలుచేసి, గృహాలంకరణను—ముగ్గులు, అను పుస్తకమును వ్రాశారు. ఈ పుస్త కమునకు భారతప్రభుత్వం, 1955 జనవరిలో వేయిరూపాయల బహు మతిని యిచ్చింది. అడ్రసు: గవ ర్నర్‌పేట, విజయవాడ-2.

వెంకటేశ్వరరావు, నార్ల. జననం, 1908 డిసెంబరు 1. బి. ఎ. (బందరు) 1934. విద్యార్థిగా వుండగానే కృష్ణా పత్రికలో పని చేస్తూ వుండేవారు. స్వరాజ్య,

1935; జనవాణి, 1936-37. ప్రజామిత్ర 1937-38; ఆంధ్రప్రభ న్యూస్ ఎడిటర్, 1938-42; ఆంధ్ర ప్రభ ఎడిటర్, 1942 నుంచి. రచనలు: స్వదేశ సంస్థానాలు. నేటి రష్యా, రష్యన్ కథలు, ఆస్ట్రియా ఆక్రమణ; చెక్ రాజ్య విచ్ఛేదం, పాలస్తీనా, మాటా మంతీ, పిచ్చాపాటి, జగన్నా టకం, నార్ల వారి మాట. "కొత్త గడ్డ" అనే పేరుతో కొన్ని ఏకాంక నాటికలను ప్రకటించారు. ఆంధ్రరాష్ట్ర పత్రికా రచయితల సంఘ అధ్యక్షులు, 1945-48. మదరాసు ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యులు 1948-51. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులు 1957 ఆగస్టు నుంచి; రాజ్యసభ సభ్యులు 1958 ఏప్రిల్ నుంచి; అడ్రస్: 2, ఫస్టు క్రాఫ్ట్ వీధి, రాయపేట.

వెంకటేశ్వర్లు పిల్లలమర్రి; వయస్సు 45; మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1946-52. ఆంధ్రరాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. 1947-49 లోను 1948-51 లోను నిర్బంధంలో వుంచబడినారు. ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు; 1953 నుంచి. అడ్రసు: కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు, విజయవాడ.

వేమారెడ్డి, కె. వి. జననం. జనవరి 6, 1908, బి. ఎ. బి. ఎల్. అడ్వొకేటుగా ప్రాక్టీసు ప్రారంభం, 1938; 1939 నుంచి కాంగ్రెస్ లో సభ్యులు; అనంతపురం జిల్లాబోర్డు ఉపాధ్యక్షులు, 1940-41. నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. రాయలసీమ మహాజనసభ అధ్యక్షులు, నంద్యాల 1949; అనంతపురం జిల్లాబోర్డు అధ్యక్షులు, 1949-53. ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు, 1953 నుంచి. అడ్రసు: అనంతపురం.

శంకరరెడ్డి నాయకంటి. జననం, 1808; కర్నూలు తాలూకా ముడుమాలలో; 1920-22 లో బి. ఎ. సీనియర్ క్లాసు చదువుతూ సహాయ నిరాకరణోద్యమంలో చేరి చదువు విసర్జించారు. రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. 1937; జిల్లా బోర్డు ప్రెసిడెంట్, 1937-38; స్వరాజ్యోద్యమంలో జెయిలుకు వెళ్ళారు. 1947 లో ప్రకాశం గారికి పార్లమెంటరీ సెక్రటరి; ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గసభ్యులు, 1937. మదరాసు ప్రభుత్వ స్థానిక పరిపాలనా శాఖ మంత్రి 1952 ఏప్రిల్ 19 నుంచి 1953 అక్టోబరు 1 వరకు, అడ్రసు: కర్నూలు.

శంభుప్రసాద్, శివశంకర్; జననం, 1911 జనవరి 25. 1923-27 లో బందరు జాతీయ కళాశాల, 1928-29 లో అడయార్ థియోసాఫికల్ హైస్కూల్, 1934-36 లో శాంతినికేతనములో చదివారు. ఆంధ్రపత్రిక, ఆంధ్ర వారపత్రిక, భారతిలకు సంపాదకులు. అఖిలభారత పత్రికా సంపాదకుల స్థాయీసంఘ సభ్యులు 1942-43; 1944-48, 1949-51. రాజ్యసభ సభ్యులు 1952 మార్చినుంచి 1956 మార్చివరకు. ఆంధ్ర లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు 1958 జులై నుంచి; అడ్రస్: ఆంధ్రపత్రికఆఫీసు, 7, తంబుచెట్టివీధి, జి. టి. మదరాసు.

శాస్త్రి, ఎస్. ఎల్. జననం 1901 అక్టోబర్; 1920 నుంచి స్వాతంత్ర్య ఉద్యమాల లో పాల్గొని, రెండుసార్లు జెయిలుకు వెళ్ళారు. ఆయుర్వేద వైద్యులు. ఆంధ్రమహాసభ నిజామాబాద్ జిల్లా సంఘ కార్యదర్శి; జిల్లా కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి; నిజామాబాద్ మునిసిపల్ కౌన్సిలర్; హైదరాబాద్ శాసన సభ్యులు 1952-57; అడ్రసు: నిజామాబాదు.

శివరామకృష్ణ, బొందలపాటి: జననం. 1920 ఫిబ్రవరి 19; అలహాబాద్ యూనివర్శిటీ 'సాహిత్యరత్న' పట్టాన్ని 1941 లో పొందారు. 1942 స్వాతంత్ర్యోద్యమంలో పనిచేశారు, ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు ఉపాధ్యక్షులు, 1943; 'కాంగ్రెస్' సంపాదకులు, 1943; వీరు వీరి సతి, శ్రీమతి శకుంతలాదేవి కలసి దేశి కవితామండలిని నిర్వహిస్తున్నారు. శరత్ బాబు రచనలన్నిటినీ తెలుగులోకి అనువదించారు. అడ్రస్: విజయవాడ-2.

శివరామ కృష్ణయ్య, మద్దూరి (60 ఏండ్లు). రాజమండ్రి వీరేశలింగ పాఠశాలలో ఉపాధ్యాయ పదవికి 1921 లో రాజీనామానిచ్చి, కాంగ్రెసులో ప్రచారము సాగించారు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో పాల్గొన్నారు. 1927 నుండి ప్లీడరుగా ప్రాక్టీసు ప్రారంభించి, దేశసేవకులకు ఎక్కువగా సహాయపడ్డారు. తూర్పుగోదావరి జిల్లాలోని ప్రధాన కాంగ్రెసు సహాయకులలో ఒకరు. అడ్రెసు: దానవాయిపేట, రాజమండ్రి.

శ్రీరంగాచార్యులు, ముక్తేవి: జననం, 1912 జూన్ 5, బి. ఏ. సైమన్ కమిషన్ బహిష్కరణ

దినాల్లో జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్ర రాష్ట్ర హోమియో వైద్యుల సమ్మేళన సంఘ ప్రధాన కార్యదర్శి; 1949 నుంచి. కృష్ణా జిల్లా ఆంధ్ర మహా సభ ప్రధాన కార్యదర్శి, 1951 నుంచి; హోమియోపతి పత్రిక ఎడిటర్ 1947-48; జైహింద్ పత్రిక ఎడిటర్ 1947-48; కృష్ణా జిల్లా రచయితల సంఘ కార్యదర్శి, గుంటూరు జిల్లా హోమియోసంఘ కార్యదర్శి, 1954 నుంచి; తెలుగు పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ వుంటారు. అడ్రసు : పెదముత్తేవి కృష్ణాజిల్లా.

శ్రీరాములు, తాడేపల్లి; జననం 1907. బందరు, వర్తకులు; ఆంధ్ర బ్యాంకు మేనేజింగ్ డైరెక్టర్, 1949 వరకు ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, హిందుస్తాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీల డైరెక్టరు. అడ్రస్ : మచిలీపట్టణం.

సచార్, భీమసేన్; జననం. 1 డిసెంబరు 1893; బి. ఏ., ఎల్. బి., లాయరుగా ప్రాక్టీసు ప్రారంభం., 1918, 1921 నుంచీ సత్యాగ్రహోద్యమములో పాల్గొన్నారు. పంజాబ్ అసెంబ్లి సభ్యులు 1936-45. పంజాబ్ ఆర్థికమంత్రి, 1946-47. తూర్పు పంజాబ్ ముఖ్యమంత్రి 1949-56; ఒరిస్సా గవర్నర్. 1956-57; ఆంధ్ర ప్రదేశ్ గవర్నర్ 1957 జులై ఆఖరువారంనుంచి; అడ్రస్: హైదరాబాద్.

సత్యనారాయణరాజు, అల్లూరి; జననం. 26 జనవరి 1914; చిన్నతనంలోనే జాతీయ యోద్యమంలో చేరి జెయిలుకు వెళ్ళి జెయిలులోనే హిందీభాషను బాగా నేర్చుకొని 'వోల్గా సేగంగా' అనే గ్రంథాన్ని తెలుగులోకి తర్జుమా చేశారు. 1938 నుంచీ ఏ. ఐ. సి. సి. సభ్యులు ఆంధ్రరాష్ట్ర యువజన సంఘ ప్రధాన కార్యదర్శి 1935; దీనికి అధ్యక్షులు. 1936. మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946-52 రాజ్యసభ మెంబరు, 1954 నుంచి; ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు, 1955 58; అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1958 జనవరి నుంచి; అడ్రెస్ : జిన్నూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

సత్యనారాయణ, కప్పగంతుల; జననం. 1916 జులై 20. జనవాణి సబ్-ఎడిటర్ 1936-37; ఆంధ్ర పత్రిక రిపోర్టర్, 1937 మే 1938 ఆగస్టు; ఆంధ్రప్రభ సబ్-ఎడిటర్, 1948 ఆగస్టు-1942 ఏప్రిల్; 1945 జనవరినుంచి "మెయిల్"

లో సబ్-ఎడిటర్; ఆంధ్రరాష్ట్ర పత్రికారచయితల సంఘ వర్కింగ్ కమిటీ మెంబరు 1945-48; ప్రపంచ దర్శిని ఎడిటర్; రచనలు, మాణిక్యం, ఎవరికివారేనా, తెల్లవారు ఝామువాతాలు, సెలవు, ఋణవిముక్తి అనే కథలసంపుటిలు; కబుర్లు; మనమతములు-ప్రవక్తలు; అడ్రసు: 5, వీరభద్రన్ స్ట్రీట్, మైలాపూర్; మదరాస్-4.

సత్యనారాయణమూర్తి, తుమ్మలపల్లి: జననం, 1918 ఆగస్టు 14. పిప్పర. ప. గోదావరిజిల్లా. విద్యార్థి యువజనోద్యమ నాయకులు. ఆంధ్ర ప్రదేశ యువజన కాంగ్రెసు అధ్యక్షులుగానూ, తాడేపల్లిగూడె తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడుగాను, ప. గో. హరిజనసేవాసమితి, ప. గో. భారత స్కౌట్స్ గ్రంథాలయ సంఘం అధ్యక్షులుగానూ వున్నారు. అఖిలభారత యువజన కాంగ్రెసు (నాగపూర్) సభకూ, అఖిల ఆసియా యువజన కన్వెన్షన్ (బొంబాయి) కూ వీరు ఆంధ్ర బృందానికి నాయకత్వం వహించారు. అడ్రసు: పిప్పర, పశ్చిమ గోదావరిజిల్లా.

సత్యనారాయణ, బొమ్మకంటి, జననం. 7 ఆగస్టు 1916. 1936 లో ఖమ్మంలో సబ్ కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగా చేరి, 1943 లో రాజకీయాలలో చేరి ఉద్యోగం విరమించారు, వరంగల్ జిల్లా ఆంధ్ర మహాసభ కార్యదర్శిగా ఉన్నారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యులు, ఆంధ్ర ప్రదేశ్ అసెంబ్లి సభ్యులు 1957 మార్చినుంచి, అడ్రసు: హైదరాబాదు.

సత్యనారాయణరాజు, 'పెన్మెత్స', జ. 1908, న్యాయవాదవృత్తి ప్రారంభం, 1930; మదరాసు గవర్నమెంట్ ప్లీడర్. 1950-53; ఆంధ్రగవర్నమెంట్ ప్లీడర్, 1953-54; ఆంధ్ర హైకోర్టుజడ్జి. 1954 నవం. 1 నుంచి. అడ్రసు: హైదరాబాద్.

సత్యనారాయణరావు, పెండ్యాల; జననం, 1915; మదరాసులోను, ఆక్స్‌ఫర్డులోను చదివి, 1948 లో ఐ. సి. ఎస్. లో చేరారు. సెంట్రల్ ప్రావిన్సెసులో అసిస్టెంటు కమిషనర్, డిప్యూటి కమిషనర్ పదవులను నిర్వహించి 1936 లో ఆరికశాఖ కార్యదర్శి అయారు. 1939-42 లో నాగపూర్ డివిజనల్ కమిషనర్; ఇండియా గవర్నమెంటు ఆహారశాఖవ డైరెక్టర్ జనరల్, 1942-43. సి. పి. రెవిన్యూ

ట్రిబ్యునల్ చైర్మన్, 1945-56; సి. పి. ప్రభుత్వ ప్రధాన కార్య దర్శి, 1946-48: జోధపూర్ సంస్థాన దివాన్, 1948-49. మధ్యభారత్ మంత్రిమండలికి సల హాదారు 1952-54. దామోదర్ లోయ అథారిటి అధిపతి 1954-56; తిరువాంకూర్ కొచ్చిన్ రాష్ట్ర రాజప్రముఖ్ సలహాదారు 1956 మార్చి 26 నుంచి డిసెంబరు వరకు; అడ్రసు: రాజమండ్రి.

సంజీవయ్య, డి. జననం. 14 ఫిబ్రవరి 1929; కర్నూలు జిల్లా పెదపాడు. బి. ఏ., బి. ఎల్. 1950 లో పార్లమెంటుసభ్యులుగా ఎన్నుకోబడినారు. 1952 లో కర్నూలు రిజర్వుడు స్థానంనుంచి అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. మద రాసు రాష్ట్రప్రభుత్వ గృహ నిర్మాణశాఖామంత్రి 1953 ఏప్రిల్ 10 నుంచి 1953 సెప్టెంబర్ 30 వరకు; ఆంధ్రప్రభుత్వ ఆరోగ్య శాఖామంత్రి, 1953 అక్టోబర్ 1954 నవంబర్; సహకారశాఖ మంత్రి 1955 మార్చి 1958 మే; స్థానిక పరిపాలనశాఖమంత్రి, 1958 మే నుంచి; అడ్రస్: హైదరాబాద్.

సంజీవరెడ్డి, నీలం; జననం. 19 మే 1913; అనంతపురం ఆర్ట్సు కాలేజీలో చదువుతూ, సత్యాగ్రహోద్యమంలో చేరి చదువు మానివేశారు. 1938 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఎన్నుకోబడి, 1940 లో సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్ళే వరకు ఆ పదవిలో వున్నారు. 1946 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. మదరాసుప్రభుత్వ మద్యనిషేధ శాఖామంత్రి, 1940 ఏప్రిల్ 1951 ఏప్రిల్; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు, 1951 ఏప్రిల్ 1953. కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ మెంబరు 1952-53; ఆంధ్రప్రభుత్వ ఉప ముఖ్యమంత్రి; 1953 అక్టోబరు 1 నుంచి 1953 నవంబరు 1 వరకు; ముఖ్యమంత్రి, 1956 నవంబర్ 1 నుంచి; అడ్రసు: హైదరాబాద్.

సీతాపతి, డాక్టర్ గిడుగు వెంకట; జననం. 1885 జనవరి 28; బి. ఎ. (1906) మదరాసు; ఎల్. టి. (1908) రాజమండ్రి; పర్లాకిమిడి రాజా కాలేజిలో 1903 - 1910 లోను, జయపురం బోర్డు హైస్కూలు హెడ్‌మాష్టరుగా 1910-11 లోను, పర్లాకిమిడి కాలేజిలో హిస్టరీ లెక్చరరు. 1911-32 ల లోను పని చేశాగా 1939-47 లలో సినిమాలలో నటిం

చారు. 1948 నుంచి తెలుగు భాషా సమితివారి తెలుగు విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంగ్రాహకులుగాను, సూర్యరాయాంధ్ర నిఘంటు పునర సమీక్షకులుగానువున్నారు. రచనలు: బాలానందము, కవలయావళి నాటికకు ఆంధ్రానువాదము మొదలైనవి. అడ్రసు: ఆఫీస్ వెంకటాచల మొదలివీధి, ట్రిప్లికేన్, మదరాస్-5.

సుందరయ్య పుచ్చలపల్లి. జననం. 1913. పధ్నాలుగవ ఏటనే రాజకీయోద్యమంలో చేరారు. 1927 లో మదరాసు కాంగ్రెసు మహాసభలో పాల్గొన్నారు. 1930 జనవరిలో మదరాసులో లయోలా కాలేజి నుంచి విద్యార్థుల ఊరేగింపు జరిపారు. రెండేళ్లు శిక్షపడి, బోర్‌స్టల్ స్కూలులో ఉన్నారు. 1932 లో కమ్యూనిస్టుపార్టీలో చేరి, 1934 లో ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు. 1928, 1930 లలో ఎ. ఐ. సి. సి. సభ్యులుగా కూడా వున్నారు. రాజ్యసభ మెంబర్ 1952-55. ఆంధ్రఅసెంబ్లి సభ్యులు. 1955 మార్చి నుంచి. అడ్రసు: కమ్యూనిస్టుపార్టీ ఆఫీసు, విజయవాడ.

సుందరరామశాస్త్రి, నరసింహ దేవర; జననం, 27 ఫిబ్రవరి 1908, (ఆలమూరు); బి. ఏ. (రాజమండ్రి) ఎం. ఏ. (మదరాసు); ఎం. ఎస్. సి. (మదరాసు); పి. హెచ్. డి. (లండన్); మదరాసు యూనివర్శిటీలో స్టాటిస్టిక్సు డిపార్టుమెంటు ప్రధానోపన్యాసకులు 1934 నుంచి 1943 నవంబరు వరకు. సిమ్లాలో, ఇండియా ప్రభుత్వపు లేబరుడిపార్టుమెంటుకు స్టాటిస్టిషియన్, 1943 నవంబరు నుంచి 1945 సెప్టెంబరు వరకు. ప్రస్తుతం, డైరెక్టర్ ఆఫ్ స్టాటిస్టిక్సు రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి. ఇండియా ప్రభుత్వపు స్టాటిస్టికల్ డిపార్టుమెంట్ స్టాండింగు కమిటిమెంబరు. అడ్రసు: రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

సుబ్బరాజు, గోకరాజు; జననం. 1921 జులై 1; పశ్చిమ గోదావరి జిల్లా జువ్వలపాలెంలో; బి. ఎస్. సి. కాశీ; 1946-48 లో కాలిఫోర్నియా శాన్‌ఫ్రాన్సిస్కో మెడికల్ సెంటర్‌లో ఫార్మకాలజీ అభ్యసించారు. 1950 లో సౌత్ ఇండియా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ లిమిటెడ్‌ను స్థాపించారు. ఆంధ్ర ప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిలు డిప్యూటి ఛైర్మన్, 1958 జులై 8 నుంచి; అడ్రసు: విజయవాడ-2.

సుబ్బారావు, కల్లూరి; జననం. 1897 మే 25; 1920 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి జైలుకు వెళ్లారు. మళ్ళీ 1922 లో కూడా. మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1937-30; 1946-52. ఆంధ్ర అసెంబ్లి సభ్యులు 1955 మార్చి నుంచీ; అసెంబ్లీ డిప్యూటీ స్పీకరు. 1955 ఏప్రిల్ 27 నుంచి 1956 నవంబర్ 1 వరకు; అడ్రసు: అనంతపురం.

సూర్యనారాయణమూర్తి, అప్పికట్ల; జననం. 1894 నవంబరు 29; సహకారోద్యమ వ్యాప్తికి చాలా కృషి చేశారు. ఢిల్లీలోని ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డు ఆఫేర్స్ సభ్యులు. హోంరూల్ ఉద్యమంలో పాల్గొని, అప్పటినుంచీ రాజకీయాలలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నారు. 1917 నుంచీ ఆంధ్ర రాష్ట్రోద్యమంలో కృషిచేస్తున్నారు; బరంపురం హరిజన సేవక్ సంఘానికి అధ్యక్షులు; ఆంధ్ర యూనివర్శిటీ సెనెట్ సభ్యులు, 1916-20; గంజాం జిల్లా వ్యవసాయదారుల సంఘ కార్యదర్శి, పత్రికా రచయిత; ఒరిస్సా రాష్ట్ర ఆంధ్ర సంఘానికి అధ్యక్షులు; అడ్రసు: సర్వోదయ భవన్, చత్రపూర్, గంజాంజిల్లా.

సూర్యనారాయణ, పంచాగ్నుల జననం 4 ఏప్రిల్ 1897; స్వరాజ్యోద్యమంలో చేరి గవర్నమెంటు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. మదరాసులోని కాంగ్రెసు కార్యాలయంలోను, స్వరాజ్యపత్రికలోను కొంతకాలం పని చేశారు. తరువాత వ్యాపారంలో ప్రవేశించారు. మేటూరు మిల్లు వస్త్రాలకు సోల్ డిస్ట్రిబ్యూటర్లుగా వున్న ఎస్. కృష్ణస్వామి, పి. సూర్యనారాయణ కంపెనీలో భాగస్థులు; చాలా మిల్లు కంపెనీలలో డైరెక్టరు; తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల బోర్డు మెంబరు; అడ్రసు : ఇండియన్ చేంబర్ బిల్డింగ్, మదరాసు-1.

సూరి, జి. ఎన్. (సూర్యనారాయణ గోళ్లమూడి) జననం 1913 మే 31. బి. ఏ., బి. ఎల్., 1939 నుంచి అడ్వొకేట్. విద్యార్థిగా వున్నప్పటి నుంచీ కథలు, నాటికలు, ఏకాంకికలు వ్రాస్తూ వున్నారు. ప్రస్తుతం తెలుగు వారపత్రికలకు 'లా' మీద వ్యాఖ్యానాలు వ్రాస్తూ వున్నారు. వీరి రచనలో ప్రసిద్ధిపొందినవి; టింగజ్ కథలు, బ్రహ్మలోకం (నాటిక) సరాగం, (రేడియో నాటిక), ఇంగ్లీషు తెలుగు నాటకాలలోను,

'నారద-నారది' ఫిలింలోను నటించారు. 'ప్రపంచదర్శిని' లోని 'లా' విషయాలు వీరు వ్రాసినవే. అడ్రస్: విద్యానగర్, హైదరాబాద్.

సోమప్ప, మాచాని; జ. 1904 ఎమ్మిగనూర్, చేనేత పరిశ్రమాభివృద్ధికిచాలా కృషిచేశారు.1937-38 లో వీరు స్థాపించిన ఎమ్మిగనూర్ చేనేత పారిశ్రామికుల సహకార సంఘం సహకారోద్యమానికి ఒక ఆదర్శప్రాయమైన సంస్థ అయింది. అఖిలభారత చేనేత బోర్డు సభ్యులు; వీరికి పద్మశ్రీ బిరుదును 1954 ఆగస్టులో రాష్ట్రపతిచే ఇవ్వబడినది. అడ్రసు: ఎమ్మిగనూర్, కర్నూలుజిల్లా.

సోమయాజులు, జే. వి. జననం. 1908 అక్టోబర్ 16; ఎం. ఏ., బి. ఇడి. 1934-35 లో బొంబాయిలో ఫైనాన్షల్ న్యూస్ పత్రికలో పనిచేశారు. 1935-40 లో బాట్లీవాలా కంపెనీలో స్టాటిస్టిషియన్; 1945 లో మదరాసు వచ్చి, స్టాక్ ఎక్స్చేంజి కంపెనీ స్థాపించారు. ఆంధ్ర సిమెంటు కంపెనీ, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, రేడియో అండ్ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్, వసంత్, సోప్‌వర్క్స్, ఆంధ్ర సిమెంట్ కన్‌స్ట్రక్షన్ లిమిటెడ్, రామకృష్ణ బేసిక్ ఇండస్ట్రీస్ కార్పొరేషన్ లిమిటెడ్, కావేరి స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్ లిమిటెడ్, జయపూర్ మైనింగ్ సిండికేట్ లిమిటెడ్, తిరుపతి కాటన్ మిల్స్ లిమిటెడ్ లలో డైరక్టర్, ఆంధ్రవాణిజ్య సంఘ అధ్యక్షులు: ఆంధ్రవాణిజ్యసంఘం తరఫున ఒక వ్యాపారబృందానికి అధ్యక్షులుగా 1955 లో ఆగ్నేయ ఆసియాదేశాలలోను, జపానులోను పర్యటించి, జపానులోని చిన్న పరిశ్రమల వ్యవస్థను ప్రత్యేకంగా పరిశీలించారు, ఆర్థిక, వాణిజ్య, పరిశ్రమల సమస్యలనుగురించి పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూవుంటారు. కేంద్రప్రభుత్వ దిగుమతుల సలహా సంఘంలోను, మదరాసు రేవు సలహాసంఘంలోను, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ కార్మిక సలహా సంఘంలోను, వాణిజ్య పన్నుల సలహా సంఘంలోను సభ్యులు. అడ్రసు. 337. తంబుచెట్టివీధి. మదరాసు-1

సోమశేఖరశర్మ, మల్లంపల్లి) జననం, 1891 (మినుమించిలిపాడు-1911 లో ఆంధ్రుల చరిత్ర వ్రాస్తున్న చిలుకూరి వీరభద్రరావుగారి సహాయకులుగా, చరిత్ర పరిశోధన ప్రారంభించారు. 1914 18. దేశమాత పత్రిక సంపాదక

[illegible] పని చేశారు, 1913 లో 'ఆంధ్రాభ్యుదయ గ్రంథమాల' ను స్థాపించారు, 1924-40లో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' తయారు చెయ్యడంలో, ఆంధ్రపత్రికా కార్యాలయం లో వున్నారు. 1940-46, ఆంధ్ర యూనివర్శిటీలో చారిత్రక పరిశోధక పండితులుగా వున్నారు, రచన; అంధ్రవీరులు, అమరావతీ స్తూపములు. చారిత్రక వ్యాసములు, ఆంధ్రదేశచరిత్ర; సుమారు 30 శాసనములు| టీకా టిప్పణులతో సహా; అడ్రెసు; ఆంధ్ర యూనివర్శిటీ. వాల్తేరు.

హనుమంతరావు, పల్లెర్ల; జననం, 27 మే 1908; 1937 లో న్యాయవాది పట్టాన్ని పొంది మహబూబ్ నగరంలో ప్రాక్టీసు పెట్టారు. 1938 లో స్టేటు కాంగ్రెసు ఉద్యమంలో చేరి 10 నెలలు శిక్ష పడ్డారు. తరువాత జిల్లా కాంగ్రెసు సంయుక్త కార్యదర్శిగా పని చేశారు. అడ్రెసు : మహబూబ్ నగర్.

హనుమంతరావు, పి.జన. 1909 మార్చి; వకీలు. మహబూబ్ నగర్ లో వృత్తి ప్రారంభించి, 1947 లో వృత్తి మాని సత్యాగ్రహంలో పాల్గొని, రెండుసార్లు జెయిలుకు వెళ్లారు, 'తెలంగాణా కేసరి' అని వీరికి ప్రజలు పెట్టిన పేరు. 1952 లో మహబూబ్ నగర్ నుంచి హైదరాబాద్ శాసనసభకు ఎన్నిక అయినారు. రెవిన్యూశాఖ డిప్యూటీ మంత్రి 1952-56; అడ్రసు : హైదరాబాద్.

హనుమంతరావు; మదూరి; జననం, 1909 అక్టోబరు 22; బి.ఏ., రాజమండ్రి కాలేజి 1932. పత్రికా విలేఖరి, కథకుడు; ఆనరరీ మేజిస్ట్రేటు, 1934; రాజమండ్రి నగర జర్నలిస్టుల సంఘానికి అధ్యక్షులు 1945. ఆంధ్రరాష్ట్ర పత్రికావిక్రేతల సంఘాధ్యక్షులు 1946; ఆంధ్రరాష్ట్ర ఓరియంటల్ భీమా కంపెనీ ఏజెంట్ల సంఘాధ్యక్షులు, 1948. అడ్రస్ : దానవాయిపేట, రాజమండ్రి.

హనుమంతరావు, మాడపాటి. జననం, 1885 జనవరి 22. (కృష్ణా జిల్లా, నందిగామ తాలూకా పొక్కునూరులో). కొంతకాలము నిజాము ప్రభుత్వమునకు ట్రాన్సులేటరుగాను, చాలాకాలము హైకోర్టు వకీలుగాను వుండిరి. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము (హైదరాబాదు)కు చాలా సంవత్సరాలు కార్యదర్శి. రచనలు: మల్లికా గుచ్ఛము, మాలతీ గుచ్ఛము, క్షేత్రకాలపుహిందూవ్యాసాలు; తెలంగాణా.

ఆంధ్రోద్యమము మొదలైనవి. తెలంగాణా ఆంధ్రులు వీరిని 'ఆంధ్ర పితామహ' అని గౌరవించారు; కేంద్రప్రభుత్వం వీరికి పద్మభూషణ్ బిరుదు నిచ్చింది; ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిలు చైర్మన్‌గా 1958 జులై 7 న ఎన్నుకోబడినారు. అడ్రసు: ఆంధ్రకుటీరం, సుల్తాన్ బజారు, హైదరాబాదు.

హరిసర్వోత్తమరావు, గాడిచర్ల; జననం, 1883 సెప్టెంబరు; బి. ఏ; (మదరాసు); ఎం.ఏ. (మదరాసు) విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపకులు, సంయుక్త సంపాదకులు 1906-7. స్వరాజ్య వారపత్రిక ఎడిటర్ 1907-8. రాజద్రోహ వ్యాసం వ్రాసినందుకు మూడేళ్ళు ఖైదు 1908-11; ఆంధ్రమహాసభ అధ్యక్షులు, 1916; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు 1926-30; ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు 1936 నుంచి; దక్షిణ భారత వయోజన విద్యా సంఘాధ్యక్షులు 1946-47 నుంచి 1950 వరకు; అఖిల భారత వయోజన విద్య, గ్రంథాలయ సంఘములలో కార్యనిర్వాహక సభ్యులు. తెలుగు విజ్ఞాన సర్వస్వము కమిటీ సభ్యులు; రచనలు: అబ్రహాం లింకను చరిత్ర. ఢిల్లి దర్బారు, ప్రభుత్వము, చైనా జపాన్ ప్రళయము, గ్రీసు చరిత్ర, మొదలైన అనేక గ్రంథములు. అడ్రసు: 2-వ వీధి; గోపాలపురం. మదరాసు-6.

రాష్ట్రపతి ప్రశంసా పత్రమును పొందిన ఉత్తమ తెలుగు చిత్రము



# సూచిక

# విజయ డిస్ట్రిబ్యూటర్స్

విజయవాడ

## రాబోయే తెలుగు చిత్రాలు

1. పద్మశ్రీ పిక్చర్స్‌వారి

"శ్రీ వేంకటేశ్వర మహాత్యం"

ఎన్. టి. రామారావు, సావిత్రి, శాంతకుమారి, జానకి, నాగయ్య
నటించినది.

డైరెక్షన్ : పి. పుల్లయ్యా, బి. ఏ,

2. ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి

"?"

ఎన్. టి. రామారావు, బి. సరోజాదేవి, జగ్గయ్యా, రేలంగి, గిరిజ
నటించినది.

డైరెక్షన్ : రామన్న

3. పద్మిని పిక్చర్స్‌వారి

"శబాష్ పిల్ల"

శివాజి గణేశన్, మాలిని నటించినది.

4. విజయ ప్రొడక్షన్స్‌వారి

"?"

డైరెక్షన్ : కె. వి. రెడ్డి, బి. ఎస్, సి. ఆనర్స్

5. స్వస్తిశ్రీ పిక్చర్స్‌వారి

"విరాటపర్వం"

# తిరుపతి మహా పుణ్యక్షేత్రం

(మదరాసుకు 90 మైళ్ళ దూరంలో ఆంధ్రప్రదేశ్ లో ఉన్నది)

శ్రీ బాలాజి వెంకటేశ్వరస్వామివారి ఆలయం- కొండపైనున్నది. సంవత్సరం పొడుగున అసంఖ్యాకంగా యాత్రికులు వస్తుంటారు. సముద్ర మట్టానికి 4 వేల అడుగుల ఎత్తున కొండపైనున్న ఈ క్షేత్రానికి వెళ్ళడానికి కొండపైకి మోటార్ కార్లు నడిచేరోడ్డు ఉన్నది. అన్ని హంగులూ కల విశ్రాంతి గృహాలు, చక్కని ఆహారపదార్థాలనిచ్చే మంచి భోజన శాలలు ఉన్నవి.

ఆధునిక సౌకర్యాలుకల అతి ప్రాచీన పుణ్యక్షేత్రం. బీదసాద అందరూ స్వామివారి దర్శనం, ఆరాధన చేసుకొనడానికి క్రమబద్ధమైన ఏర్పాట్లు చేయబడ్డాయి.

తిరుపతి (తిరుమల) లో ప్రతిదినం ఉత్సవ దినమే!

తిరుపతి యాత్రావివరాలకు, వెలకు దొరికే చిత్రపటాలకు యాత్రాదర్శిని గ్రంథాలకు, తిరుపతినుంచి తిరుమల (కొండ) పైకి వెళ్ళడానికి ప్రయాణపు ఏర్పాట్లకు, మొక్కులు తీర్చుకొనడానికి, ఉత్సవాలు చేయించుకొనడానికి ఈ క్రింద తెలియజేసిన తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రాలతో సంప్రదించండి.

1. శ్రీనివాస బాలాజీభవన్, హిమాయత్ నగర్ రోడ్, హైదరాబాదు (దక్కన్); 2. 19, రాయపేట హైరోడ్, మద్రాసు-14; 3. వెంకటేశ్ మందిర్, నం. 80-84 ఫనస్వాడి, బొంబాయి_2; 4. 14 జయ రోడ్, బాంబలపిట్య, కొలంబో-4 (సింహళం); 5. సిల్వర్ జూబిలీ పార్క్ రోడ్, బెంగుళూరు-2; 6. శ్రీ వెంకటరమణాలయం, మంగళూరు (ద. కనరా); 7. శ్రీ వెంకటేశ్వరాలయం, బ్రాహ్మణవీధి, విజయవాడ-1 దేవాలయానికి సంబంధించిన విషయాలకు తిరుమల తిరుపతి దేవస్థానం మాసపత్రికను చదవండి. సంవత్సర చందా 1 రూపాయి మాత్రమే.

వివరాలకు : ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్,
టి. టి. దేవస్థానం, తిరుపతి (ఆంధ్ర ప్రదేశ్)



త్వరలోనే

విడుదల

కానున్నది

PSR

పద్మశ్రీ ఫిలిమ్స్ వారి

భక్తి రసప్రధాన పౌరాణిక చిత్రం

# జగన్నాటకం

---

## STATEMENT ABOUT OWNERSHIP & OTHER PARTICULARS ABOUT NEWSPAPER "PRAPANCHADARSINI" (Andhra Directory and Year Book)

| | | |
|---|---|---|
| 1. Place of publication | .... | 5, Veerabadran Street, Mylapore, Madras-4. |
| 2. Periodicity of its publication | .... | Annual |
| 3. Printer's Name | .... | V. Kuppuswamy Chetty |
| Nationality | .... | Indian |
| Address | .... | 39, Anderson Street George Town, Madras-1 |
| 4. Publisher's Name | .... | K. Satyanarayana Sole Proprietor Kathamala Prachuranalu |
| Nationality | .... | Indian |
| Address | .... | 5, Veerabadran Street Mylapore. Madras-4 |
| 5. Editor's Name | .... | Kappagantula Satyanarayana |
| Nationality | .... | Indian |
| Address | .... | 5, Veerabadran Street, Mylapore, Madras-4 |
| 6. Names & addresses of individuals who own the news paper | | K. Satyanarayana, 5. Veerabadran Street Mylapore, Madras-4 |

I, K, Satyanarayana, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief,

K. SATYANARAYANA
*Publisher*

Date : 1—7—1959